శ్రీ శ్రీ గురు గౌరాంగౌ జయతః

# నారదీయ మహా పురాణాంతర్గత
# హరిభక్తి సుధోదయము

సంపాదకులు :

నిత్యలీలా ప్రవిష్ట ఓం విష్ణుపాద
శ్రీ శ్రీ మద్భక్తి విలాస తీర్థ గోస్వామి మహారాజుగారి
అనుగ్రహ పాత్రులగు
త్రిదండి స్వామి శ్రీ భక్తికమల పద్మనాభ మహారాజుగారు


తెలుగు అనువాదము, వివరణము

'సాహిత్య విద్యా ప్రవీణ'
డా॥ సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యులు
ఎం. ఏ., పి. హెచ్‌డి.





భిక్షము : 35 -00

14 ఆగస్టు, 1991.
గోదావరి పుష్కరము

ప్రథమ ముద్రణము
1000 ప్రతులు.

ప్రకాశకులు :

త్రిదండిస్వామి శ్రీ భక్తిసుధీర్ దామోదర మహారాజు
శ్రీ రామానంద గౌడీయమఠము, కొవ్వూరు.

ఈ పుస్తక ముద్రణకు సహాయము చేసినవారు

1. శ్రీ G.S. రాజు
2. శ్రీ P. జనార్ధనరావు
3. శ్రీ B. లక్ష్మణస్వామి
4. కీ.శే. M. లక్ష్మీ నారాయణ

ప్రాప్తిస్థలములు:

శ్రీ రామానంద గౌడీయమఠము, కొవ్వూరు, ఫోన్ : 229
శ్రీ గౌడీయమఠము, గుంటూరు, ఫోన్ 21426
శ్రీ గౌడీయమఠము, మద్రాసు, ఫోన్ 848781.

PRINTED AT : SRI LAXMI GANAPATHI BINDING WORKS, KOVVUR - 534 350.

# సంపాదకుల నివేదనము

శ్రీ నారదీయ పురాణాంతర్గతమైన, "శ్రీ హరి భక్తి సుధోదయము" వైష్ణవ తత్త్వమును ప్రతిపాదించు గ్రంథముల ఖనిలో అనర్ఘ రత్నముగా విరాజిల్లు చున్నది.

ఈ గ్రంథము 60 వేల మంది ఋషీశ్వరులకు ఆశ్రయమైన నైమిశారణ్యము యొక్క మహిమను వర్ణించుచున్నది. "భగవదారాధనము వార్ధక్యములో చేయవచ్చును" అనే అభిప్రాయముతో చాల మంది భ్రమపడుచున్నారు. కాని కౌమార కాలము నుండియే భగవదారాధనము చేయవలసినదని శాస్త్రములు ఘోషించు చున్నవి. దీనికి నిదర్శనముగా ప్రహ్లాదుడు, ధ్రువుడు మనకు కన్పించు చున్నారు. సుఖముతో జీవితమును గడుపవలెనని అనేకమంది దేవతలను ఆరాధించుచున్నారు. కాని శ్రీహరి ఆరాధనము వలన సమస్త సుఖ శాంతులను పొందగలమని ప్రహ్లాదుడు, ధ్రువుడు ఋజువు చేసినారు. ఈ ప్రపంచములో భగవంతుడు సవిశేషుడా? నిర్విశేషుడా? అని తత్త్వ విమర్శకులు వాదనలలో మునిగితేలు చున్నారు. నిర్విశేష వాదమును ఆశ్రయించిన హిరణ్యకశిపుడు ఆతని పురోహితులు మున్నగువారి సమస్త సందేహములను ఖండించి, భగవంతుడు సవిశేషుడే యని ఋజువు చేసినాడు ప్రహ్లాదుడు. స్థావరముల ద్వారా భగవంతుని కృపా కటాక్షములు పొందగలమని అశ్వత్థ, తులసీ మహాత్మ్యములద్వారా తెలియబడుచున్నది. కర్మ, జ్ఞాన యోగముల కంటె భక్తి సర్వోత్కృష్టమని "శ్రీహరిభక్తి సుధోదయము" రూఢి చేయుచున్నది.

బ్రతుకుకూడా. సాధారణంగా లోకంలో ఈయన నూరేళ్లు బ్రతికాడు. పాపం వీడు చిన్నతనంలోనే పోయాడు. అని ఉచ్ఛ్వాస నిశ్వాసలు విడచిన కాలాన్ని పరిగణించి ఆయుర్దాయం లెక్కకట్టి, చిన్న, పెద్ద అనేవ్యవహారం చేయటంకద్దు. కాని ఇది సరైన పరిగణనం కాదని శ్రీహరిభక్తి సుధోదయంలో మార్కండేయమహర్షి వశిష్ఠాది మునులతో చెప్పుతాడు. 18వ అధ్యాయంలో ఒక చక్కటి సన్నివేశం ఉన్నది. ఒకప్పుడు వశిష్ఠుడు మొదలైన బ్రహ్మర్షులు గంగానదీ పులినంపై ఒక సమావేశం చేశారుట. అక్కడికి శ్రీహరికటాక్షంచే చిరంజీవియైన మార్కండేయమహర్షి వచ్చాడట. వశిష్ఠుని ఒడిలో ఏడు సంవత్సరాల వయస్సుగల పరాశరుడు కూర్చొని ఉన్నాడుట. మార్కండేయ మహర్షి ,పిన్నవాడని అందరూ భావించే పరాశరునకు నమస్కారంచేశాడు. దీనికి అక్కడ ఉన్న ఋషులంతా ఆశ్చర్యాన్ని పొందారు. పరాశరుడు స్వయంగా -

'క్వమునిః సప్తకల్పాయుః క్వాహం సప్తాబ్దికః శిశుః '

ఏడుకల్పాల వయః ప్రమాణంగల మార్కండేయ మహర్షి ఎక్కడ? కేవలం ఏడు సంవత్సరాల వయస్సుగల నేనెక్కడ? ఇదేమిటి స్వామీ!' అని తొట్రుపడుతూ పలికినాడు. దానికి సమాధానం చెబుతూ మార్కండేయుడు పల్కినమాట, నరజన్మ ఎత్తిన ప్రతివ్యక్తి గుర్తించి తీరాలి.

'యావన్తోహి క్షణా జాతా హరిస్మృత్యైవ దేహినాం ।
ఏకీకృత్యైవ తానేవ, గణనం కార్యమాయుషః ॥

మానవ జీవితంలో ఎన్నిక్షణాలు శ్రీహరి స్మృతిచేతనే గడచినాయో, వాటినన్నిటినీ కూడి ఆయుః ప్రమాణాన్ని లెక్కకట్టాలి. ' దీన్ని బట్టే చిన్న. పెద్ద అనే వ్యవహారం వాస్తవంగా చేయాలి. ధాన్యాన్ని కొలిచేటప్పుడు అందులో ఉన్న పొల్లు (నిస్సారమైన అంశం) తీసివేసేకదా కొలిచేది?

'య ఏవం జీవతి చిరం సవంద్యోవయసాధికః ।
తదాయుషి విభో! తావత్ క్షణార్ధమపి నాఫలమ్ ।
యదాయుః శ్రేయసే తద్ధి మానుష్యం జీవితం విదుః ।
మనుష్యతాఽన్యథాకస్మాత్ అన్యప్రాణిష్వ ధర్మిణః ॥

'ఈవిధంగా భగవచ్చింతనంతో ఎవడు బ్రతుకుతాడో, వాడేవయస్సుచే పెద్దవాడు. వాని, ఆయుర్దాయంలో, క్షణంలో సగంకూడా వ్యర్థమైన భాగం ఉండదు. ఏ ఆయుర్దాయం శ్రేయోదాయకమో, దాన్నే మనుష్యజీవితం అనాలి. అలా కాకపోతే నిరంతరం అధర్మప్రవృత్తితో బ్రతికే మానవునికి ఇతర ప్రాణులకంటే 'మానవత్వం' లోని విశేషం ఏముంది? ఇతరుల పట్ల దయ చూపటం 'మానవత్వ'మని సామాన్యంగా మనం అనుకుంటాము? కాని మనపట్ల మనందయ చూపనక్కరలేదా? తనవైపుకూడా తానుచూచుకొన్నప్పుడు 'మానవత్వం' పరిపూర్ణం అవుతుంది .

ఈనాడు, లేచింది మొదలు పొట్ట పోసికోవడానికే జీవితం చాలకపోతే, ప్రత్యేకంగా శ్రీహరి స్మృతికి, హరిగాథ వినడానికి అవకాశం ఏది ? అని పాపం చాలమంది అనుకోవడం కద్దు. దానికి ప్రహ్లాదుడు ఉపాయం చెప్పాడు. ఎవ్వరు ఏపని చేసినా, దాన్ని విడవ నక్కరలేకుండానే ఆపని చేస్తునే శ్రీహరిని స్మరింపవచ్చును. మన జీవితం ఎంత యాంత్రికంగా జరుగుతూ ఉంటుందో, అంతయాంత్రికంగానూ, భగవత్స్మృతి జరుగుతూ ఉండాలని అభిప్రాయం. కేవలం ఊపిరి పీల్చడమే ప్రాణిలక్షణం. అయితే తోలుతిత్తి గాలిని పీల్చడం లేదా? చెట్లు గాలికి కదలటలేదా ? పలకడమే ప్రాణిలక్షణం అయితే 'వీణ' పలకడంలేదా ? కాని వీటిని ప్రాణులు అనంకదా ? కనుక, ప్రాణిత్వం, అందునా ఇతర ప్రాణుల కంటే విలక్షణమైన మానవత్వం నిలబెట్టుకోవడానికి, మనం చేయవలసిన ప్రయత్నంచాలా ఉన్నది, దీన్నే మనకు మనోజ్ఞంగా ఈ 'హరిభక్తి సుధోదయం ' అనే గ్రంథరాజం తెలుపుతుంది. ఈ హరిభక్తి సుధోదయం నారద పురాణంలోని భాగం. దీనిని గురించి ప్రస్తావన 'పురాణ పరిచయః' అనే గ్రంథంలో ఉంది. అయితే ప్రస్తుతం లభిస్తున్న నారద పురాణ ప్రతుల్లో ఈ భాగం కనబడటంలేదు. కాని వైష్ణవ సంప్రదాయంలో (గౌడీయవైష్ణవంలో) దీనికి విశేష ప్రాచుర్యం ఉంది. దాన్ని శ్రీరూపగోస్వామి తమభక్తి రసామృత సింధువు'లోను, శ్రీకృష్ణదసాకవి రాజ్‌వారు 'చైతన్య చరితామృతం' లోను శ్రీ సనాతన గోస్వామి పాదులు తమ

శ్రీ గౌడీయ మఠశాఖలన్నిటికి అధ్యక్షులైన శ్రీశ్రీశ్రీ త్రిదండి భక్తి ప్రజ్ఞానయతి మహారాజ్‌వారు ఆంగ్లంలో చేసిన అనువాదాన్ని ఆధారంగా చేసికొని పూరించడం జరిగింది. అనేక చోట్ల వారి ఈఆంగ్లానువాదమే నాకు సందేహాలు తీర్చింది. ఇందుకు వారికి నా ప్రణామాలు. ఈ గ్రంథాన్ని తెలుగువారికి అందించాలనే పూజ్యులు గురుతుల్యులు, మా శ్రీ దామోదర మహారాజ్ వారి తపన ఈనాటికి ఈవిధంగా కార్యరూపం ధరించ డానికి, అప్రతిహతమైన వారి సంకల్పమే కారణమని విశ్వసిస్తూ, నన్ను ప్రేరించినందుకు సర్వథాకృతజ్ఞతాభివందనాలు సమర్పించు కుంటున్నాను. ఇక ఈ గ్రంథముద్రణం ప్రారంభించడానికి, అసలు బెంగాలీ లిపిలో ఉన్న ఈ గ్రంథాన్ని తెలుగు లిపిలో వ్రాయించి నాకందించడానికి ఎప్పటికప్పుడు ప్రూపులు స్వయంగా తెచ్చి ఇవ్వడం, దిద్దించి ప్రెస్సువారికి అందివ్వడం, అవసరమైతే తాము స్వయంగా చూడడం వంటివి చేస్తూ, మఠం కార్యక్రమాల్లో తీరికలేకుండగా ఉన్నప్పటికీ ఈ గ్రంథముద్రణం విషయంలో విశేష శ్రద్ధచూపిన పూజ్యులు శ్రీ భువన సుందర బ్రహ్మచారి గారికి నేను సర్వథాకృతజ్ఞుడను. వారికి నా ప్రణామాలు. తెలుగు లిపిలో ఈ గ్రంథాన్ని కాపీచేసి అందించిన చి. రాచూరి శాయి ప్రసాదుకు అనేక మంగళా శాసనాలు. ఈ గ్రంథరచనా విషయంలో ఒకమాట. దీనిలో సరళ గ్రాంథికభాష విని యోగింపబడినది. సాధారణంగా విషయభారంగల గ్రంథాలు కొంతతత్త్వ విషయంలో సాధారణ పరిచయం కలవారికి విశేషంగా ఉపయోగించినా, సామాన్య పాఠకులకు కూడా కథాకథనంలో క్లిష్టత ఉండకూడదని సాధ్యమైనంత సరళమైన గ్రాంథికమే ఉపయోగింపబడింది. నాకు తెలియకుండ ఏమైనా దోషాలు దొర్లివుంటే పాఠకులే సరిదిద్దుకోగలరని విశ్వసిస్తూ, చివరిగా మరొక్కసారి మా 'దామోదర మహారాజ్ వారికి సాదర ప్రణామా లర్పిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

కొవ్వూరు — ఇట్లు
శ్రావణ శు ॥ — శ్రీహరిదాసచరణరేణువు
ద్వితీయ — సముద్రాల వేంకట రంగరామానుజా చార్యులు.

శ్రీ శ్రీ గురుగౌరాంగౌ జయతః

# హరిభక్తి సుధోదయము

ఓం నమోభగవతే వాసుదేవాయ

## ప్రథమాధ్యాయము

**ప్రథమాధ్యాయము :–** శ్రీహరిభక్తి సుధోదయ ప్రథమాధ్యాయమున నైమిశారణ్యము వర్ణింపబడినది. అందునివసించెడి భాగవతోత్తముల వర్ణనము కూడచేయబడినది. నైమిశారణ్యముననున్న శౌనకాది మహర్షులదర్శింపనెంచి, దేవర్షియగు నారుదుడేతెంచినాడు. అచ్చటగల ఋషిబృందములచే సత్కృతుడై, నారదుడు, హరిగుణ శ్రవణలాలసులైనమునులచే, హరిగుణకీర్తన మొనరింప ప్రార్థితుడైనాడు.

ఈ యధ్యాయమున తాపత్రయార్తులై సంసారసాగరమున మునిగితేలుచున్న ప్రాణికోటికి, భగవద్గుణ కీర్తన శ్రవణలాలసత అత్యావశ్యకమని సూచింపబడినది. శ్రీభాగవతముకూడ.

నివృత్త తర్షైరుపగీయమానాత్, భవౌషధాత్చ శ్రోత్రమనోఽభిరామాత్
కఉత్తమ శ్లోకగుణానువాదాత్ పుమాన్ విరజ్యేతవినా పశుఘ్నాత్ ।

ఇత్యాదిగ విజితేంద్రియులగు మహానుభావులచే కీర్తింపబడి, సంసారమహావ్యాధిని

పోద్రోలు దివ్యౌషధమై, శ్రవణపేయమైన పరమపురుషగుణోపశ్లోకనమునుండి, యాత్మను చంపుకున్నవాడు తప్ప ( ఆత్మ స్వరూపపరిజ్ఞానము లేక దేహాత్మ బుద్ధిచే భ్రష్టుడైనవాడు తప్ప) ఎవ్వడు విరక్తుడగును? అని పేర్కొనుచున్నది. ఇట్టి భగవద్గుణానుభవము కలిగి, కీర్తింపగల మహానుభావులు అరుదెంచుటయే దుర్లభముకాగా, అట్టి మహానుభావులు స్వయముగ నరుదెంచినప్పుడు, వారి యాగమనమును ఆత్మానుగ్రహముగ భావించి, పరిప్రశ్నమొనర్చి తత్త్వము నెరుగువారు ఇంకను దుర్లభులు. అట్లొనర్చువారే పరమ భాగవతోత్తములు. ఇదియే భాగవత ప్రథమలక్షణము కావున, నిరంతర భగవదనుభవమగ్నుడైన నారదమునిని భాగవతోత్తములగు ఋషులు తత్త్వజిజ్ఞాసనొనర్చుట లోకానుగ్రహ బుద్ధిచేతనే తప్పవేరు కాదు. మరియు-

'వాసుదేవ పరిప్రశ్నః పురుషాన్త్రీన్ పునాతిహి ।
వక్తారం, పృచ్ఛకం, శ్రోతౄన్, తత్పాదసలిలంయథా ।'

అన్నట్లు, ఇచ్చట వక్తయొక్కయు, ప్రష్టలయొక్కయు, శ్రోతల యొక్కయు యోగ్యతనిరూపింపబడినది. మరియు నీయధ్యాయమున 12వ శ్లోకమునుండి 21వ శ్లోకము వరకు నైమిశారణ్యమునగలమునుల వర్ణించుటద్వారమున 'భాగవత'లక్షణమే నిరూపింపబడినది. నిరంతరహరినామ సంకీర్తనముచే తాపత్రయము నణచినవారును, దానేజ్యాహుతి జపభోజనపానభాషణాది సమస్త క్రియల భగవదారాధనముగ తదాయత్త మొనర్చినవారును, భగవద్భాగవతశేషమును భజించువారును, ఆత్మగుణ-పరదోషముల పట్లనుదాసీనులును, అసదర్థ ప్రలాపదూరులును, భగవత్తులసీ ప్రభృత్యాభరణులును, అరిషడ్వర్గవిజేతలును, అయిన మహానుభావులే భాగవతోత్తములను నిరూపింపబడినది.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాన్తయే ॥ 1

స్మృతౌసకల కల్యాణభాజనం యత్రజాయతే ।
పురుషం తమజం నిత్యం వ్రజామిశరణంహరిమ్ ॥ 2

ఏకం యజ్జనయత్యనేకతనుభృత్ సశ్యాన్యజస్రం మిథో
భిన్నాకారగుణాని, కైశ్చిదథవా నోప్తం, నసిక్తం జలైః
కలేనాపి నజీర్యతే, హుతభుజానోదహ్యతే, క్లిద్యతే
నాద్భిః, తత్ సకలస్య బీజమసకృత్ సత్యం పరం ధీమహి ॥ 3

తెల్లని వస్త్రమును ధరించినవాడును, సర్వవ్యాపకుడును, చంద్రధవళ దేహుడును, నాల్గుభుజములుగల్గినవాడును. ప్రసన్నమగు వదనము కలవాడును అగు భగవానుని, సమస్త విఘ్న శాన్తికై ధ్యానింతును. తెల్లని వస్త్రము శుద్ధ సత్త్వమునకు ప్రతీకము. విష్ణుశబ్దముచే 'అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణఃస్థితః ' అని చెప్పబడిన సర్వాత్మకుడైన భగవానుడు కీర్తింపబడినాడు. నాల్గు భుజములు కలవాడనుటచే ఒక్కసారి నాల్గు పురుషార్థముల ననుగ్రహింప సమర్థుడని తెలుపబడినది. ప్రసన్నవదనుడగుటచే భక్తానుగ్రహబుద్ధిచే నిరత స్వాను కూల్యమును ప్రదర్శించు చున్నాడని తెలియుచున్నది. భగవత్ప్రాప్తికి ప్రతిబంధకములగు నజ్ఞానాది సమస్త విఘ్నములను పోగొట్టగల వాడాతడేననియు, ఆతనిని ధ్యానించుటయే భవనాశకమనియు చివరి భాగముచే సూచించబడినది. 1

ఎవ్వని స్మరణ మాత్రమున సమస్త శుభములకు నెలవుకాగలమో, అట్టి, నిత్యుడును, పుట్టుకలేనివాడును, పరమపురుషుడునగు శ్రీహరిని శరణు జొత్తును. భగవత్స్మరణమే సకలమంగళ హేతువనియు, భగవచ్ఛరణాగతియే సర్వప్రాణికి ఉపాదేయమనియు సూచింపబడుచున్నది. 2

మూడవ శ్లోకమున సత్యస్వరూపుడగు శ్రీహరి సకల జగద్బీజముగా ధ్యానింపబడు చున్నాడు. ఒక్కటేయగు నీ బీజము అనేక దేహముల ధరించి, పరస్పరము విభిన్నములగు నాకార గుణములు గల సశ్యములను (ప్రాణికోటిని) పుట్టించు చున్నది. ఈ బీజము ఎవ్వరి చేతను నాటబడలేదు. నీటిచే తడుపబడలేదు. కాలవశమున నశింపదు. అగ్నిచే దహింపబడదు. జలములచే నానుపబడదు. అనగా లోకమునగల బీజమేదేని సశ్యమును ఆవిష్కరింప వలెనన్న దాని నెవ్వరైన నాటవలయును, నీటిచే తడుపవలయును. ఇట్లు

తస్మిన్ కులపతిర్వృద్ధః శౌనకః సకలం జనమ్ ।
అభావ యద్ధరేర్భక్త్యా యోగీ భాగవతోత్తమః ॥ 10

యథాచందన యోగేన తప్తతైలం ప్రశామ్యతి ।
తథాయోగీంద్ర యోగేన జనౌఘా భజతే శమమ్ ॥ 11

తస్మిన్ కృతయుగస్యేవ సదా ధర్మో వివర్ధతే ।
నాధ్యాత్మికాదయస్తాపాః హరికీర్తన రక్షితే । 12

దత్తమిష్టం, హృతం, జప్తం, భుక్తం పీతంచ భాషితమ్ ।
యత్కించిదర్పయంతీశే తత్సర్వంతద్గతా జనాః । 13

వనము,అందలిశౌనకాద్యాశ్రమములు, మునిజనులు వర్ణింపబడుచున్నారు.

పవిత్రగోమతీనదీతటమున నిరంతరపుష్పసమృద్ధమై, త్రిభువన విఖ్యాతమైన 'నైమిష' మను వనమున్నది. 6

ఆ వనమున నుత్తమభాగవతలక్షణ లక్షితులగు మునులు చాలకాలము నుండీ యజనముఖముగ శ్రీహరినారాధించుచుండిరి. 7

అచ్చట వివిధ కుసుమ సంభరితములగు వృక్షములు, రత్నాలంకృతులై ప్రకాశించుచు యజ్ఞభాగముల గ్రహింపవచ్చిన దేవతలవలె భాసించు చున్నవి. 8

ఆ నైమిశవనమున సత్యలోకసమానమై, పుత్రపశుభార్యాది సమన్వితులై నివసించు చున్న మునులకు సుఖకరమైన పెద్దయాశ్రముండెను. 9

ఆయాశ్రమమున యోగియు, భాగవతోత్తముడును. వృద్ధకులపతియునగు శౌనకుడు సమస్త జనులను హరిభక్తి భావిత చిత్తులనొనర్చెను. పదివేలమందికి అన్నవస్త్రములనిచ్చి విద్యగరపువాడు కులపతి అట్టికులపతియే శౌనకముని. 10

వేడినూనె శరీరమునకు తగిలినపుడు కల్గెడి తాపమును చల్లని చందనరసము పోద్రోలినట్లు, ఆమునీంద్రుని సంగముచే నచ్చటి జనవృందము ప్రశాన్తిని పొందుచున్నది. 11

నిరంతర హరి సంకీర్తనముచే సురక్షితమగు నా యాశ్రమమున తాపత్రయము లేదు. కృతయుగ సంబంధముచే వలె ధర్మము వృద్ధిచెందుచున్నది. ఆధ్యాత్మికము.

ద్విజశిష్టంచ యత్కించిత్భోజ్యం యే శుద్ధచేతసః।
కాలే పరిమితం శశ్వత్ భుంజతే కేశవార్పితమ్ । 14

అవ్యుత్పన్నా ఇవాన్యేషాం మర్మస్పృక్షువచఃసు యే।
అసదర్థేషుచాశేషం సంజానంతోఽపి వాఙ్మయమ్ । 15

చిత్రం సూక్ష్మదృశో ప్యాత్మగుణాన్ మేరుసమున్నతాన్।
పరదోషాంశ్చ నిర్వైరా యే నపశ్యంత్యపి సు ఫ్లూన్॥ 16

ఆధి భౌతికము, ఆధి దైవికమునని తాపములు ముత్తెరగులు. అధ్యాత్మమనగా శరీరము. దానగల్గిన జ్వరాదిరోగములు ఆధ్యాత్మికతాపములు. పశుపక్ష్యాదిప్రాణుల వలనగల్గిన దుఃఖములు ఆధిభౌతికములు. అగ్ని, వాయు, జలాదులవలనకల్గిన దుఃఖములు ఆధి దైవికములు. ఈ మూడును హరికీర్తనముచే నాయాశ్రమమున లేవని తాత్పర్యము. 12

ఆయాశ్రమమునున్న జనులు ప్రతిక్రియను భగర్పణ బుద్ధితో నొనర్చుచున్నారని యీ శ్లోకమున చెప్పబడినది. ఏదియిచ్చినను, ఏయాగ మొనర్చినను, ఏహోమమొనర్చినను, ఏజపమొనర్చినను, ఏదిభుజించినను, ఏదిత్రావినను, ఏదిమాటాడినను సర్వము భగవదర్పణబుద్ధితో నొనర్చుచున్నారు. ఇట్లొనర్చుట నిఃశ్రేయసహేతువని గీతలో శ్రీభగవానుడు 'యత్కరోషి యదశ్నాసి, యజ్జుహోషిదదాసియత్ యత్తపస్యసికౌంతయ! తత్కురుష్వ మదర్పణమ్' అని చెప్పినాడు. శ్రీభాగవతమునగూడ ' మదర్థేఽర్థ పరిత్యాగః భోగస్యచసుఖస్యచ। ఇష్టం దత్తం, హుతం,జప్తం, మదర్థం యద్వ్రతంతపః॥ అని ఏకాదశ స్కంధమున చెప్పబడినది. మరియు 'యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మ బంధనః।తదర్థంకర్మకౌంతేయ ముక్త సంగస్సమాచర '॥ ఇత్యాదిగా భగవదారాధనా రూపముగ కాక స్వార్థసిద్ధికై చేసెడి కర్మమేదైనను జీవులకు బంధకారణమనియు, కావున చేసెడి ప్రతి కర్మమును భగవదర్పణబుద్ధితో చేసినప్పుడు అది బంధకము కాక నిఃశ్రేయసహేతువగు ననియు భగవానుడుపదేశించినాడు. 13

కావుననే అచ్చటి వారు విశుద్ధమనస్కులై భాగవతభుక్తశిష్టమునే, దేనినైనను భోజ్యముగా తగిన సమయమున, పరిమితముగ భగవంతున కర్పించియే భుజింతురు. భగవంతున కర్పింపక తనకొరకుతాను వండుకొని తిన్నది పాపమేనని 'తేత్వఘం భుంజతేపాపాః యే పచంత్యాత్మకారణాత్' ఇత్యాదిగా

కృష్ణాంఘ్రి తులసీ మౌలిః, పట్టంకృష్ణాంఘ్రివందనమ్ ।
కుండలే కృష్ణచరిత్రశ్రవణం, కంకణోఽంజలి ॥ 17

వాద్యంతే జయ గోవిందకృష్ణేతి జయడిండిమాః ।
రత్నాంగుళీయకం కృష్ణశ్రీ పాదాంబుజ కుంకుమః । 18

కీర్త్యంవిష్ణుయశః స్వచ్ఛమాతపత్రం, తథాంబరమ్ ।
తేషాం వైష్ణవరాజానాం సర్వంమండన మిత్యభూత్ । 19

శాస్త్రము బోధించుచున్నది. కావున మనము తినెడి ప్రతివస్తువు భగవంతున కర్పించియే తినవలయునని తాత్పర్యము. ఈ విషయమే 'త్వయోపభుక్తస్రగ్గంధవాసోఽలంకార చర్చితాః । ఉచ్ఛిష్టభోజినోదాసాః తవమాయాంజయేమహి ॥ అని శ్రీభాగవత వచనము. 14

అచ్చటివారు సమస్త వాఙ్మయమునెరిగిన వారయ్యును ఇతరుల మనస్సులు బాధపెట్టుదురర్థకములగు మాటలాడుటయందు అజ్ఞులుగనే ప్రవర్తించు చుందురు. అనగా పరిహాసమునకైనను అసత్ప్రలాపముల నాడరని భావము. 15

ఎంతచిత్రము! సూక్ష్మదృష్టులగు నచ్చటివారు మేరుసమున్నతములైన తమ గుణములను, విస్పష్టములగు పరదోషములను రెంటిని ఎట్టివైషమ్యము లేక సమాన బుద్ధితోడనే చూతురు. అనగా తమగుణములపై వారికెంతటియనాస్థయో పరదోషముల పట్లను అంతేయని భావము.ఇట్టి సమదర్శనమే వారిభాగవతోత్తమతా సూచకము. 16

శ్రీహరి పాద సమర్పితమగు తులసియే వారికి శిరోలంకారము. కృష్ణపాదవందనమే పట్టము. శ్రీకృష్ణచరితము వినుటయే శ్రవణాలంకారములగు కుండలములు. అంజలిబంధమే కంకణము (హస్తభూషణము). 17

కృష్ణా! గోవిందా! జయ! అనెడి యుద్ఘోషణములే జయఢక్కా నినాదములు. శ్రీకృష్ణపాద పద్మాలంకృతమగుకుంకుమమే వారికి రత్నాంగుళీకము. 18

నిరంతరకీర్తినీయమగు శ్రీహరి యశమే వారికి స్వచ్ఛాతపత్రము(వెల్ల గొడుగు) మరియు వస్త్రము. ఇట్లా వైష్ణవ రాజులకు (భాగవతోత్తములకు) సర్వము అలంకార మైనది.భాగతోత్తములకు భగవత్సంబంధము లేనిదేదియును అలంకారముకాజాలదని తాత్పర్యము. 19

జయం నేచ్ఛంతి కస్మాచ్చిత్ కదాచిజ్జేయనిగ్రహాత్ ।
తథాపి జిగ్యుః క్రోధాది మరిషడ్వర్గ మహోబుధాః ॥ 20

తేషామేవా కరం పుణ్యం తదాశ్రమ పదంమునిః ।
కదాచిన్నారదోఽభ్యాగాత్ దిదృక్షుర్భగవత్ప్రియాన్ ॥ 21

సదదర్శ నదీం తత్ర గోమతీంపుణ్యకీర్తనీం ।
సంధ్యాసమాధి సంపన్న ద్విజేంద్రోజ్జ్వల భూషణామ్॥ 22

మిథః సహస్ర కల్లోల సంఘర్ష విహితాఽరవాం ।
ద్విజేంద్రాణాం ప్రణమతామాశిషో దదతీమివ ॥ 23

తాం పశ్యన్ముదితః శ్రీమానాశ్రమం నైమిషాహ్వయమ్ ।
ప్రవివేశ మహావీణాం వాదయన్ హరి సద్గుణాన్ ॥ 24

ఆ బుధోత్తములు తామిదివరకే జయింపదగినవాటినన్నిటిని జయించిన వారగుటచే వారికి పరజిగీష (ఇతరుల జయింపవలెనని తలపు) లేదు. కాని వారు కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యములను నారు శత్రువులను జయించినారు. 20

అట్టి పరమ భాగవతోత్తములగు మునుల కాశ్రయమగు నాయాశ్రమమునకు, భగవత్ప్రియులగు నామునుల దర్శింపతలంపుతో నారదముని యొకప్పుడరుదెంచెను. 21

ఆముని యచ్చట సంధ్యాది తపః క్రియలనొనర్చు ద్విజశ్రేష్ఠులచే నలంకృతమై పరమ పావనమగు గోమతీనదిని దర్శించెను. 22

సహస్రాధికతరంగ పరస్పర సంఘర్షణముచే నేర్పడిన ధ్వనితో గూడి యానది తన్ను నమస్కరించుచున్న ద్విజశ్రేష్ఠుల కాశీస్సులనిచ్చు చున్నట్లున్నది. 23

ఆ పావన నదినిచూచియానందించిన నారదముని తనవీణపై శ్రీహరి గుణ గానమొనర్చుచు నైమిషాశ్రమమును ప్రవేశించెను. 24

కొమ్మలపై తిరుగాడుచున్న తుమ్మెదల సంరంభముచే రాలిన పూవులతో చెట్లుసహితము పూజార్హుడగు నామునిని పూజించి స్థావరములయ్యు ధన్యత నందినవి. 25

భ్రమద్భ్రమర సంరంభ వికీర్ణ కుసుమైరగాః ।
తం తథాఽపూజయన్ పూజ్యం ధన్యాస్తే స్థావరాఅపి ॥ 25

శరదిందునిభం దృష్ట్వా బ్రహ్మవిద్యావిశారదం
నారదం మనయోఽ భ్యేత్యముదాతత్ర వవందిరే ॥ 26

తే తమూచురహోహ్లాదైవే ప్రసన్నే నాస్తి దుర్లభం ।
యద్దివ్యదర్శనో యోగీ త్వమస్మద్వనమాగతః ॥ 27

సత్యం తద్వృద్ధవచనం జీవన్ భద్రాణి పశ్యతి ।
యదద్య వైష్ణవం ధన్యాః పశ్యామః పుణ్యలోచనాః ॥ 28

వయం తు తపసా స్వామిన్ క్రమేణాఘజిహీర్షవః।
తావత్ సపద్యఘభిదా త్వయా దిష్ట్యాద్యసంగతాః ॥ 29

శరత్కాల చంద్రబింబ సమాన ప్రకాశుడగు బ్రహ్మవిద్యా విశారదుని నారదుని సమీపించి మునులానందమున నమస్కరించిరి. శరత్కాల చంద్ర ప్రకాశము లోకోల్లాస కారణమైనట్లు నారదుని బ్రహ్మవిద్యా ప్రకాశము యోగి జనహృదయోల్లాస హేతువని తాత్పర్యము. 26

వారిట్లనిరి. 'అహో! దైవము ప్రసన్నమైన దుర్లభమేమియులేదు కదా? ఏలన దివ్య దర్శనుడవు యోగివగు నీవే స్వయముగా మా వనమున కేతెంచితివి.' అని. " మహద్విచలనంనృణాం గృహిణాం దీనచేతసాం । నిశ్రేయసాయ భగవన్ కల్పతే నాన్యథాక్వచిత్ " అని శ్రీభాగవతమున నన్నట్లు మహానుభావులు సాధారణ జనుల దరికివచ్చుట వారికి నిఃశ్రేయసహేతువగుటయేగాక, ఒక భాగవతోత్తముడు మరియొక భాగవతోత్తముని దరిజేరుటగూడ లోక నిఃశ్రేయసహేతువేనని యెరుగవలయును. 27

మరియు నిట్లనిరి. స్వామీ! 'బ్రతికి యుండిన శుభములబడయు వచ్చు' నను పెద్దల మాట వమ్ముకాదు.కావుననే బహుపుణ్యమొనర్చిన కన్నులుగల మేమునేడు వైష్ణవదర్శన మొనర్చి ధన్యులమైనారము.

శ్రీభాగవతైకాదశమున భగవానుడుద్ధవునితో 'మల్లింగమద్భక్త జనదర్శనస్పర్శ

వయం పుణ్యార్జన క్లిష్టాః ప్రాప్తాస్త్వాం పుణ్యసాగరం ।
దైవాద్ధాన్యార్థయంతో నిధానం కృపణా ఇవ ॥ 30

దినమేకమపి బ్రహ్మన్! వైష్ణవేన త్వయేహ నః ।
సత్కథాసుభగం పర్వ భూయాదితి మనోరథః ॥ 31

అద్యత్వత్పాదసలిలైః పర్ణశాలా భవంతు నః।
రక్షోఘ్నై ర్విహతాశేషయజ్ఞవిఘ్నాః శుభోదయాః ॥ 32

వన్యం ఫలం, నదీతోయం, సాధారణ మపి ద్వయం ।
భక్త్యాప్రదాయ భవతే ప్రాప్స్యామో ధన్యతాం వయమ్ ॥ 33
శౌనకశ్చ మహాతేజాః త్వద్దర్శన మహోత్సవం ।
లభతాం నో గురుస్తస్మాత్ తద్వేశ్మాగంతుమర్హసి ॥ 34

నార్చనమ్ ' ఇత్యాదిగ భాగవతదర్శనమును భగవదర్చ నాంతర్గతముగనే పేర్కొనినాడు. 28

స్వామీ! తపస్సుచే క్రమముగ మాత్రమే పాపముల పోగొట్టుకొనగలమేము, వెంటనే పాపనాశకుడవగు నీ సమాగమము నదృష్టవశమున పొందగల్గితిమి. 29

ధాన్యముల వెదకుచున్న దరిద్రులు దైవయోగమున నిధిని పొందినట్లు పుణ్యార్జనమునకై క్లేశముల ననుభవించుచున్న మేము పుణ్యసముద్రుడవగు నిన్నుపొందగల్గితిమి. 30

ఓ తపోనిధీ! పరమవైష్ణవుడవగు నీతో నొక్కదినమైన సత్కథాలాప మనోజ్ఞమగు పండుపు కాలయునని మా కోరిక. 31

స్వామీ ! రక్షోవినాశకములగు నీ పాదజలములచే మా పర్ణశాలలు సమస్త యజ్ఞ విఘ్నములు నశింప శుభోదయములతో కూడినవి కావలయును. 32

వనలభ్యమగు ఫలమును, నదీజలమును ఈ రెండింటిని భక్తితో నీకు సమర్పించి ధన్యులమగుదుముగాక ! 33

మహాతేజస్వియగు మాగురువుశౌనకుడు, భవద్దర్శనానందమును పొందవలయును.

ఇత్థమభ్యర్థితః సౌమ్యైః ద్విజైరంజలికర్మణా ।
ఓమిత్యువాచ హృష్టాత్మా స వైష్ణవజనప్రియః ॥ 35
అథ తైస్సహితోఽభ్యాగాత్ శౌనకస్యగృహంప్రతి ।
రమ్యం తథాశ్రమం పశ్యన్ సాశ్చర్యం సర్వవైష్ణవమ్ 36

విశాం స్వవ్యవహారేషు నిర్వ్యలీకేషు సర్వశః ।
తత్ర తత్ర స శుశ్రావ విష్ణోరాజ్ఞాం నియామికామ్ ॥ 37

అనుదేవకులందృష్ట్వా సుపుణ్యాం విదధేఽంజలిమ్ ।
స్థావరాః ప్రతిమా విష్ణోః, ద్విజాఖ్యా జంగమాస్తథా ॥ 38

పశ్య న్నిత్యాశ్రమం పుణ్యం ప్రశశంస ముహుర్ముదా ।
శౌనకస్య గృహంప్రాప ప్రఖ్యాతం ఋషిసంకులమ్ ॥ 39

కావున తన్నివాసమునకు విచ్చేయుము అని ప్రార్థించిరి. శిష్యులెట్టి యభ్యుదయులైన స్వతంత్రులుగా కాక ఆచార్య పరతంత్రులై యనుభవింప వలయునను సంప్రదాయ మీ శ్లోకమున సూచింపబడినది. 34

ఇట్లు సౌమ్యులగు ద్విజులచే నంజలి పురస్కారముగ ప్రార్థింపబడిన ముని, వైష్ణవజన ప్రియుడు కావున పరితుష్టుడై యట్లేనని యంగీకరించెను. 35

పిమ్మట నాఋషులతోగూడి విస్మయావహమై సర్వవైష్ణవలక్షణ సంపన్నమగు శౌనకమున్యాశ్రమమును సమీపించెను. 36

వైశ్యులకు, కపటములులేనివారి వాణిజ్యాది జాతిసిద్ధవ్యవహారములలో నక్కడక్కడ శ్రీవిష్ణ్వాజ్ఞయే,వారిని నియమించు దానినిగా వినెను. అనగా వైష్ణవస్మృతి సిద్ధములైన ధర్మనిదేశములే వారివ్యవహారములకు నియాకములని తాత్పర్యము. 37

నారదుడు దేవాయతమును జూచి స్థిరములైన విష్ణుప్రతిమలకును, జంగమ విష్ణుప్రతిమలగు ద్విజులకును పుణ్య సుభగమగు నంజలిని ఘటించెను. ఈశ్లోకమున శిలాది ప్రతిమలు స్థిరప్రతిమలుకాగా, ద్విజులు మహావిష్ణుని జంగము (నడయాడు) ప్రతిమలుగా కీర్తింపబడినారు. 38

ఇట్లా పవిత్రమగు నాశ్రమమును మాటిమాటికి ప్రశంసించుచు సానందముగ,

తావత్ స శౌనకో౽ ప్యాసీ ద్విష్ణుమభ్యర్చ్య తత్పరః।
బుధవృందవృతః శ్రీమాన్ కృతకృష్ణకథాదరః। 40

హృష్టైస్త్రత్రోజ్జగే కైశ్చిత్, నృత్యతే కైశ్చిదద్భుతం।
కైశ్చిచ్చ యతిమాలక్ష్య ముహుర్హస్తైః ప్రవాద్యతే। 41

తేషాం విష్ణుయశః పుణ్య సంగీత ధ్వనిరుచ్చకైః।
ద్యాం జగామాక్షయీకుర్వన్ శృణ్వతాం స్వర్గిణాం సుఖమ్ 42

ఇత్థమన్య ప్రసంగే౽పి దివ్యదృక్ స్వగృహాగతం।
జ్ఞాత్వా భాగవతం హర్షాత్ సార్ఘ్యం ప్రత్యుద్యయాద్రుతమ్। 43

సతం హరియశః స్వచ్ఛం జ్ఞానంమూర్తమివాశ్రితం।
నారదం పురతః పశ్యన్ ప్రణనామైవ దండవత్॥ 44

ఋషిజన పరివేష్టితమై ప్రఖ్యాతమైన శౌనకముని గృహమునకు వచ్చెను. 39

ఇంతలో నా శౌనకుడు విష్ణువునర్చించి, అతనియందే సమాసక్తమగు మనస్సుకలిగి, విష్ణుకథలయందాదరబుద్ధియై, మునిజనపరివేష్టితుడై భాసించుచుండెను. 40

మునిజనులలో కొందరు గాన మొనర్చుచుండిరి. మరికొందరు అద్భుతముగనర్తన మొనర్చుచుండిరి. మరికొందరు యతిని (నారదుని) జూచి సానందముగ కరతాళముల నొనర్చిరి. 41

వారొనర్చిన శ్రీహరిగుణసంకీర్తినాపరమగు పవిత్రసంగీతధ్వని బిగ్గరగా ఆకాశమునకెగసి, దానినాకర్ణించుచున్న దేవతల శ్రవణసుఖము నినుమడింప జేసినది. 42

ఇట్లు భగవత్సంకీర్తినాసక్తుడయ్యు, దివ్యదృష్టిగల శౌనకముని తన యింటికి అరుదెంచిన భాగవతు నెరిగి సానందముగ నర్ఘ్యముతో వెంటనే స్వాగతము నిచ్చినాడు. 43

మూర్తీభవించిన స్వచ్ఛమగు హరియశస్సువలె, జ్ఞానఘనుడై సాక్షాత్కరించిన నారద

ద్రుతముత్థాప్య హర్షేణ సోఽప్యాశ్లిష్టః సురర్షిణా ।
మేనేజాతమపర్యాప్తం ప్రహర్షం త్వాత్మనస్తదా । 45

స్వయమేవాసనం దత్వా యథావిధి తమార్చయత్ ।
సంపూజ్య కుశలంచైవ ప్రోవాచ వినయాన్వితః । 46

కరవాణి సందిశ మునీంద్ర! కిం ప్రియం
భవదాగమేన విదితం మయాధునా ।
నహిదుష్కరం కిమపి, సర్వసంపదః
సతతం భవాదృశపురఃసరా యతః ॥ 47

గతస్పృహత్వేఽపి మహానుభావాః
శ్రియం పరస్మై కృపయా విధాతుం।
సమాదిశన్త్యేవ కిమప్యతోఽహం
ధన్యస్త్వదుక్తం కరవాణి యోగిన్ ॥ 48

మునిని జూచి దండమువలె నేలపైబడి సాష్టాంగ ప్రణామమొనర్చెను. 'వైష్ణవో వైష్ణవం దృష్ట్వా దండవత్ ప్రణమేత్ భువి ' అని సంప్రదాయము. 44

వెంటనే దేవర్షిచే సహర్షముగా కౌగలింపబడిన శౌనకుడు తనప్రహర్షమును (ఆనందమును) అపర్యాప్తముగ (తనివిదీరనియట్లు) భావించెను. 45

శౌనకుడు నారదునకుస్వయముగ నాసనమిచ్చి యర్చించి, సబాహుమానముగ కుశలమడిగెను. 46

' ఓ మునీంద్రా ! నీ కేమి ప్రియమొనర్పవలెనో యాదేశింపుము. నీ యాగమనము చేతనేఏదియు దుష్కరము కాదని నాకిప్పుడు తెలిసినది. ఏలన, సమస్త సంపదలు నిరంతరము మీబోంట్లకు ముందే కదలాడు చుండును కదా '! 47

స్వామీ! తమకు సహజముగ నెట్టి కోర్కెలులేని వారయ్యు, మహానుభావులు పరునికైశ్వర్యము నొసగూర్పనెంచియే యేదేని యాదేశింతురు. కావున ధన్యుడనగునేనేమి చేయవలయునో చెప్పుము అని పల్కెను. 48

తతస్సురర్షిర్ముదితోఽబ్రవీత్తం
నతే విచిత్రం వినయేన భూషా।
త్వయ్యాక్ష్యతే సద్గుణరత్నరాశి :
సర్వోప్యయం నిర్మల కోశభూతే ॥ 49

దృష్ట్యైవ చత్వాం సఫలాగమోఽస్మి
పవిత్రితాశేషజనం యతోఽహమ్ ।
భూషాం భువో భాగవతాభిధానాం
హరే స్తనుం ద్రష్టుమిహాగతోఽస్మి ॥ 50

అతోఽతిధన్యోఽసి యతః సమస్తో
జనస్త్వయేశ ప్రవణీకృతోఽయమ్ ।
ఉత్పాదయేత్ యోఽత్ర భవార్దితానాం
భక్తిం హరెలోకపితా స ధన్యః । 51

అంతటనానందించిన దేవర్షి నారదుడిట్లు పలికెను. 'శౌనక మునీ! వినయ సంపత్తిచేనీకేర్పడిన యలంకారము నాకెంత మాత్రము ఆశ్చర్యము కాదు.నిర్మల కోశము వంటి నీయందు సకల సద్గుణరాశి కన్పట్టుచున్నది.' 49

'నిఖిలజనుల పావనుల నొనర్చునట్టి నిన్ను చూచినంతనే నారాక సార్థకమైనది. భాగవతుడని పిలువదగునొక యలంకారము, శ్రీహరి దేహమునైన నిన్నుచూచుటకే వచ్చితిని. ' 50

అహో! సమస్తలోకమును భగవదున్ముఖ మొనర్పగల్గిన నీవు అతి ధన్యుడవు. ఎవ్వడు సంసార భయపీడుతులగు వారికి హరిభక్తిని కల్గించునో ఆతడే లోకపిత, ధన్యుడు. 51

ఈ విధముగ నారదుడు శౌనకుని సంభావించి (గౌరవించి) శౌనకాది విప్రవరులచే పూజింపడినవాడై, సముచితముగ పరిచర్యల గైకొనుచు నాయా శ్రమమున నొక నాడుండెను. 52

ఇత్యాది సంభావ్య తతో మహర్షిః
అభ్యర్చితః శౌనకముఖ్యవిప్రైః ।
ఉవాస తస్మిన్ దివసం మహాత్మా
యథోచితం తైరభిపూజ్యమానః ॥ 52

తస్మిన్దినే సాధుమహోత్సవే తే
సుఖోపవిష్టం పరివృత్య సర్వే ।
ప్రభుం ప్రియం ప్రాహు రతిప్రహృష్టాః
సప్రశ్రయాః శ్రీశకథాభికామాః ॥ 53

అహోమహాత్మన్ ! బహుదోషజుష్టో
ఽప్యేకేన భాత్యేష భవో గుణేన।
సత్సంగ మాఖ్యేన సుఖావహేన
కృతాద్య నో యత్ర కృశా ముముక్షా॥ 54

ఆనాడు సుఖాసీనుడగు మునిని చుట్టువారి, మునులందరు సజ్జనానంద కరమగు శ్రీహరి కథా శ్రవణలాలసులై, సానందముగ నారదునితో సవినయముగ నిట్లుపలికిరి. 53

అహో! మహానుభావా! బహువిధదోషములతోగూడినదయ్యు నీ సంసారము ఒక్క గుణముచే భాసించుచున్నది. ఏమన సుఖజనకమగు సజ్జనసమాగమముచే మాలోని మోక్షేచ్ఛయు, నేడుతరిగిపోయినది. 54

పరులకొర్రకై లోకమున సంచరించునట్టి నిర్మల స్వభావుడవగు నీవు ప్రసిద్ధమిత్రుడవై జనుల హృదయాంతరములవ్యాపించిన తమస్సును (తమో గుణమును) నశింపజేయుచున్నావు. సూర్యుడు మాత్రము తన కిరణములచే, లోకము వెలుపలవ్యాపించిన తమస్సును (చీకటిని) పోద్రోలగల్గుచున్నాడు. 55

కావున స్వామీ ! దారుణములగు, తృష్ణ, మదము, లోభము, మోహము, కామము

మిత్రం ప్రసిద్ధం భువనేషు జాతం
స నిర్మలాత్మా విచరన్ పరార్థం।
త్వ మాంతరం హంసి తమోజనానాం
తతం స్వగోభిస్తరణిస్తు బాహ్యమ్ ॥ 55

అతోఽద్య నః శ్రీశయశస్తవాద్యైః
సుధారసైః ప్లావయ మానసాని।
దురంతతృష్ణా మదలోభమోహ
స్మరజ్వలద్వహ్నిశిఖాకులాని ॥ 56

మున్నగు ప్రజ్జ్వరిల్లుచున్న యగ్ని శిఖలచే తపించుచున్న మా మానసముల, శ్రీహరి గుణగానామృతరసములచే తడుపుము. 56

ఇట్లు నైమిష వనవాసులగు మునులచే మధురముగ చెప్పబడిన నారదముని, నిరంతరము శ్రీహరి గుణములను మణులచే పొదగబడిన హారముచే నలంకృతమగు కంఠము కలవాడై, శ్రీహరి యొక్క శుభ్ర కీర్తియగు గంగను విహరించు రాజహంసమై అజితుని (శ్రీకృష్ణుని) పాదారవిందముల భ్రమించు తుమ్మెదయై పరమానందమునందినాడు. 57

నారదముని శ్రీహరి గుణమణిమాలాలంకృతకంఠుడు. శ్రీహరియొక్క కల్యాణగుణములే మణులుకాగా, ఆమణులచే నిర్మింపబడిన మాలను ధరించినాడు. అనగా నిరంతరము శ్రీహరిగుణములను తనకంఠముతో నెలుగెత్తి కీర్తించువాడు కనుక హరిగుణమణిమాలాధారి. బాహ్యములైన యెన్ని హారములున్నను కంఠమునకు కలుగనిశోభ, శ్రీహరిగుణమణిమాలచే వైష్ణవులకు కల్గును. త్యాగరాజస్వామి — 'హరిగుణగణములు గళమున దాలిచి, శోభిల్లు భక్తకోటులిలలో' ఇత్యాదిగ కీర్తించినారు. కావున హరి భక్తుల యాభరణములలౌకికములని తాత్పర్యము.

రాజహంస నిరంతరము గంగాఝురులలోనీదులాడును. శ్రీహరి భక్తరాణ్మరాళము శ్రీహరికీర్తిమందాకినిలో తేలియాడుచుండును. అనగా శ్రీహరియశస్సంకీర్తనముచే నానందించుచుండునని భావము.

ఇతి సుమధురముక్త్వా నైమషేయ్యై స్స్వనిత్యం
హరిగుణమణిమాలాలంకృతస్స్రగ్ధకంఠః ।
మురహరిసితకీర్తిస్వర్ధునీ రాజహంసో
ముని రజిత పదాబ్జాలోల భృంగో జహర్ష ॥ 57

ఇతినారదీయే హరిభక్తి సుధోదయే

ప్రథమాధ్యాయః

తమ్మెద పద్మషండముల విహరించుచు తీయనితేనెల గ్రోలి మత్తిలి గాన మొనర్చుచుండును. శ్రీహరి భక్తమధుకరము, తదీయపాదారవింద మకరందాస్వాదనముచే వివశమై గానమొనర్చుచుండును. అట్లే పరమ భాగవతోత్తముడగు నారదుడునని తాత్పర్యము.

ఇదినారదీయపురాణాంతర్గతమగు

హరిభక్తిసుధోదయమున మొదటి యధ్యాయము.

# ద్వితీయాధ్యాయము

**ద్వితీయాధ్యాయసారము :–** శ్రీహరికథా పరిప్రశ్నముచే నిరతి శయానంద తుందిల హృదయుడగు నారదుడు, మునిజనుల పరిప్రశ్నమును కీర్తించినాడు. తాను కపిలునినుండి విన్న వేదసమ్మితమగు నారదీయ పురాణముయొక్క సారమును వినిపింప నుద్యమించెను. శాస్త్రములు, కావ్యములు, కథలు, మున్నగు వాఙ్మయము శ్రీహరి పరమైనప్పుడే శ్లాఘ్యమనియు, అట్టిదికాని వాఙ్మయమెంత గొప్పదైనను పరిత్యాజ్యమేననియు, శ్రీహరి కథా కీర్తనము యోగ్యులైన సజ్జనుల సమావేశములందు తప్ప, ఇతరత్ర యుక్తము కాదనియు, సహజసంస్కార సంపన్నులు కానివారికి, సద్గ్రంథ శ్రవణమువలన నెట్టి ప్రయోజన ముండదనియు, వారి పట్ల సద్గ్రంథశ్రావణము ఊషరక్షేత్రమున పడిన వర్షజలముల వంటిదేననియు, కావున మహానుభావులే శ్రీహరిగుణ సారవేత్తలనియు పేర్కొనినాడు. శ్రీహరి గుణాంకితమైన కావ్యముగాని మరియేయితర గ్రంథముగాని ఇతర గుణాలంకారాది భూషితము కానక్కరలేదు. సూర్యభూషితమగు వ్యోమ, తారకారహితమయ్యు భాసించును కదా ! ఏ వాక్కు శ్రీహరి నామాంకితమో అదియే జనతాపహారకమని కీర్తించి, మునులకు శ్రీహరికథలను వినిపింప నెంచి నారదుడు ధ్యాన నిమగ్నుడయ్యెను.

17వశ్లోకమునుండి 23వ శ్లోకమువరకు నారదకృతమగు భగవత్ స్తవనమున్నది.

యజ్ఞాది సత్కర్మములెన్నియైనను పరిమిత ఫలములై నశ్వరములే. శ్రీహరి స్మరణ ఫలము నవి యెంతమాత్రము పూరింప జాలవు. శ్రీహరి పాదసముద్భూతమగు గాంగఝురిని సాక్షాత్తు చతుర్ముఖ బ్రహ్మయు కీర్తింప జాలడు. అట్టి గంగాసంభవమూలమగు శ్రీహరి పాదమే సమాశ్రయణీయము. శ్రీహరిమాహాత్మ్యకీర్తనమే సంసార మహారోగమునకు దివ్యౌషధము. వేదాత్మక మహాసముద్ర సముద్భూతమగు దివ్యరత్నమగు నా శ్రీహరిని పలువిధముల నుపశ్లోకించి నారదుడు కథాకథనమున కుపక్రమించెను.

అథ శౌరికథా ప్రశ్న హర్ష నిర్భర మానసః ।
సురర్షిః ప్రాహ విప్రర్షిం ప్రపశ్య భగవత్ప్రియః ॥ 1

శ్రీ నారద ఉవాచ –
అహోఽతి నిర్మలా యూయం రాగో హరికీర్తనే ।
అవిధూయ తమః కృత్స్నం నృణాం నోదేతి సూర్యవత్ ॥ 2

అహం చ ధన్యో యుష్మాభిః సంగతోఽద్య మహాత్మభిః ।
ప్రవక్ష్యామి కథాః పుణ్యాః సర్వపౌరాణిక ప్రియాః ॥ 3

తద్దరేశ్చిత్ర లీలస్య సత్కథానాం సముచ్చయమ్ ।
ఇమం శృణుధ్వమన్వర్థం నామ్నాభక్తి సుధోదయమ్ ॥ 4

యన్మయాకపిలాచ్ఛ్రుత్వా పురాణం వేద సమ్మితమ్ ।
నారదీయమితి ప్రోక్తం తత్సారం ప్రబ్రవీమి వః 5

అనంతరము శ్రీహరి కథా శ్రవణ కుతూహలతతో మునులు వేసిన ప్రశ్నకు పరమానంద భరితుడై, భగవత్ప్రియుడైన యా దేవర్షి నారదుడు విప్రర్షియగు శౌనకునితో నిట్లనెను. 1

నారదుడు పలికెను. అహో ! ఎంతటి నిర్మల చిత్తులు మీరు. చీకటిని పోద్రోలనిదే సూర్యడుదయింపనట్లు మనస్సున కంటిన తమోగుణమును పూర్తిగ నిరసింపక హరిగుణ కీర్తనమందు ప్రీతిపుట్టదు కదా ! 2

మహానుభావులగు తమతో సంసర్గమును పొందిన నేనెంతయో ధన్యుడను. పుణ్యాజనకములును, సకల పౌరాణికులకు ప్రీతికరములునగు శ్రీహరి కథలను చెప్పగలను. 3

కావున విచిత్ర లీలలు గల శ్రీహరి యొక్క సత్కథాబృందమును వినుడు. ఇది 'భక్తి సుధోదయ' నామమున బరగుచున్నది. ఈ శ్లోకమున నారదుడు తానుపదేశింప నున్న శ్రీహరికథా కదంబమునకు 'హరిభక్తి సుధోదయ' మని పేరు కలదని చెప్పినాడు. శ్రీహరి భక్తియే సుధ. అనగా అమృతము. పాలసముద్రమును మథింపగా నమృతముపుట్టి రాక్షస పరాహతులగు దేవతల ప్రత్యుజ్జీవితుల నొనరించినట్లు, కామక్రోధాద్యరిషడ్వర్గ పరాహతమగు మనస్సును బ్రతికించి శ్రీహర్యున్ముఖమొన రించుటకు, సకల పురాణసాగర మథనముచే నీ 'హరిభక్తి సుధోదయ' మైనది. కావున ఇది ఆత్మవంతులగు విబుధులకు (సజ్జనులకు, హరిభక్తులకు) దివ్యౌషధమని యభిప్రాయము. 4

శాస్త్రం, కావ్యం, కథేత్యాది విస్తృతం వాఙ్మయేషు యత్ ।
వచః శౌరిపరం శ్లాఘ్యం సత్సభాసు తదేవ హి ॥ 6

శ్రావ్యమేతద్భవద్భిశ్చ నాసభ్యేషు కదాచన ।
తే హి తుష్టాస్స్వచిత్తస్య రాగోద్బోధక వాఙ్మయైః ॥ 7

కవినోక్తం వచో లౌల్యాదతజ్జేష్వతదర్థిషు ।
అమూల్యమపి న శ్లాఘ్యం వస్త్రం క్షపణకేష్వివ ॥ 8

వేదసమానమగు నేపురాణమును నేను కపిలుని నుండి విని నారదీయమను దానిని చెప్పియుంటినో, తత్సారమే మీకు చెప్పుచున్నాను. కపిలముని నుండి విని నారదుడు నారదీయ మను పేరుగల పురాణమును చెప్పియున్నాడు. ఆనారదీయ పురాణ సారమే ' హరిభక్తి సుధోదయ ' మని భావము. 5

శాస్త్రమని, కావ్యమని, కథయని, వివిధ ప్రక్రియలలో వాఙ్మయముననేది విస్తరించియున్నదో, అది శ్రీహరి గుణకీర్తనాపరమైనప్పుడే సజ్జన సదస్సుల యందు సర్వశ్లాఘ్యమగును. అనగా భగవద్గుణ గాన పరముగాని శాస్త్రమైనను, కావ్యమైనను, కథయైనను దురర్థకము నిరర్థకమునని తాత్పర్యము. కావుననే

శ్రీ భాగవతమున –

సవాగ్విసర్గ ః జనతాఘ సంప్లవః యస్మిన్ ప్రతిశ్లోకమబద్ధవత్యపి ।

నామాన్యనంతస్య యశోంకితానియత్ శృణ్వన్తి గాయన్తి గృణన్తి సాధవః

అని శ్రీహరి నామాంకితమైనవాఙ్మయము శాస్త్రలక్షణ సంపన్నము కాకున్నను భగవద్యశో విశిష్ట మగుటచే సాధువులచే వినబడుచున్నది. గానమొనర్చ బడుచున్నది, చెప్పబడుచున్నది. కావున రచనమెట్టిదైనను శ్రీహరి యశోంకితమై యున్నచో సజ్జన పరితోషకము కాజాలునని తాత్పర్యము. భగవద్గుణ కీర్తనా విదూరులగు వారి శాస్త్ర పాండిత్యము గూడ నిరర్థకమేనని శ్రీభాగవతము,

' శబ్ద బ్రహ్మణి నిష్ణాతో న నిష్ణాయాత్ పరే యది ।
శ్రమస్తస్య శ్రమఫలో హ్యధేనుమివ రక్షతః ॥ '

అని చెప్పుచున్నది. కావుననే వాఙ్మయమైనను, ఏ ప్రక్రియ యైనను, హరికథా కథన పరము కావలయునని భావము. 6

ఎవ్వరి మనస్సు లౌకిక ప్రీతిని యుద్బోధించు వాఙ్మయములచే (రచనములచే) పరితుష్టమై యుండునో, అట్టి యసభ్యులకు (హరికథా శ్రవణావర్జులకు) ఈ 'హరిభక్తి

శతైరపిన సద్గ్రంథై : పుణ్యాయ స్యాన్మనోఽసతాం ।
కఠినం శస్యయోగంస్యా చ్ఛిలాపృష్ఠం న వృష్టిభి : ॥ 9

మహాంత ఏవ తుష్యంతి సద్భక్త్యా సారవేదిన : ।
నాల్పా : కూపా వివర్ధంతే జ్యోత్స్నయా కిం సముద్రవత్ ॥ 10

శౌరి నామోజ్జ్వలం కావ్యం నాలంకారానపేక్షతే ।
వితారకమపి వ్యోమ శోభతే భాను భూషితమ్ । 11

సుధోదయము' వినిపించుట తగదు. హరికథా శ్రవణ సంస్కారము లేని వారికది వినిపించుట యూషర క్షేత్రమున వర్షించుట యేనని తాత్పర్యము. 7

దిగంబరవ్రతుడై, వస్త్రముల విడచిన బౌద్ధ భిక్షువునకు వస్త్రపువిలువ తెలియనట్లు, కవితాతత్త్వము నెరుగని వారికిని, అందాసక్తి లేనివారికిని కవిచే చపలతతో వినిపింప జేసిన కావ్యము, అమూల్యమయ్యు గుణ గ్రహణము లేమిచో నిరర్థకమే యగును. 8

వర్షము లెంతగురిసినను కఠినమగు శిలాతలము శస్యవృద్ధికి పనికిరానట్లు, శతాధిక సద్గ్రంథముల నెన్నివిన్నను అసజ్జనుని మనస్సు పుణ్యసంక్రాంతముకాజాలదు. 9

ఉత్తమభక్తిచే సారమును గ్రహించిన మహానుభావులే హరికథా శ్రవణముచే పరితుష్టి నొందుదురు. వెన్నెల యెంత ప్రసరించినను సముద్రమువలె, క్షుద్ర కూపములు (చిన్నబావులు) జలవృద్ధి నొందజాలవు కదా ! 10

శ్రీహరినామంకితమై ప్రకాశించు కావ్యమున కలంకారముల యపేక్ష యెంతమాత్రములేదు. నక్షత్రవిహీన మయ్యు నభము సూర్యబింబముచే నలంకరింప బడుచున్నది కదా ! కావుననే శ్రీ భాగవతమున -

నతద్వచశ్చిత్ర పదం హరేర్యశో
జగత్ప విత్రం ప్రగృణీత కర్హిచిత్ ।
తద్ధ్వాంక్ష తీర్థం నతుహంస సేవితం
యత్రాచ్యుత స్తత్ర హి సాధవోఽమలాః ।

ఇత్యాదిగ లోకపావనమగు శ్రీహరియశోగాన మొనర్పని వచనము ఎంతటి కావ్యగుణ భూషితమైన దయ్యును సజ్జన సేవ్యము కాదని చెప్ప బడినది. మరియు శ్రీభాగవతమున చెప్పబడినట్లు -

సదోషాపి కవేర్వాణీ హరినామాంకితా యది ।
సాదరం గృహ్యతే తజ్జైః శుక్తిర్ముక్తాంచితా యథా ।  12

సైవేహవాణీ జనతాపహారిణీ,
సుఖావలీ సంసృతి సింధుతారిణీ ॥
యానన్త నామావలి దివ్య హారిణీ,
స్ఖలత్పదా యద్యపి సా వికారిణీ ॥  13

సుకోమలం, సాధు సుగంధి గంధవత్
రసావహం, వా హరిమస్పృశద్వచః ।
దదాతి నాలం సుఫలం ధ్రువం కవేః
యథా సుశస్యం కణిశే ఫలోజ్ఝితమ్ ॥  14

ప్రసన్న గంభీరపదా, సరస్వతీ
పవిత్ర గోవింద పదాంకితాయది ।
ముక్తావళీ వారుణ రత్నరంజితా
మనోహరా సా విదూషామలంకృతిః ॥  15

తదేవరమ్యం సుచిరం నవం నవం తదేవ శశ్వన్మనసో మహోత్సవమ్ ।
తదేవ శోకార్ణవ శోషణం నృణాం యదుత్తమ శ్లోకయశోऽను గీయతే ॥

ఉత్తమ శ్లోకుడగు శ్రీహరి గుణ కీర్తనమే మనోజ్ఞము, సురుచిరము, నిత్యనూతనము నిరంతరమనఃపరితోషకము, మానవుల దుఃఖసముద్రము నింకించునదియు నని యెరుగవలయును.  11

ముత్తెముతో గూడిన ముత్తెపు చిప్పను గ్రహించినట్లు శ్రీహరి నామాంకితమైన కావ్యమును దోషములతో కూడినదైనను విజ్ఞులు గ్రహింతురు. 6వ శ్లోకమును వివరించు పట్టునజూపిన 'సవాగ్విసర్గః' ఇత్యాది భాగవత శ్లోక తాత్పర్యమే ఈ శ్లోకమున చెప్పబడినది. ఇక్కడ నుండి మూడు శ్లోకములలో ఈవిషయమునే స్పష్టపరచు చున్నాడు.  12

ఏవాక్కు అనన్తుని యనంతనామమునే దివ్యహారముగా కలిగి ఒకచోట కావ్య సౌందర్య విహీనయై, దోషములతో కూడినదయ్యును, శ్రీహరి కీర్తనా పరమగు నా వాణియే జనుల తాపమును హరించి, సుఖ సంతతిని కలిగించి, సంసార సాగరమును దాటింపగలదు.  13

అథ త్రయీనాథపదాబ్జసేవినాం
మహాత్మనాం సచ్చరితై రలంకృతాః ।
కథా ః సుపుణ్యా ః కథయామి సర్వదం
ప్రణమ్య వాచాం విభవాయ మాధవమ్ । 16

యజ్ఞాది సత్కర్మ కృతం ఖిలం భవేత్
తదప్యహో యత్స్మరణైర్న పూర్యతే ।
తతశ్చకర్తు ః ప్రదదాతి సత్ఫలం
ప్రభుః సపుష్ణాతు వచాంసి నః సదా । 17

యత్పాదపద్మాసవలుబ్ధధీ ః సదా
కలం ప్రగుంజత్యజ సర్వదేతి చ ।
నిషేవతే వేదమధువ్రతావలీ
సలోక పూజ్యార్చ్య పదః ప్రసీదతు । 18

యన్నామ గీతిన్తు రజస్త మోపహం
కలస్వరం గాయతి కిన్నరీజనః ।
ఆనందజాశ్రుస్నపితస్తన స్థల ః
స సర్వసౌభాగ్యనిధి ః ప్రసీదతు । 19

ఎంతటి మంచి పంటయైనను ఎన్నుపై (కంకిపై) గింజలు లేనప్పుడు నిష్ఫలమైనట్లే, ఎంతటి సుకుమారము, వ్యాకరణ శుద్ధము, చందనమువలె ఆనంద కారకము అయిన కవివచనమైనను శ్రీహరిగుణవిదూరమైనప్పుడు సత్ప్రయోజన మిచ్చుటకు సమర్థము కానేరదు. 14

మృదులములు, అర్థగంభీరములు నయిన పదములుగల వాక్కు పరమపావనమైన గోవింద పదముచే నలంకృత మైనప్పుడు కెంపుల యెరుపుచే నందగించిన ముక్తావళి వలె విద్వాంసుల కలంకారము కాగలదు. ఈ మూడు శ్లోకములలో భగవద్గుణ వర్ణనాపరమైన కావ్యమే విద్వత్ శ్లాఘ్యమగునని, భగవత్సౌందర్య వర్ణనము చేతనే వాక్కునకు సుందరత కలుగు నని ప్రతిపాదింప బడినది. భగవత్కథా వర్ణనమునకు పూర్వము 16వ శ్లోకము నుండి అధ్యాయంతమువరకు భగవన్మాహాత్మ్య వర్ణనమునకు కావలసిన సామర్థ్యమును శ్రీహరి తన కనుగ్రహింప వలెనని దేవర్షి యుపశ్లోకన మొనర్చుచున్నాడు. 15

ఓ మునులారా ! ఇక సర్వ కామప్రదాతయగు మాధవునికి నమస్కరించి, శ్రీహరి పాదపంకేరుహమును సేవించు మహానుభావుల సచ్చరితములచే భూషింపబడిన పరమపావన

యత్పాద సంభూత సరిద్వరామపి
స్తోతుం న శక్తః కమలాసనోఽప్యహో ।
స్తోతుం తమ ప్యుత్సహతే మనోమమ
ప్రభోర్ముదే భక్తజనస్య చాపలమ్ ॥ 20

క్షయిష్ణు మిందుం పరివర్జ్య చంద్రికా
భువంగతే వార్తిహరా సహ్లాదుభి : ।
సబుద్బుదా యచ్చరణాబ్జజా నదీ
తమ ప్రమేయం శరణం వ్రజామ్యహమ్ ॥ 21

సు సంపద : కృష్ణరుచశ్చ పాప్మనః
సహానవస్థామివ దర్శయత్యలమ్ ।
హిమేందు శుభ్రా ఖలు యత్పదోద్భవా
స సర్వ మజ్ఞాన మపాకరోతు న : ॥ 22

కథలను వాగ్వైభవలబ్ధికై వచింతును. 16

యాగాది సత్కర్మ సహితము భగవన్నామ స్మరణములచే పూరింప బడనప్పుడు అదియు నిష్ఫలమే యగును. కావున భగవత్స్మరణ పూర్వకముగా కర్మ మొనర్చిన వానికి సత్ఫలము ననుగ్రహించు నట్టి యా ప్రభువు శ్రీహరి నావాక్కులకు పుష్టిని కలిగించును గాక. 17

ఎవ్వని పాదములనెడి పద్మములందలి తేనెల కాశపడి నిరంతరము వేదములనెడి తుమ్మెదల సముదాయము, అజా! సర్వదా! అని మధురముగా గాన మొనర్చుచు సేవించు చున్నదో యట్టి లోక పూజ్యుడును, ఆరాధనీయ పాద కమలుడునగు నారాయణుడు ప్రసన్నుడగును. గాక . 18

రజస్తమో గుణముల పారద్రోలు నే విష్ణు గుణ గానమును, ఆనందాశ్రువులచే తడుపబడిన వక్షఃస్థలములు గల కిన్నరీజనము మధురస్వరముతో నొనర్చు చున్నదో, సర్వమంగళ నిధానమగు నాభగవాను డనుగ్రహించును గాక. 19

ఏ భగవానుని పాదపద్మమున నావిర్భవించిన సురనదిని స్తుతించుటకు సాక్షాత్తు చతుర్ముఖ బ్రహ్మగూడ సమర్థుడు కాడో, అట్టి శ్రీమన్నారాయణుని స్తుతించుటకు నా మనస్సు తహతహపడుచున్నది. భక్తజనుని చాపలప్రవృత్తి తన ప్రభువున కానందమునే కలిగించును కదా! 20

ముఖేందు సంవర్ధిత భక్తసాగరః
చక్రార్క సంబోధిత సన్ముఖాంబుజః ।
సన్మానసాసక్త సుశంఖ హంసభృత్
విభాతి య స్తం ప్రణతోఽస్మి వృద్ధయే ॥ 23

అథమునితిలకః శ్రీ విష్ణుమాహాత్మ్యమాద్యం
భవవిషయవిశాలవ్యాధినిర్మూల వైద్యం ।
శ్రుతిజలనిధిమధ్యప్రస్ఫురద్దివ్య రత్నం
హృషితతను రవోచద్దేవ మిష్టం ప్రణమ్య ॥ 24

( ఇతి నారదీయే హరిభక్తిసుధోదయే ద్వితీయాధ్యాయః )

నిరంతరము క్షీణించు స్వభావముగల చంద్రుని విడనాడి, లోకుల తాపమును బాప తారకలతో పాటు భువికి దిగివచ్చిన జ్యోత్స్నయా (వెన్నెలయా) యనునట్లు , బుద్బుదములతో భాసించుచు నే భగవానుని పాదాబ్జమునుండి యావిర్భవించిన సురనది, లోకతాప హారియగు చున్నదో, అట్టి యపరిచ్ఛిన్న స్వభావుడగు శ్రీమన్నారాయణుని శరణు జొత్తును. 21

పుణ్యరూపములైన సంపదలకు, నల్లనిదైన (కలుషములైన) పాపమునకు ఒకేచోట ఉనికి కుదరదని చూపించుటకేమో యనునట్లు, ఎవ్వని పాదకమలమునుండి మంచువలె, చంద్రునివలె తెల్లనైన మందాకిని యావిర్భవించినదో, ఆ శ్రీహరి, మా యజ్ఞానమును పోద్రోలును గాక !

పుణ్యములు తెల్లగను, పాపములు నల్లగనుండునని కవి సమయము. తనలో స్నానమొనర్చిన పాపాత్ముల పాపమును పోగొట్టి పుణ్యవంతులతో సహవాస మేర్పచుచున్న మందాకిని, తన ప్రవృత్తి చే పుణ్యపాపములకేక దేశావస్థానము లేదని నిరూపించుచున్నదని తాత్పర్యము. 22

ఏ భగవానుడు తన ముఖచంద్ర ప్రభలచే భక్తజన హృదయ సముద్రముల నుప్పొంగింపచేయుచున్నాడో, ఎవ్వని సుదర్శన చక్రమను సూర్యబింబముచే సజ్జన ముఖపద్మములు వికసింప జేయబడు చున్నవో, సజ్జనుల మానసములు ( మనస్సులు)

అనెడు మానస సరోవరములందాసక్తిగల పాంచజన్య శంఖమును రాజహంసమును ఎవ్వడు నిరంతరము ధరించు చున్నాడో, అట్టి శ్రీహరిని ఆత్మవృద్ధికై నమస్కరింతును. ఈ శ్లోకమున భగవన్ముఖము చంద్రబింబముగను, చక్రము సూర్యునిగను, శంఖము హంసముగను రూపింపబడినవి. చంద్ర కిరణ స్పర్శచే సముద్రముప్పొంగినట్లు, భగవన్ముఖచంద్ర సందర్శనముచే భక్తజనుల హృదయము లానందాతి శయమున నుప్పొంగు చుండును. సూర్యకిరణ ప్రసారముచే చీకట్లుతొలగి పద్మములు వికసించినట్లు భగవత్కర సమలంకృతమగు సుదర్శన చక్రప్రభలచే సజ్జనుల హృదయ కుహరములందలి యజ్ఞాన తిమిరములు పోయి, వారి ముఖాంబుజములు వికసించు చున్నవి. భగవద్ధస్తగతమగు శంఖమే రాజహంసము. ఇది సజ్జన మనస్సులను మానస సరోవరము లందాసక్తమైనది. మానస శబ్దమందలి శ్లేషచే మనస్సు మానస సరోవరము అను గూఢార్థములు స్ఫురించుచున్నవి. నిరంతరము పాంచజన్య శంఖము సజ్జనుల మనస్సులందు స్ఫురించు చుండునని భావము. 23

పిమ్మట నాముని శ్రేష్ఠుడగు నారదుడు, సంసార మహారోగము నశింపజేయు మహావైద్యుడును, ఆద్యుడును, వేదములను సముద్రములందు అంతర్గతముగ ప్రకాశించుచున్న యనర్ఘ రత్నమునైన తనయిష్టదేవతమగు నారాయణునికి నమస్కరించి ఆనందోత్ఫుల్ల దేహుడై శ్రీ విష్ణు మాహాత్మ్యమును చెప్పదొడగెను. 24

ఇది నారద పురాణాంతర్గత హరిభక్తి సుధోదయమున

రెండవ యధ్యాయము.

# తృతీయాధ్యాయము

**తృతీయాధ్యాయసారము :–** ఈ యధ్యాయము శ్రీశుక పరీక్షిత్సంవాద రూపము. సంసార మహార్ణవము దాటగోరువారికి చతుర్భుజుడగు శ్రీమన్నారాయణుడే శరణ్యుడు. అవ్యక్తరూపమును పాసించుట క్లేశావహము కావున సగుణమగు బ్రహ్మమే సుఖసేవ్యము. మడుగున అడుగున చేరిన చేప జాలరుల జయింపగలిగినట్లు నారాయణాశ్రితుడగు నరుడే కామాద్యరుల జయింపగల్గును. కామక్రోధాది సమాకులమగు ఘోరారణ్యమున సంచరించు వానికి మోక్షనిమిత్తమై చక్రియే సమాశ్రయణీయుడని సర్వశాస్త్ర సారము. మోక్షమహాసౌధము నధిరోహింపదలచువానికి శ్రీహరి భక్తియే అవశ్యాశ్రయణీయమగు నిఃశ్రేణి(నిచ్చెన) భగవద్భక్తినలవడజేయని శాస్త్రమునిష్ఫలము. శాస్త్రవేదియయ్యును పాపమాచరించువాడు, కన్నులుండియు బావిలోపడిన వానివలె నింద్యుడగును. కావున క్లేశములకోర్చి శాస్త్రముల జదివిన వారు, తత్ఫలమగు శ్రీహరి భక్తినలవరచుకొనవలయునను విషయమునే శుకముని పరీక్షిత్తునకు గంగాతీరమున బోధించెను.

శాపగ్రస్తుడై తక్షకదంశనమును ప్రతీక్షించుచు ప్రాయోపవిష్టుడైన శ్రీపరీక్షిత్తును దర్శించుట కనేకమునులేతెంచగ వారి శాస్త్రవాదములవిని, వారి వైమత్యమునకు ఖిన్నుడైన పరీక్షిత్తు పూర్వభాగ్యవశమున శ్రీశుకమునిని దర్శించెను.

'స్వసుఖ నిభృత చేతాస్త ద్వ్యుదస్తాన్య భావో –

వ్యజిత రుచిర లీలాకృష్టసారః ।'

అని కీర్తింపబడిన శుకముని, పరీక్షిత్తుచే ప్రార్థింపబడినవాడై కర్తవ్యము నుపదేశింపుమని ప్రార్థింప, ముని శ్రీహరిగుణ గానమొనర్చి, శ్రీహరి స్వరూపమును విశేషించి నిరూపించి (32వ శ్లోకము నుండి 42 వరకు) భగవన్మయము కాని దేదియు లేదని నిష్కర్షించి, తదాశ్రయణమే పరమోపాయమని నొడివెను. ధ్యేయస్వరూపమును గూడ (46,47 శ్లోకములలో) నిరూపించెను. ధ్యానప్రకారమును, ధ్యానవిఘ్నములను, తత్పరిహరణోపాయమును తెల్పెను.

శ్రీ నారద ఉవాచ -

అనంతస్యాప్రమేయస్య ప్రభావం దోషదూషణం ।
విప్రాః శృణుధ్వం వక్ష్యామి యావజ్జ్ఞానం మమోన్నతమ్ ॥ 1

భవాబ్ధి ముత్తితీర్షూణాం శరణ్యః సచతుర్భుజః ।
యః సహస్రభుజో భాతి నిజభక్తసముద్ధృతౌ ॥ 2

అవ్యక్త బ్రహ్మసేవీ హి నిర్విఘ్నం న పరం వ్రజేత్ ।
దుర్జేయో హ్యరిషడ్వర్గః సగుణం బ్రహ్మతద్భజేత్ ॥ 3

శ్రీ నారదముని పల్కెను. 'సత్యంజ్ఞానమనన్తం బ్రహ్మ' అను శ్రుతియందు చెప్పబడిన దేశకాలవస్తు పరిచ్ఛేద శూన్యుడును, ఎట్టి ప్రమాణముల చేతను ఇట్టివాడని తెలియరాని వాడును అయిన శ్రీహరి యొక్క మహామహిమమును, తత్ప్రాప్తికి ప్రతిబంధకములైన దోషముల నిరాకరణమును నాకెంత తెలియునో అంత చెప్పెదను. ఓ విప్రులారా ! వినుడు. ఈ శ్లోకమున గల 'అనంత' 'అప్రమేయ' శబ్దములకు విభిన్న సంప్రదాయములందు విభిన్నార్థములు చెప్పబడినవి. వైష్ణవ సంప్రదాయమున 'అనంత' శబ్దమునకు సత్యకామసత్యసంకల్పాద్యనేక గుణ విశిష్టుడనియు, దేశకాలవస్తువులను త్రివిధ పరిచ్ఛేదము(కొలత) లేనివాడును, అన్నిదేశములందును, అన్నికాలములందును, అంతట వ్యాపించి అంతర్యామి రూపుడై యండెడివాడు అని అర్థములు చెప్పబడినవి. ప్రమేయుడు అనగా ప్రమాణముచే తెలియ దగినవాడు. అట్లుకానివాడు అనగా తెలియరానివాడు అప్రమేయుడు అనియొక యర్థము. బ్రహ్మాదులకు సహితము ఇంద్రియ గోచరము కానివాడని వేరొక యర్థము. ముందు ముందు గూడ ఈ యర్థములనే గ్రహింపవలయును. 1

భవసాగరమును దాటగోరు వారికి చతర్భుజుడగు నా శ్రీమన్నారాయణుడే ఆశ్రయింప దగినవాడు. ఆయన చతుర్భుజుడేయయ్యును, తనభక్తుల నుద్ధరించు నప్పుడు సహస్రభుజుడుగా భాసించుచుండును. 2

ఈ శ్లోకమున నవ్యక్తోపాసనము కంటె వ్యక్తోపాసనము సర్వజన సులభమని దేవర్షి చెప్పుచున్నాడు. అవ్యక్తమగు పరబ్రహ్మమును సేవించువాడు నిర్విఘ్నముగ ప్రాప్యస్థితిని పొందజాలడు. ఏలన కామక్రోధాద్యరిషడ్వర్గము జయింప రానిదికదా ! కావున సగుణ బ్రహ్మోపాసనమే తగినది.

ఉపాసనములు ద్వివిధముగ నున్నవి. అవ్యక్తోపాసనము అనగా నిర్గుణోపాసనము.

వ్యక్తోపాసనము అనగా సగుణోపాసనము. శ్రీ భగవద్గీతలో భగవానుడు వీటిని ప్రస్తావించి అవ్యక్తోపాసకులకు క్లేశములధికమనియు, దేహధారులగు ప్రాణులకు అవ్యక్తోపాసనామార్గము దుఃఖకరమని -

క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తా సక్తచేతసాం ।

అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే ॥

అని పేర్కొనినాడు. అవ్యక్త శబ్దమునకు ఇంద్రియాగోచరము,(ఇంద్రియములకు కన్పట్టనిది) ప్రత్యక్షాద్య గోచరమగు వస్తువు, అని పలువిధముల వ్యాఖ్యానములు కన్పట్టుచున్నవి. అవ్యక్త శబ్దమునకు ప్రధానము, మూలప్రకృతి అనిగూడ అర్థము కలదు. కాని యిక్కడ ప్రధానపరముగాక చక్షురాది కరణములచే వ్యక్తముకాని యాత్మస్వరూపము అని మాత్రమే గ్రహింపదగును. కొన్ని సంప్రదాయములలో దీనినే నిర్గుణ బ్రహ్మమనిగూడ వ్యవహరింతురు. అవ్యక్త శబ్దమున కీక్రింది నిర్వచనము కలదు.

'ఇంద్రియై ర్గృహ్యతే యద్యత్ తత్తద్వ్యక్తమితిస్థితిః ।

అవ్యక్తమితి విజ్ఞేయం లింగ గ్రాహ్యమతీంద్రియమ్ ।'

కంటికగు పింపనిది అని సామాన్యార్థము. కంటికగు పింపని దానిని ధ్యానించుట కష్టము కావున సకల కల్యాణ గుణములతోగూడి కంటికగుపించెడి భగవన్మంగళరూపమే సర్వులకు సులభముగ నుపాసింప దగినదని దీని తాత్పర్యము. దీనినే ఇతరత్ర ప్రకృతి వికృతి రూపములుగగూడ చెప్పుటకలదు. విష్ణుధర్మోత్తరమున - సాకారము (ఆకృతికలది) వికృతియనియు, నిరాకారము ( కంటి కగుపింపని యాకృతికలది) ప్రకృతియనియు, ఈ రెండింటిలో అర్చనాదులొనర్చుటకు వికృతిరూపమే సులభమనియు ఈక్రింది విధముగ పేర్కొన బడినది.

' ప్రకృతిర్వికృతి స్తస్య ద్వేరూపే పరమాత్మనః ।

అలక్ష్యం తస్యతద్రూపం ప్రకృతిస్సా ప్రకీర్తితా ॥

సాకారా వికృతిర్జ్ఞేయా తస్య సర్వం జగత్ స్మృతం।

పూజాధ్యానాదికం కర్తుం సాకార స్యైవ శక్యతే ॥

స్వతస్తు దేవఃసాకారః పూజనీయో యథావిధి ।'

ఆత్మారాములగు యోగులు సహితము భగవానుని సకలకల్యాణ గుణాకరమగు దివ్యమంగళ విగ్రహముచే నాకృష్టులై దానినే యుపాసించుచున్నారని - ' ఆత్మారామాశ్చమునయో

యథాగాథహ్రదాంతఃస్థో మత్స్యో జయతి జాలకాన్ ।
కామముఖ్యానరీనేతాన్ నరోనారాయణాశ్రయః ॥ 4

ఇతఃస్మరః తతః క్రోధస్త్వితో మోహస్తతోమదః ।
అసిపత్ర వనాంతేతు గతిశ్చక్రీ ముముక్షతామ్ ॥ 5

హరిభక్తి సుధాస్వాద రోమాంచ ఘన కంచుకమ్ ।
కిం కుర్యుః శార్ఙ్గిణా రక్ష్యం కుసుమేషుముఖారయః ॥ 6

మోక్ష సౌధం మహోత్తాన మారురుక్షు స్తతోనరః ।
భగవద్భక్తి నిఃశ్రేణీం భజేతైవాన్యథాపతేత్ ॥ 7

వాఙ్మనః కాయజైః పాపైః అవశ్య మనిశంకృతైః ।
జనః కథం వా ముచ్యేత సద్భావేనా భజన్హరిమ్ ॥ 8

నిర్గ్రంథా అప్యురుక్రమే । కుర్వన్త్య హైతుకీంభక్తి మిత్థం భూతగుణోహరిః ॥ ' ఇత్యాదిగ శ్రీభాగవతము పేర్కొనుచున్నది. 3

లోతైన మడుగున నున్న చేపలు, జాలరి నుండి తప్పించు కొనినట్లు శ్రీమన్నారాయణు నాశ్రయించిన నరుడు కామాద్యరిషడ్వర్గమును జయించును. 4

ఇటు కామము, అటు క్రోధము, ఇటు మోహము, అటు మదము. ఇట్లు కత్తులవంటి యాకులుగల వనప్రదేశమున ప్రయాణించు ముముక్షువులకు చక్రధారియగు శ్రీహరియే దిక్కు. అతడు స్వాశ్రితుల మోక్షమార్గ ప్రయాణమునకు ప్రతిబంధకములైన కామాదుల తనచక్రముతో నరికివేయునని తాత్పర్యము. 5

హరిభక్తియనునమృతమును త్రాగి, సానందపులకాంచిత దేహులైన వారికి వారి రోమాంచమే కంచుకము కాగా శత్రువు లేమి చేయగలరు ? 6

కనుక,మోక్షమను మహాప్రాసాదమునెక్కగోరు నరుడు శ్రీహరిభక్తి యను నిచ్చెననాశ్రయింపవలసినదే , లేనిచో క్రిందపడుట తథ్యము. 7

అవశుడగు నరుడు, తప్పక చేసెడి వాక్పాపములచేతను మనఃపాపములచేతను,

వేదాః శాస్త్రశతం వాపి తారయంతే న తం నరం ।
యస్యాత్మమనసోః నాలం ఫలితా భగవద్రతిః । 9

శాస్త్రం సద్భక్తిమఫలత్, శస్యంచ కణిశోజ్ఝితమ్ ।
కులస్త్రీ చాప్రజాః కూపమంబుహీనం వృథైవ తత్ । 10

భగవద్భక్తిహీనస్య జాతిః శాస్త్రం, జపస్తపః ।
అప్రాణస్యేవ దేహస్య మండనం, లోక రంజనమ్ । 11

శుచిః , సద్భక్తిదీప్తాగ్నిదగ్ధదుర్జాతికల్మషః ।
శ్వపాకోఽపి బుధైః శ్లాఘ్యః , నవేదాఢ్యోఽపి నాస్తికః । 12

దేహకృతములగు పాపములచేతను శ్రీహరిని సద్భావముతో భజింపక యెట్లు ముక్తి నొందగలుగును ? 8

ఎవ్వని యంతరాత్మయందును, మనస్సునను భగవత్ప్రీతి రూపమగు భక్తి ఫలింప లేదో వానిని వేదములు, శాస్త్రశతమును తరింప జేయజాలవు. 9

ఉత్తమ భక్తినీయజాలని శాస్త్రము, గింజలతో కూడిన కంకులు లేని పంట, సంతానహీనయగు కులస్త్రీ, జలహీనమగు బావి వ్యర్థములే కదా ! 10

భగవద్భక్తి హీనుడెంతటి యుత్తమజాతిలో పుట్టినను, ఎంతటిశాస్త్రజ్ఞాన సంపన్నుడైనను, ఎంతటి జపతపాదుల నొనరించినను, వానిజాతిశాస్త్రజపతపములు, ప్రాణములేని శరీరమునకు చేసిన యలంకారములవలె నిష్ఫలమై, కేవలము లోకమును రంజింపజేయుటకే యుపయోగించును. అనగా భగవద్భక్తిహీనుని జాతి, శాస్త్రము, జపము, తపము, మున్నగునవి వ్యక్తిగతముగ నాతని నుద్ధరించుట కుపరింపక, కేవలము ఈతడింతటి గొప్పవాడని మిథ్యా గౌరవమును పొందుటకుపయోగ పడునని తాత్పర్యము. కావున జాత్యాదుల కంటె భగవద్భక్తియే గొప్పతనమును కల్గించునదని తాత్పర్యము. 11

కాయికము, వాచికము, మానసికమునగు త్రివిధ శౌచము కలవాడై, లోకదృష్ట్యా నీచజాతిలో పుట్టిన వాడయ్యును శ్రీహరిభక్తియను నగ్నిచే పరిశుద్ధుని పొందిన వాడైన శ్వపాకుడు సహితము పండితులచే శ్లాఘింప దగియున్నాడు. వేదవేదాంగపారంగతుడయ్యును హరిభక్తి విహీనుడై నాస్తికుడైన వాడు నీచుడేయగునని గుర్తింప వలయును.

శ్రుతం తదుపఘాతాయ యదసన్మార్గవర్తినః ।
జ్ఞాత్వాపి పాపకం కర్మ నాస్తిక్యేన కరోత్యసౌ ॥ 13

అశాస్త్రజ్ఞశ్చరన్ పాపం బుధైర్భూయో న నిన్ద్యతే ।
అంధః పతన్నివ శ్వభ్రే, కేవలం త్వను కంప్యతే ॥ 14

శాస్త్రవిత్ కుత్స్యతే సర్వైః జ్ఞాత్వాజ్ఞాత్వా చరన్నఘం ।
కర్ణాంతలోచనః కూపే పతన్ కైర్న విడంబ్యతే ॥ 15

తస్మాద్యత్నేన శాస్త్రాణి ప్రతిగృహ్య విమత్సరః ।
తత్ఫలం హ్యుత్తమ శ్లోకం భజేదేవ దృఢం బుధః ॥ 16

అనగా ఎవ్వరికైనను ఉత్తమమైన యోగ్యతను కల్గించునది వానికిగల హరిభక్తియే తప్ప, జాతి పాండిత్యములు కావని తాత్పర్యము. ధర్మవ్యాధాదుల వృత్తాంతములే యిందులకు నిదర్శనము. 12

హరిభక్తి విహీనతచే దుర్మార్గమున ప్రవర్తించు వానికి వాని శాస్త్రజ్ఞానమే వినాశన హేతువగును. ఏలన వాడు నాస్తిక్యబుద్ధితో, ఇది చేయరానిదని తెలిసియు, పాపకర్మము నొనరించుచున్నాడు. కనుక, ఆత్మోజ్జీవన నైపుణ్యములేని వానికి గల సాధన సంపత్తి వ్యర్థమగుటయేగాక ఆత్మహానికే కారణమగునని తాత్పర్యము. 13

గ్రుడ్డివాడు గోతిలోపడినచో చూచిన వారు దయజూపుదురే గాని కోపింపరు, నిందింపరు. సాధ్యపడినచో వాని నుద్ధరింప యత్నింతురు. అట్లే శాస్త్రజ్ఞాన ము లేనివాడు తెలియక చేసిన పాపమును బుధులు నిందింపరు. మీదు మిక్కిలి వానిని సరిదిద్ద యత్నింతురు. కాని శాస్త్రజ్ఞాన సంపన్నుడైన వాడు పాపమొనర్చినచో లోకనిందను పొందుటయేగాక వానిననుసరించిన యితరులకు గూడహానిని కల్గించినవాడగుచున్నాడు. ఏలన, లోకము విద్వాంసుల జూచి ధర్మాధర్మ నిర్ణయమును జేసికొనుచుండును. కావుననే గీతాచార్యుడు –

'యద్యదాచరతి శ్రేష్ఠః తత్తాదేవేతరో జనః ।

సయత్ప్రమాణం కురుతే లోకస్తదను వర్తతే ।'

అని చెప్పినాడు. కావున, శాస్త్రజ్ఞానముచే శ్రేష్ఠతను సంపాదించినవారు హరిభక్తి నలవరచుకొని లోకమున కాదర్శము కావలయునని తాత్పర్యము. 14

ఆప్లుత్య సర్వతీర్థేషు, దత్వా హుత్వాచ నో తథా।
ఆరాధ్య తీర్థశ్రవసం యథాయాతి పరంపదమ్ । 17

ఇమమర్థం శుకోఽప్యాహ వ్యాససూనుః పరీక్షితే ।
రాజవర్యాయ గంగాయాః పులినే ముని సంసది । 18

స హి ప్రాయోపవిష్టోఽ భూత్ బ్రహ్మశాపోగ్రతక్షకాత్ ।
భయం విజ్ఞాయ, తం ద్రష్టుమాగతాశ్చ మహర్షయః । 19

తేన తే దేవతాతత్త్వపృష్టాః వాదాన్ వితేనిరే ।
నానాశాస్త్రవిదో విప్రా మిథః సాధన భూషణైః । 20

పైశ్లోక తాత్పర్యమే భంగ్యంతరముగ మరల నీశ్లోకమున స్పష్టపరుప పడుచున్నది. శాస్త్రముల నెరిగిన వాడు తెలిసి తెలిసి పాపకృత్యముల నొనరించిన నందరిచే గర్హింప బడును. వెడదకన్నులు గలవాడు చూచిచూచి గోతిలో బడిన నెవ్వడను కంపించును ? 15

కావున, లెస్సగ శాస్త్రముల జదివి, మాత్సర్యమును విడచి శాస్త్రజ్ఞాన ఫలమగు శ్రీహరి భక్తి నలవరచుకొని యాతనిని పూనికతో తప్పక భజింపవలయును. అప్పుడే ఆతడు బుధుడని కీర్తింప బడునని తాత్పర్యము. 16

పుణ్యశ్లోకుడగు శ్రీహరిని భక్తితో నారాధించిన వాడు పరమ పదమును పొందగల్గినట్లు, ఎన్ని తీర్థములలో మునిగినను, దానహోమాదులొనర్చినను నుత్తమగతిని పొందజాలడు. కావున తీర్థస్నానదాన హోమాదులకన్న శ్రీహరిభక్తిమిన్నయని తాత్పర్యము. 17

ఈవిషయము గంగానదీ పులినమున మునిజన సభలో వ్యాసపుత్రుడగు శుకమహర్షి పరీక్షిన్మహారాజునకు చెప్పినాడు.

స్వసుఖ నిభృత చేతా స్తద్వ్యుదస్తాన్య భావో
    ప్యజిత రుచిరలీలా కృష్ట సారస్తదీయం ।
వ్యతనుత కృపయా యస్తత్త్వ దీపం పురాణం
    తమఖిల వృజినఘ్నం వ్యాససూనుం నతోఽస్మి ।

అని చెప్పబడినట్లు ఇతరములగు లౌకిక విషయముల విసర్జించి, నిరంతరాత్మానంద

హరిర్దేవం, శివోదైవం, భాస్కరో దైవమిత్యపి ।
కాలఏవ, స్వభావస్తు, కర్మైవేతి పృథగ్గుణః । 21

అథ ఖిన్నః స రాజర్షి ర్బహు వాదాకులాంతరః ।
నిఃశ్వసన్న భవత్తూష్ణీం మోక్షమార్గే ససంశయః । 22

అథాస్య పుణ్యైః ఖలు పూర్వసంచితైః
వ్యాసాత్మజో జ్ఞానమహోద్ధిచంద్రమాః ।
తమేవదేశం ప్రయయౌ యదృచ్ఛయా
శుకః స ధీమాన్ అవధూతవేశభృత్ । 23

నిమగ్నమానసుడయ్యెను, శ్రీహరి కల్యాణగుణములచే నాకర్షింపబడి యా గుణముల కీర్తించుచు, లోకాను గ్రహబుద్ధిచే శ్రీభాగవతమను పురాణరత్నమును వెలయించి లోకమునకు తత్త్వ ప్రకాశమును కలుగజేసిన భాగవతోత్తముడగు శ్రీశుకుడు (వ్యాసపుత్రుడు) మున్నే యీ విషయమును ఆర్తుడగు పరీక్షిత్తునకుపదేశించినాడు. కావున శ్రీభాగవత పురాణసారమే యీ 'హరిభక్తి సుధోదయమున' మరల ప్రతిపాదింప బడుచున్నదని తాత్పర్యము. 18

ఆపరీక్షిన్మహారాజు ప్రాయోపవేశనము నొనర్చినాడు. బ్రాహ్మణశాపము వలన తీవ్ర తక్షక నిమిత్తముగ నాతని కేర్పడిన భయము నెరిగి, ఆతనిని చూడ మహర్షు లేతెంచినారు. 19

పరీక్షిన్మహారాజుచే ప్రార్థింపబడిన నానా శాస్త్ర విశారదులును, దైవతత్త్వ వికాసము కలవారును అగు విప్రులు వారివారి యుక్తి ప్రతియుక్తులతో పరస్పర వాదములనొనర్చినారు. 20

ఇట్లొనరించిన వాద ప్రతి వాదములలో కొందరు విప్రులు శ్రీహరినే దైవముగా ప్రతిపాదించిరి. మరికొందరు శివుడే దైవమని, మరికొందరు సూర్యుడే దైవమని, మరికొందరు కాలమేనని, కొందరు స్వభావము (ప్రకృతి), కొందరు యాగాది వైదిక కర్మము ఇట్లుపలువిధముల నిరూపించిరి. 21

అంతనారాజు ఈ వివిధవాదముల విని హృదయవిక్షేపముచే కలతచెంది, సందేహ గ్రస్తుడై, ఖేదపడి, మోక్షమార్గమున, మనస్సు ప్రసరింపక మిన్న కుండెను. 22

అయత్నసంవర్ధితదృక్స్థలజ్జటః
ప్రకీర్ణకంథాచలసూత్ర మాలికః ।
అనావృతాంగస్తృణపంకచర్చిత :
వృతః స్వనద్గ్రామమృగైః సకౌతుకైః ॥ 24

రజస్వలో బాలవృతో జడాకృతిః
స్ఖలద్గతిః బ్రహ్మపరం విభావయన్ ।
అనావృతోద్యత్పులకః క్వచిత్క్వచిత్
క్షణంచ తిష్ఠన్ ఘనహర్ష నిర్భరః ॥ 25

విలోక్య తం యోగివరం నృపోత్తమః
స్వయం సమాయాన్త మనన్తవర్చసమ్ ।
ద్రుతం సముత్థాయ సముద్యయౌసహ
ద్విజైశ్చ తై ర్హర్ష వికాసిలోచనః ॥ 26

అటుపిమ్మట పరీక్షిత్తుయొక్క పూర్వజన్మ పుణ్యపరిపాకవశమున, జ్ఞానసాగరమున నావిర్భవించిన చంద్రుడును, యతివేషధారియునగు వ్యాసతనయుడు శ్రీశుకుడు తనంత తానుగ నాకస్మికముగ నా ప్రదేశమునకు విచ్చేసెను. 23

ఈ శ్లోకములలో శుకమహర్షి వర్ణింప బడినాడు. అప్రయత్నముగ వృద్ధిచెంది కన్నులపై ఇటునటు వ్రేలాడుచున్న జడలు కలవాడును, శరీరముపై మాలలుగా వ్రేలాడుచున్న దారములు కలిగి అస్తవ్యస్తముగా ధరింపబడిన బొంత గలవాడును, వస్త్ర విహీనమగు దేహము కలవాడును, మట్టిచేతను, గడ్డిపరకల చేతను పూయబడి మలినమైన శరీరముకలవాడును, మొరుగుచున్న కుక్కలచే ఆసక్తితో చుట్టువారినవాడును, ధూళిధూసరిత దేహుడును, బాలురచే పరివృతుడును, చైతన్య విహీనముగ కన్పట్టు నాకృతి కలవాడును, పరబ్రహ్మను భావనముచే తన్మయతతో తొట్రుపడుచున్న నడక కలవాడును, దిగంబరము పులకాంచితము నైన శరీరము కలిగి, అక్కడక్కడ, నిలుచుండు వాడై మహానంద భరితుడగు నాశుకు డచ్చట కేతెంచినాడు.

ఈ రెండుశ్లోకములలో నిరంతర బ్రహ్మానుభవమగ్నుడై యున్మత్తునివలె చూపరులకు కన్పట్టుచున్న శుకమహర్షి వర్ణింపబడినాడు. సాధారణముగా లోకమున మహానుభావులు భగవదనుభవ పూర్ణులు లోకులకున్మత్తులవలెనే కన్పట్టుచుందురు.

ప్రణమ్య భూమావథి దండవన్మునిం
కరే గృహీత్వా స తమాసనోత్తమే ।
నివేశ్య సంపూజ్య యథోచితార్హణై
ర్విజ్ఞాప్య వృత్తం వినయానతోఽబ్రవీత్ ॥ 27

ధన్యోఽస్మి హృత్సంశయరోగనాశనః
స్వయం ప్రసన్న స్త్వమిహాగతో యతః ।
మునేఽహమ జ్ఞానవిషాద్విభేమ్యలం
న తక్షకాత్ తత్ స్వపథేఽనుశాధి మామ్ ॥ 28

మమాధునా కిం పరమం హి దైవతమ్
పరాయణం కేన లభే శుభాగతిమ్ ।
ప్రవక్తు మర్హస్యఖిలం ఘృణానిధే!
సునిశ్చితం సర్వమహర్షి సన్నిధౌ ॥ 29

వారలను గుర్తించుట సామాన్యజనులకు వలను కాదు. వాస్తవమునకు తండ్రియగు వ్యాసుని కంటె పరిపూర్ణ బ్రహ్మానుభావము, బాహ్యవిస్మృతికల మహానుభావుడు శుకయోగీంద్రుడని పలు గాథలు స్పష్టపరచుచున్నవి. శ్రీభాగవతములోని ప్రథమస్కంథమందలి పంతొమ్మిదవ యధ్యాయమున గల- 'తత్రాభవత్ భగవాన్ వ్యాసపుత్రః'; 'తంద్వ్యష్టవర్షం' 'నిగూఢజత్రుం' 'శ్యామమ్' ఇత్యాది శ్లోకములలో (25,26,27) వర్ణింపబడిన శ్రీశుకరూపమే ఇచ్చట వర్ణింపబడినది. 24,25

అంత నాపరీక్షిన్మహారాజు అచ్చటికేతెంచుచున్న యపారతేజోనిధియగు శుకయోగీంద్రుని చూచి యానందవికసిత నయనుడై స్వాసనము నుండి సత్వరమే లేచి, ద్విజులతో కలసి ప్రత్యుత్థాన మొనర్చెను. 26

పిమ్మట శుకమునీంద్రునకు భూమిపై దండమువలె సాష్టాంగప్రణామ మాచరించి ఆతనిని కరమున గ్రహించి, యుత్తమాసనమున కూర్చుండబెట్టి యథోచిత పూజలచే సమ్మానించి, పూర్వవృత్తాంతము నెరిగించి వినమ్రశిరస్కుడై యిట్లు పల్కెను. 27

హృదయగతములగు సంశయముల నశింపజేయు మహానుభావుడవగు నీవు స్వయముగ నిచ్చట కరుదెంచినావుగాన నేనెంతయో ధన్యుడను. ఓ !మునీ !

అథనిశమ్య మునిర్నృపతేర్వచః
సకరుణో విషమాపది తిష్ఠతః ।
ఇతి జగాద హితం పరమం మునీన్
సమవలోక్య చ, తాన్ శ్రవణార్థినః ॥ 30

హరిమనంత గుణం భజతాంధ్రువా
సకలసిద్ధిరియం మునయోఽప్యమీ ।
న న విదంతి శతశ్రుతిపారగాః
సకల వేదపరం హ్యనువేదనమ్ ॥ 31

స హిదదాతి సమీహిత మర్థితో
యది జనైః స పదాంబుజ సేవితః ।
గుణమయో విగుణశ్చ పరఃపుమాన్
అథదదాతి పదం స్వమయాచితః ॥ 32

నేనజ్ఞానమను విషమునుండి భయపడుచుంటినిగాని, తక్షకసర్పమునుండి కాదు. కావున నాకు సముచితమగు మార్గమున అనుశాసనమునిమ్ము.

దయానిధీ ! ఓ మునిశ్రేష్ఠా ! నా కిప్పుడు పరమప్రాప్యమగు దైవమేది? శుభగతిని (ముక్తిని) ఏ సాధనముచే పొందగల్గుదును? ఈ విషయమును నిశ్చితమొనర్చి యీ మహర్షుల సన్నిధిని నా కెరిగింపుము. ఈ శ్లోకమున పరీక్షిత్తు తనకు పరమ ప్రాప్యమగు దైవతమును ఆదైవతమును పొందు సులభోపాయమును ఆతురుడై ప్రశ్నించుచున్నాడు. ఈ ప్రశ్నమునకు సమాధానముగా 31వ శ్లోకమునుండి ఆధ్యాయాంతము వరకు శుకమునీంద్రుని సవిస్తర సమాధానము వర్ణింపబడినది. 29

అటు పిమ్మట నాశుకముని, ప్రభుని మాటలువిని, శ్రవణకుతూహలు రగు మునీంద్రులఁ జూచి ఘోరాపదయందు చిక్కుకొన్న నృపతికి పరమశ్రేయఃకరమగు వచనము నిట్లు పలికెను. ఇచ్చట ' శ్రవణార్థిన ః ' అనిమునులకు వేయబడిన విశేషణముచే బ్రహ్మజిజ్ఞాసువులకు ప్రథమాపేక్షితముగ శ్రవణము (భగవద్గుణములఁ వినుట) నిర్దేశింపబడినది. నవవిధ భక్తి ప్రభేదములలో మొదటిది కూడ శ్రవణమే.

చూడుడు - 'శ్రవణంకీర్తనం విష్ణోఃస్మరణం పాదసేవనమ్ ।

దదదపి స్వజనస్య హి వాంఛితా
న్యథ నికృంతతి వాంఛితమేవ తత్ ।
హితకరం స్వయమేవ విముక్తయే
నతుజనాః స్వయమేవ విజానతే ॥ 33

స్వజన బంధుమతః సుజనప్రభుం
కథమపీహ భజేత పరాత్పరం ।
స హి తతోఽస్య యదేవ హితం భవే
న్న న విధాస్యతి తత్ కరుణాత్మకః ॥ 34

స ఖలు పంచసమీకరణరూప ధృక్
తనుభృతః పరిచేష్టయతి ప్రభుః ।
కమల జాద్యఖిలాన్, శిఖిరూపధృక్
పచతి భుక్తమపి స్వయమేవ తైః ॥ 35

అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥'

(శ్రీభా. 7-5-23) 30

అనంతకల్యాణగుణ విశిష్టుడగు శ్రీహరిని భజించిన వారికి సర్వవిధశ్రేయః ప్రాప్తి నిశ్చయము. నానావేద పారంగతులగు నీ మునీశ్వరులీ విషయమును తప్పక యెరుగుదురు., సమస్త వేదములకు పరమ ప్రతిపాద్యము శ్రీహరి నెరుగుటయే. 31

జనులచే ప్రహ్వాభావముతో పాదార్చనాపురస్సరముగ(భక్తితో) ప్రార్థింపబడినచో నా సర్వకల్యాణ గుణమయుడును, హేయగుణరహితుడును, పరమపురుషుడగు నా శ్రీహరి యాచింప నక్కరలేకయే స్వపదమును (పరమపదమును) తప్పక యనుగ్రహించును. ఇచ్చట 'విగుణః' అను పదమునకు గుణరహితుడు, నిర్గుణుడు అనియర్థముగాక హేయగుణములు లేనివాడు అనియర్థము చెప్పవలయును. భగవానుడు గుణరహితుడుగాక సకల కల్యాణ గుణగణుడుగనే శ్రీభాగవతాదులందు ప్రతిపాదింపబడినాడు. 32

తనను ఆశ్రయంచిన వారికి, వారి కోరికల నీడేర్చియు, శ్రీహరి, మరలవారి కోరికల తృంచివేయును. అనగా వారికేది హితకరమో దానినే, స్వామి, యనుగ్రహించును.

**స్వవపుషైవ జగద్విరచయ్య తత్**
**స్వయమనన్తవపుః స బిభర్త్యధః ।**
**ఉపరిచౌషధి వృష్ట్యనిలోడుప**
**ద్యుమణి వహ్నిమయోఽవతి నైకథా ।** 37

శ్లో ॥ సత్త్వం రజసస్తమ ఇతి నిర్గుణస్య గుణాస్త్రయః ।
స్థితి సర్గ నిరోధేషు గృహీతా మాయయా విభోః ॥

ఇచ్చట నిర్గుణ శబ్దమునకు స్వభావతః త్రిగుణాతీతుడని యర్థముగాని, ఎట్టిగుణములు లేనివాడని కాదు. ఈ గుణత్రయము యోగమాయచే కల్పింపబడినదేనని శ్రీభాగవతమే –

సత్త్వం రజస్తమ ఇతి గుణాస్తద్వృత్త యశ్చయాః ।
త్వయ్యద్ధా బ్రహ్మణి పరే కల్పితా యోగమాయయా ॥
(శ్రీభా. 10-85-13) 36

ఆ శ్రీహరి స్వయముగ ననన్త శరీరములు కలవాడు (లేదా ఇంతని కొలువరాని) యపరిచ్ఛిన్న శరీరము కలవాడు అయినను తన శరీరము చేతనే ఈ సమస్త జగత్తును సృజించి భరించుచున్నాడు. పైగా ఓషధులు (పంటలు) వర్షము, వాయువు, చంద్రుడు, సూర్యుడు, అగ్ని అన్నియు తానయ్యై పలువిధముల రక్షించుచున్నాడు.

ఈశ్లోకమున భగవానుడు తన శరీరముచేతనే ఈ జగత్తును సృజించినాడని చెప్పబడిపది. ఇచ్చట పరిణామరహితమైన భగవంతుని శరీరమునకు ఈజగత్తుగా పరిణామ మేర్పడుచున్నదా? అయినచో ఆ పరిణామము వలన భగవంతునకు (తక్కువతనము) కలుగుట లేదా? ఇత్యాది వివిధ సందేహములు కలుగుచున్నవి. ఈ విషయమున భిన్నభిన్న సంప్రదాయములలో భిన్నభిన్న సమన్వయ రీతులున్నవి.

శ్రీవిష్ణు పురాణమునగల యీక్రింది శ్లోకములలో పై ప్రశ్నలకు సమాధాన మీయబడినది.

ఏవం ప్రకారమమలం నిత్యం వ్యాపకమక్షయం ।
సమస్తహేయరహితం విష్ణ్వాఖ్యం పరమం పదమ్ ॥
ద్వేరూపే బ్రహ్మణస్తస్య మూర్తం చామూర్తమేవచ ।
క్షరాక్షర స్వరూపేతే సర్వభూతేష్వవస్థితే ॥

అక్షరం తత్పరబ్రహ్మ, క్షరం సర్వమిదం జగత్।

ఏకదేశ స్థితస్యాగ్నేః జ్యోత్స్నా విస్తారిణీ యథా।

పరస్య బ్రహ్మణ శ్శక్తిః తథేదమఖిలం జగత్॥

తత్రాప్యాసన్న దూరత్వా ద్బహుత్వస్వల్ప తామయః।

జ్యోత్స్నా భేదోఽస్తి తచ్ఛక్తేస్తద్వ న్మైత్రేయవిద్యతే।

బ్రహ్మవిష్ణుశివా బ్రహ్మన్ ప్రధానా బ్రహ్మశక్తయః।

తతశ్చదేవా మైత్రేయ! న్యూనా దక్షా దయస్తతః॥

తతోమనుష్యాః పశవో మృగపక్షిసరీస్పృపాః।

న్యూనా, న్యూనతరాశ్చైవ వృక్షగుల్మాదయస్తథా॥

(శ్రీవిష్ణు 1-22-53, 54,55,56,57)

ఈశ్లోకముల తాత్పర్యమిది.

అమలుడు, (ఎట్టి ప్రాకృత దోషములు లేనివాడు) నిత్యుడు (త్రికాలాపరిచ్ఛిన్నుడు) అంతట వ్యాపించియున్నవాడు, నాశరహితుడు, నిఖిహేయ ప్రత్యనీక కల్యాణగుణగణుడు అయిన విష్ణువే పరమధామభూతుడు. ఈయనకు మూర్తము (శరీరముకలిగి కంటి కగుపించునది) అమూర్తము (శరీరము లేక కంటికి అగుపింపనిది) అయిన రెండు రూపములున్నవి. అందు మూర్తరూపముక్షరమనియు అదియే ఈ సమస్త ప్రపంచమనియు యెరుగవలయును. అక్షరమగునది అమూర్తరూపము. క్షరమగు రూపమే ఈజగత్తుగా నేర్పడగా నక్షరమగు బ్రహ్మస్వరూపము అంతర్యామిగాలోనుండి ఈజగత్తును నియమించు చున్నది. ఒకప్రదేశమున కదలకయున్న సూర్యబింబమునుండి కాంతులు నలుదెసల వ్యాపించినట్లు అక్షరుడగు నాపరబ్రహ్మమైన విష్ణువు యొక్క శక్తియే ఈజగత్తుగా నేర్పడినది. దీనివలన సూర్యస్థానీయుడగు పరబ్రహ్మముకంటె తేజోరూపమగు జగత్తు వేరుగనున్నదని తెలియుచున్నది. 'ప్రకృతిశ్చప్రతిజ్ఞా దృష్టాంతనుపరోధాత్ (బ్ర.సు 1-4-23) అనుసూత్రమున పరబ్రహ్మము జగత్తునకు నిమిత్త కారణముమాత్రమే గాక ఉపాదాన కారణము కూడనని చెప్పబడినది. ఉపాదాన కారణమనగా ఘటాదులకు మృత్తికాదికము వంటిది. ఏదిలేనిచో ఏవస్తువు సర్వాత్మనా ఇతరకారణములున్నను ఏర్పడజాలదో అదియు పాదానకారణము. ఘటమేర్పడుటకు, జలము మున్నగు ఇతర కారణములున్నను మృత్తు (మట్టి) అపరిహార్యము (తప్పనిసరి) అయినట్లు జగత్తుకు

పరబ్రహ్మమే ఉపాదానకారణము. మృత్తు కారణముకాగా ఘటముకార్యము (దానివలన పుట్టినది) అయినట్లు పరబ్రహ్మము కారణము కాగా ఆ పరబ్రహ్మమే కార్యము గూడ అయినాడు. అనగా మృత్తువంటివాడును, ఘటాదికమువంటి వాడును ఒకే పరబ్రహ్మము తన ద్వివిధరూపములతోనైనాడు. పైని పేర్కొనబడిన యక్షరము, అమూర్తమునైన బ్రహ్మము కారణముకాగా, మూర్తమగు బ్రహ్మము జగత్తుగా నేర్పడి కార్యమైనాడు. ఇట్లగుటకు భగవంతుని శరీరమైన ప్రకృతి పురుషులే నిమిత్తము. అనగా భగవంతుడు తనకు శరీరమైన ప్రకృతి పురుషుల ద్వారమున జగత్తుగా పరిణమించుచున్నాడు. దీనితాత్పర్యమిది.

స్వయముగ అపరిచ్ఛిన్నుడు జ్ఞానానంద స్వభావుడు అయిన భగవానుడు జడము అచిద్రూపమునగు ప్రకృతి, చిద్రూపులగు (జ్ఞానస్వరూపులైన) జీవులు ఈ రెండిటి సమష్టియగు శరీరము కలవాడై తద్ద్వారమున తన శరీరమునే ఈ సమస్తజగత్తుగా పరిణ మింప చేయుచున్నాడు. ఇట్లు పరిణమించినను ఎట్టి వికారములకు దోషములకు ఆస్పదుడుకాడు. ఇట్లు జగత్పరిణామము నొందుట శ్రీహరికి లీలయే తప్పవేరుకాదు. ఇట్టి భగవచ్ఛరీర భూత ప్రకృతి పురుష సమష్టి పరిణామముగ నీ జగత్తు ఏర్పడినదని తెలియజేయుటకే మూల శ్లోకమున- 'స్వవపుషైవ జగద్విరచయ్య' అని చెప్పబడినది. దీనిని బట్టి సమస్త చిదచిద్వస్తుజాతము (జీవులు, జడప్రపంచము) సూక్ష్మదశాపన్నములు, స్థూలదశాపన్నములును పరబ్రహ్మకు లీలోపకరణములనియు, సృష్ట్యాదులు లీలయనియు తెలియవలయును. జీవులును, ప్రకృతియు భగవచ్ఛరీరమైన శక్తియేగాని వేరుకాదు. దీనినే విష్ణుపురాణ శ్లోకమున - ' పరస్యబ్రహ్మణ శ్శక్తి స్తథేదమఖిలం జగత్ ' అని చెప్పబడినది. అనగా ప్రకృతి పురుషాత్మకమగు భగవచ్ఛక్తియే బ్రహ్మాది స్థావరాంతమగు సమస్త సృష్టిగా పరిణమించినదేగాని వాస్తవమునకు సకల కల్యాణగుణాకరుడగు భగవానుడుకాదని గూడ తెలియవలయును. ఇక్కడ నొక ప్రశ్న కల్గును. సర్వము భగవచ్ఛక్తి పరిణామమే అయినప్పుడు దేవతలు నరులు, పశుపక్ష్యాదులు స్థావరములగు చెట్లు మున్నగు భేదములు, తారతమ్యము లెట్లేర్పడుచున్నవి ? అని. దీనికి సమాధానము విష్ణుపురాణము నుండి యుదాహరించిన శ్లోకములలో, 'తత్రాప్యాసన్నదూరత్వాత్' అని ఆరంభించి 3 శ్లోకములలో చెప్పబడినది. ఇది వీటి యభిప్రాయము. ఏ విధముగ సూర్యబింబమునుండి యావిర్భవించిన కాంతి యొక్కటేయైనను, దగ్గరగానున్నప్పుడు, దూరముగానున్నప్పుడు ప్రదేశతారతమ్యమును బట్టి ప్రసరించుటలో తారతమ్యముండునో అట్లే పరబ్రహ్మశక్తి, బ్రహ్మమొదలు స్థావరపర్యంతము వివిధముగ పరిణమించుటయు

యద్వై తేజశ్చంద్రసూర్యాదిదృశ్యం
యచ్చైతన్యం భాతి సర్వాసుభృత్సు ।
యద్యచ్ఛౌర్యం, ధైర్య మాయుః ప్రభుత్వం
తత్తద్రూపం సర్వసారస్య విష్ణోః ॥ 38

జ్ఞానకర్మముల తారతమ్యమును బట్టియని తెలియ వలయును. ఈ విషయమును మరికొంత వివరింపవలసియున్నది. ఇంతకుముందు సమస్త జీవకోటి, పురుషుడనియు జడమైనప్రపంచము ప్రకృతియనియు తెలుపబడినది. ఈ రెండింటికి స్థూలదశ, సూక్ష్మదశయని రెండుదశలు కలవు. సృష్టియైన తరువాత గలదశ స్థూలదశ. ప్రలయమైన తరువాత గలదశ సూక్ష్మదశ. ఆదశలో సూక్ష్మరూపముగనున్న జీవులు చిద్రూపులై (జ్ఞానస్వరూపులై) భగవంతునకు శరీరముగాన మరియుందురు. అట్లే సమస్త జడప్రపంచము సూక్ష్మముగా భగవంతునకు శరీరమై యుండును. భగవానుడు సృష్టిరూపముగ లీల ప్రకటమొనర్పదలచినప్పుడు సూక్ష్మములుగ తనశరీరములైయున్న జీవులను (పురుషులను) జడప్రపంచమును (ప్రకృతిని) ఈప్రపంచముగ పరిణమింప జేయుచు, వాటికిగల జ్ఞానమును, కర్మమును బట్టి తారతమ్యమును కల్గించును. దీనిని బట్టి కొందరు జీవులు దేవదేహములను, మరికొందరు నరదేహమును, అట్లే పశుపక్ష్యాది వివిధ దేహముల పొందుదురు. ఈ విషయమే శ్రీవిష్ణుపురాణోక్త శ్లోకములలో చెప్పబడినది. ఈతాత్పర్యమే శ్రీ భాగవతమునగల ఈ క్రింది శ్లోకమున చెప్పబడినది.

యథాత్మమాయా యోగేన నానాశక్త్యుపబృంహితమ్
విలుంపన్ విసృజన్, గృహ్ణన్ బిభ్రదాత్మానమాత్మనా ।
క్రీడస్యమోఘ సంకల్ప ! ఊర్ణనాభిర్య థోర్ణుతే
తథా తద్విషయాందేహి మనీషాం మయిమాధవ ।( శ్రీ భా. 2-9-26)

ఎట్లు ఊర్ణనాభి (సాలెపురుగు) తనశరీరము నుండి దారమును సృష్టించి గూడుకట్టి అందు నివసించుచుండునో అట్లే భగవానుడు తనంత తానుగనే వివిధశక్తి విశిష్టమగు తనశరీరమునే స్వమాయచే జగత్తుగ సృజించి, రక్షించి, లయింప జేయుచుండును. ఇది యప్రతిహత సంకల్పముగల భగవానుని లీలా వినోదమేగాని వేరుగాదు. కావున శ్రీహరి సృష్ట్యాది విషయకమగు విజ్ఞానమునను గ్రహింప వలెనని శ్లోకతాత్పర్యము. 37

చంద్ర సూర్యాది రూపమగునే తేజస్సు దుగ్గోచరమగుచున్నదో, సమస్త ప్రాణుల

వేదాః బ్రహ్మేశంభురర్కః స్వభావః
కాలః కర్మైవేతి భిన్నం యదాహుః ।
సృష్ట్యాదీనాం కారణం, కారణజ్ఞం
దైవం చైతత్ సర్వమేవం సవిష్ణోః ॥ 39

యద్భూజ్జాతం జాయమానం జనిష్యద్
విష్ణోర్నాన్యత్ స్థావరం జంగమం వా ।
వస్త్వస్త్యస్మిన్ సహ్యమూన్ వ్యాప్యలోకాన్
శబ్దస్సర్వాణ్యక్షరాణీవ తస్థౌ ॥ 40

ఆద్యాయద్యన్మత్స్య కూర్మాది సంజ్ఞా
విష్ణోర్మూర్తిః పంక్తిసంఖ్యావతారా ।
తద్యద్విశ్వం సర్వమేతచ్చ, తస్మా
ల్లోకే కించిన్నావ మన్యేత ధీమాన్ ॥ 41

యందు ఏ చైతన్యము ప్రకాశించు చున్నదో, మరియు శౌర్యము, ధైర్యము, ఆయువు, పరిపాలనాదక్షత ఇవియన్నియు సర్వసార భూతుడగు నావిష్ణువుయొక్క రూపమే. ఈ శ్లోకము భగవద్గీత యందలి విభూతి యోగమునకు సంగ్రాహకము. గీతాచార్యుడు -

'యద్యద్విభూతి మత్ సర్వం శ్రీమదూర్జితమేవవా ।

తత్తాదేవా వగచ్ఛత్వం మమతేజోఽంశ సంభవమ్' ॥

అని చెప్పినాడు. విభూతిమత్ అనగా ఐశ్వర్యసంపన్నమనియు నర్థము. ఇందే ప్రభుత్వమంతర్భవించును. శ్రీమత్ అనగా సుందరము. ఊర్జితమ్ అనగా శౌర్య, ధైర్యములు కలది బలవంతమైనదని యర్థము. ఇట్టివస్తువేదైనను నా దివ్యతేజస్సు యొక్క అంశముతో కూడినదేనని యెరుగుమని తాత్పర్యము. అనగా ఈ లోకమున ఎట్టి విశిష్టతగల వస్తువైనను భగవత్తేజోంశ సంభూతమని గుర్తింపవలయును. 38

చతుర్వేదములు, చతుర్ముఖబ్రహ్మ, పరమశివుడు, సూర్యుడు, ప్రకృతి, కాలము, కర్మము, అని యేయే విభిన్న వస్తువులు కలవో అవియు, ఈ సమస్త సృష్టికి కారణము, అట్టి కారణము నెరిగిన దైవము, సమస్తము శ్రీహరియే. 39

శబ్దతత్త్వము అకారాది సర్వాక్షరముల యందు వ్యాప్తమై యున్నట్లు, పుట్టినది,

ఇత్థంవిష్ణుః సర్వమేతన్నకించిత్
తస్మాదస్మిన్ భిద్యతేऽనంతమూర్తిః ।
ఏతజ్జ్ఞాత్వా త్వేవమేవాచరంతో
న స్పృశ్యంతే భూప ! సంసారదుఃఖైః ॥ 42

తస్మాన్నాథం భక్తకాంతం వరేణ్యం
భీతశ్చేత్త్వాం సంస్మృతేశ్శ్రద్ధధానః ।
శ్రద్ధాదృశ్యం నాస్తికానాం సుదూరం
నిత్యానందం తం స్మరానంతమాద్యమ్ । 43

యావద్యావన్నాస్తికా స్సంగిరంతే
దైవం నాస్తీత్యాదరాద్యుక్తి లేశైః ।
తావత్తావద్వర్ధయత్యేవ తేషాం
యుక్తిం తత్రైవాంగ ! సాప్యస్యలీలా ॥ 44

పుట్టుచున్నది, పుట్టనున్నది యగు స్థావరము (స్థిరముగ నుండునది జడమునగు శిలాదికము) జంగమము (కదలికగల ప్రాణికోటి) అగు సమస్తవస్తు జాతము శ్రీహరికి ప్రకృతి పురుషాత్మకముగ శరీరము కావున వేరుకాదు. ఆతడు సమస్తలోకములను అంతర్యామిగ నియమించుచు వ్యాపించి యున్నాడు. 40

శ్రీమహావిష్ణువుయొక్క మత్స్యకూర్మవరాహనృసింహ వామన రామ, పరశురామ, బలరామ, బుద్ధ కల్కి రూపమగు దశవిధ సర్వప్రథమావతారమూర్తి కలదో దానిచే నీ సమస్త ప్రపంచము వ్యాప్తమై యున్నది. కావున నీ సృష్టిలోగల పిపీలికాది బ్రహ్మపర్యంతమగు వస్తువుదేనినేని భగవద్రూపముగ సమ్మానింప వలయునేగాని తిరస్కారబుద్ధితో చూడరాదు. అట్లు చూచుటయే సామ్యదృష్టి యనియు, అట్టిసామ్యదర్శనము కలవాడే పండితుడని 'ధీమాన్' అను పదముచే సూచింపబడినది. భగవద్గీతలో ఈ విషయమే –

విద్యావినయ సంపన్నే బ్రాహ్మణేగవి హస్తిని ।
శునిచైవ శ్వపాకేచ పండితాస్స మదర్శినః । ఇత్యాదిగ చెప్పబడినది.
భగవద్వ్యాప్తమగు సర్వవస్తువు సమానమేనని తాత్పర్యము. 41

కావున నీ సమస్త ప్రపంచము అనంత మూర్తియగు శ్రీ విష్ణువేనని యెరిగి, తదను

తస్మాత్ పాపా హైతుకా దైవదగ్ధా
యద్వా తద్వా యద్యథేచ్ఛం వదంతు ।
త్వం తు క్రీడానిర్మితాశేషలోకం
విష్ణుం జిష్ణుం భక్తిజేయం భజస్వ ॥ 45

ఆదౌ ధ్యాయే చ్ఛంఖ చక్రాదిచిహ్నై
ర్దోర్భిర్భాంతం చంద్రవర్ణం చతుర్భిః ।
పుణ్యైస్సర్వై ర్లక్షణై ర్లక్షితాంగం
దివ్యాకల్పం తం ప్రసక్తం హృదబ్జే ॥ 46

సారముగ సామ్యబుద్ధితో ప్రవర్తించువారు సంసార దుఃఖములచే స్పృశింపబడరు.

కావున భక్తులచే ప్రేమింపబడువాడును, భక్తులప్రేమించు వాడును, సర్వశ్రేష్ఠుడును వాసుదేవుని, సంసార భయవిముక్తికై శ్రద్ధగలవాడవై స్మరింపుము. అనంతుడు, ఆద్యుడు, నిత్యానంద స్వరూపుడగు నాభగవానుడు శ్రద్ధామాత్రదర్శనీయుడై నాస్తికులకు సర్వాత్మనా దూరుడే సుమా.

ఈ శ్లోకమున భగవద్భక్తికి ప్రధానమైనది శ్రద్ధయని ప్రతిపాదింపబడినది. శ్రీభగవద్గీతలో గీతాచార్యుడు –

అశ్రద్ధధానాః పురుషాః ధర్మస్యాస్య పరంతప ।

అప్రాప్యమాం నివర్తంతే మృత్యు సంసార వర్త్మని ॥

ఇత్యాదిగ నెవ్వరు ఈ భగవద్భక్తి రూపమగు ధర్మమున శ్రద్ధలేనివారైయుందురో వారు భగవంతుని పొందలేక, మరణ ప్రచురమగు నీ సంసారమున భ్రమింతురని చెప్పియున్నాడు. 43

ఎంతవరకు నాస్తికులు దైవములేదని యుక్తిలేశములతో వాదించుచుందురో అంతవరకు వారి నాస్తికతా ప్రోద్బలకమగు యుక్తిని భగవానుడుగూడ పోషించుచునే యుండును. ఇది శ్రీహరి లీలయే. 44

కావున పాపాత్ములగు నాస్తికులు హేతువాదనిరతులై దైవోపహతులై స్వేచ్ఛగ యిచ్ఛవచ్చినట్లేదేని పలుకుదురుగాక. నీవు మాత్రము లీలగా సమస్తలోకముల

యద్వా లీలాస్వీకృతాశేషమూర్తేః
విష్ణో రూపం యత్ స్వచిత్తప్రియం స్యాత్ ।
తత్తు ధ్యాయేత్ సౌమనస్యేవ ధీమాన్
నోచేచ్చేత శ్చంచలం యో నియచ్ఛేత్ ॥ 47

ప్రాయశ్చైవం ధ్యాయతాం భూప విఘ్నా
జాయంతే హ్యేకస్మికా ఘోరరూపాః ।
ధ్యేయే దోషా భాంతి వా నిర్వికారే
ధ్యానస్థే వా తత్ర యోగీ న ముహ్యేత్ ॥ 48

సృజించిన, సర్వజేతయు భక్తిచే స్వాధీన పరచు కొనదగు శ్రీమన్నారాయణుని భజింపుము. 45

ఈశ్లోకమున శ్రీహరియొక్క ధ్యేయ స్వరూపమును శ్రీశుకుడావిష్కరించుచున్నాడు. శంఖము, చక్రము, గద, పద్మము, అను చతుర్విధ చిహ్నములతో గూడిన చతుర్భుజములతో స్వచ్ఛముగ చంద్రకాంతితో ప్రకాశించుచున్న వాడును, పరమ పావనములగు గుణములతో గూడిన శరీరము కలవాడును, ధ్యాతల హృత్పుండరీకములందు కొలువున్నవాడును అగు శ్రీహరిని తొలుత సేవింపవలయును. 46

లీలార్థమై శ్రీహరిచే పరిగ్రహింపబడిన నానారూపములలో ఏదిమనస్సునకు ప్రీతిని గొల్పునో యద్దానినే బుద్ధిమంతుడగు ధ్యాతసౌమనస్యముతో(మంచిమనస్సుతో) ధ్యానింపవలయును. అట్లుగానిచో చంచలమైన మనస్సునిలువరించుటెట్లు?

ఈ శ్లోకమున చంచలమగు మనస్సును నిలువరించుటకు భగవన్మంగళ మూర్త్యుపాసనము తప్పవేరు మార్గములేదని చెప్పబడినది. మనస్సు సహజముగ చాల చంచలమైనది. దాని ప్రవృత్తి నరికట్టుట చాల కష్టము. కావుననే అర్జునుడు గీతాచార్యునితో,

'చంచలం హిమనఃకృష్ణ ! ప్రమాథి బలవద్దృఢమ్ ।
తస్యాహం నిగ్రహం మన్యేవాయోరివసుదుష్కరమ్ ॥'

ఓ కృష్ణా ! గాలిమూటగట్టుట సాధ్యము కానట్లే నిరంతరము, ఇంద్రియముల మథించి (బలాత్కారముగ విషయములవైపులాగి) బాధపెట్టు మనస్సుకడు చంచలమై

విఘ్నాన్ జిత్వా త్యక్తనిర్వేదదోషః
యోగీ భూయ శ్చింతయేత్ పూర్వచింత్యమ్ ।
ఇత్థంనిత్యం ధ్యాయతాం దుఃఖబీజం
కల్కం సర్వం నాశయత్యాశు విష్ణుః ॥ 49

పశ్చాద్యోగీ సర్వభూతేషు విష్ణుం
భూపాత్మానం పశ్యతి జ్ఞానరూపం
జ్ఞాత్వాచైవం శాశ్వతం సర్వదుఃఖైః
అజ్ఞానోత్థై ర్ముచ్యతే ద్రాజ్మహాత్మా ॥ 50

యెంతమాత్రము నిగ్రహింపరాదు. కావున నీవు పూర్వము పేర్కొనిన సామ్యదర్శన రూపమగు యోగము మనస్సు నిలువరింపజాలని వారికెట్లు సాధ్యపడును? అని ప్రశ్నింపగా భగవానుడు –

'అ సంశయం మహాబాహో మనోదుర్నిగ్రహంచలమ్ ।
అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే ॥

ఇత్యాదిగ 'నిక్కముగ మనస్సునిలువరింపరానిదే! కాని, అభ్యాసముచేతను, విషయ వైరాగ్యము చేతను దానిని నిలువరింపవచ్చును. అని సమాధానమిచ్చెను. ఇట్లు చంచలమగు మనస్సును నిగ్రహించుటకు సమస్త కల్యాణగుణాకరమగు భగవన్మూర్తిని ధ్యానించుట సర్వోత్తమమార్గమని ఇచ్చట సూచింపబడినది. కావున భగవానునిచే పరిగ్రహింపబడిన నానావతారములలో నేదేని మనసుకు నచ్చిన దానిని మూర్తిగా ముందుంచు కొనియుపాసించుట యే మనోనిగ్రహ కారణమగును. కావుననే ఆగమశాస్త్రమునందు గూడ భగవదర్చామూర్తి వైభవమును తెలియజేయుచు –

సందర్శనాదకస్మాచ్చ పుంసాం సమ్మూఢచేతసాం ।
కువాసనా కుబుద్ధిశ్చ నాస్తికత్వం విలీయతే ।'

అకస్మాత్తుగా భగవంతుని దివ్యమంగళ విగ్రహమును ప్రతిమారూపమున దర్శించినవానికి చాలకాలము నుండి మనస్సును పట్టియున్న కుసంస్కారము, కుబుద్ధి, నాస్తికత్వము ఇవియన్నియు పటాపంచలై మనస్సు భగవద్రూపముచే నంకితమగునని చెప్పబడినది. కావున భగవన్మూర్త్యుపాసనమే మనోనిగ్రహహేతువని యెరుగవలయును.

తస్మాత్ స్వస్థ స్త్వస్త్విదానీం దృఢాత్మా
హిత్వా రాజ్యం భావయానంత మీశమ్ ।
గూఢంహ్యేతత్ తేన వావచ్యతే తే
తథ్యం పథ్యం విష్ణుమీశం భజస్వ ॥ 51

(ఇతి నారదీయే హరిభక్తి సుధోదయే శుకపరీక్షిత్సంవాదే తృతీయోధ్యాయః)

ఇట్లు భగవద్రూపమును ధ్యానించుచున్న వారికి ఆకస్మికముగ ఘోరములగు ననేక విఘ్నములు కలుగుచుండును. నిర్వికారమగు (ఎట్టివికారములేని) ధ్యేయవస్తువగు భగవంతునియందు లేని దోషములు గూడ భాసించుచుండును. మరియు ధ్యానదశయందు కొన్ని యలౌకిక శక్తులు ప్రతిభాసించి ధ్యానము భగవంతునిపై స్థిర పడకుండగ నడ్డగింపవచ్చును. యోగి యావిఘ్నముల నన్నిటిని పోద్రోలి ధ్యానమగ్నుడు కావలయును. ఏదశలోను నిర్వేదమునకు లోనుకారాదు. నిర్వేదమనగా ప్రకృతమున నిరాశ. 48

ఎవ్వడు సర్వవిధ విఘ్నముల గడచి (నిర్వేదాదులకులోనుగాక) పలుమారులు భగవద్ధ్యాన మొనర్చునో వానిదుఃఖమునకు కారణమైన కిల్బిషమును (పాపమును) విష్ణువే సత్వరము నశింపజేయును. 49

ఓరాజా ! నిర్వేదమును విడచిపెట్టి సర్వవిఘ్నముల జయించి శ్రీహరిని ధ్యానించిన పిమ్మట నాయోగి, సర్వప్రాణులయందంతర్యామిగా నున్న పరమాత్మయగు విష్ణువును దర్శించును. ఇట్లు నిత్యుడగు పరమాత్మను దర్శించి అవిద్యాకృతములగు సర్వవిధ సాంసారిక దుఃఖములనుండి యామహాత్ముడు ముక్తినిపొందును. 50

కావున పరీక్షిన్మహీ పతీ ! దృఢమైన మనస్సు కలవాడవై స్వస్థతను పొందుదువు గాక. ఈ రాజ్యమును విడచి అనంతుడగు శ్రీహరిని ధ్యానింపుము. ఇయ్యది పరమరహస్యము. కావుననే పలుమారులు నాచే చెప్పబడుచున్నావు. నిక్కముగా నీకు హితమును కల్గించు సర్వనియామకుడైన శ్రీహరిని భజింపుము. 51

(ఇది నారదీయ పురాణాంతర్గతమగు హరిభక్తి సుధోదయమున
శ్రీశుకపరీక్షిత్తుల సంవాదమున మూడవయధ్యాయము.)

# చతుర్థాధ్యాయము

**చతుర్థాధ్యాయసారము :–** ఈ ప్రకారముగా శ్రీహరియే పరతత్త్వమని నిరూపించి, తదుపాసనమే పరమోపాయమని శ్రీశుకముని నిష్కర్ష చేసినప్పటికిని, పరీక్షిన్మహారాజునకు పరిపూర్ణపరితృప్తి కలుగలేదు. ఆయనకు భగవదను భవము కలుగక పోవుటయే దానికి కారణము. దీని నెరిగిన శుకమునీంద్రుడు, తనహస్తము నా రాజేంద్రుని శిరస్సుపై నుంచగా, తానంత వరకు పలికిన మాటలలోని తత్త్వమారాజు హృదయమున పరిస్ఫురించినది. ఆతనిహృదయమున నంటియున్న సంశయ పటలములు తొలగిపోయినవి. ఈ విధముగ నాచార్యునకు, శిష్యునకు పరస్పరదర్శన సంభాషణాదులే కాక, ఒక్కొకప్పుడాచార్యస్పర్శనము కూడ, శిష్యుని మోహపటమును తొలగింప కారణమగునని నిరూపింపబడినది. ఈ స్పర్శనముచే పరీక్షిత్తునకు కలిగిన య ప్రాకృతానుభవము; ఆయనకు కల్గిన తాత్త్వికజ్ఞానము 5వశ్లోకమునుండి 19వశ్లోకమువరకు లెస్సగవర్ణింపబడినది. ఈశ్లోకములు వేదాన్తవిషయ గహనములగుటచే వ్యాఖ్యాసాపేక్షములు. వివిధ దృష్టాంతములచే జగద్బ్రహ్మములకు గల సంబంధము నిరూపింపబడినది. నాస్తికత్వము నిరాకరింపబడినది. గురువగు శుకమునీంద్రుని యనుజ్ఞబడసి, మునులందరు చూచుచుండగనే రాజేంద్రుడు విష్ణుస్మరణ పరాయణుడై పరమపదమును పొందినాడు. ఈ యధ్యాయముచివర –

"స్వయంచ విష్ణుః" ఇత్యాది శ్లోకముచే సర్వప్రాణులకు స్వస్వకర్మముల ఫలములు అవశ్య భోజ్యములనియు, కాని ఎవ్వరు శ్రీహరికి అనన్య భక్తులో, అట్టి భాగవతోత్తముల కర్మములను, వారిభక్తియే భుజించుచున్నది అనగా నశింపజేయుచున్నదని పరీక్షిన్నిదర్శనము ద్వారా నిరూపింపబడినది.

ఈ నిదర్శనమును బట్టి, కాలమెంత స్వల్పమైనది తనముందున్న ప్పటికి, దానిని సత్పురుషసేవనముచే సద్వినియోగ పరచు కొన్నప్పుడు, మోక్షముతోపాటు సమస్తము సుఖసాధ్యమగుననియు, కనుక ముముక్షువునకు తనలక్ష్యమును సాధించుటలో కాలమెంత మాత్రము ప్రతిబంధకము కాదని నిరూపింపబడినది.

శ్రీ నారద ఉవాచ -
ఉక్త్వేతి తం సమ్య గతుష్ట చేతసం
నిరీక్ష్య భూయోఽథమునిః కృపాకులః ।
సునిర్మలం జ్ఞానగభస్తి మాలినం
కరం తదా తచ్ఛిరసి వ్యమర్పయత్ ॥ 1

అథ క్షణాత్త స్య వచః సుధోదితా
హృదిస్ఫురజ్జ్ఞాన తతి ర్మహీపతేః ।
ప్రభేవ పూష్ణో నిరవాస యత్తమః
ప్రసన్న దేవస్య హి సంపదోఽచిరాత్ ॥ 2

శ్రీ నారదమహర్షి ఇట్లుపల్కెను. ఈ విధముగ, పలికియు, బాగుగ పరితుష్టినొందని మనస్సుగల వానిగ నా రాజుని చూచి, పరమదయాపరవశుడైన శ్రీ శుకమునీంద్రుడు అత్యంత నిర్మలము, అజ్ఞానతిమిరముల పటాపంచలు చేయు జ్ఞానసూర్యాత్మకమగు తన కరమును ఆతని శిరస్సుపై నుంచెను.

తపస్సిద్ధులగు నాచార్య పురుషులు స్వాశ్రితుల నుద్ధరించుటకు తత్త్వోపదేశమునే గాక, అవసరమైనచో స్వశక్తిపాతమునొనర్చుటకు గూడ నుద్యమింతురు. అనగా తమహస్తమును స్వాశ్రితుని శిరస్సుపై నుంచి తపశ్శక్తిని సంక్రమింప జేయుటద్వారా వాని కువాసనను దూరమగునట్లొనరింతురని తాత్పర్యము. మహానుభావుల చరితములలో నిందుకు పలు దృష్టాంతములు కన్పట్టుచున్నవి. 1

అటు పిమ్మట, కరస్పర్శవశమున పూర్వమామునీంద్రుడు పల్కిన వాక్ సుధ నుండి యావిర్భవించిన జ్ఞానరాశి, సూర్యప్రభ చీకట్లు పోద్రోలినట్లాతని హృదయమున స్ఫురించుచున్న యజ్ఞానమను తమఃపటలమును బలముగ నెట్టివేసినది. దైవమును ప్రసన్న మొనర్చుకొన్నవారికి సర్వవిధ సమృద్ధులు అచిరలభ్యములేకదా !

ఈ రెండు శ్లోకములలోను ఆచార్యపురుషునకుండవలసిన యోగ్యతగూడ నిరూపింపబడినది. తత్త్వద్రష్టయేకాక, తపస్సిద్ధుడుగూడ నైనవాడే పరులకు తత్త్వమును దర్శింపజేయ సమర్థుడని స్పష్టపరుపబడినది. 2

ఈ విధముగ నారాజ శ్రేష్ఠుడగు పరీక్షిత్తు శ్రీశుకమునీంద్రుని యనుగ్రహముచే పరమానందమయము, నిరస్త సమస్త దోషము(సకలవిధదోషములులేనిది.) సూర్యుడు,

నృపోత్తమః సోఽథ మునేర నుగ్రహాత్
అపశ్య దానంద మయం నిరామయం ।
ప్రకాశ మర్కేందు సురత్న తారకా
కృశానుధామ్నః పరమేక మైశ్వరమ్ ॥ 3

అదృష్ట పూర్వం ఝటితి ప్రవీక్ష్యతత్
క్షణం చకంపే పులకాంకు రాంకితః ।
నిరత్యయం బ్రహ్మసుఖం మహానిధిం
యథాదరిద్ర ప్రకృతిర్య దృచ్ఛయా ॥ 4

చంద్రుడు , సర్వోత్తమరత్నములు, నక్షత్రములు, అగ్ని మున్నగు తేజస్సులకంటె కోటిశః సముత్కృష్టమునైన శ్రీహరి తేజస్సును సాక్షాత్కరించెను. శ్రీమద్భగవద్గీతలో నర్జునుడు భగవానుని విశ్వరూప సందర్శన మొనర్చినప్పుడు భగవానుని దివ్యతేజస్సు వేయిమంది సూర్యులొక్కమారుదయించినచో నెంతటి కాంతి విజృంభించునో అట్టిదిగానున్నదని –

' దివిసూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా ।
యదిభాస్సదృశీ సాస్యాద్భా సస్తస్య మహాత్మనః ॥

ఇత్యాదిగా చెప్పబడినది. వాస్తవమునకప్రమేయదివ్యతేజస్కుడగు శ్రీహరి తేజస్సునకు పైశ్లోకమున నిర్దేశింపబడిన యుపమానము న్యూనమే కాగలదు. భగవత్తేజస్సు అప్రమేయము కావుననే అర్జునునకు తద్దర్శనమునకై దివ్యచక్షువు భగవానునిచే ననుగ్రహింపబడినది. కాని భగవత్ప్రేమ పరిపూర్ణమగు భక్తజన హృదయమున భాసించు శ్రీహరి తేజస్సు స్వతః అప్రమేయమయ్యు, నితాంత నిర్మలము, శీతలము సకల భువనా సేచకమునని యెరుగవలయును. 3

ఇదివరకేనాడును అనుభవ గోచరము కాని యా శ్రీహరితేజస్సును హృదయమున నకస్మాత్తుగ సాక్షాత్కరించి పులకాంచిత దేహుడై ఒకక్షణము కంపమును పొందినాడు. దరిద్రుడు మహానిధిని అనుకోకుండగ అకస్మాత్తుగ పొంది కింకర్తవ్యతా విమూఢతచే వణకినట్లు, శాశ్వతమగు నా బ్రహ్మసుఖము పరీక్షిత్తునకు హృదయ స్పందనమును కలుగజేసినది.

ఈ శ్లోకమున సర్వప్రథమ భగవత్ సాక్షాత్కారము అపూర్వ సుఖజనకమై

జగచ్చ తస్మిన్నిహితం చరాచరం
తదాత్మక త్వేఽపి విభిన్న వజ్జనైః ।
ప్రతీయమానం సవివేద తన్మయం
యథామహోర్ధిం పృథుఫేన జాలకమ్ ॥ 5

తదైవ లోకావన జన్మనాశన
వ్యాపార లీలాధృత చారువిగ్రహం ।
వివేద పంకేరుహ నాభి పంకజ
ప్రజాత రుద్రాద్యవతార విస్తరైః ॥ 6

అనన్య సామాన్యము అప్రాకృతమునగు ననుభూతిని కలుగజేయునని సూచింపబడినది. 4

ఈ చరాచరమగు(కదలికకల్గిన ప్రాణికోటితోను, స్థావరములగు పర్వతాదులతోను కూడిన) ఈజగత్తు భగవచ్ఛక్తిచే నిర్మింపబడి లోపల వెలుపల భగవత్తేజస్సుతో వ్యాప్తమై, అంతర్యామియైన భగవంతునిచే నియమింపబడు చున్నను, ఈ తత్త్వము నెరుగజాలని కొందరిచే భగవత్సంబంధములేక, సర్వాత్మనా తద్భిన్నమైన దానినిగా భావింపబడు దానిని, పృథుఫేన జాలముతో ( పెద్ద పెద్ద నురుగులతో) కూడిన మహాసముద్రము వలె భగవన్మయముగా తెలిసికొనెను.

3వయధ్యాయములోని 37 వశ్లోకమును (స్వవపుషైవ) వివరించు పట్టున తెల్పినట్లే సమస్తజగత్తు భగవంతుని శక్తిచే నిర్మింపబడినది. 'శక్తి శక్తిమతోరభేదః' శక్తికిని శక్తిగల వానికిని ఐక్యమనున్యాయమున భగవద్రూపమై యున్న దానిని, కొందరు భగవంతునకును జగత్తునకును గల సంబంధము నెరుగనివారు, ఈ జగత్తు భగవంతునితో సంబంధములేకయే స్వతంత్రముగ స్వభావసిద్ధమైనదని వాదింతురు. కాని, తత్త్వమునెరిగినవారు మాత్రము 'అంతర్బ హిశ్చతత్ సర్వం వ్యాప్యనారాయణః స్థితః' ఇత్యాది శ్రుతుల యందు చెప్పబడినట్లును,

'ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ।'

అని గీతలో సర్వభూతములయందంతర్యామిగా భగవానుడుండి నియమించుచున్నాడనియునెరిగి, ఇదియంతయు ఆ భగవానుని దివ్యకళావైభవమనియు, కావుననే,

అశేష దేవేశ మపశ్య దచ్యుతం
స జ్ఞానదృక్ – కేవలసత్ స్వరూపిణం ।
భవార్దితానాం పరమం పరాయణం
భక్తప్రియం సర్వవరప్రదం హరిమ్ ॥ 7

హృదిస్ఫురత్త త్త్వమ వేక్ష్యతత్త్వతః
స్వహస్తదత్త స్ఫటికోపమం యథా ।
మునీంద్ర గుహ్యం పురతస్స భూపతి
శ్చిరం తథా మీలితదృగ్ వ్యచిన్తయత్ ॥ 8

భగవన్మయ మనియు తెలిసికొందురు.

ఇచ్చట సముద్ర దృష్టాంతమీయబడినది. సముద్రమున తరంగ ప్రేరణముచే పుట్టిన నురుగు జలవికారమే తప్ప వేరుకానట్లు, జగత్తు భగవచ్ఛక్తి పరిణామమే తప్ప వేరుకాదని తాత్పర్యము. భగవంతుని విడచి స్వతంత్రముగ నెంతమాత్రముండజాలదని గూడ భావము. 5

అప్పుడే విష్ణు, బ్రహ్మ, శివ రూపములచే లోకరక్షణ, సృష్టి, ప్రలయహేతువులగు లీలాప్రవృత్తుల పరిగ్రహించిన దివ్యమంగళ విగ్రహమును తెలిసికొనినాడు. 6

జ్ఞానదృష్టిగల యాపరీక్షిత్తు, సమస్తదేవతలకు ప్రభువైనవాడును, కేవలము "సత్" అని యుపనిషత్తులందు కీర్తింపబడు నిత్యస్వరూపము కలవాడును, అచ్యుతుడును, సంసార భయపీడితులగు వారికి పరమప్రాప్యుడును, భక్తజనప్రియుడును, కోరిన కోర్కెలనన్నిటి దీర్చువాడును, పాపహారియునగు శ్రీహరిని సాక్షాత్కరించెను. 7

స్వహస్త సన్నిహితమగు స్వచ్ఛస్ఫటికమణి వంటివాడును, మునీంద్రుడగు శ్రీశుకునిచే తనకొఱకు మాత్రమే గుహ్యతమముగా ( పరమరహస్యముగా) రక్షించి యందింప బడినవాడును, అయిన శ్రీహరిని వాస్తవముగ( యథార్థముగ) తనహృదయమున స్ఫురించుచున్న జ్యోతిస్తత్త్వముగ దర్శించి, పరీక్షిత్తు, చాలకాలము మొగిడ్చిన కన్నులతో ధ్యానించెను. 8

అహో ! బాలుడెట్లుతన యిచ్ఛవచ్చినట్లు క్రీడార్థమై యిసుక గూడులనుకట్టి పడద్రోయుచుండునో, అట్లే సర్వేశ్వరుడగు, శ్రీహరి, స్వసంకల్ప మాత్రమున లీలగా

అహో జగత్ కృత్స్నమిదం జనార్దనో
విధాయ, సంరక్ష్య, పునర్వినాశ్యచ ।
నిజేచ్ఛయా క్రీడతి సర్వదాప్రభుః
బాలోయథా వాలుకఖేల నాదృతః ॥ 9

విచార్య మాణంచ జగజ్జగన్మయాద్
విభోర్న కించిత్ పరమస్తి తత్త్వతః ।
విచార్యమాణం పృథుసైంధవం ఘనం
పృథఙ్ న కించిత్ పయసోయథార్థతః ॥ 10

యీ సమస్త జగమును, సృజించి, రక్షించి, నశింపజేయుచు క్రీడించుచున్నాడు సుమా ! 9

ఆలోచింపగా జగన్మయుడగు శ్రీహరికంటె నీ జగత్తు వేరుగలేదు. నీటిలో వేయగా కరిగిన లవణము నీటికంటే వేరుగ లేదుకదా ! ఈ శ్లోకమున లవణ జలదృష్టాంత ముఖమున జగత్తు జగన్మయుడగు భగవంతుని కంటె వేరుగ గ్రహింపబడదని నిరూపింపబడినది. ఇచ్చట పైనిర్దేశింపబడిన దృష్టాంతము ఉపనిషత్ప్రసిద్ధమైనదే. సర్వవ్యాపియు, సర్వాంతర్యామియునగు భగవానుడే జగత్తున అణువణువున వ్యాపించియు వేరుగ తెలియబడడు. ఎట్లన్నచో జలమున కలుపబడిన లవణము కంటికి గాని త్వగింద్రియమునకు గాని వేరుగా తెలియదు. కాని రసనేంద్రియమునకు మాత్రము తెలియును.. అట్లే సర్వవ్యాపి, అంతర్యామియునగు భగవానుడు కేవలము ఆచార్యోప దేశమూలకమగు ధ్యానాద్యుపాసనము చేతనే తెలియగలడు. ఛాందోగ్యోపనిషత్తు సందలి షష్ఠప్రపాఠక త్రయోదశాధ్యాయమునగల యారుణి శ్వేతకేతు సంవాదమునని లవణదృష్టాంత మీయబడినది. ఇది యా సంవాదసారము. (ఛాందోగ్యము -6-13) 'లవణ మేతదుదకేఽవ ధాయాథమాప్రా తరుపాసీదథాః ఇతి 'సహతథాచకార ........... సయ ఏషోణిమై తదాత్మ్య మిదంసర్వం' 'రాత్రి లవణమును జలమందుంచి, ఉదయము నావద్దకురమ్ము' అని తండ్రిచే నాదేశింపబడిన శ్వేతకేతువు అట్లే చేసెను. మరునాటి యుదయమున , రాత్రియుదకమున నుంచిన లవణమును తెమ్మని తండ్రి పలుకగా , వెదకియు శ్వేత కేతువు తెలియజాలక పోయెను. ఆ లవణమానీట కలసి పోయినది. తండ్రి శ్వేతకేతువును లవణ

అముం కుతర్కోద్గత చేతసః కథం
విభుం విజానీయురనాత్మ వేదినః ।
అనుగ్రహాదస్య సుయోగినోఽథవా
దివానిశం భక్తి బలాద్ధి గమ్యతే ॥ 11

అహో కు తర్క ప్రవణో వృథాహతో
నాస్తీశ ఇత్యేష వదన్న సజ్జనః ।
ధ్రువం జగన్నాటక సూత్రధారిణా
సవంచితోఽనేన విచిత్ర కారిణా ॥ 12

మిశ్రితమగు జలము యొక్క మూలభాగమునుండి, మధ్యభాగమునుండి, అంత భాగమునుండి, జలమును త్రావుమని చెప్ప, నాతడు త్రావి, ఎట్లున్నదన నుప్పగా నున్నదని సమాధానించినాడు. అట్లే అంతట జలమున లవణము కలసియున్నదని తెలిసియు, కంటికగుపింపకుండుట చేతను, స్పర్శచేతను తెలియబడకుండుటచే దానిని వేరుగ దర్శింప జాలకున్నను రసనేంద్రియముచే దాని యునికిని తెలిసికొన గల్గినట్లు, భగవానుడు ఈ జగత్తు ననంతర్యామిగా, సర్వవ్యాపిగా, నంతటనున్నను తెలియబడక గురూపదేశముచే తను, ఉపాసనము చేతను మాత్రమే తెలియబడినాడు. అట్టి భగవానుడాత్మగా కలదే యీసర్వ ప్రపంచము. ఆ పరమాత్మయే సత్యస్వరూపుడు. కావున నీజగత్తు భగవానుని నుండి వేరు జేయరానిదని తెల్పుటకే మూలశ్లోకమున 'జగన్మయాజ్జగత్ న పరమస్తి ' అని చెప్పబడినది. 10

సర్వాంతర్యామియై జగన్మయుడైన శ్రీహరిని, కుతర్కయుత చిత్తము గలవారును, ఆత్మజ్ఞానవిహీనులును అయిన నాస్తికులెట్లెరుగ గలరు? అట్టి మహాయోగియొక్క అనుగ్రహము వలనను, నిరంతర భక్తివశముననను మాత్రమే శ్రీహరి తెలియబడును 11

ఆహా ! ఆశ్చర్యము ! భగవానుడులేడు లేడని వాదించు దుర్జనుడు, నిరంతర కుతర్క రసికుడై వ్యర్థముగ నశించుచున్నాడు. నిక్కముగ, విచిత్రముగొనర్చెడి, జగన్నాటక సూత్రధారియగు శ్రీహరిచే వంచింపబడుచున్నాడు. 12

మహారణ్యమున నుత్తమమైన రాజమార్గమును వెదుకగోరుట యెంతనిష్ఫలమో, అట్లే వ్యర్థములగు కామము, అర్థము అను నీ రెండింటిని సంపాదింప నిరంతరము ప్రయత్నించు సంసారి, శ్రీహరిచే ( శ్రీహరి మాయచే) వ్యామోహితుడై సజ్జన ప్రాప్యుడగు

అహో న జానాతి జనః సతాంగతిం
భ్రమన్నిమం విఘ్నమనేన మోహితః ।
కామార్థ కృత్యే విఫలే మహావనే
యథావివక్షుః పురమార్గ ముత్తమమ్ ॥ 13

విచక్షణాః కేచన సారవస్తుసత్
చతుర్భుజాఖ్యం ప్రతిగృహ్య కేవలం ।
త్యజంతి సర్వం జగదాత్త సద్వశం
సునారికేళస్య ఫలం యథారసమ్ ॥ 14

నా భగవంతుని పొందజాలడనుటయు నిట్టిదియే. కావున సాంసారిక ప్రవృత్తిని విడచి శ్రీహరిని పొందగోర వలయునని తాత్పర్యము. 13

నారికేళ ఫలము (కొబ్బరికాయ) యొక్క నీటిని మాత్రమే గ్రహించి పైనుండు చర్మము మున్నగు నంశమును పారవైచినట్లు, సదసద్వి చక్షణులగు విద్వాంసులు నిఖిలజగత్ సారభూత వస్తువగు చతుర్భుజ రూపతత్త్వమును (శ్రీమహావిష్ణువును) మాత్రమే గ్రహించి తదితరమగు నంశమును అసారముగా గుర్తించి పరిత్యజింతురు. అనగా శ్రీహరిని పొందుగోరు సద్భక్తులు మాత్రమే సారాసార విచక్షణులని తాత్పర్యము. 14

బాహ్యములగు సంసార సుఖముల పొందగోరి నిరంతరము అర్థ కామ ఫలముల్కై ప్రాకులాడు బాలిశుడు, ఆంతరమగు బ్రహ్మానుభవజన్యసుఖమును పొందజాలక, గంగా సమీప మందుండియు దప్పికగొన్న పశువు దానిని విడచి చిన్న నీటిగుంటలో ప్రవేశించినట్లు బాహ్య విషయములయందే తన యింద్రియముల ప్రవర్తింప జేయుచున్నాడు.

ఇచ్చట పశువుతో పోలికచెప్పబడినది. పశువునకు యుక్తాయుక్త విచక్షణ లేనట్లే, నిరంతరము బాహ్యములైన క్షుద్రసుఖముల్కై ప్రాకులాడువాడు ప్రవృత్తి సామ్యముచే పశుప్రాయుడే నని తాత్పర్యము. ఇట్టి వారి నుద్దేశించియే శ్రీభాగవతమున ప్రహ్లాదుడు –

'నైవోద్విజే పర ! దురత్యయ వైతరణ్యాః
త్వద్వీర్య గాయన మహామృత మగ్నచిత్తః ।

సుఖే స్ఫురేతత్ పురతోఽమలం సుఖం
బ్రాహ్మం న పశ్యన్ విలుఠన్ బహిఃసుఖీ ।
జనః స శోచ్యః సురసింధు సన్నిధౌ
పశుః తృషార్తః ప్రవిశంశ్చ గోష్పదే ॥ 15

జనోఽవిజానాతు నవాజగద్గురుం
నతత్ర భూయో మమ విద్యతే ఫలమ్ ।
అహం త్వితః ప్రాగ్విఫల క్రియాపరో
వృథాహతస్తేన మనోఽనుతప్యతే । 16

ఉపాస్యతే సత్కవిభిర్విహాయ యః
సమస్త సంగాన్ ఖలు సారవేదిభిః ।
వృథా భవాయాసకృశేన సర్వదః
సఏవ విష్ణుర్బత నస్మృతో మయా ॥ 17

శోచేతతో విముఖచేతస ఇంద్రియార్థ
మాయా సుఖాయ భరముద్వహతో విమూఢాన్॥ '( శ్రీభాగ - 7-9-43)

'స్వామీ ! నిరంతర భగవద్గుణ గానామృత లహరిలో మునిగి తేలు చిత్తముగలనేను ఈ సంసారమను వైతరణిని జూచి భయపడను. కాని, త్వద్విముఖమానసులై వ్యర్థమగు నింద్రియార్థ సుఖమునకై నిరంతరము పొట్లుపడు కృపణుని జూచియను కంపనొందుదును." అని పల్కినాడు. మహానుభావులచిత్తవృత్తినే మహాకవికాళిదాసు శాకున్తలమునని ట్లు చిత్రించినాడు.

'అభ్యక్తమివస్నాతః శుచిరశుచిమివ ప్రబద్ధ ఇవసుప్తమ్ ।
బద్ధమివ స్వైరగతిః జనమిహసుఖ సంగినమ్ మవైమి ॥ '

నిరంతర సుఖలాలసులగు సంసారుల జూచినప్పుడు స్నానమొనర్చినవాడు వంటికి నూనెపూసి కొన్నవానిని, శుచియైనవాడు అశుచిగానున్న వానిని, మేల్కొన్నవాడు నిద్రించుచున్న వానిని, స్వేచ్ఛగ తిరుగువాడు కారాగార బద్ధుడైన వానిని చూచి యను కంపించునట్లు యోగులును జాలిగొందురు. 15

యద్వానుతాపేన నిరర్థకేనమే
గతే హి కృత్యే హితముత్తమం ద్రుతం ।
విష్ణుం భజిష్యామి తృషా విముహ్యతా
దృష్టేన తేన వ్యవధి ర్విషహ్యతే ॥ 18

తాపత్ర యాన్తర్జ్వలతః స్వచేతసః
శాన్త్యై కరిష్యే ద్రుతమీశ భావనం ।
స్ఫురత్కరాల జ్వలన జ్వల ద్గృహే
యతేత శీఘ్రం నను శాన్తి కర్మణి । 19

నారద ఉవాచ–
ఇత్థం విచిన్త్యార్ద్రమనాః సభూపతిః
చిరాదథోన్మీలితదృగ్ మహాజనం ।
పురో నిరీక్ష్య ప్రణనామ హృష్టధీః
గురో ! కృతార్థోహమితి బ్రువన్ ముహుః ॥ 20

ఈ లోకము జగద్గురువగు నారాయణుని తెలిసికొన్నను లేకున్నను నాకెట్టి ప్రయోజనము లేదు. కాని నేనింత వరకు వ్యర్థవ్యాపార వ్యగ్రుడనై సమయమును నష్ట పరచుకొని ప్రతిహతుడనైతిని. దానికే నా మనస్సు తాపమును పొందుచున్నది16

సమస్తములగు సాంసారిక సంపర్కములను వీడి సారాసార విచక్షణులగు మహానుభావులచే నెవ్వడు నిరంతరము సేవింప బడుచున్నాడో, అట్టి సర్వకామప్రదాతయగు విష్ణువు, అయ్యో ! వ్యర్థమగు సంసారఖేదముచే కృశించిన నాచే స్మరింపబడలేదు. భగవత్ స్మరణము లేనందున జీవితమంతయు వ్యర్థమైనదని తాత్పర్యము. 17

గడచిపోయిన దానిగురించి వ్యర్థమైన ఈ యనుతాపము నాకేల ? హితకరుడగు శ్రీహరిని ఇక విలంబము సేయక భజింతును. లౌకిక కామలోభాది విరహితుడనైననాచే దర్శింపబడిన యా భగవానుని చేతనే యీ వ్యవధానము (ఎడబాటు) సహింప జేయ బడగలడు. 18

తాపత్రయముచే లోలోన దహింప బడుచున్న యీ మనస్సు చల్లబడుటకు వెంటనే శ్రీహరి చింతనము చేసెదను. నలువైపుల నాలుకలుసాచి విజృంభించిన

కృతాభ్యనుజ్ఞో గురుణా ద్విజైశ్చసః
స్థిరం స్మరన్ విష్ణు మథాతి నిర్మలః ।
ఉత్క్రమ్య మూర్ధ్నా పరమం పదంయమ్
సరోమహర్షం మిషతాం తపస్వినామ్ ॥ 21

విషాగ్నినాథాస్య దహన్ శరీరం
చక్రేఫణీ కేవల బంధుకృత్యమ్ ।
యయుశ్చ సర్వేమునీయో యథేచ్ఛం
పరీక్షితో మోక్షగతిం స్తువన్తః ॥ 22

ఘోరాగ్నిచే దహింపబడుచున్న గృహమును చల్లార్చు నుపాయము తక్షణము చూడవలయును కదా! తాపత్రయమన నేమో ప్రథమాధ్యాయమునందు ద్వాదశశ్లోక వివరణమున కలదు. (1-12) 19

నారదుడిట్లు పలికెను. ఇట్లాలోచించి ద్రవించిన మనస్సుగల పరీక్షిత్తు, చాలకాలము తరువాత మెల్లగ కన్నులు తెరచి, మహాతేజస్వియగు శుకమునీంద్రుని ఎదుట గాంచి ఆనందిత హృదయుడై 'ఆచార్యా!' కృతార్థుడనైతిని ' అనిపలుమారులు పల్కుచు వినమ్రవదనుడై ప్రణమిల్లెను. 20

అచ్చట సమావిష్టులైన ద్విజులచేతను, శ్రీశుకమునీంద్రునిచేతను అనుమతింపబడిన వాడై, ఆపరీక్షిత్తు శిరస్సుపైగల బ్రహ్మరంధ్ర భేదనముద్వారా ప్రాణత్యాగమొనర్చి, గగుర్పాటుతో రెప్పవాల్చక చుట్టుచేరిన తాపసులు చూచుచుండగా పరమపదమును చేరెను. యోగసిద్ధులైన మహానుభావులకు మాత్రమే ప్రాణోత్క్రమణము శిరస్సుపైగల బ్రహ్మరంధ్రముల ద్వారమున జరుగును. సాధారణులకు నేత్రాది రంధ్రముల ద్వారముననని భేదము. శ్రీశుకయోగీంద్ర బోధనముచే మనస్సు శ్రీహరి యందు గాఢముగ నిలిపి శ్రీపరీక్షిత్తు స్వయముగ యోగసిద్ధుడై యోగి జనసముచితమగు ప్రాణోత్క్రమణ మొనర్చినాడని తాత్పర్యము. 21

మునిశాప వశమున తక్షకుడను పాము విషాగ్నిచే వా భాగవతోత్తముని శరీరమును దహించి బంధుజనుడొనర్చెడి కృత్యమునే తానును నిర్వహించినది. (ప్రాణవిహీనమగు దేహమునకు దహనాది సంస్కారము లొనర్చుటయే జ్ఞాతులగు బంధువులొనర్చ

ఇత్థం పరీక్షిత్ శుక శిక్షితః సన్
హరింస్మరన్ మోక్షమవాప సద్యః ।
సహిప్రసన్నః క్షణతః క్షిణోతి
సర్వాణి కర్మాణి ననుస్వతంత్రః ॥ 23

స్వయంచ విష్ణుర్ద్రుహి ణాయ పూర్వం
జగాద కర్మాణ్యతిదుష్కరాణి ।
అవశ్య భోజ్యాని నృణాం తథాపి
తాన్యత్తి సద్భక్తిరితి ద్విజేంద్రాః ॥ 24

వలసిన కృత్యము కదా!) ఈ విధముగ నాశ్చర్య కరమగు పరీక్షిత్తు యొక్క మోక్షగతిని పలువిధముల ప్రస్తుతించుచు అచ్చట చేరిన మునులందరు వారివారి నెలవులకు వెడలిపోయిరి. 22

ఈ విధముగ శ్రీశుకయోగీంద్రునిచే శ్రీహరి భక్తిగరుపబడినవాడై పరమ భాగవతోత్తముడగు పరీక్షిత్తు అంత్యకాలమున శ్రీహరిని స్మరించుచు వెంటనే (స్వల్పకాలమున) మోక్షమును పొందినాడు. శ్రీహరియొక్క కృప యవ్యాజమైనది. సర్వేశ్వరుడగు శ్రీహరి యనుగ్రహించినచో సమస్తకర్మములను ఒక్కక్షణమున పటాపంచలు చేయును గదా! భగవత్కటాక్షము ప్రసరింప నంతవరకే యీ సాంసారిక సుఖదుఃఖములు, తన్మూలమగు సుకృతదుష్కృత కర్మములును. ఎప్పుడు శ్రీహరి యొక్క నిర్హేతుక కృపా కటాక్షములు పడునో ఆ క్షణముననే సమస్తకర్మములు, తత్ఫలములు నశించును. కావుననే యుపనిషత్తులు

' భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః ।
క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥ '

అని యుద్ఘోషించుచున్నవి. ఎప్పుడా పరమాత్మ ధ్యాతృజనహృదయకమలమున ధ్యానవశమున సాక్షాత్కరించునో అప్పుడే భగవత్ప్రకాశమునకు ప్రతి బంధకములుగా నున్న కుసంస్కారములను గ్రంథులు వాటంతటనవే భిన్నములై పోవును. అజ్ఞానము పటాపంచలై సర్వసంశయములు విడిపోవును. సుఖదుఃఖ ఫలభోగ కారణమగు జనన

శుక విష్ణురాత చరితం య ఇదం
మనుజః శ్రణోతి మునివర్య చాసకృత్ ।
సవిధూయ పాపపటలం విమలః
పురుషోత్త మోత్తమపదం లభతే ॥ 25

ఇతి శ్రీ నారదీయే హరిభక్తిసుధోదయే శ్రీ శుక పరీక్షిత్సంవాదే పరీక్షిద్బ్రహ్మ ప్రాప్తిశ్చతుర్థోఽధ్యాయః ।

మరణ చక్రమునకు మూలకారణములగు సకలవిధ పుణ్యపాపకర్మములు నశించునని తాత్పర్యము. 23

ఓ ద్విజశ్రేష్ఠులారా ! స్వయముగ శ్రీమహావిష్ణువు బ్రహ్మకు, అత్యంత క్లిష్టములగు కర్మములు వాటిఫలములగు సుఖదుఃఖములు నరులచే తప్పక భోగింప వలసినవే ననియు, కాని నిష్కల్మషమగు భక్తి, ఆ కర్మములను తినివేయును (నశింపజేయును) అని చెప్పియున్నాడు.

కావున భగవానుడు స్వయముగ బ్రహ్మకుపదేశించిన భక్తినిష్ఠనే శుకయోగీంద్రుడు పరీక్షిత్తున కుపదేశింపగా, తాను నైమిశమున శౌనకాదిమునుల కుపదేశించుచున్నానని నారదమహర్షి తెలిపినాడు. 24

ఓ మునిశ్రేష్ఠా ! ఎవ్వడీ శ్రీశుక పరీక్షిచ్చరితమును నిరంతరము వినుచుండునో ఆనరుడు నిర్మలమనస్కుడై సమస్తపాపముల తిరస్కరించి సర్వోత్తమమగు వైష్ణవపదమును అనగా శ్రీ వైకుంఠమును పొందును. 25

ఇది నారదీయ పురాణాంతర్గతమగు హరిభక్తి సుధోదయమున శుక పరీక్షిత్తుల సంవాదమున పరీక్షిత్తు బ్రహ్మపదమును పొందుటయను నాల్గవయధ్యాయము.

# పంచమాధ్యాయము

**పంచమాధ్యాయసారము :–** శ్రీ శుక పరీక్షిత్ సంవాద రూపమగు వృత్తాంతము నెరిగించి, కర్మముల ప్రబలత్వమును పూర్వము శ్రీమన్నారాయణుడు, బ్రహ్మకెరిగించిన వృత్తాంతమును, పంచమాధ్యాయమున నారదుడు విశదపరచుచున్నాడు. అధ్యాయారంభమున, ప్రలయకాలమున శ్రీహరి సమస్త ప్రపంచమునే కార్ణవ మొనర్చి, తెల్లని శేష పర్యంకమున తాను శయనించి యుండుటయు, అప్పుడాస్వామి నాభినుండి కమలమావిర్భ వించుటయు, అందుండి చతుర్ముఖ బ్రహ్మయావిర్భ వించుటయు, ఆ బ్రహ్మ, బాలార్క సదృశతేజస్కుడై తన చుట్టును గల మహాధ్వాంతమును (గాఢాంధకారమును) తన తేజస్సుతో నపాకరించి, జగత్సృష్టి చేయవలయునని సంకల్పించినట్లును వర్ణింపబడినది. సృష్టి యెట్లు చేయవలయునో తెలియజాలక ఖిన్నుడైన బ్రహ్మ, శేషపర్యంక శాయియై మహార్ణవమున గోచరించిన శ్రీమన్నారాయణునే, తన తండ్రిగా గుర్తించి ప్రార్థింపగా శ్రీహరి మేల్కాంచి, సృష్టినొనర్ప బ్రహ్మను ప్రేరించుటయు, సృష్టివిధానము తెలియని బ్రహ్మతన విస్మృతిని ప్రకటింపగా, శ్రీమన్నారాయణుడు సృష్టివిజ్ఞానమును బ్రహ్మకనుగ్రహించుటయు, తరువాత వర్ణింపబడినది. 14వశ్లోకమునుండి 23వరకు బ్రహ్మ యొనర్చిన స్తవనము వివిధోపనిషత్సారము. భగవానుడు కర్మవశముననే ఆయాయి ప్రాణి సృష్టి జరుగవలయునని సృష్టి విధానమును (28 నుండి 46 వరకు) విశదపరచుట కలదు. ప్రధానముగ

'తస్మాదలంఘ్య బలవత్ కర్మచక్రమిదం సదా ।

'భవిష్యతి తథా భావ్యా స్సృష్టీస్తాః త్వంప్రవర్తయ ।'

ఇత్యాదిగ అలంఘ్యమైన కర్మచక్రమునుబట్టియేసమస్త సృష్టి చేయవలయునని యాదేశించుటయు, భగవానుని యాజ్ఞను బ్రహ్మశిరసా వహించియట్లే చేయుట కలదు. ఆయాయి యుగముల యందెట్టి పుణ్యపాపవిభాగము నియతమో దానినట్లే బ్రహ్మకల్పించెను.

ఈ యధ్యాయమున శ్రీహరి భక్తులైన పుణ్యాత్ముల మాహాత్మ్యము, వారివలన లోకమెట్లు స్థిరమై యున్నదో 53వ శ్లోకమునుండి 68వ శ్లోకము వరకు లెస్సగ వర్ణింప బడినది. భగవదవతార లక్ష్యము కూడ చెప్పబడినది. ఈ విధముగ పరంబ్రహ్మ –చతుర్ముఖ బ్రహ్మల సంవాదమైన యీ ఆధ్యాయము, తత్త్వ పిపాసువులకు అమృత నిర్ఝరిణియేనని యెరుగవలయును.

శ్రీ నారద ఉవాచ -
యథాహ భగవాన్ పూర్వం మత్పిత్రే కర్మణాంబలం ।
స్వభక్త్యా తత్ప్రణాశంచ తథాశ్రుణుత సత్తమాః ॥ 1

కల్పాంతేహ్యో గతే విష్ణుర్గ్రసిత్వేదం హరాత్మనా ।
యోగనిద్రాంయయావేకో మహత్యేకార్ణవేఽర్భకః ॥ 2

తస్మిన్నేకీకృతాశేష ప్రపంచేఽభాన్మహార్ణవే ।
తజ్జగద్యోగి నశ్చిత్రం బ్రహ్మణీవ మహోజ్జ్వలమ్ ॥ 3

ధవలే శేషపర్యంకే ఫణారత్నాంశు పింజరః ।
కృష్ణః స్ఫటికశైలస్థసంధ్యాఘననిభో బభౌ ॥ 4

అథకాలేన తన్నాభి సరసో మహదంబుజమ్ ।
ఉదభూత్తత్రచ బ్రహ్మ జగద్బీజాంకురాకృతిః ॥ 5

శ్రీనారదముని పల్కెను. ఓ సజ్జనులారా ? భగవానుడగు వాసుదేవుడు, పూర్వము కర్మబలమును, తనయందలి భక్తిచే నీకర్మములు నశించటను, నాతండ్రి కెట్లెరిగించెనో చెప్పెదను వినుడు.
1

కల్పావసానమున శ్రీమహావిష్ణువీ జగమును రుద్రరూపుడై కబళించి, విశ్వమంతయు జలాకీర్ణముకాగా, ఆ జలములపై తాను శిశువై, యొంటరిగ యోగనిద్రను పొందెను.
2

పరబ్రహ్మమునందు జగత్తు భాసించునట్లు, ఏకముగ పిండీకృతమగు ప్రపంచముగల యామహాసముద్రమున యోగీశ్వరుడగు శ్రీహరియొక్క మహోజ్జ్వల శరీరమొప్పుచుండును. ఈశ్లోకమున విశేష్యముగ "వపుః" అనుపదము తెచ్చుకొని యన్వయించుకొనవలయును.
3

తెల్లని శేషుని శయ్యగ జేసికొని పరుండిన కృష్ణవర్ణుడగు నా భగవానుడు, శేషుని పడగల యందలి రత్నముల కాంతిచే పింజరవర్ణుడై, తెల్లని స్ఫటిక శైలమున నున్న సంధ్యాకాలపు నల్లని మేఘపు తునకవలె ప్రకాశించెను.
4

పిమ్మట కొంతకాలమునకా భగవానుని నాభిసరస్సున విపులమగు కమల మా

సబాల ఏవ బాలార్క సహస్ర సదృశః శ్రియా ।
విక్షిపన్ పరితో ధ్వాన్తం దిశః శూన్యా ఉదైక్షత ॥ 6

స జగత్ స్రష్టు కామోఽథ స్వ రజోగుణ చోదితః ।
ఏక ఏవ చతుర్వక్త్రో మనసాఽచిన్తయత్తదా ॥ 7

స్రష్టవ్యోహి మయాలోకో యథైతత్ పూర్యతేనభః ।
పితామహోఽహం భవితా తతః సకలవందితః ॥ 8

కథం ప్రవర్తతాం సృష్టిః? కీదృశీవా? కిమాశ్రయా?
కేన సంమంత్ర యామ్యత్ర? సహాయః కోభవేన్మమ । 9

కోవాయం జలధౌశేతే నాభ్యాం యస్యేదమంబుజమ్ ।
మమైవ జనకోనూనం, జనకస్సతు నేక్షతే ॥ 10

విర్భవించినది. అందు, జగత్తను మహావృక్షపుటావిర్భావమునకు అంకురమైన చతుర్ముఖ బ్రహ్మ యుద్భవించెను. 5

ఆ బ్రహ్మ, బాల్యదశయందే వేలాది బాల సూర్యుల కాంతితో గూడిన వాడై, తన దేహ ప్రభచే నలువైపుల చీకట్లను పారద్రోలుచు, శూన్యములగు దిక్కుల పరికించెను. 6

అంతనా చతుర్వదనుడగు బ్రహ్మ, తన రజోగుణముచే ప్రేరితుడై లోక సృష్టి నొనర్ప నిచ్ఛగించి మనస్సులో నిట్లు భావించెను. 7

'ఈ నిఖిలమగు నాకాశము నిండునట్లు నేను లోకమును సృజించి, పితామహుడనై సకలలోక వంద్యుడనగుదును గాక !' 8

' ఈ లోక సృష్టి యెట్లు జరుగవలయును ? ఏ విధముగ దేనినాశ్రయించి ఈ సృష్టి యేర్పడవలయును? ఎవనితో నేను సమాలోచన మొనర్తును? నాకెవ్వడు సహాయుడగును? 9

' ఈ యర్ణవమున నిదురించుచున్న దెవరు ? నాభియందు కమలమున్నదే ! తప్పక నాజనకుడే కానోపును. కాని, జనకుడు చూచుటలేదే ! 10

యద్వాప్రబోధయా మ్యేనం ప్రస్తుం సర్వం విధిత్సితమ్ ।
ఫణి శాయీమహాతేజాః క్రుద్ధ్యేద్వ్యేష ప్రబోధితః ॥ 11

ఇతి సంచితయన్ బ్రహ్మభీతో బోధయితుం చ తమ్ ।
తత్రప్రసాదోదిత జ్ఞాన స్తత స్తుష్టావ భక్తిమాన్ ॥ 12

శ్రీ బ్రహ్మోవాచ -
ప్రసీదదేవ! నాగేంద్ర భోగశాయిన్ ! మమప్రభో !
జాగర్షి శుద్ధ సత్త్వస్త్వం సదా నిద్రాత్వియం వృథా ॥ 13

మాయయాఽగృహ్యమాణోఽపి స్వామిన్ సర్వహృదిస్థితః ।
జ్యోతిర్మయో మహాత్మాత్వం వ్యక్తీవ సుమేధసామ్ ॥ 14

బీజం జగత్తరోరాదౌ, మధ్యే సంవర్ధనోదకమ్ ।
అంతేచ పరశుర్నాథ ! స్వేచ్ఛాచారస్త్వ మేవహి ॥ 15

కానిమ్ము. నేనొనర్పదలచిన విషయమునడుగుటకై యాతనిని మేలు కొల్పెదును. మేలు కొల్పినచో మహాతేజశ్శాలియై శేషపర్యంకశయనుడైన యీ మహానుభావుడు కోపగింపడు కదా ! 11

ఇట్లు పలువిధముల చింతించి, భీతిచే శేషశయనుడగు భగవానుని మేలుకొలుప సమర్థుడు కాని యాబ్రహ్మ, భగవానుని యనుగ్రహముచే ప్రతిబోధము నందినవాడై భక్తితో స్వామినిట్లు స్తుతించెను.

ఇచ్చట భగవానుని కృప యవ్యాజ మైనదనియు, తనయప్రతిహత సంకల్పముచే ప్రపన్నుని ననుగ్రహించునట్టి సౌలభ్యము భగవత్కృపకు కలదని సూచింపబడినది. 12

దేవా ! నాగేంద్రశయ్యపై పవ్వళించిన స్వామీ! నాకు ప్రసన్నుడవుకమ్ము. శుద్ధసత్త్వ స్వభావుడవై నిరంతరము జాగరూకుడవగు నీకీనిద్ర యేలనయ్యా! 13

మహాత్మా! స్వామీ! నిఖిల జంతువుల హృదయాబ్జములందు జ్యోతీరూపుడవై కొలువుండియు, నీ మాయచే సామాన్యులకు తెలియరాని వాడవయ్యును, నిరంతరము నిన్నుపాసించు బుధజనులకు నీదివ్యమంగళ విగ్రహముతో దర్శనీయుడవే యగుదువు.

సృజస్యున్మీలయన్నేత జ్జగద్ధంసి నిమీలయన్ ।
త్వన్ని మేషేహ్యహో! లోకా భవన్తి, న భవన్తి చ ॥ 16

'దైవీహ్యేషాగుణమయీ మమమాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరన్తితే ॥'

అని శ్రీగీతలో భగవానుడన్నట్లు, దుర్లంఘ్యమగు భగవన్మాయచే పరివేష్టితులగు లోకులకు కానరాని వాడైనను, స్వామి, అనన్య భక్తిచే నుపాసించు వారికి హృదయాబ్జములందే సాక్షాత్కరించు చుండును. కావుననే బ్రహ్మ సంహిత -

'ప్రేమాంజన చ్ఛురిత భక్తి విలోచనేన సంతస్సదైవ హృదయేషు విలోకయన్తి'

భగవత్ప్రేమయను కాటుకచే పరివ్యాప్తమగు భక్తి లోచనముతో సజ్జనులు (ప్రపన్నులు) నిరంతరము తమ హృదయములందే భగవానుని దర్శింతురని చెప్పుచున్నది.

'ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేర్జున! తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥'

అని భగవద్గీతలో భగవానుడు సమస్తప్రాణుల హృదయములందు అంతర్యామిగ నుండి తన మాయచే వారిని ప్రవర్తింప జేయచుండునని చెప్పబడినది. 14

నిఖిల జగన్నాథా ! స్వసంకల్ప మాత్రముననే నీవే యీ జగద్ వృక్షమున కావిర్భావ బీజము, మధ్యలో దానిని వృద్ధి పొందించు జలము, చివరకు ఛేదనమొనర్చు గొడ్డలివియునై యున్నావు. ఈ శ్లోకమున భగవానుడే జగత్సృష్టి స్థితిలయ కారకుడని చెప్పబడినది. 15

స్వామీ ! యోగనిద్రనుండి మేల్కాంచి కన్నుల దెరచి నిఖిల సృష్టినొనర్తువు. అంతమున యోగనిద్రచే కన్ను మొగిడ్చి, జగముల పాలయింతువు. కావున నీ కన్నుల తెరచుట, మొగిడ్చుటలలోనే ఈ సమస్త లోకముల యస్తిత్వ నాస్తిత్వము లేర్పడుచున్నవి. 16

ముల్లోకములకు రక్షకుడై ధరించు వాడును, శుభ్రమైన (శుద్ధసత్త్వమయమైన) నివాసస్థానము కలవాడును, పరమాత్మయు, ఆత్మారాముడును, స్వానందసాగరుడును, మహార్ణవశాయియునగు భగవానునకు నమస్కారము. ఈ శ్లోకమునగల విశేషణములన్నియు విశేషముగ భావింపదగి యున్నవి. 'స్వచ్ఛధామ్నే' = స్వచ్ఛమైన ధామము కలవాడని సామాన్యార్థము. 'శేషాఖ్యం ధామమామకమ్' అని శ్రీభాగవతమున

**నమస్తే త్రిజగద్ధాత్రే, స్వచ్ఛధామ్నే పరాత్మనే ।**
**స్వారామాయ, నిజానంద సింధవే, సింధుశాయినే ॥ 17**

నన్నట్లు అనంతుడని పిలువబడు శుద్ధసత్త్వ స్వరూపుడగు నాదిశేషుడే భగవానుని ధామము. ఈ యనంతుడే సంకర్షణ నామమున శ్రీ భాగవతమున కీర్తింపబడిన బలభద్రుడు. శ్రీకృష్ణ భగవానుని దివ్యధామమైన గోకుల మీయనంత బలభద్రుని యంశసంభవమని బ్రహ్మసంహిత –

'సహస్ర పత్రం కమలం గోకులాఖ్యం మహత్పదమ్ ।
తత్కర్ణికారం తద్ధామ తదనంతాశసంభవమ్ ॥'

ఇత్యాదిగ పేర్కొనుచున్నది. గోకులమను భగవద్దివ్యధామము సహస్రపత్ర కమలాకారముగ నున్నది. ఆ కమలపు మధ్య భాగమే సచ్చిదానంద విగ్రహుడును పూర్ణబ్రహ్మమునగు శ్రీకృష్ణ భగవానుని కేంద్రస్థానము. ఈ గోకులముననే బృందావన గోవర్ధనాద్య ప్రాకృత భగవత్ క్రీడా నివేశములున్నవి. ఈ గోకులము చుట్టును చతుష్కోణమగు శ్వేతద్వీప మావరించియున్నది. శ్రీ భాగవతమున నష్టమస్కంధమున చతుర్థాధ్యాయమున (శ్లో.18)

'క్షీరోదంమే ప్రియంధామ శ్వేతదీపంచ భాస్వరమ్'

అని భగవానుడు స్వయముగక్షీరాబ్ధి, శ్వేతద్వీపములు తన ప్రియధామములని పేర్కొనినాడు. ఆ శ్వేతద్వీపముయొక్క నాల్గు భాగములందును స్వామి వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధ రూపములతో నుండును. ఈ శ్వేతద్వీపము చుట్టు పరమవ్యోమమని పిలువబడు మహావైకుంఠము కలదు. అది పరమైశ్వర్యమూర్తి యగు శ్రీమహావిష్ణుని దివ్యధామము. శ్వేతద్వీపమే గోలోకమని గూడ వ్యవహరింప బడుచున్నది. ఈ గోలోకము పలుపురాణములలో వర్ణింపబడినది. బృహద్వామన పురాణము నందలి యీ క్రింది శ్లోకములు గోలోకమును నిరూపించుచున్నవి.

'ఆనందరూపమితి యద్విదన్తిహి పురావిదః ।
తద్రూపం దర్శయాస్మాకం యదిదేయో వరోహినః ॥
శ్రుత్వైతద్దర్శ యామాస గోకులం ప్రకృతేః పరమ్ ।
కేవలానుభవానంద మాత్రమక్షరమధ్యగమ్ ॥
యత్ర బృందావనం నామవనం కామదుఘైర్ద్రుమైః ॥

శ్రీభాగవతమున నందాదులీ గోలోకమునే దర్శించినట్లు చెప్పబడియున్నది.

'ఇతి సంచింత్య భగవాన్ మహాకారుణికో విభుః ।
దర్శయామాస లోకంస్వం గోపానాం తమసః పరమ్ ॥
సత్యంజ్ఞాన మనన్తం యద్ బ్రహ్మజ్యోతిః సనాతనమ్ ।
యద్ధి పశ్యన్తిమునయో గుణాపాయే సమాహితాః ॥

నిరంతర భగవదుపాసనముచే త్రిగుణాత్మక ప్రకృతినధఃకరింపజాలిన మహామునులు మాత్రమే సత్యజ్ఞానానన్త సనాతన పరంజ్యోతీ రూపముగ నే దివ్య ధామమును దర్శింప గల్గుదురో, యట్టి తమః పరమగు గోలోకమును పరమ కారుణికుడగు భగవానుడు నందాదులకు దర్శింపజేసెను. ఈగోలోకమునే బ్రహ్మయు, నారదుడును, అర్జునుడును,దర్శించినట్లు పద్మపురాణమున వర్ణింపబడినది. బ్రహ్మవైవర్తపురాణమున గూడ నీ గోలోక వర్ణనము చూడనగును. శ్రీ బ్రహ్మ సంహితలోని యీ క్రింది రెండు శ్లోకములు శ్వేతద్వీపమని పిలువబడు గోలోకమును లెస్సగ వర్ణించుచున్నవి.

'శ్రియః కాన్తాః, కాన్తః పరమపురుషః, కల్పతరవో
ద్రుమాః, భూమిశ్చింతామణి గణమయీ, తోయమమృతమ్ ।
కథాగానం, నాట్యంగమనమపి. వంశీ ప్రియసఖీ,
చిదానంద జ్యోతిః, పరమపి, తదా స్వాద్యమపిచ ॥
సయత్రక్షీరాబ్ధిః స్రవతి సురభీభ్యశ్చ సుమహాన్,
నిమేషార్ధాఖ్యోవా వ్రజతినహి యత్రాపి సమయః ।
భజేశ్వేతద్వీపం తమహమిహ గోలోకమితి యం,
విదన్తస్తే సంతః క్షితి విరల చారాః కతిపయే ॥'

గోలోక బృందావన వాసినులగు నప్రాకృత గోపికల వృందమే భగవంతునకు కాంతాత్వమును పొందినది. కావున గోపికలందరును శ్రీ శబ్దవాచ్యలే. ఇక వారందరికి పరమప్రేమా స్పదుడగు కాంతుడు శ్రీకృష్ణుడే. అచ్చట కల్పవృక్షములే వనతరువులు. చింతామణి ఖచిత మైనదే భూతలము. అమృతమే జలము. మాటాడుటయే గానము. నడకలు నాట్య భంగిమలే. మురళియే ప్రియసఖి. అచ్చట నిరంతర మహారాస సమాసక్తమగు పరంజ్యోతీ రూపమగు శ్రీకృష్ణ సచ్చిదానంద విగ్రహమే పరమయ్యును, పరమాస్వాద్యము. అచ్చటనున్న యప్రాకృత గోవృందములనుండి స్రవించు క్షీరతతియే పాలసంద్రమైనది. అచ్చట రెప్పపాటులో సగమైనను కాలమునడువదు. దానినే

శ్వేతద్వీపము, గోలోకమని తెలియగలిగిన మహానుభావులు లోకమున చాల యరుదుగ నుందురు.

ఈ యప్రాకృత గోలోకబృందావనాది సహితుడగు శ్రీహరి భువిపై యథాతథముగ స్వావిష్కార మొనర్చినాడని భావింపవలయును. ఈ యప్రాకృతదివ్య శ్వేతద్వీపాఖ్యమగు గోలోకము శుద్ధసత్త్వ స్వభావమగుటచే హరిభక్తి సుధోదయ మూలశ్లోకమున 'స్వచ్ఛధామ్నే' స్వచ్ఛమగు (శుద్ధసత్త్వ స్వభావమగు రజస్ తమోఽతీతమగు) ధామమని పేర్కొనబడినది. ఇక్కడ నొక సందేహము కలుగవచ్చును. వైకుంఠ గోలోకములు వేరుగనున్నవా? ఉన్నచో రెండుచోటులందుండు భగవానుడొక్కడేనా? వేరువేరా? అని, పురాణములలో నీ రెండులోకములు వర్ణింపబడినవి. భగవానునకు ఐశ్వర్యప్రధానము మాధుర్య ప్రధానమునైన రెండుమూర్తులు కలవనియు శ్రీమన్నారాయణుడు తానైశ్వర్య ప్రాధాన్యమును బట్టి మహావిష్ణువుగా మహావైకుంఠము లేక పరమవ్యోమని పిలువబడు దివ్యధామమున సృష్టిస్థితిలయముల నొనర్చుచు, దేవాది సాధుజన పరిత్రాణమొనర్చు చుండును. ఆ భగవానుడే తాను పూర్ణ రసస్వరూపుడై సచ్చిదానంద మయమగు శ్రీకృష్ణాత్మకమగు మాధుర్యమూర్తిని ధరించి గోలోకాంతర్గతమగు గోకుల బృందావన వాసియై యుండి కృష్ణప్రేమమాధుర్య ము గ్రోలజాలిన వారికి మాత్రమే దర్శనమిచ్చుచు; శ్రీరాధాద్యంతరంగ శక్తులతో గూడి రాసక్రీడనొనర్చుచు నాత్మారాముడై యుండును. కావున నుపాసనా తారతమ్యమును బట్టి ఒకేమూర్తికి కల్గిన భేద ద్వితయ మిదియని శ్రీచైతన్య సంప్రదాయ వైష్ణవులు పురాణ ప్రామాణ్యమును బట్టి విశ్వసింతురు. శ్రీభాగవతమున –

'ఏతే చాంశకలాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయమ్' ।

అనియు, 'అహో భాగ్యమహోభాగ్యం నందగోప వ్రజౌకసాం యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మ సనాతనమ్' అనియు సాక్షాద్బ్రహ్మమే శ్రీకృష్ణ భగవానుడనియు మత్స్య కూర్మాదు లంశావతారములనియు, శ్రీకృష్ణభగవానుడు అవతారియనియు చెప్పబడి యుండుటచే శ్రీగౌడీయ సంప్రదాయ వైష్ణవులట్లే యుపాసింతురు. వీరియుపాసనలో ఐశ్వర్యము కంటె మాధుర్యమునకే సర్వప్రాధాన్యము. వీరికి శ్రీమద్భాగవతమే పరమ ప్రమాణము. గోపికల యుపాసనయే యుపాదేయతమము. శ్రీకృష్ణుడే పరతత్త్వము.

దక్షిణదేశమున నావిర్భవించిన పరమభాగవతోత్తములగు నాళ్వారులు గూడ శ్రీకృష్ణ భగవానుని మాధుర్యమూర్తిని గోపీభావమున నుపాసించినట్లు తదభిజ్ఞులు చెప్పుదురు.

పరశ్చాసౌ ఆత్మా చఅను వ్యుత్పత్తిని బట్టి పరాత్పరుడగు శ్రీహరియే వాస్తవమునకు ఆత్మశబ్దవాచ్యుడు. 'ఆప్నోతి అంతర్యామితయా, నియామకతయాచ సర్వత్ర ఇతి ఆత్మా' అంతర్యామిగ, నియామకుడై చేతనాచేతన సమస్త వస్తుజాతమున - ' అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః' అను శ్రుతివచనమును బట్టి వ్యాపించియుండువాడు గావున- ఆత్మశబ్దము ముఖ్యముగ పరమాత్మయందే ప్రవర్తించును. జీవులయందు ఔపచారికముగనే ఆత్మశబ్దము ప్రవర్తించుచున్నది. పద్మపురాణగతములగు నీ క్రింది శ్లోకములీ విషయమును స్పష్టపరచుచున్నవి.

'చేతనస్తు ద్విధాప్రోక్తః జీవ ఆత్మేతిచ ప్రభో !

జీవా బ్రహ్మాదయః ప్రోక్తా ఆత్మైకస్తు జనార్దనః ।

ఇతరే ష్వాత్మ శబ్దస్తు సోపచారో విధీయతే ।

ఆత తత్వాచ్చ మాతృత్వా దాత్మాహి పరమోహరిః ।'

చేతనులు ద్విప్రకారముగ నున్నారు. జీవులు, ఆత్మఅని. బ్రహ్మాదులు జీవులు, ఆత్మ జనార్దనుడొక్కడే. ఇరతరులయందు ఆత్మశబ్దము అముఖ్యముగ మాత్రమే ప్రవర్తించును. పరమాత్మవలె జీవుడు గూడ చైతన్య స్వరూపుడు కావున, చైతన్య వత్వసామ్యమును బట్టి జీవుల యందాత్మ శబ్దమారోపింపబడి వ్యవహరింప బడుచున్నదని తాత్పర్యము. ఆతతత్వము(అంతట వ్యాపించియుండుట) మాతృత్వము( సర్వకారణ మైయుండుట) యనులక్షణములను బట్టి 'ఆత్మ' యన శ్రీహరియేనని భావము. దీనిని సూచించుటకే ' పరాత్మని ' అని పేర్కొన బడినది.

అట్టి భగవానుడగు శ్రీహరి 'ఆత్మారాముడు' అనగా స్వాతిరక్తమగు విశ్రాన్తిధామము లేనివాడు. 'ఆత్మా ఆరామః విశ్రాన్తిధామ, యస్య' 'ఆత్మని ఆరమతే' అనువ్యుత్పత్తులను బట్టి స్వాత్మమాత్ర విశ్రాన్తుడు, తనయందేతాను నిరంతరమానందించువాడు, ఆత్మారాముడు. అపహతపాప్మత్వజ్ఞానా నందాద్య సంఖ్యేయ కల్యాణగుణములచే తానే తనకు సుఖసంవర్ధకుడై భోగస్థాన మైనవాడని తాత్పర్యము. మరియు స్కాందపురాణము

ఆత్మాతురాధికా తస్య తయైవ రమణాదసౌ ।

ఆత్మారామ ఇతి ప్రోక్తః ఋషి భిర్గూఢ వేదిభిః ।'

ఇత్యాదిగ గోలోకవాసియగు శ్రీహరికి రాధికయే యాత్మయనియు, స్వాత్మభూతయగు రాధికతో నిరంతరము క్రీడించువాడగుటచే రహస్య వేత్తలగు ఋషులచే భగవాను డాత్మారాముడని కీర్తింప బడినాడని తెల్పుచున్నది.

అట్టిభగవానుడు 'నిజానందసింధువు' అనగా స్వస్వరూపభూతమగు ఆనందమునకు

సాగర మైనవాడు. అనగా అపరిచ్ఛిన్నానంతానంద స్వభావుడని భావము. 'ఆనందం బ్రహ్మణోరూపమ్' 'ఆనందో బ్రహ్మేతివ్యజానాత్' ఇత్యాది శ్రుతులచే నానందమే పరబ్రహ్మమగు భగవానుని స్వరూపమని తెలియుచున్నది. భగవన్నామములలో ప్రధానతమమగు కృష్ణశబ్దముగూడ నిరంతరానంద స్వరూపమునే భోధించుచున్నదని -

కృషిశబ్దోహి సత్తార్థః ణశ్చానంద స్వరూపకః ।
సత్తా స్వానందయోర్యోగాత్ తత్ పరంబ్రహ్మ చోద్యతే ।

ఇత్యాది బృహద్గౌతమీయ వచనము తెలుపుచున్నది. శ్రీభాగవవతమున నానక దుందుభి వచనమునగూడ -

'విదితోఽసిభవాన్ సాక్షాత్ ఈశ్వరః ప్రకృతేః పరః ।
కేవలాను భవానంద స్వరూపః సర్వబుద్ధిదృక్ ।'

ఇత్యాదిగ నానందమే భగవత్ స్వరూపముగ నిష్కర్షింపబడినది.

'ఈశ్వరః పరమః కృష్ణః సచ్చిదానంద విగ్రహః ।
అనాది రాదిర్గోవిందః సర్వకారణ కారణమ్ ।'

అను బ్రహ్మ సంహితా ప్రథమ శ్లోకము,

'ఆనంద చిన్మయ సదుజ్జ్వల విగ్రహస్య' (32)

'ఆనంద చిన్మయ రసప్రతిభావితాభిః
తాభిర్య ఏవనిజరూపతయా కలాభిః' (37)

'ఆనంద చిన్మయ రసాత్మతయా మనఃసు
యః ప్రాణినాం ప్రతిఫలన్ స్మరతాముపేత్య' (42)

ఇత్యాదివచనములును భగవానుని ఆనందవిగ్రమునిగా ప్రతిపాదించుచున్నవి. తైత్తిరీయోప నిషత్తున నానందమే బ్రహ్మస్వరూపముగ నిర్దేశింపబడినది. మరియు ఆనంద స్వరూపుడగు భగవానుడు రసముగా జీవులచే నాస్వాదింపబడు చున్నాడనియు, ఆనంద స్వరూపుడగు భగవంతుని పొందుట చేతనే జీవులకానంద యోగమనియు నిరూపింపబడగా నదియే బ్రహ్మసూత్రములలో - 'ఆనందమయోఽభ్యాసాత్ అనియారంభించి యానందమయాధి కరణమున విచారించి నిర్ధరింప బడినది. ఇట్లానంద విగ్రహుడగు భగవానుడు కారణార్ణవ శాయియని సింధుశాయనే అను విశేషణము తెలియజేయుచున్నది. ఈ విషయమునే

శరణ్యాయ శరణ్యానాం భూతానాం ప్రభవేనమః ।
ఆత్మనామాది భూతాయ గురూణాం గురవేనమః ॥ 18

ప్రాణానాం ప్రాణభూతాయ, చక్షుషాం చక్షుషే నమః ।
శ్రోత్రాణాం శ్రోత్ర భూతాయ మనసాం మనసే నమః ॥ 19

అర్వాక్ సంవత్సరో యస్మాదహోభిః పరివర్తతే ।
జ్యోతిషాం జ్యోతిషే తస్మై దేవోపాస్యాయ తే నమః ॥ 20

బ్రహ్మసంహిత -

యఃకారణార్ణవ జలే భజతిస్మయోగ-

నిద్రామనంత జగదండ సరోమకూపః ।

ఆధార శక్తిమవలంబ్య పరాంస్వమూర్తిం

గోవింద మాదిపురుషం తమహం భజామి ॥

ఇత్యాదిగ కీర్తించుచున్నది. ఈశ్లోకమున భగవత్స్వరూపము పరిపూర్ణముగా నిర్దేశింపబడినది. 17

శరణార్థులగు ననన్య ప్రపన్నులకు శరణముగ నాశ్రయింపదగిన వాడును,సర్వప్రాణులకు (సర్వభూతములకు) నియామకుడై పాలకుడైనవాడును, జీవులందరికి మూలకారణమైనవాడును, తత్త్వోపదేష్టలగు గురువులకు సహితము గురువైన వాడునగు శ్రీహరికి నమస్కారము. 18

ప్రాణములకు ప్రాణమైనవాడును, కనులకు కన్నైన వాడును శ్రోత్రేంద్రియములకు శ్రోత్రమైనవాడను, మనస్సులకు మనస్సైనవాడునగు భగవానునకు ప్రణతులు. ఈశ్లోకముచే కేనోపనిషద్వచనముల తాత్పర్యము. ఆవిష్కరింపబడుచున్నది.

' ఓం । కేనేషితం పతతి ప్రేషితం మనః

కేన ప్రాణః ప్రథమః ప్రతియుక్తః ।

కేనేషితాం వాచమిమాంవదన్తి

చక్షుః శ్రోత్రం కఉ దేవోయునక్తి ॥ ' (1-1)

శ్రోత్రస్య శ్రోత్రం మనసోమనో యద్వాచోహవాచం

యస్యనిఃశ్వసితం ప్రాహుర్వేదా ద్యఖిల వాఙ్మయం ।
యద్వాచ్యం చాఖిలం చాస్మై దేవాయాద్యాయ తే నమః ॥ 21

దేవ! ప్రబోధకాలోఽయం యోగనిద్రా విరమ్యతామ్ ।
అనువర్త్యః ప్రపంచోఽయం దేహిలోకాన్ త్వయిస్థితాన్ ॥ 22

ముషిత్వై తజ్జగత్ కృత్స్నం స్వపన్తం కపటార్భకమ్ ।
అపిమాయా పటచ్ఛన్నం విద్మస్త్వాంనాథ ! జాగృహి ॥ 23

సఉ ప్రాణస్య ప్రాణశ్చక్షుషశ్చక్షుః । అతిముచ్య ధీరా ః
ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి ॥ ' (1-2)

ఏవ్వనిచే ప్రేరితమై ఈ మనస్సు స్వేప్సిత విషయమును గ్రహింప గులుగుచున్నదో, పంచప్రాణములలో మొదటిదగు ప్రాణము ఎవ్వనిచే ప్రేరితమై తన పనిని చేయుచున్నదో ఎవ్వనిచే ప్రేరితమగు లౌకిక వైదిక వాక్కును జీవులుచ్చరించుచున్నారో, కన్ను, చెవి మున్నగు నింద్రియములను వాటివాటి విషయములందెవ్వడు ప్రేరించుచున్నాడో, అట్టి శ్రోత్రమనోవాక్ ప్రాణచక్షుస్సులకు శక్తి ప్రదుడై ప్రేరకుడైన పరమాత్మ శ్రీమన్నారాయణుని యెవ్వరెరుగుదురో వారు అర్చిరాది మార్గమున ప్రయాణించి యీ లింగ దేహమును విడచి ముక్తులగుదురని కేనోపనిషద్వచన తాత్పర్యము. ఇట్లు ప్రాణాదులకు శక్తి ననుగ్రహించు శ్రీహరికి ప్రణతులని తాత్పర్యము. 19

ఎవ్వని నియామకత్వశక్తిచే నియమింపబడిన కాలము దినములు, సంవత్సరములు, ఇత్యాది పరివర్తనము నొందుచున్నదో, ఎవ్వడు జ్యోతిస్సులగు సూర్యచంద్రాగ్ని ప్రభృతులకు లోపల జ్యోతీరూపుడై ప్రకాశన శక్తి నిచ్చుచున్నాడో, అట్టి నిఖిల దేవోపాస్యుడగు భగవానునకు ప్రణతులు. 20

ఏ భగవానుని నిఃశ్వాసనములు (ఊరుపులు) సమస్తవేదాది వాఙ్మయముగ నైనదని అభిజ్ఞులు తెల్పుదురో, అట్టి వేదాది సమస్త శబ్దరాశికిని 'వాచ్యుడు' గా (శబ్దములచే బోధింపబడు నర్థముగా) నెవ్వడు ప్రకాశించుచున్నాడో అట్టి యాది దేవునకు నమస్కారము. 21

ఓ దేవా! ఇది మేల్కొనదగిన సమయము. కావున యోగనిద్రను విడువుము. ఈ నిఖిల ప్రపంచము సృజింపదగియున్నది. కనుక నీలో, లయించిన లోకములను ప్రకట మొనర్పుము. 22

అథప్రబుద్ధో భగవాన్ సుస్మితో భక్తవత్సలః ।
సంభాష్య వేధ సాథైనం సంసృష్ట్యర్థ మబోధయత్ ॥ 24

బ్రహ్మాథ ప్రాంజలిః ప్రాహ సంక్లుప్తాపీశ విస్మితా ।
చిరోత్కృష్టా మయాసృష్టి రనభ్యాసా శ్రుతిర్యథా ॥ 25

శ్రీ నారద ఉవాచ –
శ్రుత్వేతి మత్పితుర్వాక్యం ప్రసన్నః ప్రాహకేశవః ।
స్వచ్ఛదంతచ్ఛవివ్యాజాత్, జ్ఞానం మూర్తమివార్పయన్ । 26

స్వామీ ! ఈ నిఖిల జగమును దొంగిలించి కపట శిశురూపమున నిద్రించుచు, మాయా పటము (వస్త్రము) చే నావరింప బడియున్నను, నీయను గ్రహముచేతనే నిన్నెరిగితిమి. కావున మేల్కొనుము.

12వ శ్లోకమున 'తత్ప్రసాదితజ్ఞానః' అని భగవదనుగ్రహముచే జ్ఞానమును బ్రహ్మ పొందినాడని తెలుపబడి యుండుటచే, మాయాధిష్ఠితుడై శిశువుగనున్న స్వామిని బ్రహ్మగుర్తింప గలిగినాడు. ఇచ్చట –

'దైవీహ్యేషాగుణ మయీ మమమాయా దురతయమా ।
మామేవయే ప్రద్యంతే మాయామేతాం తరన్తితే ॥

అని శ్రీగీతలో భగవానుడు స్వయముగ నున్నట్లు తదనుగ్రహముచేతనే తదీయ మాయను తొలగించు కొని తత్త్వ మెరుగగలుగుట యని స్పష్టపరుపబడినది. 23

పిమ్మట మేల్కాంచిన భగవానుడు శుభ్రస్మితవదనుడై, భక్తునిపై వాత్సల్యము కలవాడై, బ్రహ్మతో సంభాషించి, సృష్టినొనర్ప నాతని ప్రేరించెను. 24

స్వామీ! చాలకాలము పూర్వమున్నీతమైన సృష్టి సువ్యక్త నామరూప విభాగ పరిక్లుప్త మైనదయ్యును, అభ్యాసములేమిచే వేదమట్లునాచే విస్మరింపబడినది. 25

శ్రీ నారదముని పల్కెను. ఈ విధముగ పల్కిన నా తండ్రి (బ్రహ్మ) యొక్క పలుకులవిని ప్రసన్నుడైన కేశవుడు శుభ్రదంతకాంతి వ్యాజముతో మూర్తీభూతమగు జ్ఞానమునర్పించుచున్న వాడై పలికెను. 26

నా యనుగ్రహముచే స్మృతులు, శ్రుతులు (ధర్మశాస్త్రములు, వేదములు) నీకు

ప్రతిభాన్తు ప్రసాదాన్మే స్మృతయః శ్రుత యశ్చతే ।
సర్వజ్ఞోఽసి, సమర్థోఽన్యః, జగత్ సంప్రక్ష్య సీచ్ఛయా । 27

న చాల్పోఽపి శ్రమస్తేస్తు సృష్టిః కర్మవశాద్యతః ।
భవిత్రీ సర్వజీవానాం త్వం ప్రేరయ తథైవ తామ్ । 28

యేసాత్త్వికాః సుకృతినః తాన్ సమాహృత్య సర్వశః ।
సృజ్యాః సురాది సుఖిషు; పాపినస్తి ర్యగాదిషు । 29

బుద్ధిని స్ఫురించును గాక. సర్వజ్ఞాన సంపన్నుడవైతివి. నీయందంతర్యామిగ నుండి నేనే నియమింతును గాన నీవునాకంటె భిన్నుడవు కావు. కావున స్వేచ్ఛగ జగత్సృష్టి నొనర్పగలవు. 27

ఈ సృష్టి, సమస్తజీవుల సుకృత దుష్కృతకర్మల వలననే నేర్పడను గావున నీకు స్వల్పమగు శ్రమముగూడ లేదు. నీవుకేవలము కర్మమున నేర్పడెడి సృష్టిని ప్రేరించుము.

ఇచ్చట నాయాయి జీవులు వారివారి పూర్వకర్మానురూపములగు సురనరతిర్యక్ స్థావరాది దేహానుప్రవేశముచేయుట, సంసరించుట జరుగును. కావున సురనర తిర్యగాది సృష్టినొనర్చు నప్పుడు అందు ప్రవేశించెడి జీవుల సుకృతదుష్కృత కర్మములే నియామకములుగ నుండును గావున బ్రహ్మతాను స్వతంత్రముగ కల్పించవలసిన దేమియు లేదనియు, కర్మవశమున నేర్పడెడి సృష్టికి కేవలము ప్రేరకునిగా మాత్రమే బ్రహ్మయుండునని స్పష్ట పరుపబడినది.

ఇచ్చట నొక శంక కలుగవచ్చును. కర్మమనునది జీవులు దేహాను ప్రవేశము చేసిన తరువాత తమ బుద్ధిననుసరించి చేయునది. దేహాను ప్రవేశమునకు పూర్వము ఆకర్మముండదుకదా! అనగా కొన్ని జన్మములలో జీవుడు కర్మమును సముపార్జించి తదను కూల దేహాదుల పొందును. కాని సర్వప్రథమముగ జీవులకు ఎట్టి కర్మములు నుండవుగదా! అట్టియెడ కర్మాను కూలదేహప్రవేశమునదెట్లుకుదురును! దీనికిది సమాధానము. ఈశ్వరుడు (భగవంతుడు)జీవులు (చిత్స్వరూపులు) జడములు (అచిద్రూపమగు ప్రపంచము) అనుమూడు తత్త్వములును అనాదులు. అనగా ఆది అను అవస్థలేనివి. జీవులు సహజముగా అపరిచ్ఛిన్నజ్ఞాన స్వరూపులయ్యును కర్మాత్మకమగు

నవిద్యచే పరివేష్టితులై, ఆయాయి కర్మానురూపమగు జ్ఞాన సంకోచమును పొందినవారై బ్రహ్మ మొదలు స్తంబపర్యంతము వివిధములు విచిత్రములునగు దేహముల ప్రవేశించి, ఆయాయి దేహోచితమగు జ్ఞాన ప్రసారమును పొందినవారై ఆయాయి దేహములయందాత్మత్వాభిమానము కలవారై, తత్తదుచిత కర్మముల జేయుచు తదను గుణమగు సుఖదుఃఖ రూపమైన సంసారమును అవిచ్ఛిన్నముగ ప్రవాహరూపముగ పొందుచున్నారు. సమస్తచేతనులగు జీవులకు భగవానుడు సమానముగ చిచ్ఛక్తిని, ప్రవృత్తిశక్తిని (ఆయాయి క్రియల నాచరించుటకు కావలసిన ప్రవృత్త్యనుకూలశక్తిని) అనుగ్రహించి తన్నిర్వహణమునకై తానాధారభూతుడై అంతర్యామిగ హృదయమున ప్రవేశించి వాని ప్రవృత్తి నివృత్తుల ననుమోదించుచు నియమించుచుండును. భగవంతునిచే కల్పింపబడిన శక్తికల జీవులు ప్రవృత్తి నివృత్త్యాదులను స్వయముగనే చేయుచుందురు. ఇట్లు చేయుచున్న జీవులను భగవానుడు పరికించుచు ఉదాసీనుడుగనే యుండును. కావున సుకృత దుష్కృతాది వివిధ కర్మాచరణమును జీవులు స్వతంత్రముగ భగవంతుడిచ్చిన శక్తి ని వినియోగించి చేయుచున్నారేతప్ప - ఆకృత్యముల నొనర్చుటలో భగవంతుని ప్రేరణలేదు. కావున వారొనర్చెడి కర్మముల ఫలములగు సుఖదుఃఖముల నని వార్యముగ వారే యనుభవింప వలసియున్నది. కొందరు సహజముగ భగవదను కూల ప్రవృత్తి గలవారైయుందురు. అట్టివారికి భగవానుడు స్వయముగనే సద్బుద్ధిననుగ్రహించి సన్మార్గమున ప్రవర్తింపజేయును. ఇట్టివారి నుద్దేశించియే భగవానుడు శ్రీగీతలో -

'తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం

దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తితే ॥

తేషామేవాను కంపార్థమహ మజ్ఞానజం తమః ।

నాశయామ్యాత్మ భావస్థః జ్ఞానదీపేన భాస్వతా ॥'

మరికొందరు జీవులు సహజముగ భగవత్స్మృతి విదూరులై తమకు భగవంతునిచే నను గ్రహింపబడిన చిచ్ఛక్తి, ప్రవృత్తి శక్తులను దుర్వినియోగపరచుచు నాస్తికత్వమునవలంబించి భగవద్విదూరులు, దైవనిందకులు నగుదురు. అట్టివారి నుద్దేశించి భగవానుడు శ్రీగీతలో

'తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।

క్షిపామ్యజస్ర మశుభానా సురీష్వేవయోనిషు ॥'

నన్ను ద్వేషించు క్రూరులగు నరాధములను ఈ సంసార చక్రమున ద్రిప్పి దుర్భగములగు నీచయోనుల పడద్రోయుధునని చెప్పినాడు. దీనిని బట్టి జీవులందరకు చిచ్ఛక్తి ప్రవృత్తి

శక్తులు సమానముగనే భగవంతునిచే ననుగ్రహింపబడినను వారివారి సంస్కారముల బట్టి వాటి వినియోగమున వారుదీసికొనిన స్వాతంత్ర్యమే వారికి సుకృత దుష్కృతకర్మాచరణ హేతువై వివిధదేహాను ప్రవేశహేతు వగుచున్నదని తేలుచున్నది. ఇంచుమించుగ వైష్ణవ సంప్రదాయము లన్నియు దీనినంగీకరించుచున్నవి. శ్రీరూపగోస్వామి పాదులు తత్త్వ సందర్భమున సర్గవిసర్గముల వివరించు పట్టున –

'పురుషాను గృహీతానా మేతేషాం వాసనామయః ।

విసర్గోఽయం సమాహారో బీజాద్బీజం చరాచమ్ ॥

అను శ్రీ భాగవత ద్వాదశ స్కంధీయ శ్లోకమును వ్యాఖ్యానించుచు –

' ఏతేషాం మహదాదీనాం జీవస్య పూర్వకర్మవాసనా

ప్రధానోఽయం సమాహారః కార్యభూతశ్చరాచర ప్రాణిరూపః

బీజాద్బీజమివ ప్రవాహాపన్నో విసర్గః '

ఈ మహత్తు మున్నగు తత్త్వములకును జీవునకు పూర్వకర్మ వాసనను ప్రధానముగ జేసికొనియే చరాచరప్రాణిరూపమగు నీ సమాహారము (కలయిక) ఒక బీజమునుండి మరియొక బీజముత్పన్నమైనట్లు ప్రవాహరూపమున నవిచ్ఛిన్నముగ నేర్పడుచున్నది. ఇదియే విసర్గము (బ్రహ్మసృష్టి) ' అని పేర్కొనినారు. భగవానుడు మహాదాదులను (మహత్తత్త్వము, అహంకారము, భూతమాత్రలు, ఇంద్రియములు, స్థూలభూతములు, తదుపలక్షిత దేవతలు మున్నగు వాటిని స్వయముగ సృజించుట సర్గము. ఈ మహాదాదులతో జీవులను కలుపుటయే చతుర్ముఖ బ్రహ్మయొనర్చు విసర్గము. ఈ విసర్గమున జీవులు మహాదాది సంయుక్తులై సురనర తిర్యగాది నానాదేహముల పొందుట పూర్వకర్మవాసనను బట్టియేనని తాత్పర్యము. 28

ఎవ్వరు సత్త్వగుణ సంపన్నులు భగవదాయత్తచిత్తులై సుకృతాచరణ పరాయణులై యుందురో, అట్టి భక్తజనుల సురాది సుఖవంతములగు దేహములందును, భగవద్ద్వేషులగు పాపాత్ములను పశుపక్ష్యాది నీచయోనుల యందు సృజింపుము.

పూర్వశ్లోక వివరణావసరమున నుదాహరించిన 'తేషాం సతత యుక్తానాం' 'తేషా మేవాను కంపార్థమ్' తానహం ద్విషతః క్రూరాన్ ఇత్యాది భగవద్గీతా శ్లోకముల తాత్పర్యమే ఈ శ్లోకమున నిర్దేశింపబడినది. 29

ఎవ్వరెవ్వరికి జనకత్వాది నిమిత్తముగ మూలములైయున్నారో వారే, వారికి పోషకులై పిత్రాదులగుదురు. ఎవ్వరు పూర్వము ఎవ్వరికి ఋణపడియుండిరో వారే వారికి పుత్రాదులుగ పుట్టుదురు. 30

యే యేషాం మూలికాస్తేషాం తేస్యుః పుత్రాది పోషకాః ।
పోష్యాశ్చ పూర్వ దత్తార్ణాః తేషాం పుత్రాది రూపిణః ॥ 30

నిధనం యస్యతత్కాలే కల్పితం పూర్వ కర్మభిః ।
భవేత్తు కాలవైధవ్య యోగ్యాయాః స పతిర్ధ్రువః ॥ 31

ఉపకార్యోప కర్తృత్వం స్నేహోఽన్యోన్యంచ సంకథాః ।
ద్వేష్య ద్వేష్టృత్వ దుర్జల్పా అపి, న ప్రాగ కల్పితాః ॥ 32

సుఖ యోగ్యాన్ పరేజీవాన్ సుఖయంతు తథేతరాన్ ।
ధుఃఖయన్త్వ త్రవాముత్ర స్వయంసాక్షీ త్వమేవనః ॥ 33

ఎవ్వడు కాలవశమున పూర్వకర్మముల బట్టి నిధనమును(మరణమును) పొందినాడో, ఆతడు ఆకాలమున వైధవ్యముపొందుయోగ్యత గలస్త్రీకి పతిగాతప్పక కల్పింపబడ వలయును. 31

ఉపకారమును పొందదగియుండుట, ఉపకారమొనర్చుట, స్నేహము, పరస్పర సంల్లాపములు ద్వేషింపదగియుండుట, ద్వేషించువాడై యుండుట, దుష్టాలాపములు ఇవియన్నియు పూర్వములేనివి కల్పింపబడలేదు. అనగా పూర్వమున్నవే యిప్పుడును కల్పింప బడుచున్నవని తాత్పర్యము. 32

సుఖమనుభవింప యోగ్యతగలవారిని యితరులు ఈ లోకమునను లేదా పరలోకమున సుఖింప జేయుదురుగాక. అట్లే దుఃఖయోగ్యులను దుఃఖింప జేతురుగాక. దీనికి నీవే సాక్షిభూతుడవు. 33

ఎప్పుడెవ్విధమున నెవ్వనియందెంత(కర్మము) సంచితమైనదో(సంపాదింపబడి ప్రోగుజేయబడియున్నదో) అప్పుడవ్విధమున నాతనియందంతే భోగాస్పదముగ కల్పింపదగినదే తప్పవేరుకాదు.

అనగా జీవుడు తాను సంపాదించిన సుకృత దుష్కృతములకను రూపములగు ఫలములనే భోగింపదగును తప్ప వేరుకాదని తాత్పర్యము.

'అత్యుత్కటైః పుణ్య పాపైరిహైవఫలమశ్నుతే'

అని యన్నట్లు తాను చేసిన అత్యధిక సుకృతములకు సుఖమునుగాని, అత్యంత

యదాయస్మిన్ యథాయస్మాత్ ప్రాప్యం యద్యేన సంచితం ।
తదాతస్మిం స్తథాతస్మా ద్భోజ్యం తత్తేన నాన్యథా । 34

కార్యాశ్చతుర్యుగావస్థా స్త్వదహ్ని చప్పృథక్ పృథక్ ।
జీవానాం కర్మజైరేవం సుఖదుఃఖై ర్విలక్షణాః । 35

పుణ్యాత్మానః కృతేసృజ్యాః త్రేతాయాం పాదపాపినః ।
ద్వాపరే చార్ధపాపాశ్చ పాదపుణ్యాః కలౌయుగే । 36

కలేర్ద్వి సహస్రాబ్ద ప్రమాణ స్యాస్త్య పాదకే ।
క్రమాత్ పాపాగ్నిభిః పుణ్యం సర్వం నిర్భస్మితం భవేత్ । 37

దుష్కృతములకు దుఃఖమును గాని ఇక్కడే జీవుడను భవింపనగును. లేదా పరలోకమునందు లేదా జన్మాంతరములందైన యనుభవింపతప్పదు.

'అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్'

అను వచనమునకు గూడ యిదియే తాత్పర్యము. అనగా కర్మాను రూప భోగములనే బ్రహ్మ సృజింప వలయునని భావము. 34

నీప్రమాణము ననుసరించిన దినభాగమున (బ్రహ్మమానము ననుసరించిన యొక పగటిభాగమున) జీవుల కర్మముల వలన కల్గిన సుఖదుఃఖ భోగములచే విచిత్రవైవిధ్యమును పొందిన నాలుగు యుగావస్థలు వేరువేరుగ కల్పింప దగియున్నవి. అనగా బ్రహ్మమానమును బట్టి ఒకదిన పరిమితకాలమున నాలుగు యుగములు వేరువేరుగ కల్పింపబడును. అవి జీవుల సుకృతదుష్కృత కర్మఫల తారతమ్యముచే పరస్పర విలక్షణములై యుండునని తాత్పర్యము. కావుననే సుకృత ప్రచురమగు కృతయుగము, ఒకభాగము దుష్కృతముగల త్రేతాయుగము, రెండు భాగములు దుష్కృతములుగల ద్వాపరము, ఒకభాగము మాత్రమే సుకృతము గలిగి మూడుభాగములు దుష్కృతములతో నిండిన కలియుగము అని ఈనాలుగు యుగములును, జీవుల సుకృతదుష్కృత కర్మముల తారతమ్యమును బట్టి ధర్మాధర్మ భేదముచే వేరువేరుగ నుండునని భావము. 35

కృతయుగమున పూర్ణముగ పుణ్యాత్ములైన మహానుభావులును, త్రేతయందు ఒకపాదము(నాల్గవవంతు) పాపముగల వారును, ద్వాపరమున సగము(రెండువంతులు)

తతః పాపాత్మకే లోకే సంహృతేఽన్యోన్య మాయుధైః।
శిష్టేచ కల్కినా నష్టే కృతం భూయః ప్రవర్తతామ్॥ 38

పృథక్ చిహ్నప్రమాణానాం జీవకర్మవశాదిహ।
చతుర్యుగానాం సాహస్రం కల్పాఖ్యమ భవత్తవ॥ 39

సర్వకల్పేషు చాప్యేవం సృష్టి పుష్టి వినష్టయః।
నిమిత్త మాత్రన్తు వయం, క్రియన్తే జీవకర్మభిః॥ 40

సదా బ్రహ్మాండ వర్గేఽస్మిన్ జంతవోయంత్ర పుత్రికాః।
చేష్టంతే కర్మసూత్ర స్థాః తతస్త ద్వీక్షకా వయమ్॥ 41

పాపము కలవారును, కలియుగమున ఒకపాదము మాత్రమే పుణ్యము కలవారుగను జీవులు సృజింప బడవలయును. పై శ్లోకము యొక్క భావమే యిందు వివరింప బడినది. 36

దేవమానమును బట్టి వేయిసంవత్సరములు పరిమితిగల కలియుగపు చివరి పాదమున క్రమముగ పాపాగ్నులచే పుణ్యమంతయు నిశ్శేషముగ భస్మము కావింప బడవలయును. 37

అటుపిమ్మట పరస్పరము ఆయుధములచే పాపాత్మకమగు నీలోకము నశింపగా మిగిలినది కల్కిరూపుడగు భగవానునిచే నశింప జేయబడగా మరల కృతయుగము ప్రవర్తింప వలయును. 38

ఈ విధముగ వేరువేరు లక్షణములు ప్రమాణములు గలిగి జీవకర్మ తారతమ్యముచే నేర్పడిన యీ యుగములు నాలుగు, వేయిసారులు ఆవృత్తిని పొందగానప్పుడు నీ కల్పమగును.(బ్రహ్మకల్పమగును). 39

ఈ విధమున నన్ని కల్పములందును సృష్టి, పోషణము, నాశనము అను మూడును జీవుల కర్మపరిపాకముల బట్టియే జరుగుచుండును. కేవలము నీవును, నేనును నిమిత్తమగుదుము. 40

ఎల్లప్పుడీ బ్రహ్మాండమున ప్రాణులు మరబొమ్మలు మాత్రమే . అవితమతమ కర్మ సూత్రములచే బద్ధములై కదలుచుండగా మనము నిరీక్షించు చుందుము.41

కర్మమేధ్యాం దృఢం బద్ధ్వా, వాక్ తంత్ర్యాం నామదామభిః ।
రాగప్రముక్తా భ్రామ్యంతే ఖలేఽస్మిన్ పశవోజనాః ॥ 42

బలాద్గృహీతాః క్రోధేన రాగరాజాను జీవినా ।
అశ్రాన్తం కారితా జీవా రిష్టికర్మాణి కుర్వతే ॥ 43

లోభమత్సర దర్పాఖ్యై స్త్రిభిః స్పృష్టోమహాగ్రహైః ।
జనోఽయమస్మృతానర్థో వికుర్వన్ బహుచేష్టతే ॥ 44

భూమౌకృత్వైవ కర్మాణి దివిభుంక్తే తథాఽత్రచ ।
కామకామో హి లభతే సర్వదైవం గతాగతమ్ ॥ 45

ఈ లోకమను కళ్లమున జనులను పశువులు కర్మమను రాటకు వాక్కులను పోగులు గల నామములను త్రాళ్లచే గట్టిగ బంధింపబడినవై రాగ నిమిత్తముగ విడువబడి త్రిప్ప బడుచున్నవి.

ఎవ్విధమున పశువులు కళ్లమున రాటకు గట్టి త్రాళ్లచేకట్టబడి గడ్డి పోచల యందలి వ్యామోహముచే త్రిప్పబడుచున్నవో అట్లే కర్మబద్ధులగు జీవులు వాఙ్నామాది వ్యవహారము కల్గి విషయ సుఖముల యందలి వ్యామోహముచే జనన మరణ ప్రవాహ రూపమగు సంసారమున పరిభ్రమింప జేయ బడుచున్నారని తాత్పర్యము. 42

రాగమనెడి రాజునకు భృత్యుడైన క్రోధమనెడి దుష్టునిచే బలపూర్వకముగ స్వాయత్త పరుచుకొనబడిన జీవులు అస్వతంత్రమగ ప్రవర్తించు వారై పాప కర్మముల నొనర్చుచున్నారు. 43

లోభము, మాత్సర్యము, (అసహనము) దర్పము (అహంకారము) అను మూడు మహాగ్రహములచే పట్టుబడిన జనుడు, కలుగనున్న, యనర్థమును విస్మరించి విపరీత ప్రవర్తనము కలవాడై ఇచ్చవచ్చినట్లు పలువిధముల వర్తించుచున్నాడు.

లోభాద్యస్త్రిః శత్రువులే లోకపు విపరీత ప్రవర్తనమునకు సకలా నర్థములకు కారణములని తాత్పర్యము. 44

భూమిపై తానార్చిన కర్మములకు ఫలములగు సుఖదుఃఖములను స్వర్గముననను, భూమిపైనను జనుడనుభవించుచున్నాడు, కామాభిలాషుడై ప్రవర్తించు జీవుడా జన్మమరణ చక్రమున దగిలి ఎల్లప్పుడు అవిశ్రాన్తముగ సంచరించుచున్నాడు. 45

తస్మాదలంఘ్యం బలవత్ కర్మచక్ర మిదం సదా ।
భవిష్యతి, తథా భావ్యా స్సృష్టీస్తాః ప్రవర్తయ । 46

బ్రహ్మేచ ప్రాహ సకలాం కరోమ్యాజ్ఞాం తవప్రభో ।
కలౌ, తు, యా, వ్యవస్థోక్తా దుష్కరా సాహిభాతిమే । 47

తస్యాదౌహి త్రయోభాగాః పాపస్యాతి బలీయసః ।
ఏక ఏవతు పుణ్యస్య దుర్బలస్య సచక్రమాత్ ॥ 48

విలీయతే చైక పాదః తతశ్చాబ్దసహస్రకమ్ ।
కథంతిష్ఠ జ్జగదిదం పుణ్యేనహి జగత్స్థితిః ॥ 49

కలిప్రభంజనోద్రిక్తః దుర్వారః పాపపావకః ।
హృత పుణ్యారసంలోక మర్వాగేవ దహిష్యతి ॥ 50

కావున దాటరానిది, ప్రబలమైనది యగు నీ కర్మచక్రము ఎల్లప్పుడు భ్రమించు చునేయుండగలదు. అట్లే తప్పనిసరిగ జరుగవలసిన సృష్టులను నీవు ప్రవర్తింప జేయుము. 46

హే ప్రభో ! నీయాదేశము నంతటిని యథాతథముగ ననువర్తింతును. కాని కలియుగము విషయమున నేవ్యవస్థ నీచే చెప్పబడినదో, అది యత్యంత దుష్కరముగ నాకు తోచుచున్నదని బ్రహ్మపలికెను. 47

కలియుగమున నతిప్రబలమైన పాపమునకు మూడు భాగములు, దుర్బలమైన పుణ్యమునకు ఒకభాగము క్రమముగ నుండును. 48

స్వామీ ! పుణ్యవశముననే నిఖిల జగత్తు స్థితిని పొందును. కాని కలియుగమున ఏక భాగావశిష్టమగు పుణ్యము మూడుపాదములతో ప్రబలమైన పాపముచే కబళింపబడి విలయమును పొందును. గాన పుణ్యము లేమిచే నీ జగము సహస్రాబ్దము లెట్లు నిలువ గలదు ? 49

కలియను ప్రలయవాయువుచే ప్రేరేపింపబడి, నివారింప రానిదైన పాపాగ్ని పుణ్య సారవిహీనమగు లోకమును వెంటనే దహింపగలదు. 50

తూలరాశితో గూడిన యగ్ని కాలమును ప్రతీక్షించునా? ఒక్కక్షణమున నిఖిల

కిం తూలరాశిలగ్నోఽగ్నిః సమయం సంప్రతీక్షతే ।
దహత్యేవ క్షణాత్ సర్వం తత్రాపాయం వదస్వమే । 51

తతః ప్రహస్య ప్రాహేశః సర్వం సత్యమిదం విధే ।
అబాధితం ప్రవృద్ధేఽఘే క్షణంలోకస్య కాస్థితిః ॥ 52

ఇమమేవార్థ ముద్దిశ్య బహుధావతరామ్యహమ్
పుణ్యవత్సు ఆత్మనా లోకపావనాయ యుగేయుగే ॥ 53

తీర్థాన్యశ్వత్థ తరవో గావో విప్రాస్తథా భువి ।
మద్భక్తాశ్చేతి విజ్ఞేయా స్తనవో మమ పంచధా ॥ 54

పూజితాః ప్రణతాః ధ్యాతాః దృష్టాః స్పృష్టాః స్తుతా అపి ।
నృణాం సర్వాఘహంతారః సతతం తేహి మన్మయాః ॥ 55

-మును దహించును. కావున దానిని నివారించు నుపాయమును నాకుపదేశింపుము! 51

అంతట భగవానుడు నవ్వుచు నిట్లు పల్కెను. 'ఓ విధీ! నీవన్నదంతయు సత్యమే! పాపము అప్రతిహతముగ వృద్ధిచెందినప్పుడు, క్షణమాత్రమీలోకపు స్థితి ఎట్లుండునో భావించుటయే కష్టము. 52

ఈ విషయమును పురస్కరించు కొనియే నేను యుగయుగమున లోకమును పవిత్రమొనర్చనెంచి పుణ్యాత్ముల గృహములందు అనేక ప్రకారముల నవతరించు చుందును. 53

పవిత్రములగు జలావతరణములు, అశ్వత్థవృక్షములు, గోవులు, సదాచార సంపన్నులు భగవదారాధనా తత్పరులునైన బ్రాహ్మణులు, అట్లే నన్ను అనన్య భావనచే నిరంతరము భజించెడి నాభక్తులు అను నీ యైదు విధములైనవి నాదేహములని యెరుంగవలయును. 54

నిరంతరము మదాత్మకులైన యీ యైదుగురును పూజింపబడి, నమస్కరింపబడి, ధ్యానింపబడి, దర్శింపబడి, స్పృశింపబడి, స్తుతింపబడిన వారై సమస్త కిల్బిషముల నశింప జేయుదురు 55

తేషాం పుణ్యాత్మనాం భీతోభృశం కలిరఘాత్మకః ।
మందీభూత స్వవిభవో నిఃశంకం న ప్రవర్తతే ॥ 56

సిచ్యమానో జలైనైవ యథైధాంసి దహన్నపి ।
భస్మీ కుర్యాత్క్షణే నాగ్నిః మందంజ్వలతి చ క్రమాత్ ॥ 57

ఏవ మేషాంహి సాన్నిధ్యాత్ పుణ్యాబ్ధి నామఘానలః ।
వార్య మాణాభివృద్ధిః సన్ జగన్నార్వాగ్ద హిష్యతి ॥ 58

ఉప సంహృతి వాంఛాఽలో యావత్తావ దఘౌఘతః ।
రక్షన్తః సకలాన్ లోకాన్ బిభ్రత్యేతే మదంశజాః ॥ 59

తేషాం మధ్యేచ సర్వేషాం పవిత్రాణాం శుభాత్మనః ।
మమభక్తా విశిష్యంతే స్వయంమాం విద్ధితాన్ విధే ॥ 60

పుణ్యాత్ములగు వారియొక్క భయముచే పాపాత్మకుడగు కలి, తన వైభవము మందగించ, విశృంఖలముగ ప్రవర్తించుటలేదు. 56

ఇంధనమును(కట్టెలమున్నగువానిని) దహించుచున్న యిగ్ని సహితము జలముచే తడుపబడి క్రమముగ మందజ్వలనము కలదై ఒక్కక్షణమున వస్తువును భస్మీకరింప జాలనియట్లే, మహానుభావులైన పుణ్యాత్ముల సాన్నిహిత్యముచే పాపాగ్ని, నివారింప బడిన విజృంభణము గలదై ఒక్కపారిగ జగత్తును దహింప జాలనిదే యగును. 57,58

పూర్వము పేర్కొనినట్లు నాయంశచే పుట్టిన పుణ్యాత్ములు, ఈ లోకమునుపసంహరింప వలయునను సంకల్పము కలుగునంతవరకు (అనగా ఈ జగత్తు భగవత్ సంకల్పముచే లయమొందునంతవరకు) పాపౌఘమునుండి రక్షించుచుందురు. భగవదాయత్త చిత్తులగు భాగవతోత్తముల సాన్నిధ్యము చేతనే లోకములు యాతత్ప్రళయము పాపములనుండి దహింపబడక రక్షింప బడుచున్నవని తాత్పర్యము. 59

ఓ విధీ! ఈ లోకమునగల సమస్త పావన జనులలోను నాభక్తులు మదాత్మకులగుటచే విశిష్టతను పొందుచున్నారని యెరుగుము. 60

మేఘములు, ఘోరదావానలమును ప్రశమింప జేసినట్లు, లోకమున కొందరు

లోకేకేచన మద్భక్తాః స్వధర్మా మృత వర్షిణః ।
శమయన్త్యఘ మత్యుగ్రం మేఘాఇవ దవానలమ్ ॥ 61

ఇమాన్ లోకాన్ గిరీనబ్ధీన్ సాబిభర్తి క్షితి ర్నహి ।
కింతుసర్వేఽప్యమీ, సాచధృతా భాగవతౌజసా ॥ 62

కర్మచక్రంచ యత్ ప్రోక్త మవిలంఘ్యం సురాసురైః ।
మద్భక్తి ప్రవణైర్మర్త్యై ర్విద్ధిలంఘిత మేవతత్ ॥ 63

కథం కర్మాణి బధ్నంతి పద్మగర్భ ! మదాశ్రయాన్ ।
సర్వబంధ హరాస్తేహి మద్బుద్ధ్యా కర్మకారిణః ॥ 64

కర్మరాశిరనంతోఽపి సర్వజన్మార్జితః క్షణాత్ ।
మద్భక్తి వహ్నిశిఖయా దహ్యతే తూలరాశివత్ ॥ 65

నాభక్తులు, భగవద్దాస్యము, భగవదారాధనము, భాగవతోత్తమసేవనము మున్నగు స్వధర్మములను లోకానుప్రాణనమగు నమృతముగ వర్షించుచున్నవారై ఘోరతరమగు పాపమును ప్రశమింప జేయుచున్నారు. 61

ఈ సమస్త లోకములను, పర్వతములును, సముద్రములను, ఈ పృథివి ధరించుటలేదు. కేవలము నాభక్తజనులే వీటినుద్ధరించుచున్నారు. వాస్తవమునకీ పృథివి గూడ భాగవత జనుల ఓజస్సు (బలము) చేతనే ధరింపబడుచున్నది. 62

దేవదానవులకు సహితము దాటరానిదగు నే కర్మచక్రము (కర్మపరంపర) నాచే పూర్వము చెప్పబడినదో అది మద్భక్తులగు జనులచే (మానవులచే) అనాయాసముగ దాటబడినదని యెరుగుము. భగవద్భక్తులే మర్త్యులయ్యును కర్మపరంపరను దాటగలుగుదురని తాత్పర్యము. 63

ఓ కమలగర్భుడా ! నన్నాశ్రయించిన వారిని కర్మము లెట్లు బంధించును? నాచే ననుగ్రహింపబడిన బుద్ధి ననుసరించి కర్మాచరణ మొనర్చిన నాభక్తులు సర్వబంధములను స్వయముగ హరింపగల్గుదురు. శ్రీగీతలో భగవానుడు –

'యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః ।

తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగః సమాచర ॥'

దాస్యో మద్భక్తి కాంతానాం మద్దత్తాః సర్వసిద్ధయః ।
తేహికుర్యుర్య దీచ్ఛంతి జగత్సర్గలయౌ స్వయమ్ । 66

సదా మద్గతచిత్తానాం పశ్యతాం మన్మయం జగత్ ।
వశ్యేంద్రియాణాం క్షమిణాం భక్తానామస్మి సర్వతః । 67

తస్మాత్కలి బలోద్రిక్త పాపాన్నాభైః ప్రజాపతే ।
కైశ్చిన్మహాత్మ భిర్జాతైః తావల్లోకో ధరిష్యతే ॥ 68

'భగవదారాధనా రూపమగు యజనము కంటే వేరుగ స్వప్రయోజన సాధకముగ కామ్యబుద్ధితో నొనర్చెడి కర్మలచే లోకము జనన మరణరూపమగు చక్రమున తగులు కొనుచున్నది. కావున కర్మములను కామ్యబుద్ధితో కాక భగవదారాధనా రూపముగ నొనర్పవలయునని ' చెప్పియున్నాడు. ఇట్లొనర్చుటకు కావలసిన వివేకమును భగవానుడు తానే స్వయముగ ప్రపన్నుల కనుగ్రహింతునని గూడ చెప్పియున్నాడు.

'తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకం ।

దదామి బుద్ధియోగం తం యేనమాము పయన్తితే ।'

ఎవ్వరు నాయందు సంసక్తమైన మనస్సు గలవారై ప్రీతితో నన్ను భజింతురోవారికే బుద్ధియోగము ననుగ్రహింతును. వారునాచే నను గ్రహింపబడిన బుద్ధియోగముతో సంగత్యాగ పురస్సరముగ కర్మాచరణము నొనర్చియు కర్మబద్ధులుగాక నన్నే పొందగల్గుదురు. అని భగవానుడు పార్థవ్యాజమున లోకమునకుపదేశించెను. 64

అనేక జన్మ సమార్జితమగు ననంతమైన కర్మరాశి సహితము, నా యందుగల భక్తియను నగ్నిచే దూదివలె దహింపబడును. 65

నాభక్తియే కాంతగా (కామింపబడునదిగా) గల నాభక్తులకు, సమస్తసిద్ధులు (అణిమమున్నగు నష్టసిద్ధులు) దాసభావమును పొంది యుండును. కావుననే వారే స్వయముగ నిచ్ఛగించినచో లోక సృష్టిలయములనే యొనర్ప జాలుదురు. 66

ఎల్లప్పుడు నాయందే యవిచ్ఛిన్నమగు మనఃప్రవృత్తిగల వారును, ఈ సమస్త జగము భగవదాత్మకముగ దర్శించువారును, వశపరచు కొనబడిన యింద్రియములు గల వారును, క్షమాగుణశీలురయునగు నాభక్తులకు నేను సర్వత్ర సులభుడనే.

నారద ఉవాచ -
శృత్వేతి భక్తకాంతస్య వాక్యం సానంద విస్మయః ।
ప్రణమ్యతం గురుం వేధాః సృష్ట్యాజ్ఞాం శిరసావహత్। 69

అథయజ్ఞవరాహేన భూమిః శృంగే ప్రకల్పితా ।
ప్రసాధితం జగత్ సృజ్య మీదృశం బ్రహ్మసూత్రిణా । 70

సంవాదోఽయం పరంబ్రహ్మ బ్రహ్మణోర్యో మయోదితః ।
యత్ర స్వభక్తమాహాత్మ్యం స్వయమాహ ససర్వదః । 71

అనగా నిరంతర భగవదాయత్తచిత్తులై లోకమంతయు విష్ణుమయమని భావించువారికి భగవానుడు సమస్త వస్తువులందును గోచరించునని తాత్పర్యము. ఇట్లు భగవానుని సర్వత్ర చూడగలుగుటయే సమదర్శనమని శ్రీగీత ప్రతిబోధించుచున్నది. 67

కనుక, ఓ బ్రహ్మ! కలి బలముచే నుద్రిక్తమగు పాపమువలన భయపడకుము. భువిని యావిర్భవించిన మహానుభావులు కొందరిచే నీలోకము ధరింప బడగలదు. అనగా పాపమువలన సంప్రాప్తమైననాశము నుండి రక్షింపగలరని తాత్పర్యము.68

నారదుడు చెప్పినాడు. భక్త.జనులకు కాంతుడగు (భక్తులచే కామింపబడువాడు, మరల కామించువాడు) శ్రీహరియొక్క వాక్యమును విని ఆనందాశ్చర్య సంభరితుడగు బ్రహ్మ, పితయు, తత్త్వోపదేష్టయునగు, భగవానునకు నమస్కరించి సృష్టియొనర్చుమని భగవానుడిచ్చిన యాదేశమును శిరసావహించెను. 69

పిమ్మట యజ్ఞమయదేహుడగు వారాహమూర్తిచే తనకోరలపై భూమి యుద్ధరింపబడినది. అంతట బ్రహ్మ, శ్రీమన్నారాయణుని యాదేశముచేతను, తదనుగృహీతమగు జ్ఞానముచేతను పూర్వసృష్టి నిస్మరించి ఈ సమస్త ప్రపంచమును, సూత్రధారుడు నాటక ప్రయోగమొనరించి నట్లు సృజించెను.

ఇచ్చట బ్రహ్మ-సూత్రధారునిచే పోల్చబడుటచే, బ్రహ్మ కేవలము నాటక ప్రయోక్తయగు సూత్రధారునివంటి వాడే తప్ప వాస్తవ రచయిత కాదనియు, భగవానుడే వాస్తవమునకు సృష్టిరచయితయను 'తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్ ఇత్యాది శ్రుతివచన తాత్పర్య మావిష్కరింప బడుచున్నది. 70

నచాత్ర చిత్రం మునివర్య! శౌనక !
ప్రభోరదేయం నహితస్య కించన ।
శిశోరపి స్వాంఘ్రి జుషః కరోత్యసౌ ।
చతుర్మ్ముఖాదప్యు పరిస్థితం క్షణాత్ ॥ 72

భగవానుడు స్వయమున తన భక్తుల మాహాత్మ్యము నావిష్కరించిన, పరం బ్రహ్మ చతుర్మ్ముఖ బ్రహ్మలకు ఏర్పడిన పరస్పరవాక్ సంవాదమే నాచే నిప్పుడు తెలుపబడినది. 71

ఓ మునిశ్రేష్ఠా ! శౌనకా! భగవానునకు అనుగ్రహింప రానిదేమియులేదనుట యెంతమాత్రము చిత్రముకాదు. ఏలన ఒక్కక్షణమున, తా ననుగ్రహించెనా, తన పాదమును నోటబెట్టుకొని యాస్వాదించు స్వభావముగల స్తనంధయుడగు శిశువును గూడ చతుర్మ్ముఖ బ్రహ్మకంటె సమున్నత స్థానమున నుంచగలడు. తాను శిశురూపమున కారణార్ణవ శాయియై యుండియు సృష్టిసముద్యుక్తుడగు బ్రహ్మకు తత్త్వోపదేశమొనర్చుట యనుతన లీలచే తనసామర్థ్యమును భగవానుడావిష్కరించినాడని తాత్పర్యము72

శ్రీహరికిని, పరమేష్ఠికిని (బ్రహ్మకును) ఏర్పడిన యీవాక్సంవాదము నెవ్వరు శ్రద్ధాళువులై పఠింతురో, విందురో, స్మరింతురో, అట్టివారు భయంకరమగు జననమరణాత్మక భ్రమణమును భేదించుకొని, కాలప్రవాహమును గూడ నతిక్రమించి సుపర్ణునివలె (గరుత్మంతునివలె) భగవంతుని యమృతస్థానమగు పరమపదమును పొందుచున్నారు.

ఇచ్చట మాతృదాస్యవిముక్తికై యమృతమును తెచ్చిన గరుత్మంతుని వృత్తాంతము స్మరింపదగినది. కద్రువచే వంచితయైన తన తల్లి, వినత దాస్యమును పొందగా దాస్యవిమోచన మొనొనర్చుటకు స్వర్గమున కరిగి, అమృత భాండముగల స్థానమునకు పైని నిరంతరము పరిభ్రమించుచున్న చక్రమును గాంచి, తనశరీరమును సూక్ష్మమొనర్చి, ఒక్కసారిగా లోనికి ప్రవేశించి అమృత భాండముతో మరలివచ్చినట్లు మహాభారతాది పర్వమునగల 33 వయధ్యాయమున - (శ్లో. 2 నుండి 24 వరకు)

సంవాదం హరిపరమేష్ఠినో రిమం యః
శ్రద్ధావాన్ పఠతి, శృణోతి, సంస్మరేద్వా ।
భిత్త్వోగ్రభ్రమి మతిలంఘ్య కాలచక్రం
సంప్రాప్నోత్యమృత పదం యథాసుపర్ణః । 73

(ఇతి నారదీయే హరిభక్తిసుధోదయే
హరి-బ్రహ్మసంవాదః పంచమాధ్యాయః ।)

'సచక్రం క్షురపర్యన్తమపశ్యత్ అమృతాంతికే
పరిభ్రమన్తమనిశం ఛేదనం సోమహారిణమ్ ।
అరాన్తరేణాభ్యపతత్ సంక్షిప్యాంగం క్షణేనహ ।
అపేత్యై వామృతం పక్షీ పరిగృహ్యాశు నిఃసృతః ।

ఇత్యాదిగ చెప్పబడినది. గరుడుని పరాక్రమమును గాంచి యాతనిచే స్తుతింపబడిన శ్రీమన్నారాయణునిచే అజరత్వామరత్వముల పొంది గురుడుడు పరమపద పార్షదవర్గమున శ్రీహరివాహనముగ విశేషసమ్మానమును పొందెను.

'తంవవ్రే వాహనం విష్ణుః గరుత్మన్తం మహాబలమ్ ।
ధ్వజంచ చక్రే భగవాన్ ఉపరి స్థాస్యసీతితమ్ ।' (భా. ఆది. 33/16)

ఈ విధముగ సుపర్ణుడు పైని భ్రమించు చక్రమును ఛేదించి భగవద్వాహన భాగ్యమును పొందినట్లు, భగవత్పరమేష్ఠి సంవాదమును శ్రద్ధతోవిన్న వారును, పఠించి, స్మరించినవారును భగవత్పదనమును, సంసారచక్రముభేదన పురస్పరముగ పొందుదురని తాత్పర్యము. 73

ఇది నారద పురాణాంతర్గతమగు హరిభక్తిసుధోదయమున,
హరిబ్రహ్మ సంవాదరూపమగు పంచమాధ్యాయము ।

# షష్ఠాధ్యాయము
## (ధ్రువోపాఖ్యానము)

**షష్ఠాధ్యాయసారము :–** ఈ యధ్యాయము నారంభించి యుపాఖ్యానముఖముగ, శ్రీహరి కృపాద్యపారగుణ యశోవర్ణము చేయబడుచున్నది. 6,7 అధ్యాయములలో ధ్రువోపాఖ్యానము నిబంధింపబడినది.

'గుణాః పూజాస్థానం గుణిషు నచలింగం, నచవయః'

గుణములే ఏ వ్యక్తికైనను గౌరవము నాపాదించునవి. వానివయస్సు గాని, స్త్రీ పురుషాది భేదముగాని యెంతమాత్రము ప్రయోజకము కాదు. పిన్నవాడయ్యును ధ్రువుడు, శ్రీహరి యందలి యచంచల భక్తిచే కల్ప ధ్రువస్థానమును పొందగలిగినాడు. ఉత్తానపాదుని భార్యలలో సురుచి, సునీతులను వారిలో, సునీతిపుత్రుడైన ధ్రువుడు, సభలో తన తండ్రి యొడిలో తన సోదరుడు కూరుచుండుటచూచి, బాల్యసహజమగు కౌతుకము వలన తానును నట్లు కూరుచుండ నెంచియు, సవతితల్లిచే తిరస్కృతుడైనాడు. తల్లికి తన మనోవేదనను నివేదించి, శ్రీహరి పరిచరణమే తనకు అవశ్యకర్తవ్యమని తల్లిచే బోధింప బడినవాడై శ్రీహరిని గూర్చి తపమొనరింప కడంగినాడు. ఈ సందర్భమున సురుచి తన పుత్త్రుని ప్రతిబోధించిన ప్రకారము – తల్లులందరికి శిరోధార్యము.

'నాస్మాభి రర్చితో విష్ణుః బీజం సకల సంపదామ్'।

సమస్త లౌకికా లౌకిక సంపదలకు శ్రీమన్నారాయణుడే మూలమనియు, శ్రీహరిని పూర్వమర్చింపనివారే యిప్పుడు సంపద్విహీనులై యాపదల క్లేశముల పడుచున్నారనియు, ఎవ్వరిప్పుడు శ్రీహర్యనుగ్రహముచే సంపదల నను భవించుచున్నారో వారును ఈ జన్మమున శ్రీ మహావిష్ణువు నర్చింపనిచో సంపదల కోల్పోవుదురనియు సూచింపబడినది. లౌకికము, అలౌకికమునైన స్థానము నే ప్రాణియైన పొందదలచినచో శ్రీహర్యారాధనమ పరిహార్యమని యీ యధ్యాయము నిష్కర్షించుచున్నది. అప్రగల్భుడు, ఉపాసనాక్రమము నెరుగగల భావనా పటిమలేనివాడును, మృదుల శరీరుడు నైన ధ్రువుడే యకుంఠిత తపమొనర్చి, శ్రీహరి సాక్షాత్కారము నొంది "ధ్రువ" పదమును పొందినప్పుడు, విద్యాసంపన్నులు, సాధన సంపత్తి కలవారు, సమర్థులావిధానము ననుసరింపక పోవుట యాత్మహత్యా సదృశ్యమని వ్యక్తపరుపబడినది. ధ్రువునకు సప్తర్షులు – వాసుదేవ మంత్రమునుపదేశించుటయు, నాతడా మంత్రమును పూనికతో జపించి, ధ్యాన నిష్ఠుడై మొదట హృదయముననను, తరువాత ప్రత్యక్షముగను, భగవత్సాక్షాత్కారము నొందుటయు చెప్పబడినది. భగవానుడు మంత్రాధీనుడనియు, ఆ మంత్రము ఆచార్యా ధీనమనియు– కావున ఆచార్యాను గ్రహము వడసి మంత్ర దీక్షితుడైన వానికి భగవానుడు కరతలామలక మగునని యీ యధ్యాయసారము.

శ్రీ నారద ఉవాచ –
శ్రుణు శౌనక! భూయోఽపి భక్తకల్పతరోర్యశః ।
విష్ణోర్గాయంతి యద్ వృద్ధాః స్మరన్తి చ జపన్తి చ ॥ 1

వాసుదేవం పరం జప్యం జప్త్వా ప్రాపపురార్భకః ।
ధ్రువః కల్పధ్రువం స్థానం బ్రహ్మాదిదివిజోపరి ॥ 2

శ్రీనారదముని పల్కెను. ఓ శౌనకమునీ! భక్తజనుల కామనల నీడేర్పజాలు కల్పవృక్షమైన శ్రీహరి యశమును, నిరంతర భగవదాయత్త చిత్తులగు భాగవతోత్తములచే గానమొనర్పబడి, స్మరింపబడి, జపింపబడిన దానిని మరల విన్నవించెదను. వినుము. 1

నిరంతర ధ్యేయుడు పరవాసుదేవుడగు గోలోక వృందావన చారిని పూర్వము శిశువగు ధ్రువుడు సహితము, అనన్య భక్తిభావిత చిత్తుడై ధ్యానించి బ్రహ్మాది దివిజ శ్రేష్ఠులకు గూడ దుర్లభమైన సమున్నత స్థానమును స్థిరముగ పొందినాడు.

క్రిందటి యధ్యాయమున 72వ శ్లోకమున – 'శిశోరపి స్వాంఘ్రిజుషః కరోత్యసౌ చతుర్ముఖాదప్యుపరిస్థితం క్షణాత్' భగవానుడను గ్రహించినచో నొక్కక్షణమున శిశువును సహితము బ్రహ్మస్థాన మతిక్రమించు నట్లొనర్పగలడని చెప్పబడిన దానికి నిదర్శనముగ నిచ్చట మరల కల్పధ్రువమగు (కల్పాంతములైనను చెదరని) ధ్రువస్థానమును ధ్రువున కనుగ్రహించినాడని తెలుపబడినది. ఇది ధ్రువోపాఖ్యానారంభము.

ఇచ్చట ' పరం వాసుదేవం ' అను దానిచే రామాద్యవతారములకు మూలమై నిత్యప్రకాశశీలుడు, పరమాత్మ, గోలోక వైకుంఠవాసి 'పరవాసుదేవ 'నామసంకీర్త్యుడగు శ్రీహరి, అవతారి, కీర్తింపబడుచున్నాడు. శ్రీగీతలో –

'బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।
వాసుదేవః సర్వమితి సమహాత్మా సుదుర్లభః ॥'

ఇత్యాదిగ నిర్దేశింపబడిన వాసుదేవుడును, శ్రీమద్రామాయణమున –

యస్యేయం వసుధాకృత్స్నా వాసుదేవస్య ధీమతః ।
మహిషీ మాధవస్యైషా స ఏవ భగవాన్ ప్రభుః ॥ (శ్రీరామా. బాల. 40వసర్గ)

ఇత్యాదిగ కీర్తింపబడిన వాసుదేవుడును, ఈ అవతారియే (అవతారములన్నిటికి మూలమైన

ఆసీదుత్తానపాదాఖ్యో దత్తాంఘ్రిః శత్రుమూర్ధసు ।
రాజా సద్రక్షణే విష్ణుః, స్వయంరుద్రోఽసతాం క్షయే ॥ 3

ధన్యః కింవర్ణ్యతేరాజా సయస్యాసీద్ధ్రువః సుతః ।
వైష్ణవస్వజనత్వం హి మహతస్తపసః ఫలమ్ ॥ 4

తస్యనీతి జుషోఽప్యాసీ త్సునీతిర్న ప్రియాసతీ ।
సురుచిస్తు ప్రియా, కోవా నిర్దోషోగుణ సంశ్రయః ॥ 5

తస్యధర్మవిదః కాలాత్ సునీత్యామప్రియః సుతః ।
ఆసీద్ధ్రువః ప్రియోవిష్ణోః, సురుచ్యా ముత్తమః ప్రియః ॥ 6

భగవానుడే). ఈ వాసుదేవుని గురించియే విష్ణుపురాణాదులు నిర్వచనము నిటుల తెలుపుచున్నవి.

'సర్వత్రాస్తే సమస్తంచ వసత్యత్రేతి వైయతః ।
తతస్స వాసుదేవేతి విద్వద్భిః పరిపఠ్యతే ॥'

అంతట నాభగవానుడుండును గనుకను, అంతయు ఆ భగవానునియందే యుండును కావునను ఆ భగవానుడు వాసుదేవ శబ్దముచే శబ్దబ్రహ్మ వేత్తలచే కీర్తింపబడుచున్నాడు. ఆ భగవానుడే వసుదేవుని పుత్రుడై, యావిధముగ గూడ వాసుదేవ నామాన్వర్థతను పొందినాడు. 2

శత్రువుల శిరస్సులందుంచ బడిన పాదములు గలిగి యుత్తాన పాదుడని పిలువబడురాజు కలడు. ఆతడు, సాక్షాత్తు, సజ్జన రక్షణమున విష్ణువు, దుర్జన భక్షణమున రుద్రుడునయి యున్నాడు. 3

ఎవ్వని కుమారుడు ధ్రువుడో యట్టిరాజు ధన్యుడు కదా? ఆతని గొప్పతన మేమని వర్ణింపనగును? పరమ భాగవతోత్తముడగు వైష్ణవుని (విష్ణుభక్తుని) బాంధవ్యమే మహాతపః ఫలము కదా! 4

నీతిమంతుడగు నారాజుకు పతివ్రతయగు 'సునీతి' (అనుభార్య) ప్రేమాస్పద కాదయ్యెను. 'సురుచి' (ఈమె రెండవ భార్య) మాత్రము ప్రేమాస్పదయయ్యెను. ఎంతగుణ సంపన్నుడైనను దోషములేని వాడుండునా ? 5

కదాచిత్ పితురుత్సంగే దృష్ట్వా సురుచిజం ధ్రువః ।
లాల్యమానం ప్రియం బాలః స్వయంచైచ్ఛ త్తథాస్థితిమ్ ॥ 7

స్త్రైణః స నాభ్య నందత్తాం ప్రియాయాః పరతో భయాత్ ।
జ్ఞాత్వాథ తస్యతం భావం సురుచిః గర్వితాఽభ్యధాత్ ॥ 8

వత్సాఽతిహ్రస్వకస్త్వేష తవాత్యుచ్చైర్మనోరథః ।
ఏవంచే న్మత్సుతత్వాయ కింనతప్తం తపస్త్వయా ॥ 9

శ్లాఘ్యోఽపి మత్సపత్న్యాస్త్వం గర్భవాసేన దూషితః ।
రాజ్ఞా నాద్రియతే యద్వత్ బ్రాహ్మణః కీకటోషితః ॥ 10

ధర్మవేత్తయగు నా యుత్తానపాదునకు సునీతి యను భార్యయందు, తనకు ప్రేమాస్పదుడు కాకున్నను, విష్ణువునకు ప్రియుడైన ధ్రువుడను పేరుగల కుమారుడు కల్గెను. సురుచి యందు మాత్రము ప్రేమాస్పదుడైన యుత్తముడను పుత్రుడు కల్గెను. 6

ఒకానొకప్పుడు తండ్రియొక్క తొడపై లాలింపబడుచు, ప్రేమాస్పదుడైన సురుచి పుత్రుని, బాలుడగు ధ్రువుడు చూచి తానుగూడ నట్లే తండ్రి తొడపై కూరుచుండ నిచ్ఛగించెను. 7

అచ్చటగల స్త్రీ సమముదాయ మా బాలుని హృదయాభి ప్రాయమును, సురుచివలన భయముచే నంగీకరింపదయ్యెను. సురుచియు నాబాలుని యభిప్రాయము నెరిగి గర్వముగ నిట్లు పలికెను. 8

వత్సా! పొట్టివాడవైనను నీ కోరిక సమున్నత మైనదే. ఇట్టి కోరిక యున్నచో నాకు పుత్రునిగ బుట్టుటకు తప మేల జేయవైతివి ? (నాకు పుత్రుడైన వానికే యట్టి అర్హత కలదని యభిప్రాయము). 9

జాతిచే సమ్మానింపదగు బ్రాహ్మణుడయ్యును 'కీకట' మను నింద్యప్రదేశమున నివసించుటచే దూషింపబడినట్లు, శ్లాఘ్యుడవయ్యు నీవు నా సపత్ని (సవతి) యొక్క గర్భమున పడితివి గాన దూషింపబడి, తండ్రిచే నాదరింప బడవైతివి. 10

రాజుకు పుత్రుడవై పుట్టియు, నా సవతికి జన్మించి నందున నప్రియుఢ వైతివి.

ఆత్మజోఽప్యస్యన్నృపతేస్తస్యాః జాతోఽసి దుర్భగః ।
సుబీజాన్యపి శస్యాని దూష్యేయుః క్షేత్రదోషతః । 11

ఇమం హి నృపతేరంకం మహోన్నత పదం ధ్రువ ।
సుభగోర్హతి మత్పుత్రో భవితా యో ధరాపతిః । 12

ఉక్తస్తయే త్యనుచితం సమ్మతస్యపితుః పురః ।
బాలః సామర్షదుఃఖాశ్రుధౌతోరురజసాయయౌ । 13

గత్వా మాతుర్గృహం పృష్టః సతయోద్విగ్నయా భృశం ।
ప్రవృద్ధ రోదనః ప్రాహ చిరాత్ సురుచి దుర్వచః । 14

సపత్న్యాః తద్వచః శ్రుత్వాలతా పుష్టేవ వహ్నినా ।
వ్యథితాఽపి ధృతింబద్ధ్వా సునీతి రవదచ్ఛనైః । 15

వత్సాశ్వసిహి భద్రంతే సురుచిః ప్రాహయద్వచః ।
సత్య మేతన్న తన్మిథ్యా మందభాగ్యోఽసి మా ఖిద । 16

మంచి బీజముల పుట్టిన పంటలైనను, క్షేత్రదోషముచే దూషింపబడును గదా11

ఉత్తమ స్థానమైన యీనృపతి యొక్క తొడపై, భవిష్యత్తున భూపతికాదగు నా పుత్రుడే అధిష్ఠింప నర్హుడు. 12

తండ్రి యెదుట నిట్లనుచితముగ పలుకబడిన బాలుడగు ధ్రువుడు, రోషము, దుఃఖము, పెనవేసికొని కన్నుల జాలువారిన స్వచ్ఛాశ్రువులచే కడుగబడిన దేహధూళి కలవాడై వెడలి పోయెను. 13

తల్లికడకేగి, యుద్విగ్న హృదయయగు నామెచే పలువిధముల నడుగబడిన వాడై, బిగ్గరగానేడ్చుచు,ఎట్టకేలకు సురుచియాడిన దుష్టవచనముల తెలిపెను.14

తన సవతి యాడిన మాటలను విని, అగ్నిచే, దహింపబడిన లతవలె పరితాపమును చెందియు, ధైర్యము వహించి, 'సునీతి' మెల్లగ నిట్లనెను. 15

నాయనా! కుమారా! ఊరడిల్లుము. నీకు మంగళమగును గాక. నీతో సురుచి పలికిన మాట సత్యమేగాని, మిథ్యకాదు. దురదృష్టవంతుడవైన నీవు దుఃఖింప వలదు. 16

నాస్మాభిరర్చితో విష్ణుః బీజం సకల సంపదాం ।
తస్మాదాత్మాపరాధోఽయం క్షంతవ్యః కస్యఖిద్యతే । 17

పురానార్చిత లక్ష్మీశైరనాథైః కృపణైరిహ ।
అచికిత్స్యాపదః ప్రాప్తాః తూష్ణీం భోజ్యాహి ధైర్యతః । 18

త్యజ మన్యుం గురుర్భూపో, మాతాచ సురుచిస్తవ ।
యాఽభూత్ సుతపసా రాజ్ఞో గౌరీవేశస్య వల్లభా । 19

నీచైః గురుమనువర్తేథాః ! తదేవాయుష్కరం తవ ।
అయోగ్యో మత్సుతో భూత్వా నృపాంకం కథమిచ్ఛ సి । 20

అథాధిక్యం సపత్నేభ్యో పీచ్ఛస్యర్చయతం హరిమ్ ।
యత్ప్రసాద ఫలం ప్రాహుః బ్రహ్మాదీనామపిశ్రియః । 21

శ్రుత్వేతి సహసాహృష్టః సధీమాన్ ప్రాహమాతరం ।
సిద్ధార్థో స్మ్యద్య యద్యస్తి కశ్చిదాశ్రిత కామధుక్ । 22

మనచే సకల సంపదలకు హేతువైన శ్రీమహావిష్ణువు అర్చింప బడలేదు. కనుక నిది స్వాపరాధమే, సహింపకతప్పదు. దీనికి ఎవరు కారణమని దుఃఖింతుము?17

పూర్వము లక్ష్మీపతిని సేవింపని యనాథులు, దీనులునైన మనచే విచారింప రానియిట్టి యాపదలు పొందబడినవి. ధైర్యముతో మిన్నక యుండి వీటిననుభవించుట తప్ప చేయదగిన దేమియులేదు. 18

నృపతి నీతండ్రి, సురుచి నీతల్లి, పరమేశ్వరునకు గౌరివలె, తనతపస్సు చేతనే నీతండ్రికి ఆమె ప్రేమాస్పదయై నది. కావున వారిపట్ల కోపమును విడువుము19

పెద్దలయెడ నమ్రుడవై వర్తింపుము. అదియేనీ కాయుర్వర్ధకము. నా కొడుకు వైపుట్టి యోగ్యతను కోల్పోయిన నీవు, నృపుని తొడపై కూరుచుండ నెట్లిచ్ఛగించితివి. 20

నీ ప్రత్యర్థుల కంటె నీకు గొప్పతనము కావలయు నన్నచో శ్రీహరిని, ఆరాధించుము. అతని యనుగ్రహము వలననే బ్రహ్మాదులకు సహితము సంపదలు సిద్ధించినవని పెద్దలు చెప్పుదురు. 21

అద్యైవ సకలారాధ్యం సమారాధ్య జగత్పతిం ।
స్థాన మిష్టం లభే సోఽస్తు నృపాంకో భ్రాతు రేవమే ॥ 23

సత్యమాత్థ, నమత్సూనోర్నృపాంకో యోగ్య ఇత్యదః ।
స్థానం యోగ్యంతు త్వత్సూనోః మమ సర్వ సురోపరి ॥ 24

యత్ స్థానం మత్ సపత్నా నామన్యే షాంవా తపస్వినామ్ ।
మనోరథైర లభ్యం యత్ తల్లేభేత్వత్సు తస్త్వహమ్ ॥ 25

శ్రీ నారద ఉవాచ –
ఇత్యుక్త్వాచరణే మాతుః ప్రణమ్య శుభగో ధ్రువః ।
ప్రయయౌ సత్పతిం దేవమారాధయితు ముత్సుకః ॥ 26

ఈ మాటలు విని వెంటనే యానందించిన యాధీశాలియగు ధ్రువుడు తల్లితో నిట్లనెను. 'ఆశ్రయించిన వారి కామన లీడేర్పజాలిన కామధేనువున్నచో నా ప్రయోజనము సిద్ధించినట్లే కదా! 22

ఈనాడే సకలారాధ్యుడైన జగత్పతియగు శ్రీహరి నర్చించి నాకిష్టమైన సమున్నత స్థానమును పొందెదను. నాతండ్రితొడ సోదరునకే యగును గాక. 23

అమ్మా! నీ కుమారుడనగు నాకు, రాజాంకము (రాజుతొడ) యోగ్యముకాదని నీవన్నది సత్యమే. నాకు సర్వదేవతల పైగల సమున్నతమైన ప్రదేశమే యోగ్యమైనది. 24

ఏ సమున్నత స్థానము నా ప్రత్యర్థులకును, తాపసులకును సహితము కోర్కులగూడ పొందరానిచో అట్టిస్థానమును నీపుత్రుడు పొందినాడని యెరుగుము. (తప్పక పొందగలడని తాత్పర్యము) 25

శ్రీ నారదముని పల్కెను. ఇట్లు పలికి, శుభాస్పదుడగు ధ్రువుడు తల్లి యొక్క పాదములకు మ్రొక్కి సజ్జన పరిపాలకుడగు శ్రీహరి నారాధింప నుద్యుక్తుడైయు త్సాహముతో వెడలెను. 26

ఇట్లు బయలుదేరిన ధ్రువుడు పట్టణపు టుద్యానవన సమీపమున మహాతేజస్వులగు

స్వపురోపవనేదృష్ట్వా సప్తర్షీన్ సుమహౌజసః ।
ప్రసాదం భక్త కాంతస్య విష్ణోర్మేనే తదాత్మని ॥ 27

నత్వాతేభ్యః స్వవృత్తాంతం నివేద్యచ పృథక్ పృథక్ ।
హరి మర్చ్యతమం జ్ఞాత్వా ప్రాప్తమంత్రో ముదాయయౌ ॥ 28

హిరణగర్భ పురుష ప్రధానావ్యక్త రూపిణే ।
ఓం నమో వాసుదేవాయ శుద్ధజ్ఞాన స్వరూపిణే ॥ 29

ఇమం సర్వార్థదం మంత్రం జపన్ మధువనే తపః ।
సచక్రే యమునా తీరే మునిదృష్టేన వర్మనా ॥ 30

సప్తర్షుల గాంచి భక్తప్రియుడగు శ్రీహరి యనుగ్రహమే యదియని లోన తలంచెను.

ఏదేని మంచిపని తలపెట్టి ప్రయత్నమునకు కడంగినప్పుడు అనుకోకుండగ పెద్దలదర్శనమగుట, ప్రయత్న సాఫల్యమునకు ద్వారమేననిసూచింపబడినది.27

వారికి నమస్కరించి,తన వృత్తాంతమును వారికి వేరువేరుగ నివేదించి, శ్రీహరియే యత్యంతారాధ్యుడని యెరిగి, వారినుండి మంత్రమును పొంది సానందముగ వెడలెను.

ఇచ్చట, మంత్రద్వారముననే భగవదుపాసన మొనర్పవలయుననియు, ఆ మంత్రము మంత్ర సిద్ధులైన యాచార్యులవలన పొంద దగినదనియు సూచింపబడినది. 28

ఈ శ్లోకమంతయు ధ్రువునకు మహర్షులుపదేశించిన మంత్రమే. హిరణ్యగర్భుడు (బ్రహ్మ) పురుషుడు, ప్రధానము, అవ్యక్తము అనునవి రూపముగ గలవాడును, శుద్ధమగు జ్ఞానమే స్వరూపముగా గలవాడుననగు వాసుదేవునకు నమస్కారమని మంత్ర తాత్పర్యము. 29

సర్వకామప్రదమైన యీ మంత్రమును, యమునా తీరమున గల మధువనమున జపించుచు మహర్షి దర్శితమగు మార్గమున ధ్రువుడు తపమొనరించెను. 30

శ్రద్ధాన్వితేన జపతాథ జప ప్రభావాత్ ।
సాక్షా దివాబ్జ నయనో దదృశే హృదీశః ।
దివ్యాకృతిః సపదితేన తతః స ఏవ
హర్షాత్ పరశ్చ జపతా సకలాత్మ భూతః ॥ 31

పశ్యన్ ధ్రువః సవిభు మేక మశేష దేశ
కాలాద్యుపాధి రహితం ఘన చిత్ప్రకాశమ్ ।
ఆత్మానమప్యథ పృథక్ నవివేద తస్మిన్
విష్ణౌ నివేశిత మనా నజజాప భూయః ॥ 32

శ్రద్ధాన్వితుడై జపమొనర్చుచున్న యాధ్రువునిచే, వెంటనే హృదయమందు పుండరీకనయనుడు, దివ్యమంగళ విగ్రహుడు, సకల జీవుల కంతరాత్మ యైనవాడునగు శ్రీహరి కన్నులముందు సాక్షాత్కరించిన విధముగ జపప్రభావముచే స్పష్టముగ గోచరించినాడు. ధ్రువునకు జపప్రభావమున శ్రీహరి హృదయమందు గోచరించినాడని తాత్పర్యము. 31

అంతట నాధ్రువుడు హృదయమున సాక్షాత్కరించిన, విభుడును, నిఖిదేశకాలాద్యుపాధులు లేనివాడును, విజ్ఞాన ఘనముగ ప్రకాశించు వాడును, అయిన శ్రీహరిని దర్శించి, ఆ విష్ణుని యందే మనస్సును లయముచేసి తనను తాను వేరుగ తెలియక, మంత్రజపమును గూడ తన్మయత్వమున మరచిన వాడాయెను. 32

ధ్రువుని మనస్సు ధ్యానవశమున అసమాన నిర్వృతి సాగరమున నిమగ్నము కాగా ఆతడు బాహ్యమగు శరీర విషయము నెంత మాత్రము తెలియ జాలడయ్యెను. ఆకలి, దప్పిక, వాయువు, వర్షము, మిక్కిలివేడిమి, మున్నగు, శరీర దుఃఖములెవ్వియు నాతని స్పృజింప జాల వయ్యెను. 33

క్షుత్తర్ష వాతఘన వర్షమహోష్ణజంచ
శారీర దుఃఖకుల మన్యనకించ నా భూత్ ।
మగ్నే మనస్యనుపమేయసుఖాంబురాశౌ
రాజ్ఞః శిశుర్నహి వివేద శరీరవార్తాః । 33

విఘ్నాశ్చతస్య కిల శంకిత దేవసృష్టా
బాలస్య తీవ్ర తపసో విఫలా బభూవుః ।
శీతాతపాదిరివ విష్ణుమయం మునింహి
ప్రాదేశికాన్న ఖలు ఘర్షయితుం క్షమంతే । 34

(ఇతి శ్రీ నారదీయే హరిభక్తి సుధోదయే ధ్రువచరితే షష్ఠోఽధ్యాయః । )

ఈతని తపస్సును జూచి శంకించిన దేవతలచే కల్పింపబడిన విఘ్నములన్నియు, తీవ్రముగ తపమొనర్చుచున్న ధ్రువునియెడ నిష్ఫలములయ్యెను. శీతలత్వము, వేడిమి, గల ప్రదేశములందు నివసించు వారిని అభ్యాస వశమున శైత్యాదులు బాధింపనట్లే విష్ణునియందు తన్మయమైన మనస్సుగల ధ్రువుని శీతాతపములు గూడ బాధింపవయ్యెను. 34

ఇది నారదీయ పురాణమునగల హరిభక్తి సుధోదయమున
ధ్రువచరితము నందలి షష్ఠాధ్యాయము.

# సప్తమాధ్యాయము

**సప్తమాధ్యాయసారము :–** ఇట్లు సప్తర్షుల మంత్రోపదేశముచే శ్రీహరిధ్యాన నిష్ఠుడై హృదయమున భగవన్మూర్తిని సాక్షాత్కరించుచున్న ధ్రువుని యను గ్రహింపనెంచి, శ్రీమన్నారాయణుడు పరితుష్టాంతరంగుడై ఖగేంద్ర తురగము నెక్కి యచ్చోటున కరుదెంచెను. నిరంతరమునిజన శిరస్సంసేవిత పాద కమలుడును, వర్షామేఘ సదృశవినీల దేహుడును, ఉరఃస్థలాంలకృత కౌస్తుభమణి ప్రతిబింబిత నిఖిలలోకుడును, కరుణోత్తరంగితహృదయుడును, వివిధ దివ్య రత్న విభూషా భూషిత దేహుడును, స్వోపసేవమాన భక్తజన జ్ఞానపుణ్యాయశః శ్రీ సమాన నఖకాంతి కాంత చరణయుగళుడును, నిజశుభ్ర దంత చంద్ర చంద్రికా సమాధౌతభక్తజనతపఃక్లిష్టదేహరజస్కుడునునగు శ్రీమన్నారా యణుడు సాక్షాత్కరించి, వరమును కోరికొమ్మని యడుగగా ధ్రువుడు, క్షణకాలము, కింకర్తవ్యతా విమూఢుడై కన్నుల వెంట నానందాశ్రువులు జాలువార సాష్టాంగ ప్రణామమొనర్చినాడు. భక్తజన సులభుడగు భగవానుడు, ధ్రువుని భుజముల బట్టుకొని లేవనెత్తి, బిగ్గకౌగలించి – 'నాయనా! నాచేనాయాస పెట్టబడితివికదా!' యనుచు, వరము కోరికొమ్మన, ధ్రువుడు, భగవత్ సంస్తవన శక్తి ననుగ్రహింప వేడెను. అంతనా భగవానుడు మూర్తీ భూత మహావిజ్ఞానమగు స్వశంఖముతో ధ్రువుని వక్త్రాబమును స్పృశింప, విధూత సమస్త మోహుడగు ధ్రువుడు స్తుతించెను. 18వ శ్లోకమునుండి 28 వశ్లోకమువరకు గల ధ్రువకృతమగు స్తవనము పరతత్త్వ స్వరూప నిష్కర్షకమై, వివిధ శ్రుతిస్మృతి పురాణాగమసార భూతమై, హృదయావర్జకము. భగవానుని ధ్రువుడు యితరములైన కోరికలు కోరక, శ్రీహరిపద పుండరీకముల యందు తనకచంచలమగు భక్తి యుండవలయునని మాత్రమే కోరినాడు. శ్రీహరి యథాభిలషిత మను గ్రహించినాడు.

'త్వాం మోక్షబీజం శరణం ప్రపన్నః'

ఇత్యాదిగ ఆరంభమున పరిమిత ప్రయోజనముతో నున్న ధ్రువుని తపము తుదకు, ఆతని ముముక్షుత్వమును, ప్రపన్న శిరోమణిత్వమును ఫలింప జేసినదని యీ యుపాఖ్యానము నొడువుచున్నది. శ్రీహరిని ధ్యానించి యుపాసించువారికి మోక్షము, భగవత్ప్రేమ– ఏతదతిరిక్తమైన యాచనీయ మేదియు లేదని యీ యధ్యాయసారము.

శ్రీ నారద ఉవాచ –
అథభక్త జనప్రియః ప్రభుః శిశునా ధ్యాన బలేన తోషితః ।
వరదః పతగేంద్ర వాహనో హరిరాగాత్ స్వజనం సమీక్షితుమ్ ॥ 1

ముని పింజర మౌలిలాలితో, విలసద్రక్త ఘనాఘనద్యుతిః ।
సబభావుదయాద్రి మత్సరాద్ధృత బాలార్క ఇవాసితాచలః ॥ 2

విలసన్ముఖమస్య కుండలద్వయరశ్మిచ్ఛురితాంతరం దధౌ ।
వికటోదిత బాల భాస్కరద్వయ ఫుల్లాంబుజ కాంతిముత్తమామ్॥ 3

నరరాజ కౌస్తుభమణీంద్ర బింబితం
సకలం ధ్రువస్య పురతో జగద్దధత్ ।
స్వజనప్రియః కరుణయా నిజంవపు
ర్ధృత విశ్వరూపమివ దర్శయన్ విభుః ॥ 4

చిత్రరత్నమయ భూషణై ర్విభోః పీనవృత్త వితతాస్తదా భుజాః ।
తస్య సేవక సమీహితప్రదాః కల్పవృక్ష విటపాః ఫలైరివ ॥ 5

శ్రీ నారదముని పల్కెను. పిమ్మట శిశువగు ధ్రువునిచే ధ్యానబలముచే సంతోషింప జేయడబడిన వరదుడు(వరములనిచ్చువాడు) భక్తజనులకు ప్రియమైనవాడు (భక్తజనుల పట్ల ప్రీతిగలవాడును) అయిన శ్రీహరి, గరుడ వాహనుడై స్వాశ్రిత జన దర్శనమునకై యరుదెంచెను. 1

ముని జనుల పింగళ జటా భరితములైన శిరములచే ప్రణామలాలితుడై యెర్రని రంగుడాలు, (ఎరుపు డాలు) గల నల్లని మేఘము వలె నొప్పుచు ఉదయాద్రియందలి మాత్సర్యముచే స్వయముగ బాల సూర్యుని ధరించిన కాటుక కొండవలె నా శ్రీహరి ప్రకాశించెను. 2

రెండు కర్ణముల ధరించిన కుండలముల రత్నకాంతులచే ప్రకాశించుచున్న శ్రీహరి వదనము, యిరువైపుల నుదయించిన రెండు బాలసూర్య బింబములు గల వికసిత పుండరీకపు సర్వోత్తమ సౌందర్యమును ధరించుచుండెను. 3

స్వాశ్రిత జనప్రియుడగు శ్రీహరి తన వక్షఃస్థలమున ధరింపబడిన కౌస్తుభమణి

శ్రీమదంఘ్రియుగలం బభౌ విభోః
స్వచ్ఛయా నఖరుచా నిషేవితమ్ ।
నిత్యమానతజనోప లభ్యయా
జ్ఞానపుణ్య యశసామివ శ్రియా ॥ 6

స రాజ సూనుం, తపసి స్థితం, తం
ధ్రువం, ధ్రువస్నిగ్ధదృగిత్యు వాచ ।
దంతాంశు సంజ్ఞై రమృత ప్రవాహైః
ప్రక్షాలయన్రేణు మివాస్య గాత్రే ॥ 7

యందు ప్రతిబింబించిన సమస్త జగత్తును ధరించుచున్నవాడై, కరుణతో తనదేహమును విశ్వరూపమును ధరించుచున్నట్లు, దర్శింప జేయుచున్నవాడై విభుడగు నా భగవానుడు ప్రకాశించెను. 4

చిత్రముగ ప్రకాశించుచు రత్నములతో గూడిన యలంకారములచే నలంకరింపబడి, దృఢముగ బలిసి, గుండ్రముగ, దీర్ఘములై యున్న, భగవానుని భుజములు, ఫలములతో గూడిన కల్పతరుశాఖలవలె, తన్నారాధించువారి కోరికల దీర్చున వైయున్నవి.5

శ్రీహరి పాదద్వంద్వము, నిరంతరము భగవదాయత్తమైన మనస్సు గల్గి, దాసభావమును పొందిన భక్తజనులచే పొందనగు జ్ఞానపుణ్యయశస్సుల (జ్ఞానము, పుణ్యము, కీర్తియను, మూడిటి యొక్క) సంపదవలె, స్వచ్ఛమైన నఖకాంతిచే (గోళ్లయొక్క కాంతిచే) సేవింప బడుచున్నదై భాసించుచున్నది. 6

ఇట్లు దివ్యమంగళ విగ్రహముతో సాక్షాత్కరించిన శ్రీమన్నారాయణుడు, స్వచ్ఛములైన దంతముల కాంతులే యమృతపు జాలులు కాగా నాతని మేని రజమును కడుగుచు, తపోనిష్ఠుడగు ధ్రువుని స్థిరముగ ప్రేమగ జూచి యిట్లనెను. 7

కుమారా! నీమనస్సునగల శ్రేష్ఠమగు వరమును కోరికొమ్ము. ధ్యానాన్వితము, ఇంద్రియ నిగ్రహ యుతము, దుష్కరమైన చిత్తవృత్తి నిరోధముతో కూడినది యునైన నీ తపస్సుచే పరితుష్టి నొందితిని.

ఈ శ్లోకమున తపస్సునకు మూడు విశేషణములు వేయబడినవి. 1. ధ్యానాన్వితము. 2. ఇంద్రియ నిగ్రహముకలది. 3. దుష్కరమైన చిత్తవృత్తి నిరోధముతో కూడినది అని.

వరం వరం వత్స! వృణుష్వయస్తే
మనోగతస్త్వత్తపసాస్మి తుష్టః ।
ధ్యానాన్వితే నేంద్రియ నిగ్రహేణ
మనో నిరోధేన చ దుష్కరేణ । 8

తీర్థాప్లవ స్తీవ్ర తపోవ్రతేజ్యా
తోషాయ మే, సత్యమయ శ్చ పంథాః ।
కింత్వేషు దూరే నిగృహీత చిత్త
ధ్యానం క్షణం వాపి తదేవ తుష్ట్యై । 9

తపస్సునకు ప్రధానమైనది ధ్యానము. అనగా ధ్యేయమైన భగవత్ స్వరూపమందు మనస్సు నిలకడగ లగ్నమొనర్చి చింతన మొనర్చుట. ఇది కుదరవలెనన్న, ఇంద్రియముల నిగ్రహణ మావశ్యకము. ఇంద్రియ నిగ్రహమనగా చక్షుః శ్రోత్రాదీంద్రియముల వాటి వాటి విషయములపై పోరకుండ నియమించుట. మనస్సు నరికట్టినప్పుడే తదధీనములగు నింద్రియములు వశపడును. కనుకనే 'మనోనిరోధేన' అనుదానికి 'దుష్కరేణ ' అను విశేషణము చేర్చబడినది. మనోనిగ్రహణము చాలకష్టము. దీనిని గుఱించి గీతాచార్యుడు విపులముగ పార్థునకు పదేశించినాడు.

చంచలమైన మనస్సును అరికట్టుట కష్టమే అయినను అభ్యాసముచే దానిని సాధింప వచ్చుననియు, ఇంద్రియముల విషయముల నుండి లాగినంతమాత్రమున విషయముల పట్లగల రుచి నశింపదనియు, అదికేవలము మనస్సును భగవదాయత్త మొనర్చినప్పుడు మాత్రమే సాధ్యమనియు,ఇట్లు మనస్సును భగవదాయత్తమొనర్చి, మనస్సునసు వర్తించియుండు ఇంద్రియముల గూడ నిగ్రహించిన వానికి బుద్ధినిశ్చలమై ధ్యేయవస్తువు లెస్సగ ధ్యాన దశయందు స్ఫురించుననియు భగవానుడుపదేశించినాడు. అతి దుష్కరమైన మనోనిగ్రహణము, ఇంద్రియనియమనము ధారావాహికమగు ధ్యానము అను మూడును ధ్రువునిచే సాధింపబడినవని తాత్పర్యము. 8

తీర్థజలావగాహనము, తీవ్రమైన తపస్సు, వ్రతములు, యాగములు, ఇవియన్నియు, సత్యమార్గమే. కనుక నాకు పరితోషజనకమే. అయినను, నిగ్రహింపబడిన చిత్తముతో నొనర్పబడు ధ్యానము వీటికంటె విలక్షణము. ఒక్కక్షణమైనను, అదియే నాకు అత్యంత పరితోషమును కలిగించును. ఈ శ్లోకమున సకల విధసాధనముల కంటె ధ్యానమే విశిష్ట మైనదని చెప్పబడినది. 9

యదాపి కేనాపి నరేణ చేతో
మయ్యర్పితం వాయుబలం నిగృహ్య ।
తం సర్వతః పాతి మమాజ్ఞయైతత్
సుదర్శనం ప్రాప్య సదైవ ధీర । 10

జిత్వైవ మాయాం మమసాధుబుద్ధి
ర్యస్త్వాదృశో బ్రహ్మణి తిష్ఠతీహ ।
తస్మై ప్రదాతుం త్వరతే వరాన్మే
మనస్తతో వత్స! వృణీష్వ కామాన్ । 11

వాయువువలె నిగ్రహింప నలవిగాని మనస్సును నిగ్రహించి ఎప్పుడైన ఎవ్వడైన నాయందులగ్న మొనర్చినచో, అట్టి ధ్యాతను నాయాజ్ఞచే నీసుదర్శనము (చక్రము) సన్నిహితమై యుండి రక్షించుచుండును.

భగవానుని దివ్యాయుధములలో సుదర్శన చక్రము భగన్మనోభిమాని దైవతము. ఇయ్యది భగవానుని దక్షిణ భాగమునుండి, వాయువునధిఃకరించు వేగమున చలించు స్వభావము కలదియై, భగవద్విరోధి నిరసనమందు అత్యుగ్రమై యుండునని విష్ణుపురాణాదులు పేర్కొనుచున్నవి.

'చల స్వరూప మత్యుగ్రం జవేనాంతరితానలమ్ ।
చక్ర స్వరూపంచ మనోధత్తే విష్ణుః కరేస్థితమ్ ।' (విష్ణు.పు. 1-22/71)

ఈ విష్ణు పురాణమునకు పోద్బలకముగ విష్ణుచిత్తీయవ్యాఖ్యలో నుదాహరింపబడిన యభియుక్తోక్తి కూడ నీయభిప్రాయమునే సమర్థించుచున్నది.

'దేవస్య దక్షిణే పార్శ్వే హేతిరాజం సుదర్శనమ్ ।
చలస్వరూప మత్యుగ్రం మనస్తత్త్వాధిదైవతమ్ ।'

ఈ సుదర్శనము మనస్తత్త్వాధిదైవతమై భక్తజనుల మనస్సును రక్షించుచుండును. ఈ చక్రమే స్థితికారణమనిగూడ , పరమసంహితాగతమగు, 'చక్రం స్థితిని బంధనమ్ ' అను వచనము ప్రతిపాదించుచున్నది.

స్వయముగ నచింత్య దివ్యాద్భుతమూర్తియైన భగవానుడు ప్రాణులశ్రేయస్సుకై యిట్టి దివ్యాస్త్రభూషణాదులను ధరించుచు , భక్తజన సులభమూర్తియై యుండునని గూడ

శృణ్వన్ వచస్తత్ సకలం గభీర
మున్మీలితాక్షః సహసా దదర్శ ।
స్వచిన్త్య మానం స్వయమేవ మూర్తం
చతుర్భుజం బ్రహ్మ పురః స్థితంసః । 12

దృష్ట్వా క్షణం రాజసుతః సుపూజ్యం
పరం తమీశం కిమహం బ్రవీమి ।
కింవాకరోమీతి ససంభ్రమః సన్
నచాబ్రవీత్ కించన నోచకార । 13

విష్ణు పురాణము తెలుపుచున్నది.

'అస్త్ర భూషణ సంస్థాన స్వరూపం రూపవర్జితః ।

బిభర్తి మాయారూపోఽసౌ శ్రేయసే ప్రాణినాంహరిః ।

ఈ శ్లోకమున 'రూపవర్జితః' అను పదమునకు కర్మనిమిత్తమైన ప్రాకృత రూపరహితుడని యర్థము. 'మాయారూపః' అనగా అనంతైశ్వర్య స్వరూపుడని యర్థము. పూర్వము హరిభక్తి సుధోదయ శ్లోకములలో వర్ణింపబడిన దివ్యాభరణాది విశిష్టమగు, భగవద్రూపము దర్శనము, అనుస్మరణము, నామసంకీర్తనము, మున్నగు వివిధ ప్రకారముల జగత్సౌలభ్యము కొఱకు, ధర్మసంస్థాప నార్థమును నని తాత్పర్యము. 10

ఓ వత్సా! ఎవ్వడు నామాయను జయించి మదాయత్తమగుటచే సర్వోత్తమమైన బుద్ధి కలిగి బ్రహ్మనిష్ఠుడై యుండునో అట్టి నీబోటి భక్తునకు వరముల నిచ్చుటకై నామనస్సు నిరంతరము త్వరపడుచుండును. కావున వరముల కోరికొమ్ము. 11

అంతట గంభీరమగు నా భగవద్వచనము నంతటిని విని వెంటనే కన్నులు తెరచినవాడై ధ్రువుడు , తనచే ధ్యానింపబడుచున్న భగవానుడు స్వయముగ పరంబ్రహ్మమగు నారాయణుడు చతుర్భుజుడై మూర్తవిగ్రహమును ధరించి ఎదుట నిలచి యుండుట గాంచెను. 12

రాజకుమారుడైన ధ్రువుడు ఆరాధ్యుడైన శ్రీమన్నారాయణుని ఒక్క క్షణము చూచి, ఏమిమాటాడుదును, ఏమిచేయుదునని సంభ్రమమున (తత్తరపాటున) కింకర్తవ్యతావిమూఢుడై ఏమియు మాటాడక, ఏమియు చేయక మిన్నకుండెను.

హర్షా శ్రుపూర్ణః పులకాంచితాంగః
ప్రసీద నాథేతి వదన్నథోచ్చైః ।
దండప్రణామాయ పపాత భూమౌ
సవేపమానస్త్రి జగద్విధాతుః ॥ 14

తం భక్త కాంతః ప్రణతం ధరణ్యా
మాయాసితోఽసీతి వదన్ కరాబ్జైః ।
ఉత్థాపయామాస భుజౌ గృహీత్వా
పస్పర్శ హర్షోపచితౌ క్షణేన ॥ 15

అనుకోని విధమున ధ్యేయమగు పరతత్త్వము సాక్షాత్కరించినప్పుడు మనస్సు స్తబ్ధమై కింకర్తవ్యతా విమౌఢ్యము నందుట సహజముకదా ! 13

ఆనందాశ్రువులు కన్నుల జాలువార, గగ్గురుపాటు చెందిన మేనుకలవాడై 'స్వామీ! ప్రసన్నుడవు కమ్ము' అని బిగ్గరగా పలుకుచు, త్రిలోకనాధుడగు శ్రియః పతికి దండ ప్రణామమాచరింప నాతడు భూమిపైబడెను. 14

భక్తజన ప్రియుడగు శ్రీహరి, భూమిపైదండ ప్రణామమాచరించుచున్న, ధ్రువుని, 'నాయనా! చాల క్లేశము నొందింపబడితివి' అని కరపద్మములతో భుజముల బట్టుకొని పైకెత్తి, దగ్గరకు తీసికొని, ఆనందముచే నుబ్బిన, యా భుజముల నొక్కక్షణము గట్టిగ స్పృశించెను.

ఈ శ్లోకమున భగవానుని, సౌహార్ద సౌశీల్యౌదార్య గుణములు లెస్సగా వ్యక్త పరుపబడినవి. సౌహార్దమనగా స్వాశ్రితుల పట్ల స్నిగ్ధహృదయ పూర్వకమైన ప్రవృత్తి. భగవద్గీతలోని యైదవ యధ్యాయమున – 'సుహృదం సర్వభూతానామ్'

ఇత్యాది వచనము భగవానుని సౌహార్దగుణమును స్పష్టపరుచుచున్నది. ఇట్టి సౌహార్దగుణమునకు నిదర్శనమే – చేతులతో ధ్రువుని పైకెత్తి భుజముల స్పృశించుట. భారతద్రోణపర్వమున–

'ఉరసా ప్రతిజగ్రాహ పార్థం సంఛాద్య మాధవః

ఇత్యాదిగ పార్థుని భగవానుడు కౌగలించు కొనినట్లు చెప్పుట సౌహార్దగుణఖ్యాపనమే.

సౌశీల్యమనగా – 'మహతాం మందైస్సమం నీరంధ్రేణ ప్రవృత్తిః'

తతోవరం రాజ శిశుర్యయాచే
విఘ్నం పరం తత్స్తవశక్తిమేవ
తం మూర్తవిజ్ఞాననిభేన దేవః
పస్పర్శ శంఖేన ముఖే అమలేన । 16

అథముని వరదత్త జ్ఞానచంద్రేన సమ్యగ్
విమలిత మపి చిత్తం పూర్వమేవ ధ్రువస్య ।
త్రిభువన గురుశంఖ స్పర్శజజ్ఞాన భానుః
విమలయతితరాం, తం సాధుతుష్టావ హృష్టః । 17

జాతిగుణవయోవిద్యాదులచే పెద్దలైనవారు పిన్నల పట్ల సన్నిహితముగ ప్రవర్తించుట. గోపాలాదులపట్ల భగవానుని స్నిగ్ధప్రవృత్తి ఇట్టిదే. ఔదార్యమనగా పాత్రముయొక్క లాఘవమునుగాని (ఎవ్వనికీయదలచెనో వాని తక్కువతనమును గాని) దేయవస్తువు యొక్క గొప్పతనమును గాని పరిగణింపక ప్రత్యుపకార నిరపేక్షముగ వితరణ మొనర్చుట. అధికముగ నిచ్చియు తృప్తిని చెందకుండుట.

'చతుర్విధా భజంతే మాంజనా స్సుకృతినోఽర్జున ।
ఆర్తోజిజ్ఞా సు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ ॥'

అని చెప్పబడిన చతుర్విధార్థులును – 'ఉదారాః సర్వ ఏవైతే (వీరందరును) ఉదారులేనని, యర్థుల యర్థిత్వమునే విశేషముగ పరిగ్రహించుటయు నౌదార్యమే. ఈ గుణములన్నియు లెస్సగ హరిభక్తిసుధోదయ శ్లోకమున వ్యక్తపరుపబడినవి. 15

అంతట నారాజపుత్రుడగు ధ్రువుడు శ్రీహరిని స్తుతించుటకు కావలయు శక్తినే యనుగ్రహింపుమని భగవానుని ప్రార్థించెను. అంత నాదేవుడు మూర్తీభవించిన విజ్ఞానము వంటిదగు స్వచ్ఛమైన శంఖముతో నాతని ముఖమున స్పృశించెను.

వాస్త వమునకు తండ్రి తొడపై కూర్చుండుటద్వారా, తన సహోదరునితో సమానమైన సమ్మానమును పొందుట ధ్రువుని లక్ష్యమైనను, శ్రీహరిదర్శనముచే నాతని మోహము తొలగి, భగవత్ స్తవన శక్తికంటె కోరదగిన వరము వేరులేదని స్ఫురించుట భగవద్దర్శన మాహాత్మ్యమే.

ఈ శ్లోకమున భగవానుని శంఖము మూర్తీభవించిన జ్ఞానముగ నిర్దేశింపబడినది.

శ్రీ ధ్రువ ఉవాచ –
జయజయ వరశంఖ శ్రీగదా చక్రధారిన్
జయజయ నిజదాస ప్రాప్య దౌర్లభ్యకామ ।
త్రిభువన మయ! సర్వప్రాణి భావజ్ఞ ! విష్ణో !
శరణ ముపగతోఽహం త్వాం శరణ్యం వరేణ్యమ్ । 18

భగవదాయుధములలో నిదిముందు నిర్దేశింపబడుట నభ్యర్హితత్వము (పూజ్యత్వము) నుబట్టియని యెరుగవలయును. శంఖ చక్రగదా పద్మములను నాల్గును క్రమముగ ముక్తి, స్థితి, సంహారసృష్టి నిబంధనములు, (హేతువులు) అని పరమ సంహితా వచనము తెల్పుచున్నది.

సృష్టిబీజం తథాపద్మం చక్రం స్థితి నిబంధనమ్ ।

గదాసంహార బీజంతు శంఖం ముక్తి నిబంధనమ్ ।'

భగవద్భక్తి రూపమగు భగవత్ ప్రాప్త్యుపాయమును సాధించు స్వపర స్వరూప సంబంధాది విజ్ఞానప్రదాయక మగుటచే శంఖము ముక్తి బీజముగ కీర్తింపబడినది. ఇయ్యది తామసాహంకారాభిమాని దైవతమని గూడ పురాణములు పేర్కొనుచున్నవి.

'భూతాది మింద్రియాదించ ద్విధాహంకార మీశ్వరః ।

బిభర్తి శంఖరూపేణ శార్ఙ్గ రూపేణ చ స్థితమ్ ॥' (వి. పురాణ 1-12-70)

శంఖము- భూతాదిరూపమగు నహంకారముగ నీశ్లోకమున పేర్కొనబడినది. భూతాది శబ్దమునకు శబ్దాదిరూపమగు భూతకారణమని యర్థము. తదభిమానిదైవతము శంఖమని తాత్పర్యము.

ఇది 'అమలము' అనిచెప్పుటచే స్వయముగ నిర్మలమై యెట్టిదోషములు లేని దగుటచే స్వసంస్పర్శచే ధ్రువుని ముఖమున నిర్మలము విశుద్ధమునైన విజ్ఞానముతో గూడిన వాక్కునావిర్భవింప జేయజాలినదను నభిప్రాయము వ్యక్తపరుపబడినది. 16

పిమ్మట మునిశ్రేష్ఠులగు సప్తర్షులచే ననుగ్రహింపబడిన, మంత్రోపదేశ జన్యమగు జ్ఞాన చంద్రునిచే లెస్సగ నిర్మల మొనర్పబడిన దయ్యును, ధ్రువుని చిత్తము, త్రిలోక గురువగు శ్రీహరి, శంఖ స్పర్శచే జ్ఞానభాస్కర ప్రభాభాసురమై ధ్రువుని మిక్కిలి విమల మొనర్చినది. ధ్రువుడంతట శ్రీహరిని సానందము స్తుతించెను. 17

శ్రీ ధ్రువుడు పల్కెను. సర్వవ్యాపకుడవగు స్వామీ! శ్రీమన్నారాయణా!

ప్రకృతి పురుష కాలవ్యక్తరూప స్త్వమేక
స్త్రి జగదుదయ రక్షా నాశహేతు స్త్వమేవ ।
విసదృశతర భూతవ్యక్త రూపస్త్వమేక
స్తత ఇదమితి తత్త్వం జ్ఞాయతే కేన సూక్ష్మమ్ । 19

శంఖ చక్రగదా త్మకములగు శ్రేష్ఠాయుధముల ధరించినవాడా ! జయము! జయము! నిరంతర భగవత్కైంకర్య పరులైన దాసజనులచే సులభముగ పొందదగిన, దుర్లభ కాములు కలవాడా! (సామాన్యులకు దుర్లభములైన కాములు భగవద్దాసులకు ప్రాప్యములని భావము.) జయము! జయము! త్రిలోకాంతర్యామీ! నిఖిలప్రాణిహృదయ భావముల నెరిగినవాడా! సర్వులచే వరణీయుడవు, ఆశ్రయింప దగినవాడవునగు నిన్ను శరణు జొత్తును.
18

ప్రకృతి, పురుషుడు, కాలము మున్నగు వ్యక్తములైన రూపములుకల నీ వొక్కడివే, ముల్లోకముల పుట్టుకకు, స్థితికి, చివరకు నాశనమునకు కారణమై యున్నావు . ఒకదానితో నొకటి ఎంతమాత్రము పోలికలేని వివిధ ప్రాణులుగా (జీవరాసిగా) వ్యక్తమైనరూపము కలవాడవగు నీవే యీ సమస్తజగత్తు. అను ఈ సూక్ష్మతత్త్వము ఎవ్వనిచే తెలియ బడును? ఎవ్వరు తెలియజాలరని తాత్పర్యము.

ఇచ్చట ప్రకృతియనగా సత్త్వరజస్తమోరూప త్రిగుణాశ్రయమై సమస్త జగన్నిర్మాణ కారణమైన భగవచ్ఛక్తి.

'యస్యశక్తి ర్మహామాయా జగద్విభ్రమకారిణీ ।
విశ్వోత్పత్తి నిమిత్తత్వాత్ ప్రకృతిః ప్రోచ్యతే బుధైః ।'

'నిఖిల జగత్ప్రవృత్తికి కారణమైన మహామాయా రూపమగు శక్తియే ప్రకృతి. ఇది విశ్వనిర్మాణ కారణము కావున ప్రకృతియని వ్యవహరింపబడుచున్నది. శ్రీభగవద్గీత- 'మాయాంతు ప్రకృతిం విద్యాత్ మాయినంతు మహేశ్వరమ్' ఇత్యాదిగా మాయయే ప్రకృతియనియు దానిని వశమందుంచు కొన్నవాడే పరమేశ్వరుడనియు తెలుపుచున్నది. ఇది పురుష భోగస్థాన మగుచున్నది.

పురుషుడనగా జీవుడు. 'సహస్ర శీర్షాపురుషః' ఇత్యాది వైదిక సూక్తమందు పురుష శబ్దము పరమాత్మపర్యాయముగా ప్రసిద్ధమై యున్నను, ప్రస్తుతమున ప్రకృతితో పాటు చేర్చబడి యుట్టంకింపబడుటచే జీవవాచకమే. పురి = శరీరమున, శేతే = శయనించి

అవికృతనిజ శుద్ధజ్ఞాన రూపశ్చ యస్త్వం
వికృత సకల మూర్తి శ్చేతనాత్మా శ్రుతశ్చ ।
స్ఫురతి తవ విరోధో వైదిక స్తేన నాథ !
భ్రమతి బుధజనోఽయం త్వత్ప్రసాదం వినాత్ర ॥ 20

యుండువాడు, అనగా శరీరముచే బద్ధుడైన జీవుడని యర్థము.

కాలమనగా స్వభావతః జడమైన పదార్థము. నిమేష, ఘంటా, దిన, మాస సంవత్సరాది విభాగములచే వ్యవహరింపబడునది. కాని, ఈ కాలము నిఖిల జగత్ప్రవృత్తి కారణమై భగవచ్చేష్టారూపమై యున్నదని శ్రీభాగవత వచనము –

'యోఽయం కాలస్తస్యతేఽవ్యక్తబంధో ।
చేష్టామాహుః చేష్టతే యేన విశ్వమ్ ।
నిమేషా దిర్వత్సరాన్తో మహీయాన్
తంత్వేశానం క్షేమ ధామ ప్రపద్యే ॥' (శ్రీ. భాగ. (10-3-26)

ఈ విధముగ ప్రకృతి, పురుషుడు, (జీవుడు) కాలము మొదలగు వ్యక్తములైన రూపముల కలిగి యా శ్రీహరియొక్కడే నిఖిల జగదుదయమునకు, తద్రక్షణమునకు, నాశనమునకు కారణమగు చున్నాడు. అంతమాత్రమే కాక ప్రకృతి జీవ సమ్మేలనమువలన నేర్పడిన యీ సమస్తమగు పదార్థ జాతమునకు ఆధారమైన పృథివ్యప్తేజో వాయ్వాకాశ రూపములగు భూతసంతతికి కూడ తానేకారణమై తానే యీప్రపంచముగ కార్యమై యున్నాడు. ఈ సూక్ష్మమగు తత్త్వమును భగవదనుగ్రహముచే తప్ప, తెలియజాలమని ముందు శ్లోకమున స్పష్టపరుపబడినది. 19

'వాస్తవమునకు ఎట్టి వికారములు లేని శుద్ధమైన జ్ఞానమే స్వరూపముగ కల్గిన యా భగవానుడు, వివిధ వికారములు గల యీ చేతనాచేతనాత్మక ప్రపంచముగ తానై, తదంతర్యామిగ 'తదాత్మ' కుడైయున్నాడని వేదముచే తెలియ బడుచున్నాడు. అంతియేకాక స్వామీ! నీయందంతర్లీన మైయున్న ప్రపంచమే యిట్లు స్థూలరూపముగ ప్రకాశించుచున్నదను విషయమును నీ యనుగ్రహములేక నెవ్వడెరుగగలడు ? కావుననే పండితుడు గూడ యీ తత్త్వమును తెలియ జాలక భ్రాంతి చెందుచున్నాడు.

'కింసిద్వనం క ఉ సవృక్ష ఆసీత్, యతో ద్యావా పృథివీ నిష్టతక్షుః' 'ఏమియా వనము? ఏమియావృక్షము? దేనినుండియీ యంతరాళము, పృధివి చెక్కబడినవో?'

అవికృత నిజరూపః త్వం తథాపీశ నాయం
వికృత వివిధ భావో మాయయాతే విరుద్ధః ।
దినకర కరజాలం హ్యూషర స్థాన సంగా
దవికృత మపిధత్తే నీరరూపం వికారమ్ । 21

అని ప్రశ్నించి 'బ్రహ్మవనం, బ్రహ్మ సవృక్ష ఆసీత్, యతోద్యావా పృథివీ నిష్టతక్షుః' 'దేని నుండి యీ ద్యావా (అంతరిక్షము) పృథివులు చెక్కబడినవో ఆ వనము పరబ్రహ్మమే, ఆవృక్షమును పరబ్రహ్మమే!' అని సమాధానమును వేదము చెప్పుచున్నది. (ఋగ్వేదము 10,6,8,4) ఈ వేదవచనమును బట్టి భగవానుడే జగత్కారణమని స్పష్టము. ఇట్లు కారణమైన భగవానుడే తన ప్రకృతిని యధిష్ఠానముగ జేసికొని యీనా నావికారాస్పదమైన జగన్మూర్తియై యున్నాడు. శ్రీ భగవద్గీతలో భగవానుడు తన ద్వివిధ ప్రకృతిని గూర్చియిట్లు చెప్పియున్నాడు.

'భూమిరాపోఽనలోవాయుః ఖం మనోబుద్ధిరేవచ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ।'

వివిధ విచిత్రానంత భోగ్య, భోగోపకరణ, భోగస్థాన, రూపముగ నున్న యీ జగత్తుకు మూలములైన గంధాది గుణ విశిష్టములగు పృథివి, జలము, ఆకాశము, తేజస్సు, వాయువు, మున్నగు భూతరూపముగను, మనస్సు మున్నగు నింద్రియములుగను, మహత్, అహంకారము ఇత్యాది రూపముగను నెనిమిది విధములైన ప్రకృతి, భగవత్ప్రకృతియే. ఇది పరా ప్రకృతియని వ్యవహరింపబడును. దీనికంటే భిన్నముగ అపరాప్రకృతి కూడ కలదు. అది జీవరూపము-

'అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమే పరామ్ ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ।

ఇత్యాదిగ పేర్కొనబడినది. ఈ పరాపర ప్రకృతులే జడ-జీవ రూపముగనున్న సమస్త జగత్తు. ఈవిధముగ జీవజడాత్మకమైన వివిధ విచిత్ర జగత్తు భగవత్ప్రకృతియే కనుక తదాత్మకమే. ఇది సూక్ష్మముగ భగవంతుని యందిమిడి యుండి సృష్టిదశలో స్థూలరూపముగ నావిష్కృత మైయున్నది. ఈ తత్త్వమును కేవలము పండితులు కూడ భగవదను గ్రహము లేనిదే తెలియజాలరు. 20

ఎట్టి వికారములు లేని స్వస్వరూపము కలవాడవయ్యును, ప్రభూ! వివిధ వికారములుకల యీ ప్రపంచముగా నీవే స్వావిష్కార మొనర్చినావు. అయినను నీదగు

శ్రుతమిహ తవరూపం వైకృతం కారణంచే
త్యఖిలమపి జగద్వై వైకృతం తద్వికారి ।
సదితి సముపలభ్యం బ్రహ్మయత్ కారణం తత్
తదుభయ మపివందే దేవ! వంద్యం మునీన్ద్రైః । 22

దశశతముఖ మీశ ! త్వాం సహస్రాక్షి పాదం
వదతి వరద! వేదస్త్వం యతో విశ్వమూర్తిః ।
విమల మముఖ పాదం చాక్షి బాహూరు హీనం
వితత మపృథు దీర్ఘం బ్రహ్మ భూతోయతస్త్వమ్ । 23

నీయావిర్భావము, నీమాయచే నిరుద్ధము కాలేదు. సూర్యకిరణ సముదాయము, ఊషరక్షేత్ర సంబంధముచే, స్వభావతః వికారములేని దయ్యును, జలవికారమును పొందుచున్నది కదా!

ఈ శ్లోకమున నీయబడిన దృష్టాంతమును బట్టి వికార రహితమగు వస్తువుకూడ వికారమును పొందుట సంభవమేనని నిరూపింప బడుచున్నది. ఇచ్చట నీవిషయము గుర్తింప వలయును. ఈ దృష్టాంతమును బట్టి యవికృతరూపమే సత్యమనియు, వికారాత్మకముగ నున్న యీ జగద్రూపము అసత్యమనియు ననరాదు. ఈ విధముగ జగదసత్యత్వమును ప్రతిపాదించుట యీ దృష్టాంతలక్ష్యము కాదు. పైగా.అవికృతమగు రూపముతోపాటు, వికారాత్మకమైన యీజగద్రూపము కూడ భగవానునిదేనని నిరూపించుటయే దాని లక్ష్యము. 'వాచారంభణం వికారో నామధేయం మృత్తి కేత్యేవ సత్యమ్' అనునౌపనిషదదృష్టాంతము నందువలె, మృద్ద్రవ్యము కారణాత్మకముగ నెట్లు సత్యమో, తద్వికారమగు ఘట శరావాదికము కూడ కార్యాత్మకముగ సత్యమే తప్ప మిధ్యకాదని నిరూపింపబడినట్లు, కార్యకారణములు రెండును భగవానుడేనని నిరూపించుటయే ప్రస్తుత దృష్టాంత పరమలక్ష్యము. కనుకనే 22వ శ్లోకమున భగవానుని వైకృతరూపము, కారణరూపము రెండును కీర్తింపబడినవి. 21

ఓ దేవా! వేదములలో నీకు కారణరూపము, వైకృతరూపమునని రెండురూపములు కలవనియు, అందు వికారాస్పదమైన సమస్తజగత్తు వైకృతరూపమనియు, అవికృతమైన యే కారణరూపము కలదో, అదియే సచ్ఛబ్ద వాచ్యమగు పరబ్రహ్మమనియు, కీర్తింపబడుచున్నది. మునీంద్ర వంద్యమగు నీరూపద్వయమును నమస్కరింతును.

అవి కృత (కారణ) రూపము, జగదాత్మకమగు వికృతరూపము రెండును

వితత విమల రూపే త్వయ్యదో నాథ! విశ్వం
పృథగివ పరిదృష్టం స్వాశ్రయాభిన్నమేవ ।
జలమయ మివఫేనం వారిధౌ దృశ్యతేఽథో
లయసముచిత కాలే త్వన్మయం స్యాత్ పృథఙ్న । 24

త్వమిహ వివిధ రూపై స్త్వన్మయాన్ పాసిలోకాన్
అగణిత పృథుశక్తి ర్నాశయన్ ఉత్పథస్థాన్ ।
ప్రణత జనమనస్త జ్ఞాన దానేన రక్షన్
ధనతనయవధూభి ర్మోహయం స్త్వయ్యరక్తాన్ । 25

భగవానునివేనని నిష్కర్షించుటచే ఒకటి సత్యము, మరియొకటి మిధ్యయని వ్యవహరించుట ఎంతమాత్రము కుదరదు. కావున సత్యమైన యీ ద్వివిధరూపము మునీంద్రులచే సహితము వందనీయమే. అనగా భగవంతుని మూలస్వరూపమును మునీంద్రు లెట్లు ధ్యానింతురో, అట్లే ఈ దృశ్యమాన సమస్త జగత్తును భగవద్రూపముగనే భావించి ధ్యానింతురే తప్ప నిరాకరింపరని తాత్పర్యము. 22

ప్రభూ! నిన్ను పది, వందతలలు కలవానిగను, వేలకన్నులు, పాదములు కలవానిగను వేదముద్ఘోషించుచున్నది. వరదా ! వేదమట్లు కీర్తించుటకు - నీవు విశ్వమూర్తివగుటయే కారణము తప్ప వేరు కాదు. నిర్మల స్వరూపుడవగు నీకు ప్రాకృతములైన ముఖము, పాదము, కన్నులు, బాహువులు, ఊరువులు (తొడలు) మున్నగు నవయవములేవియు లేవు. అనగా నీ శరీరము అప్రాకృతమని తాత్పర్యము. సర్వత్ర వ్యాపించిన తనువుగలనీవు పృథుత్వ దీర్ఘత్వాది ప్రాకృత గుణములు కలవాడవు కూడకావు.

శ్రుతి – ' సహస్ర శీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్, సభూమిం విశ్వతోవృత్వా అత్యతిష్ఠద్దశాంగులమ్ ' ఇత్యాదిగ భగవంతునకు వేయి తలలు, వేయికన్నులు, వేయిపాదములు కలవని నొడువుచున్నది. అనగా నిఖిల ప్రపంచము భగవానుని రూపమే కనుక ప్రాణుల శిరస్సులు, కన్నులు, పాదములు భగవానుని సంకల్పముచేత ప్రకృతి రూపములుగ కల్పింప బడినవే కనుక భగవానుని కట్లు వ్యవహారము ప్రపన్నమేయగుచున్నది. 23

అంతట నంతర్యామిగ నన్తర్బహిర్వ్యాప్తుడవై నిర్మల స్వరూపముకల నీయందే యీ సమస్త జగత్తు పూర్వము సూక్ష్మముగ నుండి యిప్పుడు స్థూలముగ వేరుగ

త్రిజగ దుదీయ నాశావిచ్ఛయా యస్య తస్య
స్వజన సకల కామోత్పాదనం నః స్తవాయ ।
ఖలజన హననం వా శ్రీపతే ! తేతతస్త్వమ్
అగణిత గుణ సింధుంస్తౌమి నో, కిన్తు వందే ॥ 26

కుందనిభ శంఖధరమిందు నిభవక్త్రం
సుందర సుదర్శన కరోదార హారమ్ ।
వంద్యజన వందిత మిదన్తు తవరూపం
దివ్యమతి హృద్యమఖిలేశ్వర! నతోఽస్మి ॥ 27

కన్పట్టుచున్నను తన కాశ్రయమైన(కారణమైన) నీకంటె వేరుకాదు. ఎట్లుగ - నురగ వేరుగ కన్పట్టు చున్నను సముద్రమున నది జలరూపమే తప్పవేరు కాదో, అట్లే ప్రలయ కాలమందీ జగమంతయు లీనమై త్వదాత్మకముగనే యున్నది.

శ్రీ భగవద్గీతలో భగవానుడు -

మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి పరంతప ।

మయి సర్వమిదం ప్రోతం, సూత్రే మణిగణా ఇవ ।

ఓ అర్జునా! నాకంటె వేరుగను, ఉత్కృష్టముగను, నేమియులేదు. నాయందే యీ సమస్త జగత్తు సూత్రమున మణులు పొదగ బడియున్నట్లు లీనమైయున్నదనియు, కారణావస్థమైన కార్యావస్థమైన సమస్త చిదచిదాత్మక జగత్తునన్నే ఆశ్రయించి నా శరీరముగన మరియున్నదనియు పేర్కొనినాడు.

అట్లే- 'పురుషస్సపరః పార్థ! భక్త్యాలభ్యస్త్వ నన్యయా ।

యస్యాన్తస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥'

అని కూడ - భగవానునియందే సర్వభూతములు, సర్వభూతముల యందు భగవానుడును నున్నారని పేర్కొని యున్నాడు.

'జ్యోతింషి విష్ణుర్భువనాని విష్ణుః వనాని విష్ణుర్గిరయో దిశశ్చ ।

నద్యస్సముద్రాశ్చ స ఏవ సర్వం యదస్తి యన్నాస్తి చ విప్రవర్య ॥

ఇత్యాదిగ సర్వము విష్ణుమయమేనని గూడ చెప్పబడినది. 24

స్వామీ! ఈ ప్రపంచమున వివిధ స్వరూపములతో త్వన్మయులైన లోకులను

స్థానాభి కామస్తపసిస్థితోऽహం
త్వాంద్రుష్టవాన్ సాధు, మునీంద్ర గుహ్యమ్ ।
కాచం విచిన్వన్నివ దివ్యరత్నం
స్వామిన్! కృతార్థోऽస్మి వరం నయాచే । 28

అపూర్వ దృశ్యే తవ పాదపద్మే
దృష్ట్వా దృఢం నాథ! నహిత్యజామి
కామాన్నయాచే సహికోऽపి మూఢో
యః కల్పవృక్షాత్తుష మాత్ర మిచ్ఛేత్ । 29

రక్షించుచున్నావు. అప్రమేయ మహాశక్తి సంపన్నుడవై యున్మార్గగాములైన(దుర్మార్గులైన) వారిని నశింప జేయుచుందువు. నీ శరణము జొచ్చిన వారిని యపార జ్ఞాన దానముచే రక్షించు వాడవై, నీయందు భక్తిలేనివారిని ధనము, పుత్రులు, భార్యమున్నగు వాటి ద్వారమున మోహింప జేయుచున్నావు. 25

ముల్లోకముల యుత్పత్తి వినాశములు ఎవ్వని సంకల్పము చేతనగుచున్నవో, అట్టి భగవానుడొనర్చు స్వజన సమస్త కామోత్పాదనము కాని (తనవారికి వివిధ కామనల నీడేర్చుటగాని), దుర్జనుల చంపుటగాని, లీలయే తప్ప వేరుకాదు. కావున నీలీల మాకు స్తవనార్హ మయ్యును, స్తుతింప నలవి కాదు కనుక, కేవలము నమస్కరింతును.

నిఖిల జగత్పతీ! మొల్లల వంటి తెల్లని శంఖమును ధరించువాడును, చంద్రసమాన సుందర వదనుడును, మనోజ్ఞమగు సుదర్శన చక్రమును కరమున దాల్చిన వాడును, అనర్ఘమణిహార ధారియు, ప్రణతజన వందనీయమగు నిట్టి రూపముకల వాడవగు నీ దివ్యము హృద్యమునగు మూర్తిని నమస్కరింతును. 26

ఈ శ్లోకమున భక్తజనోపాస్యమగు భగవన్మనోహర మూర్తి వర్ణింపబడినది. భగవానుని యవ్యక్తరూపము కంటె వ్యక్తమగు నీ రూపమే సుందర తమమై యుపాసకుల హృదయములందు ప్రతిష్ఠితమై సర్వకామ ప్రదమగునని యీ వర్ణనము వలన తెలియ వలయును. శ్రీభాగవతాదులందు వర్ణింపబడిన భగవద్రూపము కూడ నుపాసకాను గ్రాహకమై సర్వజనోపాదేయ తమమని యెరుగవలయును. ఇట్టి రూపములే శ్రీభాగవతమున - (10-2-29) 'బిభర్షి రూపాణ్యవబోధ ఆత్మా, క్షేమాయలోకస్య చరాచరస్య ।

త్వాం మోక్ష బీజం శరణం ప్రపన్నః
శక్నోమి భోక్తుం నబహిః సుఖాని ।
రత్నాకరే దేవ! సతి స్వనాథే
విభూషణం కాచమయం నయుక్తమ్ । 30

అతో నయాచే వరమీశ! యుష్మత్
పాదాబ్జభక్తిః సతతం మమాస్తు ।
ఇమం వరం దేవవర! ప్రయచ్ఛ
పునః పునస్త్వామిదమేవ యాచే ॥ 31

ఇత్యాత్మ సందర్శన లబ్ధ దివ్య
జ్ఞానం ధ్రువం తంభగవాన్ జగాద ।
ప్రబోధయన్ రాజసుతం త్వదుక్తం
మిథ్యాన కించిత్ శృణు వత్స! గుహ్యమ్ । 32

సత్యోపపన్నాని సుఖావహాని సతామభద్రాణి ముహుః ఖలానామ్ ॥'
అని కీర్తింపబడినది. 27

స్వామీ! నా తండ్రి యొక్క తొడ యనుస్థానమును నా సోదరుడు పొందగా నేనును ఆ స్థానమునే పొందగోరియు, పొందజాలక తల్లి ప్రేరింపగా తపస్సు నొనర్చితిని. కాని, మునీంద్రులకు సహితము అందరాని నిన్ను లెస్సగా దర్శింప గల్గితిని. గాజును వెదుకబోయి రత్నమును పొందినట్లు నిన్ను దర్శించి కృతార్థుడనైతిని. కనుక వరమును కోరజాలను. 28

అపూర్వమగు దర్శనముగల నీ పద పుండరీకముల దర్శించి స్వామీ! వాటిని నిశ్చయముగ నెంత మాత్రము విడువజాలను. కామముల గూడ కోరజాలను. కల్పవృక్షమునుండి పొల్లును కోరెడి మూఢుడెవ్వడైన నుండునా ? 29

దేవా! మోక్షకారణమైన నిన్ను శరణు జొచ్చిన నేను, బాహ్యములగు లౌకిక భోగముల ననుభవింప శక్తుడగాను. నిఖిలరత్న నిధియగు సముద్రుడు తన నాథుడైయుండ కాచమయమైన (గాజుతో చేయబడిన) యాభరణమును ధరింప నయుక్తము కదా! 30

ఆరాధ్య విష్ణుం కిమనేన లబ్ధం
మాభూజ్జ నేష్యిత్థ మసాధు వాదః ।
స్థానం పరం ప్రాప్నుహి యన్మతంతే
కాలేన మాం ప్రాప్స్యసి శుద్ధభావః ॥ 33

ఆధార భూతః సకల గ్రహాణాం
కల్పధ్రువః సర్వ జనైశ్చ వంద్యః ।
మమ ప్రసాదాత్తవ సాచ మాతా
తవాన్తికస్థాస్తు సునీతి రార్యా ॥ 34

తం సాంత్వయి త్వేతి వరైర్ముకుందః
స్వమాలయం దృశ్యవపుస్ఖలోఽగాత్ ।
త్యక్త్వాశనైః స్నిగ్ధదృశా స్వభక్తం
ముహుః పరావృత్య సమీక్షమాణః ॥ 35

కావున ఓ దేవదేవా! నే నితరమగు వరమును దేనిని కోరను. నిరంతరము నీ పాద సరసీరుహభజనమే నాకగునుగాక! స్వామీ! మాటిమాటికి దీనినే వరముగ కోరుచుంటిని కాన దానినే (నీపాదభక్తిచే) యనుగ్రహింపుము. 31

ఇట్లు నిజదర్శన భాగ్యముచే పొప్తించిన దివ్యజ్ఞానము గల ధ్రువుని ప్రతిబోధించుచు – 'నాయనా! నీవన్నది సత్యమే. మిధ్యకాదు. కాని రహస్యము నెరిగించెద' వినుము అని పల్కెను. 32

'మరియు విష్ణువు నారాధించ ఈతడేమి ప్రయోజనమును పొంద గలిగెనని జనులలో అపవాదము కలుగ కుండునుగాక. కావున నీ వేస్థానమును కోరితివో అదియే నీకు కల్గును కాక. కాలవశమున పరిపక్వమై విశుద్ధమగు మనోభావముకలవాడవై నన్ను పొందగలవు. 33

సకల గ్రహములకు (సూర్యచంద్రాది గ్రహములకు) ఆధారమైన వాడవై బహు కల్పాన్తము స్థిరముగ నుండి సమస్త జనులచే పూజింప బడుచునుందువుగాక. నాయనుగ్రహముచే నీ తల్లియగు సునీతియు నీచెంతనే యుండగలదు.' 34

ఇట్లాధ్రువుని కభిమతములగు వరములనిచ్చి, యాశ్వాసించి, పురుషోత్తముడగు శ్రీహరి, కన్నులకగుపించు దివ్యమంగళ విగ్రహముతో గూడిన వాడై, తన భక్తుడగు

తావచ్చ ఖస్థః సురసిద్ధసంఘః
శ్రీవిష్ణు సద్భక్తి సమానతం తమ్
దృష్ట్వాభ్యవర్షచ్ఛుభ పుష్ప వృష్టిం
తుష్టావ హర్షాద్ధ్రువ మవ్యయంచ । 36

శ్రియా పునః సోఽపి సునీతి సూనుః
విభాతి దైవైరభి వంద్యమానః ।
సోఽయంన్నృణాం దర్శనకీర్తనాభ్యా
మాయుర్య శో వర్ధయతి శ్రియంచ ॥ 37

ఇత్థం ధ్రువః ప్రాప పదం దురాపం
హరేః ప్రసాదాన్నచ చిత్రమేతత్ ।
తస్మిన్ ప్రసన్నే ద్విజ! చిత్ర శక్తౌ
కిందుర్లభమ్ ! దుర్లభవాగనర్థా ॥ 38

ధ్రువుని ప్రేమపూర్ణములగు దృక్కులతో వెనుకకు తిరిగి మాటిమాటికి చూచుచున్నవాడై వైకుంఠమున కరిగెను. 35

అంతవరకు, ఆకాశమున నిలుచుండిన దేవసిద్ధబృందము, శ్రీహరియందుగల భక్తియొక్క భారముచేతనాయన్నట్లు వినమ్రమైన శిరస్సుగల యాధ్రువుని చూచి, నానందముగ పుష్పవృష్టిని గురిపించి, యాధ్రువుని మరియు నవ్యయుడగు (నాశరహితుడగు) శ్రీహరిని పలు విధముల స్తుతించినది. 36

సునీతి పుత్రుడగు నాధ్రువుడు భగవదనుగ్రహలబ్ధ శ్రీవిలసితుడై దేవతలచే నమస్కరింపబడుచు ప్రకాశించు చుండెను. ఆతడు తన దర్శనము చేతను, కీర్తింపబడుట చేతను ప్రజలయాయుస్సంపదల వృద్ధి నొందింప జేయుచున్నాడు. 37

ఈ శ్లోకమున నారదుడు ధ్రువవృత్తాంతమును ముగించుచు భగవదారాధనా వైశిష్ట్యమును కొనియాడుచున్నాడు. 'ఓ శౌనకా! శ్రీహరి యనుగ్రహముచే బాలుడగు ధ్రువుడు ఇతరులకు సాధ్యముకాని సమున్నత స్థానమును పొందినాడనుట విచిత్ర మేమియుకాదు. వివిధ విచిత్ర శక్తిసంపన్నుడగు భగవానుడనుగ్రహించినచో దుర్లభమనునదేముండును? 'దుర్లభమ' ను శబ్దముగూడ నర్థరహితమే కదా! 38

సహజప్రసన్న మూర్తియగు శ్రీహరి యారాధనముగూడ అనేకవిఘ్నములతో కూడినదగుటచే దుష్కరమే. సాధారణముగ విష్ణునారాధించుచున్నవారికి, నిద్ర,

ఆరాధనం దుష్కరమస్య కిన్తు
ప్రసన్న మూర్తేరపి భూరి విఘ్నమ్ ।
నిద్రా స్మరాలస్యభయాది విఘ్నాః
ప్రాయేణ విఘ్నం భజతాం భవన్తి ॥ 39

అతిప్రసన్నోఽపి దురాసదోఽసౌ
జనైర్బతాజేయ సహస్ర విఘ్నైః
ఫణీంద్ర చూడామణి వన్మహోర్ఘః
సంప్రాప్యతేఽస్మిన్ కృతిభిస్తు ధన్యైః ॥ 40

క్రోధాదయః శ్రీహరి కల్పవృక్షం
రక్షంత్య జేయాః సకలార్థ బంధుమ్ ।
తదున్ముఖాన్ విప్రతిషేధయంతః
తాన్ వంచయిత్వాలభతే తమేకః ॥ 41

మదనవికారములు, అలసత్వము, భయము అనునవి విఘ్నములుగా నుండును. కావున నిద్రను, కామప్రకోపమును, అలసత్వమును, భయమును, ఎవ్వరు జయింప గల్గుదురో అట్టివారు శ్రీహరియనుగ్రహమునకు కారణమైన నిర్విఘ్నారాధనము నొనర్పగుల్గుదురని తాత్పర్యము. 39

ఎంతటి ప్రసన్నుడైనను, అక్కటా! జయింపనలవి గాని బహువిధ విఘ్నములుగల జనులచే శ్రీహరి పొందరాని వాడేకదా! శేషుని పడగలపైగల యనర్ఘరత్నములవలె దుర్లభుడైన శ్రీహరి, తదారాధనమున విఘ్నములు, జయించి కృతకృత్యులైన సిద్ధపురుషులచే తప్పక పొందబడగలడు.

అనగా పూర్వోక్తబహువిధ విఘ్నములు జయించి తన్నారాధించిన వారికి శ్రీహరి సులభుడేనని తాత్పర్యము. 40

కామక్రోధాద్యరిషడ్వర్గము లోకమునకు జయింప నలవికానిదై సకలార్థ బంధువగు శ్రీహరియను కల్పవృక్షమును సర్వథా రక్షించుచుండును. ఎవ్వరు శ్రీహరియున్ముఖులగుదురో వారి నీ యరిషడ్వర్గము శ్రీహరిదరిజేరనీక నివారించుచుండును. కాని ఎవ్వడో ఒక్క మహానుభావుడే యరిషడ్వర్గము నే మరచి, వంచించి శ్రీహరిని పొందగలుగును. అట్టివాడు దుర్లభుడే.

రాజును భటులు పరివేష్టించియుండి, ఇతరులను (రాజును చేరగోరువారిని)

ప్రోధారిషడ్వర్గమహాహిగుప్తం
దురాసదం విష్ణునిధిం మహాన్తమ్ ।
యఃసాధయేత్ సాధుమహోత్సవాయ
విద్యాబలాత్తం ప్రణతోఽస్మి నిత్యమ్ ॥ 42

ఆరాధనం దుష్కరమి త్యుదాస్తే
యఃక్షీణచిత్తః సవినష్ట ఏవ
అవిఘ్నసిద్ధ్యై శరణం తమేవ
గత్వార్చయేద్యః సవిముక్త ఏవ ॥ 43

దరిజేరనీయక నివారించు చుందురు. కాని కుశలబుద్ధిగలవాడు రాజును జేర భటులేతనకు ప్రతిబంధకమని యెరిగి వారినేమరచి, వంచించి నేర్పుగ రాజును చేరగలుగును. అట్లే కామక్రోధాదుల వంచించియే భగవానుని జేరవలయునని తాత్పర్యము. అట్లు చేయగలవాడే మహానుభావుడని ముందు శ్లోకమున గూడ స్పష్టపరుపబడినది. 41

ప్రబలారిషడ్వర్గ - మహాసర్ప రక్షితమై పొందరానిదగు శ్రీవిష్ణుమహానిధిని, సాధుపరితోషమునకై జ్ఞానబలముచే సాధింపగలవానికి నా ప్రణతులు. 42

ఎవడు భగవదారాధనము దుష్కరమని తలచి యుదాసీనుడై (ఆరాధనము చేయక) యుండునో అట్టి మతివినాశనము నొందినవాడు స్వరూపనాశనమునే పొందుచున్నాడు. భగవదారాధనా ప్రతిబంధకములగు విఘ్నములు తొలగగ శ్రీహరినే యనన్య భావముతో శరణు జొచ్చి తదారాధన మొనర్చువాడు ముక్తుడేయగును.

అనగా భగవదారాధనా ప్రతిబంధకములగు విఘ్నములు తొలగవలెనన్న భగవచ్ఛరణాగతి తప్ప వేరుమార్గములేదని తాత్పర్యము. కావుననే శ్రీభగవద్గీతలో భగవానుడు-

'ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశ్యేర్జున తిష్ఠతి ।

భ్రామయిన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ।'

ఇత్యాదిగ భగవన్మాయా మోహితు లగుటచేతనే ప్రాణులు కామాది వశవర్తు లగుచున్నారనియు, ఇవియే భగవదారాధన ప్రతిబంధకములనియు - కావున మాయనధిఃకరించి సర్వప్రాణి హృదయములందు కొలువున్న స్వామిని శరణు జొచ్చినప్పుడు, మాయతొలగి కామాదులు కూడ నశించుననియు- భగవచ్ఛరణాగతికంటె శాన్తిని పొందునుపాయము వేరులేదనియు పేర్కొనినాడు. శ్రీగీత -

యః శ్రద్ధావాన్ శుద్ధ భావేన విష్ణుం
చేతః సేవ్యం సేవతే వీత రాగః ।
నాసౌ విఘ్నైః స్పృశ్యతే దోషమూలైః
యద్వ ద్ధ్వాంతైరుజ్జ్వలాత్మా ప్రదీపః । 44

యస్త్వే తద్ధ్రువ చరితం శృణోతి ధీమాన్
న భ్రశ్యేత్ సనిజపదాత్ ధ్రువోయథేతి ।
నిత్య శ్రీ ర్విజయతి చాపదః సమస్తాః
ప్రహ్లాదాసురవ దజేయ భక్తిమాన్స్యాత్ । 45

'తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత !
తత్ప్రసాదాత్పరాం శాన్తిం, స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ।' (శ్రీ.భ.18-62)
అనియు,
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ।'
అనియు సర్వకర్మములను భగవదారాధనా రూపముగా నొనర్చుటద్వారా శ్రీహరిని శరణు జొచ్చుటయే భక్తి విరోధి నిరసనో పాయమని నిష్కర్షించుచున్నది. 43

నిరంతర శ్రద్ధా సమన్వితుడై యెవ్వడు ఎట్టి కల్మషములు లేక విశుద్ధమైన హృదయ భావముతో మనస్సంసేవ్యుడగు శ్రీహరిని, రాగాదుల విడచి సేవించునో, అట్టివాడు సముజ్జ్వలకాంతియుతమగు దీపము చీకట్లచే చుట్టువారనట్లే, దోషమూలకములగు (కామక్రోధాది మూలకములగు) విఘ్నములచే నెంతమాత్రము స్పృశింపబడడు. అనగా భగవదారాధనమునకు శ్రద్ధ, విశుద్ధ చిత్తత అత్యావశ్యకములని తెలియునగును. 44

ఈ విధముగ నే ధీమంతుడు ధ్రువచరితమును వినునో ఆతడు ధ్రువుని వలె నిజస్థానము నుండి భ్రష్టుడు కాడు. నిరంతర సంపదల వరలుచు సమస్తాపదలను జయించును. మరియు ప్రహ్లాదుడను పరమ భాగవతోత్తముని వలె సుస్థిరమగు భగవత్ప్రీతిని పొందగలడు.'విజయితి' అనునది యార్షప్రయోగము. 45

ఇది నారదీయ పురాణాంతర్గమగు శ్రీహరి భక్తి సుధోదయమున
ధ్రువచరితమను సప్తమాధ్యాయము.

# అష్టమాధ్యాయము

**అష్టమాధ్యాయసారము:** ధ్రువచరితోపవర్ణనావసానమున 'ప్రహ్లాదాసురవదజేయ భక్తిమాన్స్యాత్' అని చెప్పబడుటచే ప్రసక్తమైన ప్రహ్లాద చరితమును యీయధ్యాయము నుండి యారంభించు చున్నాడు. శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసుని జనకుడగు శ్రీపరాశర మహాముని యను గ్రహించిన శ్రీవైష్ణవ మహాపురాణమున, వరాహ కల్పమున జరిగిన ప్రహ్లాద వృత్తాంతము వర్ణింపబడినది. ప్రస్తుతము పాద్మకల్పమునకు చెందినయదే వృత్తాంతము వర్ణింపబడుచున్నది. కల్పభేదమున్నను కథా భేదము, లక్ష్యభేదములేదు. ప్రహ్లాదచరితముఖమున శ్రీగోవిందమాహత్మ్యమే యావిష్కరింపబడినది. శ్రీగోవింద దివ్యనామ కీర్తనశ్రవణములే ప్రాణికి కృతార్థతావహములు. పూర్వము వర్ణింపబడిన ధ్రువచరితమున-ధ్రువుడు తండ్రిచే పీడింపబడక పోయినను-తాను పొందిన యవమతికికుంది, సప్తర్షి ప్రబోధితవాసుదేవమంత్ర మననమునుజేసి, ఘోరతప మొనర్చి, శ్రీహర్యనుగ్రహమువడసి. తాను తరించి తనవారిని(తల్లిదండ్రులను) గూడతరింపజేసి, వారికి గూడ సమున్నత స్థానమును కల్పింపజేసినాడు. ఈ చరితమున-భగవదనుధ్యానమునకు తల్లిదండ్రులు ప్రతిబంధము కాకపోవుట విశేషము. కాని ప్రహ్లాద చరితమున-మాతృగర్భముననే భగవద్భక్తి బీజములను పొంది నైసర్గిక సంస్కారసంపన్నుడైన ప్రహ్లాదుని ధ్యాననిష్ఠకు తండ్రి,తద్వర్గీయులు, చివరకు విద్యను బోధించు గురువులు కూడ ప్రతిబంధకములై, వివిధ విచిత్ర క్లేశములపాలు జేయుటయు,

వాటినన్నిటిని తన యప్రతిహత శ్రీహరి భక్తిచే నధఃకరించి తన ప్రతిచర్యను-ప్రవృత్తిని భగవదారాధనముగ-భగవత్కైంకర్యముగ పరిణమింపజేసి సాక్షాత్తు శ్రీమన్నారాయణుని -పాలకడలి విడచి-యవతిరించునట్లు చేయగలిగిన పరమభాగవతోత్తముడు ప్రహ్లాదుడగుట నితాంతవిలక్షణముకావుననే ప్రపన్నజనులకీతని చరితము పరమోపాదేయము. ధ్రువుని వలె ఒకచోట కూరుచుండి ప్రహ్లాదుడు తపమొనరింపలేదు. మాటాడుచు, ఆడుచు, తినుచు, పరుండుచు, నడచుచు, స్నానమాచరించుచు ఎల్ల వేళల తన నిత్యకృత్యము లన్నియు శ్రీహరి పారమ్యమును పొందుటకు సోపానములుగ జేసికొనినాడు. దీనిని బట్టి ఏ ప్రాణియైనను సర్వము పరిత్యజించి యొకచోట కూరుచుండియే ధ్యానింపనక్కరలేదనియు, తామనివార్యముగ నొనర్చు ప్రతికృత్యమును భగవదనుధ్యానముతో మేళవించి - భగవదారాధనము చేయవచ్చునని నిరూపింప బడినది. ఎవ్వరేపని చేయుచున్నను-శ్రీహర్యనుధ్యానమునకు ఎట్టి ప్రతిబంధకము లేదని ఈ కథాసారము. భగవద్ధ్యానమునకు అవకాశము కుదురుటలేదని యాత్మవంచనము చేసికొనువారికి ఈ ప్రహ్లాదచరితము చక్కటి ప్రతిబోధము నిచ్చుచున్నది. ఈ యధ్యాయమున ప్రహ్లాదుని యనన్యభక్తి, తండ్రి వానిని పరీక్షింపనెంచి పిలిపించుటయువానినుండి హరి భక్తిని గుఱించి విని క్రుద్ధుడగుటయు ద్విజనిందజేయుటయు, ప్రహ్లాదుడు ద్విజనిందను వారించి సత్సంగ మాహాత్మ్యము నుగ్గడించుటయు, తండ్రిప్రహ్లాదుని గురుగృహమున కంపుటయు ప్రధానాంశములు.

శ్రీ నారద ఉవాచ –

తతః ప్రహ్లాదచరితం సతైః పృష్టోఽవదన్ముదా ।
ధన్యాః శృణుత విప్రేంద్రాః శ్రావ్యం భాగవతంయశః ॥ 1

వారాహకల్పేయద్వృత్తం ప్రహ్లాదస్యమహాత్మనః ।
శ్రీమాన్ పరాశరః ప్రాహ సమ్యగేవ మహామతిః ॥ 2

పాద్మకల్పేతు చరితం తస్యైత ద్వర్ణ్యతేమయా।
భవన్తి ప్రతి కల్పంహి విష్ణోర్లీలాధి కారిణః ॥ 3

శ్రీనారదమహామునిపల్కెను.

పిమ్మట నానరదమహర్షిశౌనకాదిమునిపుంగవులచే ప్రార్థింపబడినవాడై సానందముగ ప్రహ్లాదచరితమును నిట్లు చెప్పెను. ధన్యులగునోమునిసత్తములారా! తప్పక వినదగిన భాగవతకీర్తిని (భగవత్సంబంధియగు యశమును) విందురుగాక! 1

'వారాహ' మను పేరుగల కల్పమున జరిగిన మహానుభావుడగు ప్రహ్లాదుని వృత్తాంతమును, ధీశాలియగు శ్రీపరాశరమహర్షి లెస్సగ వర్ణించినాడు.

పరాన్–బాహ్య దృష్టికలవారిని (నాస్తికులను), శృణాతి– ప్రమాణతర్క శరములచే నశింపజేయువాడు కావున 'పరాశరు' డని యన్వర్థనామమును పొందినమహర్షియు, శ్రీభాగవతాది పురాణ కర్తయగు కృష్ణద్వైపాయన వేదవ్యాసుని తండ్రి, సర్వోత్తమమైన వైష్ణవధర్మమును నిరూపించు తలపున శ్రీవిష్ణుపురాణ' నామకమగు మహాపురాణమును విరచించెను. గౌడీయ సంప్రదాయ వైష్ణవులకు 'శ్రీభాగవతము' ప్రమాణతమమైనట్లు శ్రీరామానుజీయ సంప్రదాయ వైష్ణవులకు పరమోపాదేయమైనదీ విష్ణుపురాణమే 'వేదేషు పౌరుషం సూక్తం, ధర్మశాస్త్రేషు మానవమ్ । భారతే భగవద్గీతా, పురాణేషు చ వైష్ణవమ్ ॥ అని కీర్తింపబడినది. కావుననే శ్రీయామునమునులు తమస్తోత్రరత్నమున నీ పురాణమును 'పురాణరత్న' మనికీర్తించియున్నారు. ఇందు–ఆరు అంశములున్నవి. ప్రథమాంశమున 16నుండి 20వ అధ్యాయమువరకు ప్రహ్లాద చరితము సవిస్తరముగ వర్ణింపబడినది. ఈ కథవారాహకల్పముకు సంబంధించినది. పాద్మకల్పము ముగిసిన తరువాత, ద్వితీయ పరార్ధమందు 'వారాహ' మను ప్రథమకల్పము నడచుచున్నది. ఈ కల్పముయొక్క ఆరంభమున జరిగిన ప్రహ్లాదునికథ, మైత్రేయునిచే ప్రారంభింపబడినది పరాశరముని –

'మైత్రేయశ్రూయతాం సమ్యక్ చరితం తస్యధీమతః ।

నమః పుణ్యావిశేషాయ తస్మైయేన మమా్రశయం ।
ప్రాప్యమే సుఖితా జిహ్వా హరికీర్తన లంపటా ॥ 4

జిహ్వాంలబ్ధ్వాకపి యోవిష్ణుం కీర్తనీయం న కీర్తయేత్ ।
లబ్ధ్వాకపి మోక్షనిఃశ్రేణీం సనారోహతి దుర్మతిః ॥ 5

తస్మాద్గోవింద మాహాత్మ్యమానంద రససుందరమ్॥
శ్రుణుయాత్ కీర్తయేన్నిత్యం సకృతార్థో న సంశయః ॥ 6

ప్రహ్లాదస్యసదోదారచరితస్య మహాత్మనః॥ అని యారంభించి ' -

ప్రహ్లాదం సకలాపత్సు యథార్క్షితవాన్ హరిః ।

తథార్క్షతి యస్తస్యశ్రుణోతి చరితం సదా॥ అని ప్రహ్లాద చరిత మాహాత్మ్యప శ్లోకనముతో ముగించినాడు. ఈ ప్రహ్లాద చరితముతోపాటు, శ్రీకృష్ణధ్రువాది చరితములన్నియు వారాహకల్పమునకు చెందినవే. ఈ విషయమునే మాత్స్య పురాణము -

'వరహకల్ప వృత్తాన్తమధికృత్య పరాశరః
యత్ప్రాహధర్మానఖిలాన్ విష్ణోస్త ద్వైష్ణవం విదుః '

ఇత్యాదిగ నొడువుచున్నది. 2

పాద్మ కల్పమున ప్రహ్లాదుని చరితమేదికలదో దానిని నేను వర్ణించుచున్నాను. ప్రతికల్పముననను శ్రీహరిలీలానుభవమున కర్షులైన భాగవతోత్తములుందురు. 3

ఏ పుణ్య విశేషముచే శ్రీహరిగుణ సంకీర్తనా లాలసమగు నా జిహ్వ (నాలుక) సుఖానుభవమును పొందినదో అట్టి పుణ్యవిశేషమునకు నా ప్రణతులు.

బహుజన్మసంచితపుణ్యపరిపాలకవశమునగాని 'జిహ్వ' భగవద్గుణ కీర్తినాలంపటము కాదని తాత్పర్యము. 4

ఎవ్వడు జిహ్వను పొందియు కీర్తనీయుడగు హరిని కీర్తింపడో, వాడు మోక్షమార్గమునధిరోహించుటక మరియున్ననిః శ్రేణిని (నిచ్చెనను) అధిరోహించని (ఎక్కని) దుర్మతియేనని యెరుగవలయును.

భక్తస్య వైష్ణవం శ్రుత్వాయదంగం పులకాంచితం।
తత్తస్య దివ్యకవచం దురితాస్త్ర నివారణమ్॥ 7

శృణ్వాన్ హరికథాం హర్షాద్యదశ్రూణి విముంచతి।
తన్నిర్వాపయతి వ్యస్యతాపత్రయమహానలమ్॥ 8

తస్మాదిమాం కథాం దివ్యాం ప్రహ్లాదచరితాంచితామ్।
అనంత మాహాత్మ్యపరాం శ్రుణుధ్వం ఋషి సత్తమాః॥ 9

అనగా జిహ్వాయనునది భగవద్గుణ కీర్తనమొనర్పనేర్పడిన సాధనమే తప్ప సాధారణమగు నింద్రియమాత్రము కాదని తాత్పర్యము. శ్రీభగవతమున (10-10-38)

'వాణీగుణాను కథనే, శ్రవణం కథాయాం

హస్తౌచ కర్మసు, మనస్తవ పాదయోర్నః।

స్మృత్యాం శిరస్తవ నివాసజగత్ప్రణామే

దృష్టిస్సతాం దర్శనేఽస్తు భవత్తనూనామ్॥

ఇత్యాదిగ, మానవుని ప్రత్యవయవము, ఇంద్రియములు భగవదారాధనాసాధనములే తప్పవేరు కాదని చెప్పబడినది. కావుననే ముకుందమాలలో శ్రీకులశేఖరులు.

జిహ్వే! కీర్తయ కేశవం, మురరిపుం చేతో!భజ, శ్రీధరం

పాణి ద్వంద్వ! సమర్చయాచ్యుత కథాః శ్రోత్రద్వయ! త్వం శ్రుణు।

కృష్ణంలోకయ లోచన ద్వయ! హరేర్గచ్ఛాంఘ్రి యుగ్మాలయం

జిఘ్ర! ఘ్రాణ ముకుందపాదతులసీం, మూర్ధన్! నమాధోక్షజమ్॥

అని పేర్కొనినారు.

భగవంతునిచే మోక్షనిఃశ్రేణిగ(నిచ్చెనగ) నను గ్రహింపబడిన జిహ్వను భగవత్కీర్తనమునకే వినియోగించి సార్థక మొనర్పవలయుననితాత్పర్యము. 'కమలాక్షునర్చించు కరములు కరములు' ఇత్యాది పోతనగారి పద్యముకూడ, ఇక్కడ బహుధా అను సంధేయము.



కనుక పరమానంద రసభరితమై మనోహరమైన శ్రీగోవింద మాహాత్మ్యము

హిరణ్య కశిపుర్నామ పురాభూద్దితి జేశ్వరః ।
యన్నామాద్యాపి సంశ్రుత్యనూనంబిభ్యతి దేవతాః ॥ 10

యదాజ్ఞయా మునిగణాస్త్యక్త వేదపరిగ్రహాః
ధ్యానయజ్ఞ జపైర్విష్ణుం నార్చయన్ యద్వశేస్థితా ॥ 11

హుంకృతైర్నిర్జితాః శత్రోర్యస్య నామ్నైవ నిర్జితా ॥
ప్రశమం సుర్గురు గుణైః సురాః విద్రుత్య నిర్జనే ॥ 12

వినవలయును. నిత్యము కీర్తింప వలయును, అట్లొనర్చిన వాడే నిక్కముగ ధన్యుడు. 6

శ్రీహరి మాహాత్మ్యమును విని భక్తునియే యంగము పులకాంచితమైనదో (గగ్గురుపాటును పొందినదో) ఆయంగమే యాతనికి పాపమనెడి యస్త్రము

నుండి రక్షించు దివ్యకవచము గానేర్పడును.

నాదబ్రహ్మోపాసనావిశదతమచేతస్కులగు శ్రీత్యాగరాజస్వామి 'బంటురీతి కొలువియ్యవయ్యరామా' యను కీర్తినమున 'రోమాంచమను ఘన కంచుకము ' అని భగవద్భటునకు కామాద్యరిజన నిర్జయమునకు భగవదనుభవజన్యమగు రోమాంచమే కవచమనియు, రామనామమే వర ఖడ్గమనియు కీర్తించినారు. అనగా నిరంతర భగవన్మాహాత్మ్య శ్రవణ కీర్తనాదులచే పులకిత దేహులైన భక్తజనులనెట్టి పాపాస్త్రజాలములు పీడింపజాలవని తాత్పర్యము. 7

శ్రీహరి దివ్యకథామృతము నాస్వాదించుచు, పరమానంద భరిత స్వాంతులై ఎవ్వరు కన్నుల నానందాశ్రువులరాల్చుచుందురో, ఆయశ్రువులే వారి తాపత్రయ మహాగ్ని జ్వాలల నార్పివేయును. 8

కావున ప్రహ్లాద చరితముచే కూడి, యనంతుడగు శ్రీహరి దివ్యగుణ కీర్తానాపరమగు నీ కథను, ఓ ఋషిశ్రేష్ఠులారా! వినుడు.

'అనంత మాహాత్మ్య పరామ్' అను శబ్దమునకు అనంతమైనమాహాత్మ్యమును ప్రతిపాదించునదని గూడ యర్థము. 9

పూర్వము , ఎవ్వని పేరువిన్నంత మాత్రమున దేవతలు భయ విభ్రాంతు లగుదురో యట్టి దైత్య సార్వభౌముడగు హిరణ్యకశిపుడను నాతడుండెను. 10

సుదుర్వృత్తోఽపి విప్రర్షే ! జ్ఞానిభిర్యన్నదృశ్యతే ।
నృసింహ కరజైః పుణ్యైర్యః సాక్షాల్లబ్ధవాన్ గతిమ్ ॥ 13

తస్యసూనురభూన్ముక్త ః ప్రహ్లాదోనామవైష్ణవః
హిరణ్యకశిపోర్ముక్తి ర్యతో జన్మద్వయాంతరా । 14

తం విష్ణుభక్తిః స్వీచక్రే ప్రహ్లాదం జన్మనః పురా।
జన్మాంతరకృతైః పుణ్యైర్యథాయాతి స్వమశ్రమమ్ । 15

సోఽవర్ధతాసురకులే నిర్మలో మలినాశ్రయే ।
మహతి గ్రాహదుష్టేఽబ్ధౌ విష్ణోర్వక్షో మణిర్యథా । 16

సవర్ధమానో విరరాజ బాలః
సహస్రయానాథ పదాబ్జభక్త్యా ।
పరిస్ఫురంత్యా స్వపుర ః పురోత్థం ।
ఫలం దదత్యాగ్రత ఏవతత్త్వమ్ ॥ 17

ఆ హిరణ్యకశిపుని యాజ్ఞకు వశవర్తులై, మునులు సహితము వేదమును విడచి ధ్యాన యజ్ఞజపాదులచే విష్ణువునారాధించుటయు మానినారు. 11

'ఎవ్వని హుంకారము చేతను, నామ శ్రవణమాత్రముచేతను నిర్జితులైన దేవతలు విజన ప్రదేశమునసహితము వాని గుణములను గొప్పగప్రశంసింతురో.' 12

ఓ! శౌనకా! అతిపవిత్రములైన శ్రీనృసింహుని నఖరములచే(గోళ్లచే) నెవ్వడు నిసర్గ దుష్టప్రవృత్తియయ్యును సాక్షాత్తుగా జ్ఞానులకు సహితము గోచరముగాని పరమ పదమును పొందినాడో. 13

అట్టి హిరణ్యకశిపునకు పరమ భాగవతోత్తముడు, ముక్తుడునగు ప్రహ్లాదుడను వైష్ణవుడు (విష్ణుభక్తి పరాయణుడు) జన్మించినాడు. ఆతని వలననే తండ్రియగు హిరణ్యకశిపుడు జన్మద్వయవ్యవహితమగు ముక్తిని పొందగల్గెను. 14

ఎట్టి శ్రమములేకయే ధనప్రాప్తియైనట్లు, పూర్వము జన్మాంతరపుణ్య పరిపాకవశమున పుట్టినది మొదలుగ నాప్రహ్లాదుని, విష్ణుభక్తి స్వాధీన పరచు కొనినది. 15

బాలోఽల్పదేహో మహతీం మహాత్మా
విస్తారయన్ భాతి స విష్ణుభక్తిమ్ ।
సిద్ధిం మహిష్ఠామివ మంత్రరాజో
మహాలతాం బీజ మివాణు మాత్రమ్ ॥ 18

సవిష్ణు పాదాబ్జరసేన భక్తిం
ప్రవర్ధ యామాస ఫలేనసాచ
సమీహితే నైనమజస్ర మిత్థం
తయోః ప్రవృద్ధిః ప్రగుణీబభూవ । 19

అముంచతీ క్షేమకరీ చ నిత్యం
ప్రవర్ధమానా చరితేన తస్య ।
జ్ఞానామృత స్తన్యరసేన బాలం
పుపోష మాతేవ తమీశభక్తి : । 20

బహు విధ గ్రాహాదులచే (మొసళ్ళు మున్నగు ఘోరజలచరములచే ) క్లిష్టమైన సముద్రమున " కౌస్తుభమణి " యా విర్భవించినట్లు నిర్మల స్వభావుడగు నా ప్రహ్లాదుడు అతికల్మషమగు నాదనుజ వంశమున నావిర్భవించి వృద్ధినొంద సాగెను. 16

కన్నుల యెదుట ముందే స్ఫురించుచున్న తత్త్వ ఫలమును అనుగ్రహించుచున్న శ్రీహరి పాద పంకేరుహ భక్తితో పాటు వృద్ధిచెందుచు నాబాలుడగు ప్రహ్లాదుడుదినదిన ప్రభాస మానుడాయెను. 17

సదాచార్యోపదిష్టమగు మంత్రశ్రేష్ఠము మహాసిద్ధిని కల్గించినట్లును, అణుమాత్రమైన బీజము మహాలతను ప్రసవింపజేసినట్లును, అల్పదేహుడగు నాబాలుడు చిన్నతనముననే మహానుభావుడై యపారమగు విష్ణుభక్తిని వృద్ధిపొందించిన వాడై ప్రకాశించుచుండెను. 18

ఆ బాలుడు(ప్రహ్లాదుడు) శ్రీహరి పాదపద్మములయందలి ప్రీతిచే, భక్తిని వృద్ధి పొందించెను. ఆ భక్తియు సమీహిత(ఆతడుకోరిన) ఫలముననను గ్రహించుచు నాతని వృద్ధిపొందించినది. ఈ విధముగ ప్రహ్లాదుడును, భక్తియు పరస్పర పరిపుష్టితో ద్విగుణీతములైరి.

ప్రవర్ధితా కల్పలతేవ భక్తిః
శ్రీకృష్ణ కల్పద్రుమ సంశ్రయాస్మై ।
అకుంఠితాగ్రాహరహన్నవాని
జ్ఞానాది దివ్యాని దదౌ ఫలాని ॥ 21

అనగా ఎవ్వరు భగవత్పాదారవిందములయందు భక్తిని పెంపొందించు కొందురో అట్టివారికి సమస్త ఫలముల ననుగ్రహించుచు నాభక్తియు ప్రబలమగునని తాత్పర్యము. 19

ఆతనినెల్లప్పుడు ఎడబాయక, ఆతనికిక్షేమమును కల్గించుచు,ఆతని సర్వోత్తమ చారిత్రము(నడువడి)చే దినదినప్రవర్ధమానమైన భగవత్ప్రీతి రూపమగు భక్తి, జ్ఞానామృతమునే స్తన్యముగ(చనుబాలుగ) నిచ్చుచు బాలుడగు ప్రహ్లాదుని తల్లివలె పోషించుచుండెను. 20

శ్రీహరియను కల్పవృక్షము నాశ్రయించి నదగు భక్తికల్పలత అప్రతిహత ప్రవృత్తిగలదియై నిరంతరము వృద్ధిచెందుచు నాబాలునకు దివ్యజ్ఞానములను ఫలముల ననుగ్రహించు చుండెను.

20,21 శ్లోకములలో భక్తి తాను తల్లియై జ్ఞానస్తన్యమును ఇచ్చుననియు, భక్తికల్పలత–జ్ఞానఫలముల నిచ్చుచున్నదనియు చెప్పబడుటచే–భక్తి–జ్ఞానమునకు సాధనమనునభిప్రాయము వ్యక్తమగుచున్నది. కాని యీ శ్లోకముల తాత్పర్యమిది. జ్ఞానాది సకల యోగములకు సాధ్యము భక్తియే.

"భక్తిరసామృత సింధువు" ననుసరించి భక్తి త్రివిధము 1 సాధనభక్తి 2. భావ భక్తి (సాధ్యభక్తి) 3. ప్రేమభక్తి. ఈ మూడింటిలో– ఉపాసకుల మనస్సులను విశుద్ధమొనర్చి–భావభక్తిని సాధించునదే–సాధనభక్తి. ఈ సాధనభక్తి–శ్రవణ,కీర్తన, స్మరణాద్యుపాయరూపమై శాస్త్రముచే విధింపబడినప్పుడు వైధీభక్తియని వ్యవహరింపబడుచున్నది. శ్రీమద్భాగవతమున

'తస్మాద్భారత సర్వాత్మా భగవానీశ్వరోహరిః ।
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ స్మర్తవ్యశ్చే చ్ఛతాఽభయమ్ ॥

'అభయమును కోరువాడు శ్రీహరి గుణగణముల వినవలయును, కీర్తింపవలయును, స్మరింపవలయును' అని సాధన భక్తి విధింపబడినది. ఈ విధముగ శాస్త్రములచే

విధింపబడిన భక్తి-వైధీరూపమగు సాధనభక్తి. సహజముగ భగవానునిపై యను రాగములేనివారికి ఈ శాస్త్రవిహితమగు వైధీ భక్తివలన ప్రవృత్తి కలుగును. అదృష్టవశమున భగవత్కథల యందాసక్తి కలవారు వైధీభక్తికి అధికారులు. ఈ సాధనభక్తి యొక్క రెండవ ప్రభేదము-రాగానుగభక్తి. ఇది గోకులవాసులైన గోపకులకు-గోపికలకు భగవంతుని పట్లగల ప్రీతిని అనుసరించిన భక్తియే. రాగానుగభక్తియనగా గోపికల రాగముననుసరించినది.

ఇట్లు వైధీభక్తి-రాగానుగ భక్తియను నీరెండును సాధన భక్తి ప్రభేదములు-సాధనభక్తిని(భావభక్తిని)సాధించును. ఈసాధనభక్తి ప్రభేదస్వరూపవిశేషాదులు 'భక్తి రసామృతసింధువు' లో చూడనగును.

ద్వివిధసాధన భక్తి ద్వారమున అనగా శాస్త్రవిహితమగు భక్తి విధానముననుసరించిగాని-గోపికలకు కృష్ణునియందుగల రాగముననుసరించిగాని-భావభక్తి లేక సాధ్యభక్తి సాధింపనగును. హృదయమున ధ్యానవశమున కలిగిన చిత్తార్ద్రతయే భావము. ఇది భగవత్ప్రేమాభిలాషరూపము. ఈ యార్ద్రతారూపమైన ప్రీతియే ఈ యధ్యాయమున ప్రహ్లాదుని భక్తిని వర్ణించు పట్టున 23వ శ్లోకమున 'స్మరణామృతార్ద్రః' అని చెప్పబడినది. ఈ భావభక్తిలేక సాధ్యభక్తి అను భవగోచర మగునప్పుడు ధ్యేయవస్తువగు భగవానుని స్వరూపము ప్రకాశించును.

ఈ రెండు భక్తుల తరువాతది ప్రేమభక్తి. భావభక్తి దశయందు గల చిత్తార్ద్రత, బాగుగనతిశయించి, ఆనందోత్కర్షను కలిగించుచో-భగవానునియందు నిరతిశయప్రగాఢప్రీతి భావము ప్రబలమై 'ప్రేమ' శబ్దవాచ్యమగును. ఈ క్రింది శ్లోకము లీవిషయములను విశదపరచుచున్నది.

'సాభక్తిః సాధనం, భావః,ప్రేమాచేతి త్రిధామతః ।
వైధీ,రాగానుగా చేతి సాద్వివిధాసాధనాభిధా॥
యత్రరాగానవాప్తత్వాత్ప్రవృత్తిరుప జాయతే।
శాసనేనైవ శాస్త్రస్య సావైధీభక్తిరుచ్యతే॥
విరాజన్తీ మభివ్యక్తం వ్రజవాసి జనాదిషు।
రాగాత్మికామనుసృతా యాసారాగానుగోచ్యతే।
శుద్ధసత్త్వ విశేషాత్మా ప్రేమసూర్యాంశు సామ్యభాక్।
రుచిభిశ్చిత్తమా సృణ్యాకృదసౌ భావ ఉచ్యతే ।
సమ్యఙ్మసృణితస్వాన్తో మమత్వాతిశయాంకితః ।

భావస్సఏవ సాన్ద్రాత్మా బుధైః ప్రేమానిగద్యతే ॥'

ఈ త్రివిధభక్తులలో ప్రేమభక్తియే పరమోపేయము. ఇదిముక్తికంటె కూడను త్కృష్టమనిప్రస్తుత ప్రహ్లాదచరితమున నిరూపింపబడినది. ఈపరమోత్కృష్టమగు ప్రేమసముత్పత్తికి ఒక క్రమము కూడ చెప్పబడినది.

'ఆదౌశ్రద్ధా, తతఃసాధు సంగోఽథ, భజనక్రియా।

తతోఽ నర్థనివృత్తిః స్యాత్తతో నిష్ఠా రుచిస్తతః ॥

అథాసక్తిస్తతో భావస్తతః ప్రేమాభ్యుదంచతి।

సాధకానామయం ప్రేమ్ణః ప్రాదుర్భావే భవేత్క్రమః ॥

శాస్త్ర శ్రవణాదులవలన తొలుత శ్రద్ధకలుగును. శ్రద్ధాళువైనవాడు సజ్జన సాంగత్యమును పొంది, తద్ద్వారమున భజన విధానమునలవరచుకొనును. భజనము వలన తనయనర్థముల పోగొట్టుకొనును. అప్పుడు అనర్థ రూపములగు ప్రతిబంధములు లేకపోవుటచే భజనక్రియయందు నిష్ఠ(ఏకాగ్రత-సతతత్వము) కలుగును. నిష్ఠకుదరగనే భజన క్రియయందు రుచి (ప్రీతి) కలుగును. దానివలననాసక్తి (సహజమైన సంసక్తి) దానివలన చిత్తార్ద్రతారూపమగు భావము, దానివలన ప్రేమకలుగును.

ఈ ప్రేమము విభావాది సామగ్రితో కూడి యాస్వాద్యమైనప్పుడు భక్తి రసమగును. ఎవ్వనికి పూర్వజన్మ సంబంధమైన సంస్కారమువలనగాని, ఈ జన్మమున కల్గిన భగవద్భక్తి సంస్కారమువలనగాని భక్తిరసాస్వాదయోగ్యతకల్గునో వాడే ఈరసము నాస్వాదించుటకధికారి.

ఎవ్వరు అనన్యమైన భగవద్భక్తిచే దోషములనన్నింటిని పూర్తిగా విడచి ప్రసన్నమైన(శుద్ధసత్త్వ సంపన్నమైన) మనస్సు కలిగియుందురో, నిరంతరము భక్తి రసానుభవభావితాంతః కరణులైన రసికుల సాంగత్యముతో శ్రీభాగవతరక్తి కలిగియుందురో, శ్రీహరిచరణ కమలభక్తి మాత్రమే తమకు జీవన హేతువని గ్రహింతురో, నిరంతరము భగవత్ప్రేమమునకు అంతరంగములైన శ్రవణకీర్తనాదుల విధిగనాచరించుచుందురో, అట్టి భక్తజనుల హృదయములందు పూర్వశాసన ఏతజన్మీయవాసనలచే ననుభవగోచరమైన భగవత్ప్రీతియే విభావాదిరస సామగ్రిచే ఆస్వాద పదవిని పొందినప్పుడు భక్తి రసమని నిష్కర్షము. ఈయనుభవమే మానవజీవితమునకు పరాకాష్ఠ. దీనిముందు మోక్షముకూడ దిగదుడుపే. కనుకనే ప్రహ్లాదుడు 'భూయోఽపియాచేదేవేశ ! త్వయిభక్తిర్దృఢాస్తుమే।

యా మోక్షాంతచతుర్వర్గఫలదా శుభదాలతా ।' అని ప్రస్తుతగ్రంథమున (హరిభక్తి

సబాల లీలాసు, రహోఽన్యడింభైః
ప్రహే లికాక్రీడన కేషు నిత్యం।
కథా ప్రసంగేషు చ కృష్ణ ముక్తం
నోవాచ కించిత్, సహితత్ స్వభావః॥ 22

సుధోదయమున) శ్రీనృసింహుని ప్రార్థించినాడు. ఇట్టి భక్తిరసాస్వాదనమునకై యోగులు సహితము మోక్షమున గూడ విముఖులై తహతహపడుదురు.

'రసోవైసః, రసంహ్యేవాయంలబ్ధ్వానందీభవతి' ఇత్యాది శ్రుతివచనము లీ మహారసాను భవమునే ప్రమాణించుచున్నవి.

ఈ భక్తి ప్రణాళిలో 'జ్ఞానము' అంతర్లీనమై యున్నదే తప్ప వేరుకాదు. దీనినే శ్రీభాగవతము క్రింది శ్లోకములలో –

'జ్ఞానే ప్రయాసముదపాస్య నమన్త ఏవ

జానన్తిసన్ముఖరితాం భవదీయవార్తామ్ ।' అనియు

'శ్రేయః స్రుతిం భక్తి ముదస్య తే విభో క్లిశ్యంతి యే కేవల బోధలబ్ధయే।' అనియు

'పురేహ భూమన్ బహవోఽపియోగినః త్వదర్పితేహా నిజకర్మలబ్ధయా।

విబుధ్య భక్త్యైవ కథోపనీతయా ప్రపేదిరేంజోఽచ్యుత! తేగతిం పరామ్' అనియు స్పష్టపరచుచున్నది. 21

బాలుడగు నా ప్రహ్లాదుడు రహస్యముగ నితర బాలురతో క్రీడించునప్పుడును, ప్రహేలికా క్రీడనములొనర్చునప్పుడును, నిత్యము ఏ మాటలు మాటాడినను శ్రీకృష్ణనామమును విడచి వేరొక మాటపలుకడాయెను. అదియే యాతని స్వభావము.

ప్రహేలికలనునవి పొడుపుకథల వంటివి. చమత్కారార్థగర్భితములై పరితోషకరములై యుండునీ ప్రహేలికలయందు గూడ కృష్ణనామము తప్ప వేరుగ నెట్టి ప్రసంగము లేదని భావము. క్రీడలలో కూడకృష్ణనామే ఆతనికి స్వభావసిద్ధమగుటచే సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు భగవదనుస్మృతి తప్ప మరియేమియులేదని పర్యవసించుచున్నది. శ్రీభాగవతమున –

'న్యస్త క్రీడనకోబాలో జడవత్తన్మనస్తయా।

కృష్ణగ్రహ గృహీతాత్మా నవేద జగదీదృశమ్ ।'

ఇత్థం శిశుత్వేకపి విచిత్ర కారీ
వ్యవర్ధతేశస్మరణామృతార్ద్రః ।
సకల్పవృక్షాంకురవద్భవిష్య
న్మాహాత్మ్య సంసూచక రమ్యమూర్తిః ॥ 23

తం పద్మవక్త్రం దైత్యేంద్రః కదాచిల్లలనావృతః ।
బాలం గురుగృహాయాతం లాలయన్ప్రాహ సస్మితః ॥ 24

సుధీస్త్వమితి తేమాతా నిత్యం ప్రహ్లాద! తుష్యతి ।
సేయం తథావయం, కించిత్ పశ్యామో గురుశిక్షితమ్॥ 25

'ఆటవస్తువుల నావలపారవైచిజడునివలె భగవన్మయమైన మనస్సుకలవాడగుటచే ప్రహ్లాదుడు శ్రీకృష్ణనామకగ్రహముచే గ్రహింపబడెనా యన్నట్లు బాహ్యప్రపంచము నెరుగజాలడయ్యెను.' కనుకనే కూర్చొని యున్నను తిరుగుచున్నను, భుజించుచుండియు, శయనించియు,త్రావుచు, మాటాడు చున్నను ఈక్రియల నేమాత్రము పట్టించుకొనక కేవలము గోవింద భావనా సమాలింగత చిత్తుడై యున్మత్తుని వలెనున్నాడు. ఒకప్పుడేడ్చుచు, ఒకప్పుడునవ్వుచు, మరియొకప్పుడు భగవదనుధ్యానముచే బిగ్గరగపాడుచు నానందించుచుండును. శ్రీభాగవతమిట్లు చెప్పుచున్నది.

' ఆసీనః పర్యటన్నశ్నన్శయానఃప్రపిబన్ బ్రువన్।

నాను సంధత్త ఏతాని గోవింద పరిరంభితః ॥

క్వచిద్రుదతి వైకుంఠ చింతాశబలచేతనః ।

క్వచిద్ధసతి తచ్చింన్తాహ్లాద ఉద్గాయతి క్వచిత్ ।' ఇత్యాది.

ఈ వివశప్రవృత్తి, ఎవ్వరికి సాధారణ జీవనమగునో వారే భాగవతోత్తములు. వారు వారి ప్రవృత్తులయందు శ్రీకృష్ణభావనమే తప్ప వేరుగ నింకేమియు దర్శింపజాలరు. 22

ఈవిధముగ బాల్యముననే చూపరులకాశ్చర్యము కల్గించు ప్రవృత్తికలవాడై నిరంతర భగవత్స్మరణామృత సమాప్లావితుడై, కల్పవృక్షాంకురమువలె(కల్పవృక్షపు మొలకవలె) భవిష్యత్కాల మాహాత్మ్యమును సూచించు మనోహరాకృతికలవాడై వృద్ధిచెందెను.

కల్పవృక్షాంకురము అంకురతాదశయందే స్వభావసిద్ధమగు మహిమగల దై యర్థిజనుల కామనలీడేర్చుచు, చూపరులకాశ్చర్యమును కల్గించుచు, భవిష్యత్కాలమున

అథాహ పితరం హర్షాత్ ప్రహ్లాదోజన్మ వైష్ణవః ।
గోవిందం త్రిజగద్వంద్యం గురుం నత్వాబ్రవీమితే ॥ 26

ఇతిశత్రుస్తవంశ్రుత్వా పుత్రోక్తం స్త్రీవృతః ఖలః ।
ఖిన్నోఽపి తం వంచయితుం జహాసోచ్చైః ప్రహృష్టవత్ ॥ 27

ఆలింగ్యచ సతంప్రాహ సాధు కిం కింపునర్వద।
హాస్యం గోవింద కృష్ణేతి సాధు ద్విజవిడంబనా ॥ 28

ఏవం వదన్తి సత్యంతే, మమరాజ్యాత్ పురాఖలాః ।
శాశితాస్తే మయోదానీం త్వయేదం క్వశ్రుతం వచః ॥ 29

ప్రకటము కాగల మహామహిమమునకు-అను రూపమగు(తగిన) ఆకృతికలిగియున్నట్లే, ప్రహ్లాదుడును, పిన్నతనముననే సహజసిద్ధమగు హరిభక్తిచే విచిత్రకృత్యముల నొనర్చుచు, చూపరులకు భవిష్యత్కాలమున నీతడు తప్పక మహానుభావుడు కాగలడనునభిప్రాయమును కల్గించు మనోజ్ఞమూర్తియై యున్నాడని తాత్పర్యము. ఇచ్చట వర్ణింపబడిన యార్ద్రతయే భావము. ఇది ప్రేమముగను, భక్తిరసముగను పరిణమించును. 23

పుండరీకసమానవదనుడగు నాబాలుడు స్వాచార్యగృహమునుండి రాగా, ఒకప్పుడు, స్త్రీజన పరివేష్టితుడైన హిరణ్యకశిపుడు పుత్రుని లాలించుచు, చిరునగవున నిట్లనెను. 24

'ఓ ప్రహ్లాదుడా! నీతల్లి నిన్నుజూచి బుద్ధిమంతుడవని యానందించు చున్నది. నేనునునట్లే. కావున గురుగృహమున నీవేమి నేర్చితివో చూతుముగాక! 25

తండ్రి మాటలు విని బాలుడును జన్మప్రభృతి విష్ణుభక్తుడునగు ప్రహ్లాదుడు-సానందముగ- 'మూడులోకములకు నమస్కార్యుడైన గోవిందుని జగద్గురువును నమస్కరించి పల్కుదుననెను. 26

స్త్రీజన పరివేష్టితుడైన దుర్మార్గుడగు హిరణ్యకశిపుడు తనశత్రువగు శ్రీమన్నారాయణుని స్తుతిని విని, లోన ఖేదమును పొందిన వాడయ్యును బాలుని వంచింపనెంచి, ఆనందించిన వానివలె బిగ్గరగ నవ్వెను. 27

కుమారుని కౌగలించుకొని -'లెస్స! బాగున్నది! గోవిందా! కృష్ణా! ఎంతటి యపహాస్యము. ఎంతటి బ్రాహ్మణవంచన. మరల పలుకుము!" అని సోల్లుంఠనము (దెప్పిపొడుపు) గ పలికెను. 28

పితుర్దుష్టవచః శృత్వా శ్రీమాన్ స భయసంభ్రమః
ప్రహ్లాదఃప్రాహ హాహార్య మైవంబ్రూయాః కదాచన । 30

సర్వైశ్వర్యప్రదం మంత్రం భవాగ్నేః స్తంభనంతథా ।
హాస్యం కృష్ణేతి కోబ్రూయాత్, ఆద్యోమంత్రోయతోఽభయమ్-31

కృష్ణనిందాకృతం పాపం గంగయాపినపూయతే ।
కృష్ణేతి శతకృత్వస్త్వం జప! భక్త్యాఽత్మ శుద్ధయే । 32

అహో! అవిద్యాప్రాబల్యం స్వయం యేనైవ లీలయా ।
దారు దారా యథోత్సృష్టః జనోఽజ్ఞాత నిజస్థితిః । 33

నా రాజ్యమునకు పూర్వము దురాత్ములు కొందరిట్లేపలికిరి. నిజము. వారు నాచేనిప్పుడు శాశింపబడిరి. నీవీమాటనిప్పుడెచ్చటవింటివి? 29

తండ్రి పలికిన దుష్టవచనమును విని భయము, తొట్రుపాటు చెందిన ప్రహ్లాదుడిట్లనెను. 'హా! హా! తండ్రీ ఇట్టి మాట్టలెప్పుడును పలుకకుము' 30

సమస్త సంపదలన ననుగ్రహించునదియు, సంసార ఘోరానలమును శమింప జేయునదియు, ఆద్యమంత్రము అభయప్రదమునైన 'కృష్ణ' యను నామమును అపహాస్యముగ నెవ్వడు పల్కును? 31

శ్రీకృష్ణ నిందనొనర్చినందున కల్గెడి పాపము గంగాజల స్పర్శచే గూడ పోద్రోలబడదు. కావున ఈ పాపము తొలగి యతఃకరణపరిశుద్ధికల్గుటకై నీవు నూరుసారులు కృష్ణ నామమును జపింపుము.

' విద్యాచోరో గురుద్రోహీ వేదేశ్వర విదూషకః

తేఏతే బహుపాప్మానః సద్యోదండ ఇతిశ్రుతిః । విద్యను దొంగిలించువాడు, గురుద్రోహము చేయువాడు, వేదమునిందించువాడు, భగవానుని నిందించువాడు, వీరందరు మహాపాపాత్ములు. వీరికి వెంటనే దండనము విధింపవలయునని వేదము చెప్పుచున్నది. ఇట్టి మహాపాపాత్ములు కూడ భగవన్నామస్మరణముచే పాపవిముక్తులగుదురు. కావుననే సకృత్స్మృతోఽపి గోవిందో నృణాంజన్మశతైశ్చితమ్ । పాపరాశిందహత్యాశు తూలరాశిమివానలః ఒక్కసారి స్మరింపబడినంతమాత్రముననే శ్రీగోవిందనామము బహుజన్మసంచితపాపమును గూడ అగ్ని దూదిని వలె దహించి వేయునని

వినాయచ్ఛక్తి మున్మేష నిమిషేఽప్యప్రభుః స్వతః
విష్ణుం తమేవ హసతి స్వయం హాస్యస్తు వస్తుతః ॥ 34

గురవేఽపి బ్రవీమ్యేతద్యతో హితకరం పరం
శరణం వ్రజ సర్వేశం పురాయద్యపి పాపకృత్ ॥ 35

అథాహ ప్రకటక్రోధః సురారిర్భర్త్సయన్ సుతం।
ధిక్ ధిక్ చపల! తేశీలం మమాప్యగ్రే ప్రగల్భసే ॥ 36

ఉక్త్వేతి పరితో వీక్ష్య పునరాహశిశోర్గురుః
వధ్య తామేష దైతేయా నశుభంహి ద్విజేఽనృతే ॥ 37

చెప్పబడినది. 32

ఆహా! అవిద్యా ప్రభావమెంత ప్రబలముగా నున్నది. దారువు(కాష్ఠము) చే చేయబడిన భార్యా ప్రతిమను మోహించి దానివలన విలాసములచే వంచింపబడినట్లు, ఈ జనుడు తన వాస్తవ స్థితి నెరుగజాలక, అవిద్యావ్యామోహితుడై వ్యవహరించు చున్నాడు కదా! దారు ప్రతిమా విలాసము లెంత అవాస్తవములో అట్లే అవిద్యా కృతములైన అహంకారాది చిత్తవృత్తులునని తాత్పర్యము. 33

ఏ భగవానుని యనుగ్రహ శక్తిలేనిచో ఉన్మేషము(కన్నులతెరుచుట) నిమేషము-(కన్నులు మూయుట) చేయుటకు గూడ సమర్థుడు కాడోవాడు, ఆ భగవానుడగు శ్రీ విష్ణువునే యపహసించుట, వాస్తమున కాతడే స్వయముగ నపహాస పాత్రమగుటయే. 34

తండ్రివయిన నీకు పరమహితమునుచెప్పుచున్నాను. పూర్వమెంత పాపమొనర్చిన వాడవయ్యును సర్వేశ్వరుడగు శ్రీహరిని శరణుపొందుము. 35

ప్రహ్లాదుని మాటలువిని క్రోధ సంమూర్ఛితుడైన యాదానవేంద్రుడగు హిరణ్యకశిపుడు పుత్రుని భయపెట్టుచు– 'ఓరీ! యేమి నీ చపలతాగుణము. నాయెదుట గూడనిట్లు ప్రగల్భములాడుచుంటివే!' 36

ఇట్లు పలికి; అంతట పరికించి, మరల నా హిరణ్యకశిపుడిట్లు పలికెను. 'ఓ దానవులారా! ద్విజుడ సత్యమాడిన శుభముకాదుకదా! కావున వీనిని వధింపుడు.' 37

అథదైత్యై ర్ధృతోనీతో నిబధ్య కుశలోద్విజః।
ధీమానూచే ఖలందేవ ! దేవాన్తక ! పరీక్ష్యతామ్॥ 38

లీలయైవ జితందేవ త్రైలోక్యం నిఖిలం త్వయా।
అసకృన్మహిరోషేణ కింక్రుద్ధ్యస్యల్పకేమయి ॥ 39

కుశక్రోధోఽథ దేవారిః శ్రుత్వోవాచస ధిగ్ ద్విజాన్।
విష్ణోః స్తవం మత్సుతం త్వం బాలపాఠమపీపఠః॥ 40

ఇత్యుక్తేనాథగురుణా ప్రహ్లాదః పార్శ్వతః స్థితః।
సఖేదం వీక్షితః ప్రాహ తాత! వాచ్యోనమే గురుః। 41

పిమ్మట (హిరణ్యకశిపుని శాసనముననుసరించి) బంధింపబడి తీసికొని వెళ్ళబడుచున్న యా ద్విజుడు(ప్రహ్లాదుని గురువు) కుశలబుద్ధితో నిట్లనెను-'దేవా! దేవాంతకుడా! ఒకవిషయమును పరీక్షింపుము.' 38

'దేవా! లీలగననేకసారులు ముల్లోకములు జయించితివి. అట్టి నీవు అల్పుడనైన నాపట్ల రోషముతో కోపింపనేల?' 39

తీవ్ర క్రోధుడగునా, సురహంత యీ మాటవిని- 'ద్విజాలకు తిరస్కారమగునుగాక! విష్ణుస్తవమునే మాకుమారునకు బాలపాఠముగా(బాలునకుపదేశింపవలసిన పాఠముగా) పఠించితివా?' 40

ఇట్లు దైత్యేంద్రునిచే పలుకబడి దుఃఖించుచున్న గురునిచే వీక్షింపబడినవాడై ప్రహ్లాదుడు- 'తండ్రీ!మాయుపాధ్యాయుడిట్లు పరుషభాషణముచే నిందిపతగడు' అని పల్కెను. 41

'తండ్రీ! త్రిలోకగురువగు శ్రీహరిచేతనే నేనిట్లు బోధింపబడితిని. ఆయనచేతనే బోధింపబడిన నీవిట్లు అసద్భాషణమేల చేయుచుంటివి.' 42

ఎవ్వడీ లోకమున అనంతడగు శ్రీహరిచే ప్రేరింపబడక స్వయముగ మాటాడుట, భుజించు, త్రాగుట, ప్రవర్తించుట, ప్రాణవాయువును పీల్చుట చేయునో అట్టివాడు లేడు.

అనగా సమస్త కార్యములు భగవత్ప్రేరణము చేతనే జరుగుచున్నవని తాత్పర్యము. ఎవ్వడు భగవానునిచే ననుగ్రహింపబడిన చిచ్ఛక్తి, ప్రవృత్తిశక్తులను, ప్రవృత్తి నివృత్తి

త్రిజగద్గురుణైవేత్థం కారుణ్యాత్ శిక్షితోऽసి స్పృహం ।
అసాధు భాషసే నాథ! త్వం చ తే నైవ శిక్షితః ॥ 42

నసోऽస్తి తనుభృల్లోకే యోऽనంతాప్రేరితః స్వయం ।
బ్రవీతి భుంక్తే, పిబతి, చేష్టతే చ శ్వసిత్యపి ॥ 43

ఉక్తమేవ వదామ్యేతత్ త్యజేమాం తామసీంధియం ।
పూర్వంత్వయార్చితో విష్ణుర్భవ్యైశ్వర్యైక కారణమ్ ॥ 44

త్రైలోక్యైశ్వర్య మే తత్తే యత్ప్రసాదాదిహాऽభవత్ ।
తమనర్చయతో విష్ణుం వ్యక్తాతాత! కృతఘ్నతా॥ 45

పరికరములను భగవదానుకూల్య సంపాదనమునకై వినియోగించునో వానిచే భగవానుడు స్వయముగా సత్కర్మముల చేయించి యుద్ధరించును. ఎవ్వడు తనకు భగవదనుగృహీతములైన పరికరములను తద్విపరీతముగ వినియోగించునో, అట్టి భ్రష్టచిత్తునిచే నసత్కృత్యముల జేయించి నరకముల పడద్రోయును. శ్రుతియీ విషయముననే యిట్లు చెప్పుచున్నది.

'ఏష ఏవ సాధుకర్మకారయతి తంయమేభ్యో లోకేభ్య ఉన్నినీషతి' । ఏష ఏవా సాధుకర్మకారయతి తంయమధోనినీషతి' (ఎవ్వని నుత్తమ లోకముల కుద్ధరింప నెంచునో వానిచే సాధుకర్మము, అధో లోకముల పడద్రోయుదలచిన వానిచే న సాధుకర్మము చేయించునని యర్థము ) ఈ విధముగ సర్వప్రవృత్తులకు వెనుక భగవత్ప్రేరణము కలదని స్పష్టమగుచున్నది. దీనివలన భగవానునకు వైషమ్యనైర్ఘృణ్యము లేమియునంటవు. తన సంస్కారములే దానికి కారణము కదా! 43

తండ్రీ! చెప్పినదే మరల చెప్పుచున్నాను. ఈ తమోగుణప్రచురమై మోహకలుషమగు బుద్ధిని విడువుము. పూర్వము నీచే నర్చింపబడిన విష్ణువు యొక్క అనుగ్రహముచేతనే ఈ రాజ్యమున్నగు సమస్త సంపదలు కల్గినవి.' అనగా పూర్వము విష్ణ్వారాధనముచేసియుండనిచో నేడిట్టి సంపదలననుభవించు నవకాశము కలుగదని తాత్పర్యము. 44

'ఈనాడు నీవనుభవించుచున్న త్రైలోక్య సమున్నతమైన యీ సమస్త భాగ్యము యే శ్రీహరి యనుగ్రహముచే కల్గెనో, అట్టి దేవదేవునర్చింపనందున నీకృతఘ్నతాభావమును వ్యక్తమైనది.' 45

యద్వాత్మభావం నజనస్త్యక్తుం శక్నోతి సర్వథా ।
సర్వేశకల్పితం తస్మాదితోఽన్యన్న బ్రువే గురో ॥ 46

గురురప్యంగులిం మోహాదహిదంష్ట్రాన్తరేఽర్పయన్ ।
నిషేధ్య ఇతి మత్ప్రోక్తం తత్ యత్కించిత్ క్షమస్వమే ॥ 47

ఉక్త్వేతిపాదావనతం రాజాసామ్నాఽమలంసుతం ।
తద్గురుం మోచయిత్వాహ, వత్స కింత్వం భ్రమస్యలమ్ ॥ 48

మమాత్మజస్య కింజాడ్యం తథాఽశక్తద్విజాతివత్ ।
విష్ణుపక్షైర్ధ్రువం ధూర్తైర్గాఢం నిత్యం ప్రతార్యసే ॥ 49

త్యజద్విజప్రసంగంత్వం జడసంగోహ్య శోభనః ।
అస్మత్ కులోచితం తేజః తవయేన తిరోహితమ్ ॥ 50

'అయినను ఏవ్యక్తియు స్వసహజసిద్ధమగు లక్షణమును విడువజాలడు. ఈ స్వభావము భగవత్ పరికల్పితమే. కావున తండ్రీ! ఇంతకంటె వేరుగనేనేమియు చెప్పదలచలేదు.' 46

'పెద్దవాడైనను మోహవశమునమహాసర్పపు కోరలలో తన వ్రేలిని దూర్చు చున్నప్పుడు నిషేధింపదగియున్నాడని భావించి యీ మాత్రపు మాటలు పల్కితిని. క్షమింపుము.' 47

ఈ మాటలు పలికి పాదములపై బడిన నిర్మలమనస్కుడగు కుమారుని, రాజు, మంచి మాటలతో బుజ్జగించి, గురువును విడిపించి- 'నాయనా!ఏలనీచిత్త విభ్రమమును పొందుచున్నావు?' అని పల్కెను. 48

'నాకుమారుడవైననీకు దుర్బలులైన బ్రాహ్మణులకువలె నీ విష్ణుప్రీతి జాడ్యమేల కల్గినది? తప్పక విష్ణుపక్షావలంబకులగు ధూర్తులచే గూఢముగ(పైకి తెలియకుండునట్లుగ) వంచింపబడుచున్నావు.' 49

'మనదానవ వంశమున కుచితమైన తేజస్సును మరుగుపరచుచున్న యీ బ్రాహ్మణజనోచిత ప్రసంగమును విడువుము. జడులతో సంగతి అందగించదు కదా!' 50

యస్య యత్సంగతిః పుంసో మణివత్స్యాత్ సతద్గుణః
స్వకులర్ద్ధ్యై తతోధీమాన్ స్వయూథ్యా నేవసంశ్రయేత్ ॥ 51

మత్స్వతత్స్వోచితం త్యక్త్వా విష్ణు పక్షీయనాశనమ్ ।
స్వయమేవ భజన్ విష్ణుం మంద! త్వం కిం నలజ్జసే ॥ 52

విశ్వనాథస్య మేసూనుర్భూత్వాన్యం నాథమిచ్ఛసి ।
ఆరూఢస్యయతో హస్తిప్రహస్వ ఇత్యస్తి లోకవాక్॥ 53

శిశుత్వాత్త్వం నజానీషే వర్తమానః పరోక్తిభి ః
శ్రుణువత్స! జగత్తత్వం నాత్ర కశ్చిద్ జగత్ప్రభుః ॥ 54

యః శూరః స శ్రియం భుంక్తే, యః ప్రభుః సమహేశ్వరః ।
సదేవః సకలారాధ్యః సచాహం త్రిజగజ్జయీ ॥ 55

ఎవ్వని కెవ్వనితో సంసర్గముండునో వాడు ఆ గుణమునే పొందును. స్వచ్ఛమైనమణి(స్ఫటికము) తన సన్నిధియందున్న వేరొక మణియొక్క వర్ణమునేతానును పొందును. కావున బుద్ధిమంతుడు స్వవంశవృద్ధికై తన జాతి వారితోనే (తనతో సమానములైన గుణములు కలవారితోనే) సంబంధము పెట్టుకొని యుండవలయును.'

అనగా దానవ విరుద్ధ స్వభావులగు ద్విజుల సంగతిని విడచి దానవులనే యాశ్రయింప వలయునని తాత్పర్యము. 51

' ఓరీ! మందుడా! నీ కులమునకు స్వభావసిద్ధమైన వైష్ణవనాశనమును విడచి స్వయముగ విష్ణువు నాశ్రయించినీవేల సిగ్గిలకున్నావు?' 52

'ఏనుగు నెక్కినవాడు 'ఏనుగుపొట్టి' అని యన్నట్లు నిఖిలజగన్నాథుడనైన నాకుపుత్రుడవైపుట్టి, నన్ను విడచివేరొకనిని నాథునిగా నెట్లు కోరుచుంటివి.' 53

'నాయనా! నీవు చిన్నవాడవగుటచే నితరులమాటలు విని తత్త్వము నెరుగజాలకున్నావు. జగత్తత్త్వమును చెప్పెదను వినుము. ఈ జగత్తునకు(నాకంటె) వేరుగ ప్రభువెవ్వడును లేడు.' 54

'ఎవ్వడు పరాక్రమశాలియో యాతడే సమస్త సంపదలననుభవించును. ఆతడే ప్రభువు. మహేశ్వరుడు. ఆతడే సకలారాధ్యుడగు దేవుడు. ఆ దేవుడను నేనే

విష్ణునామాస్తి దేవేషు సత్యం దేవోత్తమశ్చసః ।
మాయాశంబరవత్, కిన్తు సోఽసకృన్నిర్జితోమయా ॥ 56

బాలస్త్వం తాన్ ద్విజాన్ ఇత్థముపదేష్టు మిహానయ ।
తేషామహం ప్రవక్ష్యామి యథావిష్ణోరహం పరః ॥ 57

త్యజ జాడ్యమతః శౌర్యం భజస్వ స్వకులోద్భవమ్ ।
ఉత్తిష్ఠ కేసరిశిశో జహిదేవ మృగవ్రజమ్ ॥ 58

ఇత్యాకర్ణ్య సుధీః ప్రాహ పితరం రచితాంజలిః ।
తాతైవ మేత చ్ఛూరశ్చ విశ్వనాథశ్చ నాన్యథా ॥ 59

త్వాం నాహం ప్రాకృతం మన్యే త్రిజగజ్జయినం పరం ।
ధ్రువం త్వం త్రిజగద్భర్తుః విష్ణోరేవాంశసంభవః ॥ 60

ఈముల్లోకముల జయించిన వాడను.' 55

'దేవతలలో విష్ణునామము కలవాడున్నాడు. నిక్కముగనాతడు దేవతలందరిలో గొప్పవాడే. శంబరునివలెమాయలమారియగు నా విష్ణువునాచే పలుమారులు నిర్జింపబడినాడు.' 56

'అప్రగల్భుడవగునీవు నీయుపాధ్యాయులగు బ్రాహ్మణుల నిచ్చటకు తీసికొనిరమ్ము వారికి విష్ణువుకంటె నేనెట్లు గొప్పవాడనో వచింపగలను.' 57

ఈ జాడ్యమును( శ్రీహరిభజనమే జాడ్యమని హిరణ్యకశిపుని యభిప్రాయము) విడువుము. నీకులమునకు సహజమైన శౌర్యమును పరిగ్రహింపుము. ఓ సింహపోతమా! దేవతలను మృగముల మందను విడువుము. 58

ఈమాటలను విని బుద్ధిశాలియగు ప్రహ్లాదుడు తండ్రికి నమస్కరించి -'తండ్రీ! నీవన్నదినిజమే శూరుడే విశ్వనాథుడగును వేరుకాదు.' అనిపల్కెను. 59

'ముల్లోకముల జయించిన సర్వోత్తముడవగు నిన్ను ప్రాకృతజనునిగానేను భావించుటలేదు. నిక్కముగ త్రిలోకభర్తయగు శ్రీమన్నారాయణుని యంశచేతనే నీవు పుట్టితివి.' 60

ప్రభూ! ఇతరులకు పొందరానివగు నీ సంపదలు, ఈ శౌర్యము, ఈ శక్తి, శ్రీహరి

ఇదం శౌర్యమియంశక్తిః ఈదృశః సంపదః ప్రభో!
అనంత శక్తే రంశత్వమ్ సూచయంత్యన్యదుర్లభాః ॥ 61

కింత్వన్యద విచార్యోక్తం ద్విజసంగం త్యజేతియత్ ।
ప్రసీదార్య! తమస్యంధే(భమన్ దీపం త్యజేత్కథమ్ ॥ 62

అజ్ఞానధ్వాంత దుర్లక్ష్య విషయావట సంకటే ।
ప్రజన్భవబిలే దీపం ద్విజసంగం భజేత్సుధీః ॥ 63

మాత్సర్యాద్వా వృథాద్వేషాత్ ద్విజసంగంహి యస్త్యజేత్
సన్మార్గ దర్శనం మూఢః సహన్యాత్ స్వేచచక్షుషీ॥ 64

ద్విజసంగం కథం జహ్యాదమృతాస్వాద సత్ఫలమ్ ।
ఖలసంగం కథం కుర్యాద్భవాగ్న్యుద్దీపనానిలమ్ ॥ 65

యంశసంభవుడవు నీవనియే సూచించుచున్నవి.' 61

'ఆర్యా! ద్విజసంగతిని విడువుమనిగూడ యనాలోచితముగ పలికిన మాటయే. క్షమింపుము. చీకటిలో దిరుగుచు దీపమును విడుచుటెట్లు? 62

' అజ్ఞానమనెడు మహాంధకారముచే, కానరాని విషయసుఖములను సన్నిహిత ప్రదేశములుగల్గి క్లేశభూయిష్ఠమైన సంసార బిలమున ప్రవేశించు బుద్ధిమంతుడగు వాడు ద్విజసంగమను దీపమును తప్పకపరిగ్రహింపవలయును.' 63

'మాత్సర్యము(ఓర్వలేనితనము)చేగాని, నిరర్థకద్వేషముచేగాని, ఎవ్వడు ద్విజసంగమమును విడచునో అట్టివాడు సన్మార్గమును చూపించునట్టి తమ నయనములను తానే పాడుచుకొను మూర్ఖుడని యెరుగవలయును.' 64

అమృతమువంటి స్వాదిష్ఠములగు ఫలముల నను గ్రహించు ద్విజసమాగమమును విడచుటెట్లు? సంసారఘోరాగ్ని నుద్దీపింపజేయు వాయువగు ఖలసంసర్గమును పరిగ్రహించుట యెట్లు?' 65

'తండ్రీ! విష్ణువు సర్వమయుడయ్యును ( సమస్త చరాచర ప్రపంచము విష్ణు తనువేయైనను) ద్విజులే యాతని ప్రధాన దేహములు. అట్టి ద్విజుల సంగమమును విడచి యీ జన్మమునెట్లు వ్యర్థపరచుకొందును.' 66

విష్ణోః సర్వమయస్యాపి ప్రధానాస్తనవోద్విజాః ।
కథం జన్మవృథాకుర్యాం, త్యక్త్వా తైస్సంగతిం గురో ॥ 66

గోబ్రాహ్మణాః పరందైవం హవిర్మంత్రాత్మకా యతః ।
విష్ణుశక్తి స్తదాధారా సమస్త జగదాశ్రయా ॥ 67

సర్వదేవో పజీవన్తి యానష్టౌ దేవ యోనయః ।
దేవానామపి దేవేభ్యః తేభ్యః కో ననమేద్బుధః ॥ 68

జగద్రథస్యాక్షభూతా ధృత్యై గోబ్రాహ్మణా ధ్రువమ్ ।
పూజితాః ప్రణతా ధ్యాతాః యేరక్షంతి సదాజనాన్ ॥ 69

గోవిప్రసదృశం నాన్యద్దృష్టాదృష్టం హితంనృణామ్ ।
వస్తు యద్దర్మన స్సర్మ కీర్తనైఃకల్మషాపహమ్ ॥ 70

'యాగమున దేవతోద్దేశముగ విడువబడు పవిత్ర హవిర్ద్రవ్యము వలె, మంత్రమువలె దేవాత్మకత కల్గినవియే గోవులు, బ్రాహ్మణులు(బ్రహ్మజ్ఞాన సంపన్నులు) కనుక, విష్ణుశక్తి యాగోబ్రాహ్మణుల నాశ్రయించియున్నది. గోబ్రాహ్మణుల నాశ్రయించి యుండినవిష్ణుశక్తియే నిఖిల జగత్తు కాశ్రయము.' 67

'ఎనిమిది విధములగు దేవ జాతులును యీగోబ్రాహ్మణులనాశ్రయించియే బ్రతుకుచున్నవి. దేవతలకు గూడ దేవతలైన యిట్టి గోబ్రాహ్మణుల కే బుద్ధిశాలి ప్రణతులిడడు?'

దేవతలను బ్రతికించునవి యాగములు. అనగా యాగము అందాయాయి దేవతలనుద్దేశించి యర్పింపబడు హవిర్ద్రవ్యములే దేవతలకాహారమని భావము. అట్టి యాగములకు వలసిన క్షీర, దధి, ఘృతాదుల ( పాలు, పెరుగు,నెయ్యి మున్నగువాటిని) సమకూర్చునట్టి గోవులు. మంత్రముల స్వరసంపన్నములుగ ప్రయోగించి దేవతల నాహ్వానించి వారికిహవిర్ద్రవ్యముల నిచ్చువారు, అనుష్ఠానపరులు, వైదికులు, మంత్ర స్వరూపులునగు బ్రాహ్మణులే. కావున గోబ్రాహ్మణుల నాశ్రయించియే దేవజాతులన్నియు బ్రతుకుచున్నవని తాత్పర్యము. 68

'నిఖిల జగత్తనెడు రథమునకు ఆధారమైన అక్షములు( ఇరుసునకు ఇరువైపులనుండెడి కన్నులు) గోబ్రాహ్మణులే ! అట్టి గోద్విజులు పూజింపబడి, నమస్కరింపబడి,

నిత్యోపచీయమానశ్చ పాపాగ్ని రపశైర్జనైః ।
సద్యోగిలేదిమాన్ లోకాన్ గోవిప్రైర్వారితో నచేత్ ॥ 71

విప్రా ఏవ భవవ్యాధేః క్లిష్టం స్వశరణాగతం
దివ్యజ్ఞానౌషధం దత్వా రక్షంత్యౌషధ వేదినః ॥ 72

విప్రా ఏవ విజానన్తి తద్విష్ణోః పరమం పదం
కిమసిద్ధా విజానంతి నిధిం గూఢ తమం ప్రభో ॥ 73

తస్మాద్ ద్విజోజనైః పూజ్యో జ్ఞానసిద్ధివిశేషతః ।
దేవబుద్ధ్యాద్యదజ్ఞానీ ననిర్విణ్ణః పరః పశుః ॥ 74

ఇతి పుత్రవచః శ్రుత్వా హిరణ్య కశిపుః క్రుధా ।
మిథ్యా విహస్య ప్రాహేదమహొద్భుత మిదం మహత్ ॥ 75

ధ్యానింపబడినవారై యెల్లప్పుడు లోకుల రక్షించుచుందురు.' 69

గోవులతోను, విప్రులతోను సమానముగ దృష్టాదృష్ట ప్రయోజనకరమగు వస్తువు వేరొకటిలేదు. ఏలన గోవిప్రస్పర్శనము. దర్శనము, కీర్తనము సమస్తపాపముల పోద్రోలునవే కదా! 70

పాపపరతంత్రులైన యీ జనులచే నిరంతరమువృద్ధి చెందింపబడిన పాపాగ్ని, గోవిప్రులచే నివారింప బడక యున్నచో ఒక్కసారిగ యీ లోకమునన్నిటిని మ్రింగియుండెడిది. 71

ఔషధజ్ఞులైన విప్రులే, సంసారమహావ్యధిచే పీడితుడై స్వశరణు జొచ్చిన జనుని, దివ్యజ్ఞానమనుఔషధమునిచ్చి రక్షించు చున్నారు. 72

'సర్వాత్మకుడైన శ్రీహరి దివ్యస్థానమగు వైకుంఠమును బ్రహ్మజ్ఞాన సంపన్నులు ధర్మనిష్ఠాగరిష్ఠులునైనద్విజులే తెలిసికొందురు. తపస్సిద్ధి (యోగసిద్ధి) లేని వారు గూఢముగనున్న నిధిని తెలిసికొనజాలరుగదా!' 73

కావున జ్ఞానసిద్ధుడగు (బ్రహ్మజ్ఞాన సంపన్నుడగు) ద్విజుడు విశేషముగ లోకులచే పూజింపదగియున్నాడు. దేవా! ఎవ్వడు అజ్ఞానుడు, సాంసారిక సుఖములపట్ల నిర్వేదము లేనివాడో, వాడు మహాపశువని యెరుగవలయును. 74

అసురోఽయం ద్విజాన్‌స్తౌతి మార్జార ఇవ మూషికాన్ ।
ద్వేష్యాన్ శిఖీవ ఫణినో దుర్నిమిత్తమిదం ధ్రువమ్ ॥ 76

లబ్ధ్వాఽపి మహదైశ్వర్యం లాఘవం యాన్త్యబుద్ధయః ।
యదయం మత్సుతః స్తుత్యః స్తావకాన్ స్తౌతి నీచవత్ ॥ 77

రే ! మూఢ! దృష్ట్వాప్యైశ్వర్యం మమబ్రూషే హరింముహుః
కాకః స్మరతి వా నింబఫలం చూతవనే స్థితః ॥ 78

కస్తే బహుమతో విష్ణుర్యం జానన్తి ద్విజా వద।
అస్మాదృశస్య తుహరేః స్తుతిరేషా విడంబనా ॥ 79

అవిద్యామానం తం విష్ణు వర్ణయన్ బాహుధాముదా ।
తంతూన్ వినాంబరం చిత్రం వయన్ మత్తఇవేక్షసే ॥ 80

ఈ విధముగ పుత్రుని మాటలను విని, హిరణ్యకశిపుడు, క్రోధముతో, మిధ్యా హాసమును(అసత్యమైన హాసమును) ప్రదర్శించి -ఓహో! అద్భుతము! ఇదిచాల గొప్ప విషయము' అని పలికెను. 75

'అహో! అసురుడు(రాక్షసుడు) ద్విజులను స్తుతించుచున్నాడు. పిల్లి ఎలుకలను; ద్వేషింపదగు పాములను నెమలి, స్తుతించుట నిశ్చయముగా దుష్టశకునమే.' 76

'బుద్ధిహీనులగువారు గొప్ప ఐశ్వర్యమును పొందియు తక్కువతనమునే పొందుదురు. ఏలన-సర్వులచే స్తుతింపదగిన నాపుత్రుడు, స్తోత్రపాఠకులను (వందిమాగధులను) నీచునివలె స్తుతించు చున్నాడు.' 77

' ఓరీ! మూర్ఖుడా ! నాయీ యపారైశ్వర్యమును చూచియు హరిని గురించి మాటిమాటికి పలుకుచున్నావు. తీయమామిడితోటలో నున్న కాకి వేపపండును స్మరించునా? 78

'ద్విజు లేవిష్ణువును తెలిసికొనుచున్నారో, నీకేవిష్ణువు ఇష్టుడో ఆతడెవ్వడు? మాబోటివారికి ఆ హరిని స్తుతించుటయే యాత్మవంచన.' 79

అభిత్తి చిత్రకర్మేవ ఖపుష్పస్యేవ సౌరభమ్ ।
మూఢ నిర్విషయంవిష్ణోః కిం నజానాసి సంస్తవమ్ ॥ 81

త్వం పశ్యసి శిశుర్విష్ణు మపి సూక్ష్మదృశోవయం ।
వీక్షమాణా న పశ్యామో మత్తః పశ్యతి కోఽపరః ॥ 82

నిందంతమిత్థం తమువాచ బాలో
జ్ఞానార్ణవః స్వపితరం సరోషః
అభీరఖిన్నః సపిథాయ కర్ణే
గురుశ్చవాచ్యః పరగుర్వ మిత్రః ॥ 83

సత్యం నజానాసి మునీంద్రగుహ్యం
జడస్వభావోఽస్య జడస్వభావమ్ ।
అకంపనం తం బహు కంపనస్త్వం
నిగూఢ తత్త్వం ప్రకటార్థదర్శీ ॥ 84

'వాస్తవమునకు "లేని" విష్ణువును ఆనందముతో వర్ణించుచున్న నీవు, దారములేకుండగ చిత్రమగు వస్త్రమును నేయునట్టి యున్మత్తునివలె గోచరించుచున్నావు.' 80

'నిరాధార ప్రదేశమున బొమ్మను గీచినట్లు, ఆకాశపుష్పపు పరిమళమువలె, ఓ మూర్ఖుడా! ఆ విష్ణువుని స్తోత్రము నిర్విషయమని (నిరాలంబనమని) తెలియదా?' 81

' అప్రగల్భుడవు శిశుడవైన నీవు విష్ణుని చూచుచుంటివా? సూక్ష్మదృష్టిగల మేమెంత చూచినను ఆతడు కన్పట్టడయ్యె! మాకంటె సూక్ష్మదృష్టులెవ్వరు?' ఈశ్లోకమువరకు హిరణ్య కశిపుని నాస్తికతా వాదములు తమోగుణ ప్రచురతగల దైత్య స్వభావులగు నాస్తికుల హృదయాభిప్రాయ సారములని యెరుగవలయును. వారికి ప్రత్యక్షము తప్ప ఇతర ప్రమాణములులేవు. కావున కంటికగుపింపని వస్తువును లేదని యందురు. 82

జ్ఞానసాగరుడును, క్రోధావిష్టుడును, ఎట్టి భయము,ఖేదములేనట్టి బాలుడగు ప్రహ్లాదుడు–కర్ణముల(చెవులు) మూసికొని–ఇట్లనెను.

జ్ఞానేనయేషాం విదధే విధాతా
పరాయణం కేవల చక్షురాది ।
కారుణ్య పాత్రం బతదేహినస్తే
కథం విజానీయురతీంద్రియంతమ్ ॥ 85

మనస్తుతద్వేదకమస్తి లబ్ధం
మాత్సర్యదంభ స్మరపంకలిప్తమ్
పుంసాం మనస్తత్ సమలం, విశుద్ధం
విష్ణుం కథంవేదయితుం ప్రభు స్యాత్ ॥ 86

' పరమగురువగు శ్రీహరినిద్వేషించువాడు గురుడైనను(తండ్రియైనను, ఆచార్యుడైనను,) నింద్యుడే!' 83

'మునీంద్రులకు మాత్రమే తెలియదగు రహస్యతమము, చైతన్యస్వభావము, అచలమునైన భగవత్తత్త్వమును, జడస్వభావుడవు, ఇంద్రియవశ్యతచే లోలస్వభావుడవు, కంటికగుపించు వస్తువులను మాత్రమే దర్శింపగల వాడవునైననీవు వాస్తవముగ తెలియజాలకున్నావు.' 84

'ఎవ్వరికి కేవల బాహ్యవస్తుజ్ఞానముచేతనే చక్షురాదీంద్రయములకు కృతకృత్యతను బ్రహ్మకల్పించినాడో, అట్టి భగవద్దయాపాత్రులైన దీనులగు మానవులు ఇంద్రియములచే గ్రహింపరాని శ్రీహరినెట్లు తెలిసికొందురు. ఇది దీని తాత్పర్యము.

హిరణ్యకశిపుని మాటలలో శ్రీహరి కన్నులతో చూడబడనందున లేడను వాదము వ్యక్తమైనది. ప్రహ్లాదుడీ వాదమును దూషించుచున్నాడు. కన్నులచే చూడబడని కారణమున శ్రీహరిలేడనుట కుదరదు. ఏలన ఈ చక్షురాదీంద్రయములు బాహ్యములగు వస్తువుల గ్రహించుటచే మాత్రమే కృతార్థములగునట్లు బ్రహ్మచే కల్పింపబడినవి. కావున ఇంద్రియగ్రాహ్యుడుగాని భగవానుడు ఇంద్రియములచే దర్శింపనలవిగాడు కావున ప్రత్యక్షము శ్రీహరియునికిని దెలిసికొన ప్రమాణము కాజాలదని తాత్పర్యము. దీనివలన నలౌకికమైన భగవత్తత్త్వము లౌకిక ప్రమాణములచే తెలియబడదని తెలియుచున్నది. 85

'మనస్సు భగవద్విషయక జ్ఞానము పొందగలిగినదే అయినను, ఈ మానవుల మనస్సు, మాత్సర్యము(ఓర్వలేనితనము)దంభము(అహంకారము లేక గర్వము)స్మరుడు

విచక్షణాస్తస్యమలాని సమ్యక్
విధూయ వైరాగ్య జలేనకేచిత్ ।
శుద్ధేన తే నాథ! విదన్తి శుద్ధం
సగోచరః స్యాత్కథమస్మదాదేః ॥ 87

మాత్సర్య లోభ స్మరదోషశిష్యాః
పశ్యేమ విష్ణుం యదితం వయంచ ।
తత్ కిం వృథాష్టాంగకయోగతంత్రైః
క్లిశ్యంత్యలం పర్ణభుజో మునీంద్రాః ॥ 88

(మన్మథుడు లేక కామవికారము) మున్నగు దోషములచే కూడి మలినమై నదగుటచే. శుద్ధసత్త్వస్వభావుడగు శ్రీహరిని తెలియజేయగల సామర్థ్యము కలది కానేరదు.'

'ఆత్మావా అరేద్రష్టవ్యః శ్రోతవ్యోమంతవ్యో నిదిధ్యాసితవ్యః'

ఇత్యాది ప్రమాణములచే మనస్సు మననినిదిధ్యాసనాది సాధనముగా చెప్పబడినందునను –'ధ్యాయీత మనసా దేవ' మిత్యాదిగ మనస్సు చేతనే ధ్యానము చేయవలసియున్నదని తెలియు చున్నందున మనస్సు సాధనమే. కాని పురుషుల మనస్సు బహువిధ దోషపంకిలము–ఇతరుల యుత్కృష్టతను జూచి యోర్వజాల కుండుట, గర్వపడుట, కామదోషగ్రస్త మగుట మున్నగు దూషణములను బట్టి నిర్మలమగు భగవత్తత్త్వమును తెలియ మనస్సు గూడ సాధనము కాజాలదని తెలియుచున్నది. కావుననే యుపనిషత్తులు– 'యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ 'అని చెప్పుచున్నవి. 86

' ఓరాజా యుక్తాయుక్త, కార్యాకార్య విచక్షణులైన కొందరు మహానుభావులా మనస్సున కంటిన సర్వవిధ మలములను వైరాగ్యమనెడు జలముచే లెస్సగ కడిగివైచి, సత్త్వగుణపూర్తిచే పరిశుద్ధమైన యా మనస్సుతో శుద్ధసత్త్వ స్వభావుడగు పరమాత్మని తెలిసికొందురు. మనబోటివారి కాతడు ఎట్లగుపించును? 87

'మాత్సర్యము(ఆకారణద్వేషము) లోభము, కామము మున్నగు వివిధ దోషములచే శాశింపబడుచు, వాటికి లోబడిన మనమే శ్రీహరిని దర్శింపగలిగినచో, పర్ణాశనులగు మునీంద్రులు యోగాదినియములచే, నేలక్లేశముల కొనితెచ్చు కొందురు?' కావున మాత్సర్యాది దోషదూషితులకు భగవద్దర్శనము దుర్లభమని తాత్పర్యము. 88

అహంచ తం తాత! నవేద్మి సమ్యక్
జ్ఞాతః సచేత్ సర్వమయః సుఖాత్మా ।
పునర్నభేదప్రవేణేన పుంసా
భావ్యం, విభుస్తర్హి విముక్తిరేషా । 89

వయం తు తాదృక్స్థితి కాంక్షిణోఽపి
వృథాహతాశా స్తమజం నవిద్మః ।
కించిత్ కదాచిద్యదితాత విద్మః
తస్యైవమాయా పునరావృణోతి। 90

తండ్రీ! నేనును బాగుగ సర్వాత్మకుడు,ఆనంద స్వరూపుడు విభుడునగు నా శ్రీహరిని యెరుగజాలను. ఆతడే తెలియబడినచో నీజనుడు భేదప్రవణుడు కాడు కదా! అప్పుడది మోక్షమేయగును.'

తాను పరమాత్మయగు శ్రీహరికి చెందినవాడనను భావన లేక స్వతంత్రుడనను భావన కలిగి ప్రవర్తించుటయే భేదప్రవణత. భగవద్దర్శనమైనప్పుడు అంతట భగవానుడే అంతర్బహిర్వ్యాప్తుడనియు, విభుడు-ఆనందస్వరూపుడని యెరిగినపుడు, తాను స్వతంత్రుడనను భావన కవకాశములేనందున భేద ప్రవణత కవకాశములేక తాను ముక్తినే పొందగలుగనని తాత్పర్యము. 89

'మనమట్టి భేదప్రవణతా రహితమగు స్థితిని కోరువారమయ్యును వ్యర్థముగ మాత్సర్య లోభ కామాదిదోష దూషితులమై అజుడగు శ్రీహరి నెరగ జాలకున్నాము. తండ్రీ! ఎప్పుడైననొకప్పుడు కొంచెమా శ్రీహరిని తెలిసికొన్నను-వెంటనే, యాతని మాయచే సమ్మోహితులమై విదూరులమగు చున్నాము.'

మాయాసమ్మోహితత్వము చేతనే తత్త్వము నెరుగజాలక నేనే సర్వేశ్వరుడను, స్వతంత్రుడనను బుద్ధికి నరుడు వశపడుచున్నాడని తాత్పర్యము. హిరణ్యకశిపుని ద్వేష ప్రవృత్తికి వైష్ణవ మాయయే కారణమనిగూడ సూచింప బడుచున్నది. 90

'తండ్రీ! ఆ విషయమట్లుండనిమ్ము! విష్ణుదర్శనమున వేరొకకారణమును గూడ చెప్పుచున్నాము వినుము. మాత్సర్యమను వస్త్రము జ్ఞాన శరీరమునకు గట్టిగా చుట్టబడియున్నది. 91

' మాత్సర్యదోష జుష్టుడవు కావుననే ద్వేషబుద్ధితో శ్రీహరిని జూచుచున్నావు.

తత్రావదాస్తాం భూయోఽపి కారణం విష్ణుదర్శనే।
శ్రుణు మాత్సర్య వస్త్రంహిజ్ఞానాంగావరణం దృఢమ్ ॥ 91

మాత్సర్యాదీక్షసే విష్ణుం తతవీనం నపశ్యసి ।
లోచనే సుదృఢం బద్ధ్వా దిదృక్షుః కిమిహేక్షతే ॥ 92

భక్తిపూతో దిదృక్షుస్తం తద్ద్రక్ష్యసి జగన్మయం।
దివ్యాంజనాక్తనయనః సిద్ధోఽదృశ్యమివౌషధమ్ ॥ 93

స్వమాయయా జగత్కృత్స్నం వశీకుర్వన్నపీశ్వరః।
విష్ణుః భక్త్యైకయా చిత్రం వశోభవతి దేహినామ్ ॥ 94

కన్నులను దృఢముగ మూసికొని చూడదలచియు నేమి చూడగలడు'? 92

'దివ్యమగు నంజనముచే(కాటుకచే) కూడిన కన్నులు కల సిద్ధపురుషుడు కంటికగుపింపని యోషధిని గూడ చూడగల్గినట్లు, భక్తి పూతుడవై చూడదలచినచో జగన్మయుడగు శ్రీహరిని చూడగల్గుదువు'. 93

'తనమాయచే సమస్తలోకముల వశపరచుకొనుచున్న శ్రీహరి సహితము తనయందు దేహులకు గల యవ్యాజభక్తిచే వశపడుచున్నాడు. ఎంత చిత్రము! '

భగవంతునియందుగల యనన్యభక్తిచే, భగవన్మాయనే కాక మాయియగు (మాయచే జగమును వశపరచుకొను స్వభావముగల) భగవానుని గూడ వశపరచుకొనవచ్చునని తాత్పర్యము. శ్రీభగవద్గీత 'భక్త్యా త్వనన్యయా శక్యః' అనియు,

'అనన్య చేతాస్సతతం యోమాంస్మరతినిత్యశః ।

తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్యయోగినః॥' అనియు,

'మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।

సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయకల్పతే॥ అనియు,

భగవానుడు అనన్య భక్తి మాత్ర వశ్యుడని యుట్టంకించుచున్నది.

'యోమద్భక్తః సమేప్రియః' (ఎవ్వడు నా భక్తుడో వాడేనాకు ప్రేమాస్పదుడు) 'శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేతీవమేప్రియాః' (ఎవ్వరు భక్తి యోగము నాశ్రయించి శ్రద్ధాళువులై నాయందే అనన్య భావనకల భక్తి కలిగియుందురో వారే నా కత్యంతప్రియులు'

తమనిచ్ఛన్ సుఖాత్మానం సర్వదుఃఖాశ్రయం స్వయం ।
జనః సుసేవ్యం మూఢాత్మా శోచ్య ఏవ కిముచ్యతే ॥ 95

ఇతి ప్రహ్లాద వచనం నిశమ్య సురకంటకః ।
భ్రుకుటీ వికటాటోప స్ఫుటక్రోధోద్భటాననః ॥ 96

వవర్ష వైష్ణవే సూనౌ భర్త్సనాశనిసంచయం ।
తమేవ భావం నృహరౌ సూచయన్నఖిలాత్మని ॥ 97

మూఢః స్వశరణాచ్చైవం గోవింద వరణం ద్విజాః ।
నిర్వాసయామాస భటైః ఆయుశ్శేషమివాత్మనః ॥ 98

'నమేభక్తః ప్రణస్యతి' (నాభక్తుడు నాశనమును పొందడు) 'యే భజన్తి తుమాంభక్త్యామయితే, తేషుచాప్యహమ్'(ఎవ్వరు భక్తినాశ్రయించి నన్నారాధింతురో వారు నాయందును, నేను వారి వారి యందును ఉందుము) 'పురుషః సపరః పార్థ భక్త్యాలభ్యస్త్వ నన్యయా' (అర్జునా ఆపరమ పురుషుడు అనన్య భక్తిచే మాత్రమే పొందదగియున్నాడు) ఇత్యాద్యసంఖ్యాకవచనములు భగవానుడు భక్తిమాత్రవశ్యుడని ప్రమాణించుచున్నవి. 94

' సుఖాత్మకుడును సుఖముగ సేవింపదగినవాడును అయిన శ్రీహరిని కోరక, సర్వదుఃఖాస్పదమగు దానిని( సంసారాదికమును) కోరువాడు మూఢుడై శోచనీయుడేయగును. ఏమని చెప్పవలయును? 95

ఈ విధముగ ప్రహ్లాదుడు పలికిన పలుకులను విని సురద్వేషియగు హిరణ్యకశిపుడు కనుబొమలవక్రచాలనములచే స్పష్టమైన క్రోధభావమున భయదమగు ముఖము కలవాడయ్యెను. 96

'విష్ణుభక్తిపరాయణుడైన కుమారునియందు బెదిరింపులను పిడుగులను కురిపించెను. క్రోధభావమునే అఖిలాత్మకుడగు నరహరియందుగూడ ప్రకటించెను. 97

' శ్రీహరి చరణ దంద్వమును శరణు జొచ్చినబాలకుడగు ప్రహ్లాదుని, మూర్ఖుడగు హిరణ్య కశిపుడు తనయాయుర్దాయమును తానే వెడల నడచి నట్లింటినుండి భటులచే పోద్రోలెను. 98

జిహ్మం నిరీక్ష్యచ ప్రాహ, చాధరం కంపయన్ క్రుధా।
యాహి యాహి ద్విజపశో! సాధుశాధి శిశుంమమ ।  99

ప్రసాద ఇత్యేవవదన్ సవిప్రో
జగామ గేహం ఖలరాజసేవీ ।
విష్ణుం విసృజ్యాన్వచరచ్చ దైత్యం
కింవా నకుర్యుః భరణాయ లుబ్ధాః ।  100

ఇతి శ్రీనారదీయే హరిభక్తి సుధోదయే ప్రహ్లాదచరితేఽష్టమోఽధ్యాయః

ఉపాధ్యాయులగు ద్విజులను గూడ కుటిల దృష్టితో నిరీక్షించి, క్రోధముచే పెదవులు కంపింప-' పొమ్ము! పొమ్ము! ద్విజపశువా! నాకుమారుని బాగుగ శాసించుము' అనిపలికెను.  99

'స్వామ్యనుగ్రహము. అని పలుకచు నాయుపాధ్యాయుడు మూర్ఖ రాజసేవాశీలుడు గావున శ్రీహరిని విడచి యాదైత్యునే అనుసరించి సేవించెను. ఉదరపోషణలాలసులైన దీనులగు లుబ్ధులు(లోభబుద్ధికలవారు) ఇంకేమి చేయగలరు?  100

ఇది శ్రీనారదీయ పురాణాంతర్గతమగు హరిభక్తి సుధోదయమున

ప్రహ్లాద చరితమను నెనిమిదవ యధ్యాయము.

# నవమాధ్యాయము

**నవమాధ్యాయసారము :–** హిరణ్య కశిపుని యాజ్ఞను పురస్కరించుకొని గురుని గృహమునకు తోడ్కొని పోబడిన ప్రహ్లాదుడు క్రమముగ బాల్యమును విడచి కౌమారవయస్సును పొందినాడు. కాని కౌమారవయః సహజమైన నాస్తికత్వమాతని హృదయము నంటలేదు. మీదుమిక్కిలి బాహ్యవిషయానాసక్తియు, శ్రీకృష్ణరక్తియు వృద్ధి చెందసాగినవి. ఆతని ప్రజ్ఞాన చంద్రుడు దినదిన ప్రవర్ధమానుడగుచు, గురువుచే నుపదేశింపబడకయే పరోక్ష బ్రహ్మ మాతనిక పరోక్షమైనది. నిసర్గ బుద్ధిశాలులకు గరూపదేశమన పేక్షితము కదా! ఇట్లు సహజముగ తత్త్వ విద్యయు, ఇతర శాస్త్రములును ఆతనికి కరతలామలకములు కాగా, ఒకప్పుడు తండ్రిచే పిలువబడినాడు.

తండ్రికి, ప్రహ్లాదుడు, అర్థశాస్త్ర నీతివిద్యల వైయర్థ్యమును లెస్సగ వివరించినాడు. భవశత్రు సంహారకమైన తత్త్వ విద్యనే ప్రశంసించి, నీతి, సంపదలకుగల సాధ్యసాధన భావమును నిరసించి, సర్వసాధ్యము పరమోపేయము శ్రీహరి తత్త్వమేనని నిష్కర్షించినాడు.

బాహ్యలక్ష్మికంటె భగవత్సేవాలక్ష్మియే మర్త్యోపాదేయమని యుట్టంకించినాడు. శ్రీహరి సముపాశ్రయణమే మర్త్యజన్మ ఫలమని యుద్ఘోషించినాడు. ఉలూకము – భాస్కరజ్యోతిస్సును సహింపనట్లు రాక్షసుడు, శ్రీహర్యుప శ్లోకనమును సహింపజాలక 'అస్త్రములచే చంపుడని భటులనాజ్ఞాపించెను. విషమును తినిపించెను. సర్పములచే కరిపించెను. ఎంతవరకు తన హృదయ కుహరములందు కొలువున్న అంతకాన్తకుని మానవుడు గుర్తింపలేడో అంతవరకే బాహ్యదుఃఖములు. గుర్తించిన వానికి బాహ్యక్లేశములకించిత్కరములు కదా! ప్రహ్లాదుని హింసింప నుద్యమించిన భటుల యాయుధములు ముక్కలైనవి. సర్పముల శిరస్సులు పగిలినవి. కోరలూడి త్రెళ్లినవి. శ్రీహర్యనుధ్యానముచే యోగియైన ప్రహ్లాదుని దేహమప్రధృష్యము కాగా, ఘోరవిషాహులు శిరస్సుల వంచితమ యశక్తతను నిర్లజ్జముగ ప్రకటించినవి. ఘోరాశీవిషము లచేగూడ, 'మహానుభావుడ'ని, కీర్తింపబడిన ప్రహ్లాదుని యచంచల విశ్వాసము – అనన్యభక్తి – నిరంతరాను ధ్యానము – క్రమముగ విజృంభింపగా – దైత్యునిహృదయమున క్రోధావేశములు వికటములై తాండవమాడినవి. పర్యవసానము ఆత్మహానియని యా తమోగుణ ప్రచురుడగు దైత్యుడెరుగడు కదా !

శ్రీ నారద ఉవాచ –
సోఽప్యాశు నీతో గురువేశ్మ దైత్యైః
దైత్యేంద్ర సూనుః గురుభక్త భూషః ।
అశేష విద్యానివహేన సాకం
కాలేన కౌమార మవాప యోగీ । 1

ప్రాయేణ కౌమార మవాప్యలోకః
పుష్ణాతి నాస్తిక్య మసద్రతించ ।
తస్మిన్ వయస్యస్య బహిర్విరక్తిః
కృష్ణే త్వభూచ్చిత్ర మజేచ భక్తిః । 2

యదాకలాభి స్స కలాభిరేష
పూర్ణో భవేన్నైవ తదాస్య సమ్యక్ ।
ప్రకాశితానన్త పదః సమస్తాః
ప్రజ్ఞానచంద్రస్తు కలాః పుపోష । 3

శ్రీ నారదుడు పల్కెను. గురుభక్తిసమలంకృతుడగు నాయసురసూనుడగు ప్రహ్లాదుడు వెంటనే గురుగృహమునకు రాక్షస భటులచే తోడ్కొని పోబడినాడు. సమస్త విద్యలతో పాటుగ కాలక్రమమున యోగియగు నాబాలకుడు బాల్యమును విడచి కౌమారనామకమగు ద్వితీయ వయస్సును పొందెను. 1

సాధారణముగ కౌమారవయస్సును పొందిన జనుడు, అసద్విషయముల యందాసక్తిని, నాస్తిక్యబుద్ధిని పెంచుకొనుచుండును. కాని ప్రహ్లాదునకు మాత్రమీవయస్సున బాహ్యవిషయల యందు విరక్తియు అజుడగు శ్రీకృష్ణుని యందు భక్తియు పరిపుష్టము లగుట చాల విచిత్రము.

ఈ శ్లోకమున ప్రహ్లాదునకు కృష్ణునియందు భక్తి మిక్కుటమైనది చెప్పుటచే నొక సందేహము కలుగవచ్చును. నృసింహావతారము తరువాత నేర్పడిన యవతారము కృష్ణావతారము కావునను, కృష్ణావతార సమయమునకు ప్రహ్లాదుడు లేడు కావునను కృష్ణునియందు భక్తికలిగినదనుట యెట్లుకుదురును? అని. ఈశ్లోకమే కృష్ణుడు అవతారము కాదనియు అవతారములన్నిటికి మూల భూతుడగు నవతారి యనియు తెలుపుటకు ప్రమాణమగుచున్నది. వాసుదేవశబ్దము సర్వాంతర్యామియగు పరమాత్మను

క్షయిష్ణుతారాహుభయవ్యతీతం
ప్రజ్ఞాన సంజ్ఞం విధుమస్త దోషం ।
సదోదితం ప్రాప్యనవం స చంద్రో
రేజేఽకలంకః హృత సర్వ పాపమ్ । 4

దైత్యేంద్ర భీత్యా గురుణాప్య నుక్తం
బ్రహ్మాస్య సాక్షాదపరోక్షమాసీత్ ।
హరేః ప్రసాదేన సహస్రరశ్మౌ
స్థితేహి దీపే ననదృశ్యదృష్టిః । 5

బోధించినట్లే కృష్ణశబ్దము గోలోకవాసియు సచ్చిదానంద విగ్రహుడునగు శ్రీకృష్ణ భగవానుని బోధించుచున్నది. ఆయన యవతారముగాక సాక్షాత్తు భగవానుడే కనుక ప్రహ్లాదునకు కృష్ణభక్తి యుచితమే. ఆ భగవానుడే నృసింహుని గ నవతరించెనని గూడ దీనిని బట్టి నిర్ధారింప వచ్చును. ఎనిమిదవ యధ్యాయమున – 'శ్రీకృష్ణ కల్పద్రుమ సంశ్రయా' అనియు, 'గోవిందం త్రిజగ ద్వంద్యం' అనియు, 'హాస్యం గోవిందకృష్ణేతి' అనియు, 'కథా ప్రసంగేషు చ కృష్ణముక్తం' అనియు 'కృష్ణనిందాకృతం పాపం' అనియు పలుసారులు కృష్ణగోవింద శబ్దములు ప్రయోగింపబడినవి. ఇవి సర్వావతార మూలభూతుడు శ్రీకృష్ణ శబ్ద కీర్తితుడునగు శ్రీహరినే బోధించుచున్నవని యెరుగవలయును 2

'బాలుడగు ప్రహ్లాదుడెప్పటికి సంపూర్ణకళలతో పరిపూర్ణుడుకాలేదో అప్పటికే అనగా అంతటి అప్రగల్భతా దశయందే, ఆతని ప్రజ్ఞాన చంద్రుడు (బ్రహ్మజ్ఞాన మనెడి చంద్రుడు) ప్రకాశింప జేయబడిన అనంత పదము కలిగి సమస్త కళలను పోషించెను.' ఇది దీని తాత్పర్యము. అప్పుడే బాల్యమును విడచి కౌమారమున ప్రవేశించిన ప్రహ్లాదునకు వయఃపరిపాక జన్యములగు విశేషములింకను పూర్ణముగ నేర్పడకున్నను, సహజ సిద్ధమగు శ్రీహరి పాదసమాసక్తి చేత నాతని విజ్ఞానము (తత్త్వజ్ఞానము) సమస్త విశేషములతో వయః పరిపాక మునకుమించి వృద్ధి చెందినది. అనగా వయోఽనను రూపమగు భగవత్ప్రీత్యతి శయము ఆతనికి విలక్షణతను చేకూర్చినదని భావము. అనన్త పదమనగా నాకాశము, శ్రీహరిపాదమునని యర్థము. 3

'క్షీణించు స్వభావము కల్గియుండుట, రాహువు వలన భీతి నొందుట యనునవి యతిక్రమించి ఎట్టికళంకము, (మచ్చ) లేక సర్వపాప వినాశకమై నిరంతర ముద

గురూప దేశాంశ్చ వృథైవ మన్యే
మహామతే ర్మాంధ మతేర్భృశంచ ।
నిరామ యస్యేహ కిమౌషధేన
పుంసస్తథైవోత్కట యక్ష్మభాజః ॥ 6

అథ సంపూర్ణ విద్యం తం కదాచిద్దితిజేశ్వరః ।
ఆనాయ్య ప్రణతః ప్రాహ, ప్రహ్లాదం దైత్యపుంగవః ॥ 7

జ్ఞాతం ద్విజోక్తం తత్కృత్స్నమసదిత్యద్యకిం త్వయా ।
యేనార్వాక్ ఛాదితోహ్యే సీర్భస్మన్యే వాగ్నిరప్రభః ॥ 8

యించుచున్న నవప్రజ్ఞానచంద్రుని పొంది నిష్కళంకుడగు నా ప్రహ్లాదచంద్రుడు ప్రకాశించెను.' 4

హిరణ్యకశిపుని వలన భీతిచే నుపాధ్యాయుని చేగూడ బోధింపబడని ' పరం బ్రహ్మతత్త్వమా ప్రహ్లాదునకు సాక్షాత్తుగ ప్రత్యక్షానుభవ గోచరమయ్యెను. ఇది శ్రీహరి యనుగ్రహము వలననే యేర్పడినది. నిఖిల జగత్ప్రకాశకుడగు సూర్యుడు ప్రకాశించుచుండ దృశ్యవస్తు దర్శనము కాలేదనుట యుండదుకదా! ఈ శ్లోకమున - 'యత్ సాక్షాద పరోక్షం బ్రహ్మ' అను శృతివచనము పరామర్శింప బడినది. 5

విలక్షణ ప్రతిభా శాలియగు వానికిని, ప్రతిభారహితుడైన మందబుద్ధికిని గరూపదేశము వ్యర్థమేనని భావింతును. ఏలన - ఎట్టిరోగములేని వానికిని, బాగుగా ముదిరిన రాజయక్ష్మ (క్షయరోగము)కల వానికిని ఔషధమువలన ప్రయోజనము లేదుకదా!

అనగా బుద్ధిమంతుడు సహజ కౌశలము చేతనే గురూపదేశాపేక్ష లేకయే విషయముల గ్రహించును కావున నాతనికి గురూపదేశ మక్కరలేదు. ఇక మందబుద్ధికి గరూపదేశమున్నను ఎట్టివిశేషముండదు. కావున తదపేక్షలేదు. ఎట్లన్నను, - ఎట్టిరోగము లేకపరిపూర్ణారోగ్య సంపన్నుడగు వానికి ఔషధాపేక్ష లేనట్లుగనే, బాగుగాముదిరి వైద్యమునకు లొంగని దశలోనున్న క్షయరోగముచే బాధపడువానికి గూడ నిష్ఫలము కావున నౌషధము అక్కరలేదు కదా!

గురూపదేశాపేక్ష లేకయేనైసర్గిక సంస్కారముచే ప్రహ్లాదుడు తత్త్వద్రష్ట కాగలిగెనని తాత్పర్యము. 6

సాధ్వజ్ఞాన నిధేర్బాల్యాన్ముక్తోఽసి సురసూదన ।
ఇదానీం భ్రాజసే భాస్వాన్నీహారాదివ నిర్గతః ॥ 9

బాల్యేవయంచ త్వమివ ద్విజైర్జాడ్యాయ మోహితాః ।
వయసావర్ధమానేన పుత్రకైవంను శిక్షితాః ॥ 10

తదద్య త్వయిధుర్యేఽహం సర్వ కంటకతాధురం ।
విన్యస్య స్యాం చిరధృతాం సుఖీ పశ్యన్ శ్రియం తవ ॥ 11

గురుశ్చ నీతినైపుణ్యం మమాగ్రేఽ వర్ణయత్తవ ।
నచిత్రం పుత్ర తచ్చోక్తం విచిత్రం వాంఛతః శ్రుతేః ॥ 12

నేత్రయోః శత్రు దారిద్ర్యం శ్రోత్రయోః సుతసూక్తయః ।
యుద్ధవ్రణంచ గాత్రాణాం, మానినాం హి మహోత్సవః ॥ 13

పిమ్మట (కొంత కాలము తరువాత) పరిపూర్ణ విద్యావంతుడగు నా ప్రహ్లాదుని యసుర నాయకుడగు హిరణ్యకశిపుడు పిలిపించి, ప్రహ్వాభావుడగు నాతనితో నిట్లనెను. 7

'నివురుకప్పిన నిప్పువలె ప్రకాశరహితుడవైయున్న నీవు బ్రాహ్మణులు చెప్పినదసత్యమని యెరిగితివా?' 8

'అజ్ఞాన నిధానమైన బాల్యము నుండి విముక్తుడవై, మంచుతెరల చీల్చుకొని బయల్వెడలిన సూర్యునివలె నిప్పుడు ప్రకాశించుచున్నావు !' 9

'కుమారుడా! మేమును బాల్యవయస్సున నీవలెనే ద్విజులచే వ్యామోహితులమై జడత్వమును వహించియు, క్రమముగ పరిణతి నొందిన వయస్సుచేతనే యిట్లు సుశిక్షితులమైతిమి.' 10

'కనుక నేడు ధురంధరుడవైన నీయందు, నేనింతవరకు వహించిన సర్వకంటకత్వ భారమును, (అందరిని పీడించి లొంగదీసికొనుట యను బాధ్యతను) ఉంచి, నీ యైశ్వర్య వైభవమును చూచుచు సుఖముగ నుందునుగాక! 11

'కుమారా! నీగురువు, నీనీతి శాస్త్రనైపుణ్యమును నా ముందట వర్ణించినాడు.

శ్రుత్వేతి నికృతి ప్రజ్ఞరక్షః పతివచస్తతః ।
జగాద యోగీ నిఃశంకం ప్రహ్లాదః ప్రణతో గురుమ్ ॥ 14

సూక్తయః శ్రోత్రయోః సత్యం మహారాజ మహాత్మ్యవః ।
కింతు తా వైష్ణవీర్వాచో ముక్త్వానాన్యా విచారయ । 15

నీతిః సూక్తికథాశ్రావ్యా, శ్రావ్యం కావ్యంచ తత్త్వతః ।
యత్ర సంసృతి ధుఃఖాఘ రక్షాగ్ని ర్గీయతే హరిః ॥ 16

దుర్బద్ధంవా సుబద్ధంవా వచస్తత్ సద్భిరీడ్యతే ।
అచింత్యః శ్రూయతేయత్ర భక్త్యా భక్తేష్పితప్రదః । 17

అర్థ శాస్త్రేణ కింతాత! యత్ స్వసంసృతి వర్ధనః ।
శాస్త్ర శ్రమేణ కింతేన యేనాత్మైవ విహింస్యతే ॥ 18

కాని విచిత్రమును వాంఛించుచున్న (కోరుచున్న) నా శ్రవణేంద్రియమున కాతడు చెప్పినదంత చిత్రముగలేదు. 12

'అభిమానధనులగు వారికి - కన్నులకు శత్రుదారిద్ర్యము (శత్రువుల దీనతాదశ) చెవులకు పుత్రుల మనోహరవాక్కులు, శరీరావయములందు యుద్ధమువలన కల్గిన గాయము, చాల ప్రీతిని కల్గించును కదా! 13

ఈ విధముగ శ్రీహరిద్వేష దోషదూషితమగు ప్రజ్ఞగల యసురనాథుని మాటను విని, పిమ్మట, నిగృహీతేంద్రియుడును, వినమ్రభావుడునగు ప్రహ్లాదుడెట్టి సంశయమును లేక యిట్లనెను. 14

'మహారాజా! నిజమే! సూక్తులు వీనులకు శ్రవణపేయములే కాని యవివిష్ణు మాహాత్మ్య ప్రతిపాదకము లైనప్పుడే. ఇతరములు కావు. యోచింపుము.'

ఏనీతివాక్కు, ఏసూక్తికథ, ఏకావ్యము, వాస్తవముగ సంసారదుఃఖాత్మకమగు మహాపాపమును దహించు తీవ్రాగ్నియగు - శ్రీహరినికీర్తించు చుండునో అదియే శావ్యమగును. 16

సాధారణ బుద్ధిచే భావింప నలవి కానివాడును, భక్తిచే మాత్రమే భక్తజనుల

నీతిభిః సంపదః, తాభిః బహ్వ్యః స్యుర్మమతా దృఢాః ।
తాభిర్బద్ధో భవాంభోధౌ నిమజ్జత్యేవ దుర్మతిః ॥ 19

దరిద్రాణాం త్వభూయంసి మమతా బాధనా నిహ ।
కదాచిదుత్తరేయుస్తే విరక్తా భవవారిధేః ॥ 20

సుస్థేన సంపదస్తస్మాన్న కామ్యా నీతి శాస్త్రతః ।
వ్యాధయః ప్రార్థనీయాః కిం వృథా దృష్టౌషథాదనాత్ ॥ 21

తత్ స్వీకుర్వంతి విద్వాంసః శాస్త్రం యేన భవాభిధః ।
అనాదిర్విన్యతే శత్రుః మహాస్త్రంసుభటాయథా ॥ 22

కామనల నీడేర్చువాడును అయిన శ్రీహరిని కీర్తించు వాక్కు దుష్టమైనదైనను, పరిశుద్ధమైనదైనను సజ్జనులెల్లప్పుడు కొనియాడుచుందురు. అనగా శ్రీహరిని కీర్తించు వాక్కునకు బాహ్యమైన శాస్త్రాది పరిశుద్ధ్య పరిశుద్ధులు అకించిత్ కరములని తాత్పర్యము.

శ్రీమద్భాగవతమీ యభిప్రాయమునే యీక్రింది శ్లోకమున నొడువుచున్నది.

సవాగ్విసర్గః జనతాఘసంప్లవో యస్మిన్ ప్రతిశ్లోకమబద్ధవత్యపి ।
నామాన్య నంతస్య యశోంకితాని యత్ శ్రుణ్వన్తి గాయన్తి గృణన్తి సంతః ॥

ఏవాక్కు దోషవిరహితము సుందరము కాకున్నను భగవద్యశోగాయకమై జనపాప వితతిని నాశనమొనర్చునో అదియే నిజమైన వాక్కు. దానినే సజ్జనులు విందురు, గానమొనర్చుదురు, కీర్తింతురు. కావున భగవత్ప్రతిపాదకమగు వచనమే శ్రవణీయమని భావము. 17

తంత్రీ తనదగు సంసారమును వృద్ధి నొందించు అర్థశాస్త్రమువలన నేమి ప్రయోజనము? ఏ శాస్త్రము ఆత్మహింసకు కారణమగునో ఆశాస్త్రము కొఱకు శ్రమించుట వ్యర్థమే! ఈశ్వర ప్రతిపాదకములు కాని శాస్త్రములన్నియు వర్జనీయములని తాత్పర్యము. 18

నీతి శాస్త్రములు సంపదలవృద్ధి నొందించును. సంపదల వలన ధృఢములగు మమ తాను రాగములు కల్గును. మమతాను రాగములచే బంధింప బడిన దుర్మతి, సంసారసముద్రమున తప్పక మునుగును. కనుక బంధకారణములైన నీతి శాస్త్రములు వర్జనీయములని తాత్పర్యము. 19

కించ సాధన భూతా హి నీతయః, సంపదః, ఫలమ్ ।
ఫలసాధన భేదాది, లోకే విష్ణుమయే కుతః ॥ 23

చేతనా చేతనం కృత్స్నం జగద్విష్ణు మయం యదా ।
కర్తు స్సాధన సాధ్యాది భేదాస్తే తే తదావృథా । 24

సంతువా సంపదస్సాధ్యాస్తాసుకిం సత్వలం భవేత్ ।
త్యక్త్వా తదార్జనే క్లేశం క్లేశంచ తదపాయ జమ్ ॥ 25

ధన బంధు మయీా లక్ష్మీ ర్విద్యుల్లోలా నచేత్తతః ।
యుజ్యేతా ప్యార్జనం తస్యాః దృష్ట సారాచ సాతదా । 26

దరిద్రులైనవారికి మమతా బంధనములంతగా నుండవు. కనుక ఒకప్పుడు సంసార సాగరమునుండి విరక్తులై వారు తరింపవచ్చును. 20

కనుక స్వస్థచిత్తుడైన వాడెవ్వడును నీతి శాస్త్రమును బట్టి ధనార్జనము చేయరాదు. (సంపదలను కోరరాదు) కంటికి మందులు కనుపించుచున్నవికదాయని రోగముల నెవ్వడైన కోరితెచ్చు కొనునా ? 21

కనుక, యోద్ధలైన భటులు మహాస్త్రమును పరిగ్రహించినట్లు, విద్వాంసులు భవమని పేరుగల యనాది శత్రువును సంహరింపగల శాస్త్రమునే స్వీకరింతురు. తృతీయాధ్యాయమున 9,12 శ్లోకములలో నీయభిప్రాయమే చెప్పబడినది. 22

ఈ లోకమంతయు విష్ణుమయమై యుండగా సంపదలు ఫలములనియు, ఆ ఫలములను సాధించు సాధనములు నీతులనయు, ఈ ఫలసాధన రూపమగు భేదము పరిగణింపతగదు. అనగా సర్వఫల స్వరూపుడు శ్రీహరియే. ఆ ఫలముల సాధింప జాలు సాధనము కూడ శ్రీహరి యేనని తాత్పర్యము. 23

పై శ్లోకమునందలి భావమునే మరల ప్రదర్శించు చున్నాడు. ఈ సమస్త చేతనా చేతనాత్మకమైన ప్రపంచము విష్ణుమయము. కనుక ఇదిసాధనము ఇది సాధ్యము అనునది విష్ణువుకంటె వేరుగ నేదియు లేదు. అనగా అన్ని సాధనములు, సాధ్యములు, శ్రీహరియే యైనప్పుడు సంపదలు సాధ్యములనియు, నీతిశాస్త్రములు సాధనములనియు భావించుట వ్యర్థమని తాత్పర్యము. ఈ సమస్త జగత్తు శ్రీహరి తనువని పూర్వము - తృతీయాధ్యయమున గల - ' స్వవపుషైవ జగద్వి రచయ్య ' ఇత్యాది శ్లోకమున నిరూపింపబడినది. (శ్లో. 37) 24

యదివా దుర్మతిః కశ్చి ద్బాహ్యలక్ష్మీ మవేక్షతే ।
తథాపి నీతిభిః కింస్యాత్ సేవ్యః శ్రీశోహి సర్వదః ॥ 27

దదా త్యభ్యంతరాం లక్ష్మీం, బాహ్యాంవా సుధి యార్చితః ।
భక్తి చింతాను సారేణ ప్రభుః కారుణ్యసాగరః । 28

సర్వజ్ఞం, మనసా సేవ్యం, లీలా సృష్ట జగత్త్ర యమ్ ।
అక్షోభ్యం, కరుణా సింధుం, కృష్ణం కస్తాత నా శ్రయేత్ ॥ 29

ఒకవేళ సంపదలు సాధింపదగినవి యైన కానిమ్ము! కాని వాటిలవలన, అవి సంపాదించుకు పొందిన క్లేశము, అవి నశించి నప్పుడు కలిగెడి క్లేశము తప్ప, ఫలమేమున్నది? 25

ధనబంధురూపమైన యీలక్ష్మి, మెరుపు తీగవలె క్షణభంగురము (చంచలము) కాకుండినచో నప్పుడది కొంత సారము కలదియగును. కనుక, దానిని సంపాదించుట యుక్తమై యుండెడిది. కాని యట్లు లక్ష్మి స్థిరమెప్పుడును కాజాలదని తాత్పర్యము. 26

ఒకచో నెవ్వడైన దుర్మతి, బాహ్యమగు చంచలమైన లక్ష్మిని వీక్షించును గాక, అయినప్పటికిని నీతిశాస్త్రముల వలన నేమిఫలము? సర్వ సంపత్ప్రదాతయగు శ్రీపతియే సేవింపదగియున్నాడు. ఇచ్చట 'శ్రీశ' యనుపదమును ప్రయోగించుటను బట్టి బాహ్యమగు నైశ్వర్యము ననుగ్రహించు లక్ష్మియే సాక్షాత్తుగ శ్రీహరి వశవర్తినియై యుండగా నా శ్రీహరిని సేవించుట మాని, లక్ష్మిప్రాప్తికై శుష్కములగు నీతి శాస్త్రముల నాశ్రయించుట మూర్ఖత్వమే తప్ప వేరు కాదని తాత్పర్యము. 27

కరుణా సముద్రుడగు, ప్రభుడునగు శ్రీహరి సద్బుద్ధితో నర్చింప బడినప్పుడు భక్తి ధ్యానాద్యను సారముగ నాంతరలక్ష్మిని బాహ్యలక్ష్మిని, కూడ యనుగ్రహించును. బాహ్యలక్ష్మి యనగా ధనధాన్యాది సమృద్ధి. ఆంతరలక్ష్మి యనగా భగవత్పరి చరణసౌభాగ్యమే. బాహ్యమగు లక్ష్మి చంచలము. భగవత్సేవాలక్ష్మి మర్త్యునకు అమర్త్యత్వమును కలిగించి భగవత్ప్రేమరూపమగు నిత్యఫలమును అనుగ్రహించునది కావున సర్వవిలక్షణమైనదని యంతర్గత తాత్పర్యము. 28

సర్వజ్ఞుడును (త్రికాలాబాధమైన సార్వవిషయిక జ్ఞానము కలవాడును) మనస్సుచేత (ధ్యానరూపముగ) సేవింపదగినవాడును, లీలగ ముల్లోకముల సృజించినవాడును,

వైష్ణవం వాఙ్మయం తస్మాత్ సేవ్యం శ్రావ్యంచ సర్వదా ।
ముముక్షుభి ర్భవ క్లేశాన్నో చేన్నైవ సుఖంక్వచిత్ ॥ 30

ఇతితస్యవచః శ్రుణ్వన్ సరోషోఽమృత సన్నిభమ్ ।
జజ్వాల దైత్యః సంతప్తం సర్పిరద్భిరి వాధికమ్ ॥ 31

ప్రహ్లాదస్య గిరం పుణ్యాం జనసమ్మోహ నాశినీం ।
నామృశ్యతాసురః శ్రుత్వోలూకో భాను ప్రభామివ ॥ 32

అక్షోభ్యుడును, దయాసముద్రుడును, అయిన కృష్ణుని యెవ్వరాశ్రయింపరు.

ఈశ్లోకమునగల సర్వజ్ఞాది శబ్దముల యర్థమును సంప్రదాయాభిజ్ఞులిట్లు ప్రతిపాదించు చున్నారు. సర్వజ్ఞః - సమస్త ప్రపంచమును స్వరూపతః సాక్షాత్కరించుకొన్నవాడు. భక్తులయొక్క శక్యాశక్యములను, సాధ్యా సాధ్యములను అనుసంధించువాడు, సర్వశ్చ అసౌజ్ఞశ్చ అనికూడ మరియొక వ్యుత్పత్తి. స్వయముగ సర్వాత్మకుడును, స్వాత్మజ్ఞానము కలవాడునని యర్థము. నిగ్రహానుగ్రహోచిత జ్ఞానము కలవాడని కూడ యర్థము. అక్షోభ్యః - గంభీర మగు నాశయము కలవాడగుటచే నవికార్యుడు అనియొక యర్థము. తనను అనన్య భావముతో నాశ్రయించిన ప్రసన్న జనులకు అభయమిచ్చి, దృఢచిత్తముతో నెట్టి క్షోభమునకు లొంగక ప్రతిజ్ఞను నెరవేర్చువాడు.

'సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదామ్యే తద్వ్రతంమమ ।'

అను శ్రీరామ చంద్ర వచనముచే భగవానుని యక్షోభ్యత్వము స్పష్టమగుచున్నది. ఈ శ్లోకమున కృష్ణశబ్దము గోలోకవాసియై యవతారియైన భగవానుని ప్రతిపాదించు చున్నది. ఈ ప్రయోగమును బట్టి శ్రీకృష్ణమూర్తి యవతారియే(అన్నియవతారములకు మూలమే) కాని యవతారము కాదని తెలుపబడుచున్నది. 29

కనుక నెల్లప్పుడు మోక్షేచ్ఛగల జనులచే విష్ణుప్రతిపాదకమైన వాఙ్మయము సేవింపదగినది. వినదగినది. లేనిచో నీ సంసార క్లేశమునుండి వారికి మోక్షము దుర్లభము. సుఖమును సర్వాత్మనా దురవాపమే. 30

పుత్రుని యమృత రసోపమములైన వాక్కుల విని, యా హిరణ్యకశిపుడు కాగిన నేయి నీటిచుక్కలచే మండినట్లు క్రోధముచే ప్రజ్వరిల్లెను. 31

పరితో వీక్ష్య సంప్రాహ క్రుద్ధో దైత్య భటానిదం ।
హన్యతా మేషకుటిలః శస్త్ర ఘాతైః సుభీషణైః । 33

ఉత్కృత్యోత్కృత్య మర్మాణి, రక్షత్వేన మతోహరిః ।
పశ్యత్విదానీ మేవైష హరిసంస్తవజం ఫలమ్ ॥ 34

మా భూయః కర్ణ పదవీం జ్వాలయన్తీ మనోమమ ।
యథా గచ్ఛేద్ధరికథా తథైనం నయత క్షయమ్ ॥ 35

అథో ద్యతాస్త్రా దైతేయా స్తర్జయన్తః స్వగర్జితైః ।
అచ్యుతా దచ్యుతం ధీరం తంజఘ్నుః పతిచోదితాః ॥ 36

ప్రహ్లాదోఽథప్రభుం నత్వా ధ్యాన వజ్రం సమాదధౌ ।
స్థిర చిత్తస్తు దేవేశ ప్రసాదాత్ పూతతాం గతః ॥ 37

గుడ్లగూబ సూర్యకాంతిని దర్శింప జాలనట్లు, లోకమోహము ను పొద్రోలు పవిత్రమైన ప్రహ్లాదవాక్కును ఆదానవుడు విమర్శింప జాలడయ్యెను. 32

కుమారుని మాటలకు క్రుద్ధుడైన తండ్రి నలువైపుల పరికించి భటులతో నిట్లనెను. ఈ కుటిలబుద్ధి భయంకరములగు శస్త్రఘాతములచే (దెబ్బలచే) చంపబడును గాక ' అని. 33

వీని శరీరమునుండి మర్మ భాగములను వెలికి పెరికి పెరికి, శరీరమును కాకులకు, గ్రద్దలకు, రాబందులకు, ఆహారముగా నిడుడు. ఆ హరియే వీనిని రక్షించును గాక! హరి స్తవనము వలన కలిగిన ఫలమును వీడిప్పుడే చూచును గాక! 34

'నా మనస్సు ప్రజ్వలింప జేయు హరిగాథ మరల నాశ్రవణ పథమున పడకుండునట్లు వీనిని చంపుడు' అని క్రోధవివశుడై యాదైత్యుడు పలికెను. 35

పిమ్మట ప్రభువగు హిరణ్యకశిపునిచే ప్రేరింప బడినవారై రాక్షసులు ఆయుధముల పైకెత్తి తమ గర్జనములచే భయపెట్టుచున్నవారై శ్రీహరినుండి యెంత మాత్రము జారిపోని స్థిరబుద్ధియైన ప్రహ్లాదుని కొట్టిరి. 36

అంతనా ప్రహ్లాదుడు ప్రభువునకు నమస్కరించి ధ్యానమను వజ్రమును (వజ్రాయుధమును) పరిగ్రహించినవాడై, దేవదేవుడగు శ్రీహరి యనుగ్రహమువలన

సపర్య శక్తేరీశస్య ప్రసన్నస్య ఘృణానిధేః ।
కరాంబుజేన శ్లక్ష్ణేన సర్వాంగేషు ప్రమార్జితః ॥ 38

దధౌచ తత్ ప్రసాదేన వజ్రీభూతం నిజం వపుః ।
అభేద్యం సుదృఢం విష్ణోర్మహిమ్నైవ ఘనీకృతమ్ ॥ 39

అకృత్రిమరసం భక్తం తమిత్థం ధ్యాన నిశ్చలమ్ ।
రరక్ష భగవాన్ విష్ణుః ప్రహ్లాదం పరమేశ్వరః ॥ 40

అథాలబ్ధ పదాన్యస్యగాత్రే శస్త్రాణి రక్షసామ్ ।
లీలాబ్జ శకలానీవ పేతుశ్ఛిన్నాన్న్య నేకధా ॥ 41

కిం ప్రాకృతాని శస్త్రాణి కరిష్యంతి హరిప్రియమ్ ।
తా పత్రయమహో స్త్రౌఘః సర్వోఽప్యస్మాద్బిభేతిహి ॥ 42

చిత్తస్థైర్యమును పొంది పవిత్రుడాయెను.

ఇచ్చట శ్రీహరి ధ్యానమే వజ్రాయుధమని చెప్పుటచే, వజ్రము శత్రుప్రయుక్తములైన యాయుధముల నాశనమొనర్చినట్లు ధ్యానముకూడ శస్త్రపీడను దూరము చేసినదను భావము స్ఫురించుచున్నది. లేదాధ్యాన వజ్రమను సమాసమును బట్టి వజ్రమువలె చెదరని దుర్భేద్యమైన ధ్యానమును పరిగ్రహించినాడని యర్థము. ధ్యానదశయందు బాహ్యస్పృహ యుండదు. కాన శత్రుప్రహారము లేమియు బాధకములు కాలేదని తాత్పర్యము. 37

ఆ ప్రహ్లాదుడు, సర్వశక్తి సంపన్నుడును, ప్రసన్నుడును, దయాసాగరుడును నయిన పరమేశ్వరుడగు శ్రీహరి, మృదుల కరకమలముచే సర్వావయవములందు తడుమ బడినవాడాయెను. 38

ఇట్లు శ్రీహరి కరకమల మృదుల స్పర్శచే వజ్రమువలె దర్భేద్యము శ్రీహరి ప్రసాద మహిమలచే ఘనీకృతము (శిలవలె గట్టిగా చేయబడినది) అగు శరీరము నాప్రహ్లాదుడు పొందెను. 39

సహజమైన భగవత్ప్రీతి కలిగి తదారాధనా తత్పరుడై ధ్యాననిష్ఠుడైన ప్రహ్లాదుని పరమేశ్వరుడగు , శ్రీవిష్ణుభగవానుడు రక్షించెను. 40

హిమమగ్నిం, తమః సూర్యం, పన్నగాః పతగేశ్వరమ్ ।
నాసాదయన్త్యేవ యథా తథాస్త్రాణి హరిప్రియమ్ ॥ 43

అంతకాత్ కాలకూటాచ్చ కాలరాత్ర్యా లయాలయాత్ ।
వైష్ణవానాం భయంనాస్తి రక్షోభిర్మశకైశ్చ కిమ్ ॥ 44

పీడయన్తి జనాంస్తావద్ వ్యాధయో, రాక్షసా, గ్రహాః ।
యావద్గుహాశయం విష్ణుం సూక్ష్మంచేతో నవిందతి ॥ 45

తస్మిన్ పరావరే దృష్టే నృణాంకిం దుర్జయం ద్విజ !
ససర్వజిత్ సర్వేశో, యోజినాతి జగన్మయమ్ ॥ 46

నైవ చాలయితుం శేకుః ప్రహ్లాదం లఘవోఽ సురాః ।
అంతఃసారం స్మృతహరిం సుమేరుమనిలా ఇవ ॥ 47

అనంతర మారాక్షస ప్రయుక్తములైన యస్త్రములు ప్రహ్లాదుని శరీరమును బాధింపజాలనివై విలాసకమలపు ముక్కలవలె భిన్నములై క్రింద పడిపోయినవి. 41

తాపత్రయరూపమగు మహాస్త్ర సముదాయమే ప్రహ్లాదుని వలన భయపడినప్పుడు సాధారణములైన శస్త్రములు శ్రీహరి ప్రీతిపాత్రుడైన వానినేమి చేయగలవు? 42

మంచు అగ్నిని, చీకటి సూర్యుని, సర్పములు గరుత్మంతునెట్లు సమీపింపలేవో యట్లే శస్త్రము లెవ్వియు శ్రీహరి ప్రియుడగు ప్రహ్లాదుని సమీపింపలేదు. 43

అంతకుని వలన, కాలకూట విషమువలన, కాళరాత్రివలన, నరకమువలన విష్ణుభక్తుల కెట్టి భయము లేదు. క్షుద్రకీటకములవంటి రాక్షసుల వలన నేమి భయము ? 44

హృదయమను గుహయందు నివసించియున్న సూక్ష్మస్వరూపుడగు శ్రీహరిని మనస్సెంత వరకు పొందజాలదో, అంతవరకు జనులను వ్యాధులు, రాక్షసులు, గ్రహములు (పిశాచాదులు) బాధించుచునే యుండును. చిత్తము విష్ణు సమాయత్త మైనప్పుడివి యేవియు పీడింప జాలవని తాత్పర్యము. 45

పరావరుడైన భగవానుడు సాక్షాత్కరించినప్పుడు నరులకింక జయింప రానిదేమున్నది. ఎవ్వడు జగన్మయుడైన శ్రీహరిని తన యనన్య భక్తిచే జయించునో, వాడు సర్వజేతయై సర్వ సమర్థుడు కాగలడు. 46

తేఽథ భగ్నాస్త్ర శకలైః ప్రతీపోత్తైరితస్తతః ।
హన్య మానా న్యవర్తంత సద్యః ఫలదఘైరివ ॥ 48

నచిత్రం విబుధానాం తదజ్ఞానాం విస్మయావహమ్ ।
వైష్ణవం బలమాలోక్య రాజానూనం భయందధౌ ॥ 49

ఆజన్మతావత్తద్దేహే నైవలబ్ధాంతరం భయమ్ ।
తదావిశజ్జాతఫలం శ్రీ భాగవత పీడయా ॥ 50

ససంభ్రాన్తో దైత్యరాజః కిమేత దితివిస్మితః ।
తస్థౌ తూష్ణీం క్షణం భీతః పన్నగేనేవ వేష్టితః ॥ 51

పునస్త స్యవధోపాయం చిన్తయత్యేవ దుర్మతిః ।
స్వకర్మప్రేర్యమాణోవా కింకుర్యాదవశో జనం । 52

మేరుపర్వతమును వాయువులు కదల్పజాలనట్లు హరిస్మృతిచే నంతర్గత సారము కలవాడగు ప్రహ్లాదుని, లఘుబుద్ధులు (బలహీనులు) అయిన రాక్షసులు కదిలింప జాలరైరి. 47

అంతనారాక్షసులు, వెనుకకు తిరిగివచ్చి తమనే తాకుచున్నట్టివియు, వెంటనే ఫలించిన పాపముల వంటివియునగు భగ్నశస్త్రశకలములచే (విరిగిన ఆయుధముల ముక్కలచే) కొట్టబడిన వారై వెనుకకు మరలిరి. 48

విద్వాంసులకు విచిత్రమైనది కాకున్నను, అజ్ఞానులకు ఆశ్చర్యమును కలిగించునట్టి యావైష్ణవ బలమును చూచి రాజు, నిక్కముగ భీతిని పొందినాడు. 49

జన్మించినది మొదలు హిరణ్యకశిపుని శరీరమున ఏ మాత్రము అవకాశమును పొందని భయము, భాగవతోత్తముడగు ప్రహ్లాదుని పీడించిన కారణముగ, హిరణ్యకశిపునిలో ఆవేశించి సాఫల్యమును పొందినది. 50

చిత్త సంభ్రమమును పొందిన యా హిరణ్యకశిపుడు 'ఏమియిది'యని యాశ్చర్యమును పొందినవాడై సర్పముచే చుట్టబడిన వానివలె ఒక్కక్షణము భయపడి మిన్నకుండెను. 51

ఇట్లు భయవిభ్రాన్తుడయ్యును ఆదుష్టమతియగు హిరణ్యకశిపుడు మరల ప్రహ్లాదుని

సమాదిశత్ సమాహూయ దండశూకాన్ సుదుర్విషాన్ ।
అశస్త్ర వధ యోగ్యోఽయమ నార్య చరితోఽసకృత్ । 53

తస్మాద్భవద్భిర్న చిరాత్ హన్యతాం గరలాయుధాః ।
దష్టం స్వభుజమప్యాశు ఛింద్యాదేవ కులద్రుహమ్ ॥ 54

ఘాతయిష్యామ్యముం పుత్త్రం సదాకృత పరస్తవమ్ । 55

హిరణ్య కశిపోః శ్రుత్వా వచనం తద్భుజంగమాః ।
తస్యాజ్ఞాం జగృహుర్మూర్ధ్నా ప్రహర్షాద్వశవర్తినః । 56

అథ జ్వల ద్గరల కరాళ దంష్ట్రిణః
స్ఫుట స్ఫుర ద్దశన సహస్ర భీషణాః ।
అకర్ణకా హరిమహిమస్వకర్ణకాః
హరిప్రియంద్రుతతర మాపతన్ క్రుధా । 57

వధించుటకుపాయము నాలోచించుచునే యుండెను. తన కర్మముచేత ప్రేరితుడై వివశుడైన జనుడేమిచేయడు? 52

అంత నా హిరణ్యకశిపుడు దుస్సహమైన విషతీవ్రతగల యాశీవిషముల (సర్పముల) పిలచి యిట్లాదేశించెను. 'నిరంతరము అనార్య (దుర్జన) వ్యవహారము కల వీడు శస్త్రములచే చంపదగినవాడు కాడు.' 53

'కనుక ఓ – సర్పములారా! వెంటనే మీచే వీడు చంపబడును గాక! విషపుకాటును పొందినప్పుడు తనభుజమునైనను వెంటనే ఛేదింప వలయునుకదా! అట్లే కులద్రోహియగు పుత్రుడును సంహరింపదగియే యున్నాడు.' 54

'కనుక నిరంతరము శత్రు స్తవన పరాయణుడైన యీ పుత్రుని చంపింపగలను' అని 55

హిరణ్యకశిపుడు పల్కిన యీ మాటను విని యాసర్పములు, ఆతనికి వశవర్తులై, యాజ్ఞను సానందముగ శిరసావహించినవి. 56

పిమ్మట ప్రజ్వలించుచున్న ఘోరవిషముచే భయంకరములగు కోరలు కలవియును, స్పష్టముగ ప్రకటింపబడిన దంత సహస్రములచే భీతికరములు, శ్రీహరి మహిమయందు ప్రవర్తింపని కర్ణములు (చెవులు) కలవగుటచే కర్ణరహితములునైన యాశీవిషములు క్రోధముతో హరిభక్తుడగు ప్రహ్లాదునిపై వేగముగవచ్చిపడినవి. 57

సమీక్ష్యతాన్ పరిపతతః ఫణీశ్వరాన్
అసంభ్రమః ఫణిరిపు కేతనం ధియా ।
యయౌసుతో దితజపతేః సచస్మృతః
స్థితోఽభవద్ధృది సహ సర్పశత్రుణా ॥ 58

అథాదశన్ గరల ధరాః సహస్రశో
విధాయతం విషశిఖిధూమ ధూసరమ్ ।
నతేఽవిదన్ హృదిగరుడ ధ్వజం ధృతం
ధృత వ్రతం ద్విజ! నిజ భక్తరక్షణే ॥ 59

సచాస్మరద్దరి ధృత శంఖనిః స్వరత్ –
సుధారస ప్లుత మఖిలం నిజం వపుః ।
అథాచ్యుత స్మరణ సుఖా మృతార్ణవ –
స్థితో బహిర్నచ సవివేద కించన । 60

తనపై పడుచున్న ఘోరవిషసర్పముల జూచి యెట్టితొట్రుపాటు లేని యాప్రహ్లాదుడు తన చిత్తమున శ్రీహరిని ధ్యానించెను. ప్రహ్లాదునిచే ధ్యానస్మృతుడైన భగవానుడు గరుడునితో పాటుగ నాతని హృదయమున నావిర్భవించెను.

'ఫణిరిపుకేతన' శబ్దమునకు సర్పములకు శత్రువైన గరుడుడు (ఫణిరిపుః) ధ్వజముగా (కేతనం యస్యసః) కలవాడగు శ్రీహరియని యర్థము. 58

ఓ శౌనకా! అంతనా విషధరములగు సర్పములు, వేలసంఖ్యలో నాప్రహ్లాదుని, విషవహ్నినుండి బయల్వెడలిన పొగచే చుట్టువారునట్లొనర్చి, యాతని హృదయమున 'గరుడధ్వజుడు' తన భక్తుల రక్షణమున పూనిక వహించి యున్నాడని యెరుగ జాలక తీవ్రముగ కాటువేసినవి. 59

శ్రీహరి ధ్యాన నిమగ్నమనస్కుడైన ప్రహ్లాదుడు తన శరీర మంతయు శ్రీహరిచే ధరింపబడిన శంఖమునుండి జాలువారుచున్న యమృతరసము చే తడుపబడుచున్నట్లు తెలిసికొనెను. పిమ్మట శ్రీహరి స్మరణమువలన యానందరస సముద్రమున నిమగ్నుడై బాహ్యప్రపంచము నెంత మాత్రమెరుగ జాలడయ్యెను. 60

ఇట్లు వ్యర్థమైన శ్రమముగల యా ఘోర విషసర్పములచే పరివృతుడై యుండియు

తదా బభౌ ఫణిని కరైర్వ్యథాశ్రమైః
వృతః సుఖీ ద్విజ! సహి విస్ఫుర ద్విషైః ।
యమస్వసుర్జలపటలే యదూద్వహః
స్వలీలయావృత ఇవ కాలియానుగైః ॥ 61

గరాయుధా స్త్వచమపి భేత్తు మల్పికాం
వపుర్వ్యజస్మృతిబలదుర్భిదీకృతే ।
అలం నతే హరిపురుషస్య కేవలం
విదశ్యతం నిజదశనైర్వి నాకృతాః ॥ 62

తతః స్ఫుటత్ స్ఫుటమణి రత్నమస్తక -
క్షరన్మహో రుధిర భృశార్ద్ర మూర్తయః ।
అలక్షితై ర్గరుడ శతైశ్చ ఖండితాః
ప్రదుద్రువుః ద్రుతమనిలాశనా భయాత్ ॥ 63

రరక్ష తం నిజపదభక్తమచ్యుతః
ఫణివ్రజాద్ద్విజ! నచతత్ర విస్మయః ।
మృకండుజం సకలలయే త్వపాలయత్
తతోఽపి కిం త్రిజగద భూద్యదృచ్ఛయా ॥ 64

ఎట్టిదుఃఖములేక సుఖముగ నుండిన యా ప్రహ్లాదుడు, కాలియ సర్పాను సారులగు నాగ పత్నులచే కాళింది మడుగున లీలగ చుట్టువారిన గోపకిశోరుని వలె రాజిల్లెను.61

గరలాయుధములగు నాసర్పములు ప్రహ్లాదుని శరీరమునగల స్వల్పమగు చర్మమును గూడ చీల్చలేక, శ్రీహరిస్మరణ బలముచే దుర్భేద్య మొనర్పబడిన యాతని శరీరమును కరచి, తమ దంతములనే కోల్పోయినవి. శ్రీహరి భక్తుల కెట్టిపీడను కల్గింప నవి శక్తములు కావుకదా! 62

అంతట విస్పష్టముగ పగిలిపోయిన మణులుగల, శిరస్సుల నుండి, స్రవించుచున్న, రుధిరముచే నత్యంతము తడిసిన దేహములు కలవై, యాసర్పములు, కంటికగుపింపని గరుడ సహస్రముచే వ్రయ్యలు చేయబడిన దేహములు కలవై, భయముతో నటునిటు పారిపోయినవి. 63

తతః స్రవత్ క్షతజ విషణ్ణ మూర్తయో
ద్విధాకృతోద్యద్వదనా భుజంగమాః ।
సమేత్యతే దనుజ పతిం వ్యజిజ్ఞపన్
వినిశ్వసత్ప్రచలఫణాః సువిహ్వలాః । 65

తవాత్మజం నచవయమర్దితుం క్షమాః
కథం ప్రభో! జితసుర రాజ! కేసరీ ।
సృజేత్ సుతం పరమృగబాధ్య మీదృశం
మహద్బలం తవచ సుతస్య నాద్భుతమ్ । 66

అస్మాంస్తు జిజ్ఞాససి చేత్ సముద్రాన్
దృష్ట్యైవ కుర్మో విషవహ్ని దగ్ధాన్ ।
ప్రభో! మహాద్రీనపి భస్మశేషాం
స్తస్మిన్నశక్తాస్తు త్వైవ వధ్యః । 67

మహాను భావస్య తవాత్మజస్య
వధేప్రయుక్తా, గరుడైర్హతాః స్మః ।
క్వాప్యాగతై స్తత్తను వజ్రఘాతాత్
స్వామిద్రుహాంనో దశనాశ్చ భిన్నాః । 68

ఓ శౌనకా! తనపాద సమారాధకుడైన ప్రహ్లాదుని శ్రీహరి, విషసర్పములనుండి రక్షించెననుట యెంతమాత్రము విస్మయావహము కాదు. ఏలన – సమస్త ప్రపంచము లయమును పొందినప్పుడు శ్రీహరియే మార్కండేయమునిని రక్షింపలేదా! ఇంత కంటె వేరుగ చెప్పదగినదేమున్నది? శ్రీహరి సంకల్ప మాత్రముచేతనే కదాయీ త్రిభువనము లావిర్భవించుట. 64

అంతట గాయముల నుండి స్రవించుచున్న రక్తము కలిగి విషణ్ణవదములతో గూడి, రెండుగా చీలిన ముఖములను పైకెత్తి యాసర్పములు, నిట్టూర్పులతో వణుకుచున్న పడగలు కలవై, వివశములై వచ్చి యాదైత్యేంద్రునికి విజ్ఞాపన మొనర్చినవి. 65

ప్రభూ ! దేవేంద్రుని జయించినవాడా! నీ కుమారుని మేమెంత మాత్రము పీడింప జాలమైతిమి. సింహము ఇతర సాధారణ మృగములచే బాధింపదగు

తదద్భుతం దేవ! తదీయమంగ
మక్ష్ణోర్మృణాలం ముహురు ద్విభాతి ।
విదశ్య మానం ప్రఖరైస్తు దంష్ట్రైః
దంభోలి సారాత్త్రిగుణం కఠోరమ్ । 69

ఇత్థం దిజిహ్వాః కృతినో నివేద్య
యయుర్విసృష్టాః ప్రభుణా కృతార్థాః ।
విచిన్తయన్తః పథి, విస్మయేన
ప్రహ్లాద సామర్థ్య నిదానమేవ । 70

ఇతి శ్రీ నారదీయే హరిభక్తి సుధోదయే ప్రహ్లాద చరితే నవమోధ్యాయః

పుత్రునేలకనును? నీ కుమారుని బలమును అమోఘము. ఇది యెంత మాత్రము విస్మయకరము కాదు.' 66

' ఓ ప్రభూ! మాశక్తిని పరీక్షించితివేని, సముద్రములను దర్శనమాత్రము చేతనే విషాగ్నిదగ్ధముల నొనర్పగలము. మహాపర్వతముల సహితము భస్మావశిష్టముల నొనర్పజాలుదుము. కాని నీపుత్రుని పట్ల నశక్తులమే! ఆతడు నీకు మాత్రమే వధ్యుడు'. 67

మహానుభావుడగు నీ పుత్రుని చంప నియుక్తులమైన మేము, ఎచ్చటినుండియో యేతెంచిన గరుత్మంతులచే కొట్టబడితిమి. నీ కుమారుని దేహమను వజ్రపు ప్రహారములచే మాదంతములు భిన్నములైనవి. 68

దేవా! చాల ఆశ్చర్యము! నీ కుమారుని శరీరము చూపులకు మృణాలళము (తామరతూడ) వలె కన్పట్టుచున్నను, కఠోర దంతములచే కాటువేసి నప్పుడు వజ్రముకంటె మూడురెట్లు సారవంతమై కఠినముగా నున్నది. 69

ఇట్లా యాశీవిషములు తమకృత్యమును నెరవేర్చి ప్రభువునకు నివేదించి యాతనిచే సమ్మానింపబడి వెడలిపోయినవి. వెడలుచు, మార్గమధ్యమున ప్రహ్లాదుని యసమానశక్తికి అచ్చెరువొంది కారణమేమియని చింతింప దొడగినవి. 70

ఇది శ్రీనారదీయ పురాణాంతర్గతమగు హరిభక్తి సుధోదయమున ప్రహ్లాద చరితమను తొమ్మిదవయధ్యాయము.

# దశమాధ్యాయము

**దశమాధ్యాయసారము :-** ఈ యధ్యాయమున హిరణ్యకశిపుడు తన కుమారుని పిలిపించి వాడు తనకు దండోపాయసాధ్యుడు కాడని యెంచి, మంచి మాటలతో బుజ్జగింపనెంచెను. శత్రుపక్షమును వీడుమని బోధించెను. అరిషడ్వర్గమే శత్రుపక్షము కనుక దానినే విడువవలయుననియు, అరిషడ్వర్గ వంచితమగు నీలోకము శ్రీహరి పక్షమును విడచుచున్నదనియు, వేలమందిలో ఒక్కడు మాత్రమే సంసార విరక్తుడై విష్ణువు నాశ్రయించు ననియు, విష్ణు బలము కంటె వేరైన బలము లేదనియు ప్రహ్లాదుడు పేర్కొనినాడు. నామరూపరహితుడగు ఆ శ్రీహరిని ఆశ్రయింపనేల ? యనితండ్రి పలికిన పలుకులకు ప్రహ్లాదుడు 13వశ్లోకమునుండి 24వశ్లోకము వరకు పలికిన ప్రతి సమాధానము గంభీరములైన వేదాన్త విషయములతో కూడి యున్నది. అనేకములగు నిగూఢములైన యుపనిషదర్థము లీ శ్లోకములలో పొందు పరుపబడినవి.

'అస్థూల మహ్రస్వమనణ్వ దీర్ఘమ్ అనామరూపం యదనన్తవస్తు।
తదేవ సేవ్యం భవభీరుణార్య తద్బ్రహ్మ విష్ణుః సతతమేవ కాంక్షే ॥

ఇత్యాది శ్లోకములందు " అనామ రూపమ్ " ఇత్యాది విశేషణములచే పరబ్రహ్మ మగు శ్రీమన్నారాయణుని కెట్టిరూపము కలదని ప్రహ్లాదుడు భావించినాడో - ఈ 12 శ్లోకములు లెస్సగా విశదపరచుచున్నవి. నిగూఢము అప్రాకృతమునగు భగవన్మూర్తి యొక్క వైభవమును ప్రహ్లాదుడు ఆవిష్కరించినాడు. ఈ శ్లోకములు ఈ హరిభక్తి సుధోదయము యొక్క ప్రౌఢిమను చాటుటకు తార్కాణములు. అటు పిమ్మట 26వ శ్లోకము నుండి ప్రహ్లాదుని - హిరణ్యకశిపుడు ప్రలోభ పరచ యత్నించిన విధానము, వచన ధోరణి - నాస్తికవాద సారమును ఆవిష్కరించును. వాటికి ప్రహ్లాదుని ప్రతి సమాధానము 45వశ్లోకమునుండి - 75వ శ్లోకమువరకు విషయభోగముల ఆంతర్యమును, శ్రీహరి స్మరణమునందలి మహామహిమను విశదపరచినది. దిగ్గములు ప్రహ్లాదునేమి చేయలోక పోవుట. 89వశ్లోకము వరకును, అక్కడనుండి 110 వరకు ప్రహ్లాదుని వివిధ క్లేశముల పాలు చేసినను ఆతడు బాధనొందకుండుటయు లెస్సగా వర్ణింపబడినది. వేదాన్తవిషయ పరముగా నీయధ్యాయము చాల ప్రధానమైనది.

శ్రీ నారద ఉవాచ –

అథాసురేశః సచివైర్విచార్య,
నిశ్చిత్య సూనుం తమదండ సాధ్యమ్ ।
ఆహూయ సామ్నా ప్రణతం జగాద
వాక్యం సదానిర్మల పుణ్యచిత్తమ్ ॥ 1

ప్రహ్లాద! దుష్టోఽపి నిజాంగజాతో
నవధ్య ఇత్యద్య కృపా మమాఽభూత్ ।
ఆదిశ్య సర్వానసురాంశ్చ పశ్చా
దనుగ్రహాన్మే సుఖితోఽస్య మోఘాత్ ॥ 2

మామిచ్ఛయానుగ్రహ నిగ్రహాణాం
కర్తార మిత్థం నహివేత్సి పూర్వమ్ ।
యతస్త్వ మస్మాన్ పరిముచ్యబాల్యా
దనామరూపం హరిమాశ్రితోఽసి ॥ 3

ఇతః పరం త్వం త్యజ పుత్ర! శత్రుం
దయాహి రాజ్ఞాం ననదాస్య బుద్ధే ।
నాకార్యకార్యే విమృశంతి రోషే
హనిష్యసే శత్రురతో వృథాత్వమ్ ॥ 4

శ్రీనారదముని పల్కెను. పిమ్మట నాదైత్యేంద్రుడగు హిరణ్య కశిపుడు, తన మంత్రులతో సంప్రతించి, తన కుమారుడు దండోపాయముచే సాధింపనలవి కానివాడని నిశ్చయించి, వానిని పిలచి, వినమ్రుడై నిరంతరము నిర్మలము పవిత్రమునైన చిత్తముగల ప్రహ్లాదునితో సామోపాయ గర్భితమగు వాక్యమును పలికెను. 1

ఓ ప్రహ్లాదుడా ! దుర్మార్గుడయ్యును పుత్రుడు చంపదగనివాడను కారణమున నీపట్లనాకు కరుణ కల్గినది. కనుకనే ముందు సర్పములను, రాక్షసులను, నీవధకై నియోగించియు, నీయెడగల యమోఘమైన యనుగ్రహబుద్ధిచే నిన్ను సుఖవంతుని జేసితిని.' 2

'మేము మా సంకల్పము చేతనే నిగ్రహించుటకు అనుగ్రహించుటకును శక్తులమని

కింవా ఫలం తే పరసంశ్రయేణ
కింవాన సాధ్యం స్వత ఏవపుత్ర ।
స్వాధీన మేవాంగ బలం విచార్య
విసృజ్య మౌర్ఖ్యం త్యజ శత్రు పక్షమ్ ॥ 5

పితుర్వచస్తత్ పరిభావ్య దుష్టం
ముకుందదాసః ససుధీర్జగాద ।
ఏతత్ కరిష్యామి సహస్రకృత్వః
త్వయోదితం శ్లక్ష్ణతరం హిపశ్చాత్ ॥ 6

పరాశ్రయైః కిం? స్వబలం విచార్య
త్యజారి పక్షానితి కృత్య మేతత్ ।
సతాంహి విఘ్నైః సదనిచ్ఛతాంచ
వచః సదైవాప్యవశాదుదేతి ॥ 7

యిట్లు మాగుఱించి పూర్వము తెలియజాలవైతివి. కావుననే మమ్ములను విడచి, బాల్య చాపల్యముచే నామరూపరహితుడగు హరినాశ్రయించితివి.' 3

'కుమారా! ఇకమీదట శత్రువైన హరిని విడచిపెట్టుము. ఓ మందబుద్ధీ! రాజులకు దయయెల్లవేళల నుండదు. రోషము కల్గినప్పుడు కార్యాకార్యముల పర్యాలోచింపరు. కనుక నాపట్ల శత్రుభావముగల నీవు వ్యర్థముగ చంపబడగలవు. 4

శత్రువు నాశ్రయించి నందువలన నీకేమి ప్రయోజనము? స్వతంత్రముగ నీకు సాధ్యము కానిదేమున్నది? పుత్రా! స్వాయత్తమైన నీ దేహబలమునే పర్యాలోచించి, మూర్ఖతను విడచి, శత్రుపక్షము నాశ్రయించుట పరిత్యజింపుము.' 5

ఈ విధముగ తండ్రిచే పలుకబడిన యీ దుష్టవచనమును విని శ్రీహరి పాద దాసుడగు నా బుద్ధిశాలి, ప్రహ్లాదుడు ఇట్లు ప్రతిసమాధానించెను. 'తండ్రీ! నీవు పల్కిన యీ మృదులతరవచనమును (పరపక్షమును త్యజించుటను) వేయిసారులు తరువాత అనువర్తింతును? 6

ఇతరుల నాశ్రయించుటేల? తన బలమును పరామర్శించి శత్రుపక్షమును విడువుమన్న విషయము తప్పక యాచరింపదగినదే!' ఒక్కొక్కప్పుడు విఘ్న

విచార్య తామార్య సచారి పక్షః
ప్రాధారిషడ్వర్గ మృతేన కశ్చిత్ ।
స్వాధీన మానంద మసౌహి పాపో
రుణద్ధ్య భోగాయ జనస్య నిత్యమ్ । 8

కామాది భిర్వంచిత ఏషలోకః
త్యజత్యనష్టం ప్రకృతి ప్రయుక్తైః
కుస్త్రీ ప్రయుక్తై రివదృష్టియోగైః
భ్రాన్తః పుమాన్ స్వంపితృమాతృ పక్షమ్ । 9

'ఏకః సహస్రేషు భవాద్విరక్తః
త్రితాపఖిన్నోయది విష్ణుమేతి ।
హ్రదం యథాగౌస్తృషిత స్తతస్తం
నివారయన్త్యాశ్వరయః స్మరాద్యాః । 10

కారణముగ మంచినియిచ్ఛగింపని సజ్జనులకు వారికి వివశముగ నిట్టి మాటలుదయించుట కలదు.' అనగా శత్రు పక్షమును విడువుమను మాట నీముఖమునుండి అప్రయత్నముగ వెడలినది. అది ఒక విధముగ ఆచరింప దగినదేనని భావము. 7

'ఆర్యా! విచారింపుము. మానవునకు కామక్రోధ లోభమోహమద మాత్సర్యములను నరిషడ్వర్గమును విడచి శత్రుపక్షము మరేదియు లేదు. పాపస్వభావముగల యీ యరిషడ్వర్గమే, నిత్యము మానవునకు స్వాయత్తమై యున్న యానందము నను భవించుటకు ప్రతిబంధమై యడ్డగించు చుండును'. 8

స్వభావ ప్రయుక్తములైన కామక్రోధాద్యరిషడ్వర్గముచే వంచింపబడిన యీ లోకము, కుత్సితురాలగు స్త్రీచే ప్రయుక్తములైన దుష్టసంబంధములచే వంచింపబడిన పురుషుడు భ్రాంతిచే తన పితృ మాతృ పక్షమును విడచినట్లు, శ్రీహరిని విడచి వైచుచున్నది. 9

వేయిమందిలో నొక్కడు తాపత్రయ పీడితుడై సంసారము నుండి వైరాగ్యమును పొంది శ్రీహరిచరణ కమలము నాశ్రయించినను, దప్పికగొని మడుగలో దిగిన గోవునువలె శత్రువులైన కామాదులు వెంటనే నివారించుచున్నవి. అనగా శ్రీహరి పదసేవా సక్తుడైన వానినిగూడ కామక్రోధాదులు బాధించునని తాత్పర్యము. కనుకనే, శ్రీగీతలో –

త్యజామిచైనం రిపుపక్షమార్య ।
శ్రుణుష్వ చాత్మీయ బలం యదుక్తం ।
విష్ణోర్బలం సహ్యాఖిలాత్మభూత
స్తదన్య ఏవాపర సంశ్రయశ్చ ।  11

ఇయంచ మేతాత! సదాప్రతిజ్ఞా
త్యజామి శత్రూన్న పరాన్ భజిష్యే ।
బలం భజిష్యే నిజమైశ మేవ
సత్యాశిషోమే భవతః ప్రసాదాత్ ॥  12

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥

వేలాది మానవులలో సిద్ధిని పొందవలెనని (భగవత్పాద పరిచరణ భాగ్యమును పొందవలయునని) ఎవ్వడో ఒక్కడు మాత్రమే జన్మాంతర సంస్కార వశమున ప్రవర్తించును. ఇట్లు ప్రవర్తించిన వారిలో అందరు సిద్ధిపొందజాలరు. కొందరు మధ్యముననే కామాది వంచితులై పరాహతులగుదురు. ఎవ్వడో ఒక్కడు మాత్రమే కామాదుల జయించి భగవత్తత్త్వమును దర్శింప జాలును.  10

'ఆర్యా! శత్రుపక్షమును పరిత్యజించు చున్నాను. తనబలమునే ఆశ్రయింప వలయునని యంటివి కదా! చెప్పెదను వినుము. ఆత్మీయ బలమనగా సర్వాత్మకుడైన శ్రీహరి బలమేతప్ప వేరుకాదు. శ్రీహరి కంటె భిన్నుల నాశ్రయించినవాడే పరుడగును.  11

'ఓ తండ్రీ! ఇదియే నిరంతరము నాప్రతిజ్ఞ. పరులైన శత్రువులను త్యజింతును, వారినెంత మాత్రము సేవింపను. నీయను గ్రహముచే సత్యమైన యాశీస్సులుగల నాకేది వాస్తవమైన బలమో అట్టి దైవబలమునే ఆశ్రయింతును.'  12

'నామరూప రహితుడైన శ్రీహరినాశ్రయించుట దోషమని నొడివితివి. వాస్తవమున కిది యెంతయో గుణవత్తరమైనది. ఏలన, నామరూప సహితుడైన మర్త్యునిచే, నామరూపములు కలవాడయ్యును ఆ భగవానుడు, తనతో సమానమగు ప్రాకృతనామరూప ధారిగ యెట్లు సేవింపదగును ?

ఈశ్లోకమున భగవానునకు దివ్యనామరూపములు (అప్రాకృతములు) కలవనియు,

యద్ద్వేష వచో్త్క్ష మనామరూపం
హరింశ్రితోఽసీతి, గుణః పరోఽయమ్ ।
సనామరూపేణ సనామరూపః సేవ్యః
కథం స్యాత్? స్వసమానరూపః । 13

అవైకృతై స్స్వ్య మనామరూపం
సనామ రూపశ్చ వికారయుక్తైః ।
కార్పణ్య యుక్తైః కృపణోను సేవ్యః
కార్పణ్య హీనో ధనవాన్ హినాన్యః । 14

అట్టి యప్రాకృత దివ్య నామరూప ధారియైన శ్రీహరి, ప్రాకృత జనునిచే, స్వసమానముగ (ప్రాకృత నామరూపధారిగ) నెంత మాత్రము సేవింపదగిన వాడుకాదనియు, దివ్యమంగళ విగ్రహధారిగనే యారాధింప దగియున్నాడని తాత్పర్యము. 13

ప్రాకృతిక వికారములైన మరణాదులకు, మాయకు వశవర్తులుకాని మహానుభావుల చేత మాత్రమే, అప్రాకృత దివ్యమంగళ విగ్రహము, దివ్యనామము కల భగవానుడు సేవింపబడును. ప్రాకృతిక వికారములకు మాయకు వశపడిన సామాన్యులు ప్రాకృతిక నామరూపములు కల ఇతర దేవులను సేవింతురు. కార్పణ్యదోషము నుండి విముక్తులైనవారు కృపణులైన (ప్రాకృతనామ రూపాది సహితులగు) వారిని సేవింపరు. ఎవ్వడు కార్పణ్యమును విడచునో వాడే ధనవంతుడు, ఇతరుడు కాడు.

ఈ శ్లోకమున 'అనామరూపమ్' అను పదముచే నామరూప రహితుడని యర్థము స్ఫురించుచున్నది. కాని అది సరియైన యర్థము కాదు. వాజ్ మనోబుద్ధులచే నిరూపింపరాని నామరూపములు కలవాడనియే యర్థము. కావుననే శ్రీ భాగవతమున –

'ననామరూపే గుణకర్మ జన్మభిర్ని రూపితవ్యే తవతస్య సాక్షిణః ।

మనోవచోభ్యా మనుమేయ వర్త్మనో దేవక్రియాయాం ప్రతియంత్య థాపిహి ।

అనియు –

శృణ్వన్ గృణన్ సంస్మరయంశ్చ చిన్తయన్నామాని రూపాణి చ మంగలానితే ।

క్రియాసు యస్త్వచ్చరణార విందయో రావిష్టచిత్తో నభవాయ కల్పతే ।

అనియు, భగవానుని నామరూపములు, గుణకర్మజన్మములతో పాటు నిరూపింప రాని వనియు; కనుకనే లోకవిలక్షణములనియు, అంతియేగాక సాధారణ ప్రాకృత గుణకర్మ

అస్థూల మహ్రస్వ మనణ్వ దీర్ఘమ్
అనామరూపం యదనన్తవస్తు
తదేవ సేవ్యం భవభీరుణార్య
తద్బ్రహ్మ విష్ణుః సతమేవ కాంక్షే ॥ 15

జన్మములుకల జనులచే నిరూపింపరానివని గూడ తెలుపబడినది. రామకృష్ణ గోవింద ప్రభృతులగు నామములును, మత్స్యకూర్మాది రూపములును అనంతవైభవ సంపన్నములు కావున యిట్టివని నిరూపింప నలవికానివే. అయినను ఎవ్వరు అనన్య భావనతో వాఙ్మనస్సుల భగవదాయత్త మొనర్చుదురో వారు సమస్త క్రియలందును భగవన్నామ రూపములలో నేక దేశములనైన భావింప గలుగుదురు. అంతియే కాక తన శక్తిని బట్టి కొన్ని నామరూపములనైన విని, కీర్తించి, స్మరించి, భావించినప్పుడు వారికి సంసార భయముండదు, అని శ్రీ భాగవతమున భగవానునికి నామరూపముల సత్త్వము నిరూపింప బడినందున, నామరూప రహితుడని చెప్పుట కుదరదు.

కార్పణ్య శబ్దమునకు దైన్యమని సామాన్యార్థమైనను – 'త్యాజ్యస్య అపరిత్యాగః' విడువ దగిన దానిని విడువకుండుట, 'దయాజనక దీనవృత్తి నిరతత్వమ్' దయను పుట్టించు దీన ప్రవృత్తి కలిగియుండుట మున్నగు నర్థములు కూడ కలవు. మాయావశులై ప్రాకృతిక స్వభావ ప్రతిబద్ధులై భగవదతిరిక్త దేవతా శ్రయణముచే పరితృప్తులైన దీనులు కృపణులు కాగా, వారిప్రవృత్తి – కార్పణ్యమని తాత్పర్యము. ఇట్టి కార్పణ్య లక్షణము లేనివారే వాస్తవమునకు ధనవంతులు. ఎందువల్లననగా వారు శ్రీహర్యతిరిక్త దేవతల నాశ్రయింపక శ్రీహరినే ఆశ్రయింతురు. 14

'ప్రాకృతములైన లౌకిక వస్తువులకు నియతములైన స్థూలత్వము, హ్రస్వత్వము అణుత్వము, దీర్ఘత్వము, నామరూపములు లేనిదై అపారము, 'అణోరణీయాన్ మహతో మహీయాన్' ఇత్యాదిగా కీర్తింపబడు నపరిచ్ఛిన్నమగు వస్తువేదికలదో, ఆ వస్తువే, సంసార భీరువగు ప్రాణిచే సేవింపదగి యున్నది. ఆవస్తువే పరబ్రహ్మము – అదియే విష్ణుశబ్ద ప్రతిపాద్యము. కావున పరబ్రహ్మమైన విష్ణువునే కాంక్షింతును.'

'అశబ్దమ స్పర్శమరూప మవ్యయం' ఇత్యాద్యౌపనిషద వచనము నందును,

రూపం యత్తత్ ప్రాహురవ్యక్త మాద్యం బ్రహ్మజ్యోతిర్నిర్గుణం నిర్వికారమ్ ।
సత్తామాత్రం నిర్విశేషం నిరీహం సత్వం సాక్షా ద్విష్ణు రధ్యాత్మదీపః ॥

ఇత్యాదిగ భాగవత వచనమునందును సర్వాత్మనా, నామరూపాది విశేషరహితము,

గుణరహితమునైనదే పరబ్రహ్మమను నర్థము ఆపాతతః స్ఫురించును. కాని 'నిర్గుణ' 'నిర్విశేష' ప్రభృతి శబ్దములకు గుణరహితుడు నామరూపాది విశేషము లెంత మాత్రము లేనివాడని యర్థము కాదు. శ్రీ భాగవతశ్లోకమున పరమాత్మకు స్వరూపము కలదనియే నిరూపింపబడినది. 'రూపమ్' అనగా 'రూప్యతే ప్రాకృత పురుష విలక్షణత్వేన నిరూప్యతే ఇతి రూపం' ప్రాకృతులైన (ప్రకృతి సంబద్ధులైన) పరుషులకు (జీవులకు) ఎట్టి వికారాస్పదము వినశ్యము నైన రూపమున్నదో, అట్టిదికాక, దానికంటె విలక్షముగా నిరూపించునది కావున రూపము' అను వ్యుత్పత్తిని బట్టి భగవంతునకు రూపము కలదని స్పష్టమగుచున్నది. ఆరూప మెట్టిదనగా దీనియందు గల విశేషములే 'అవ్యక్తమ్' 'ఆద్యం' 'బ్రహ్మజ్యోతిః' 'నిర్గుణం' 'నిర్వికారం' 'సత్తామాత్రం' నిర్విశేషం' నిరీహం' ఇత్యాది విశేషణములు తెలియజేయుచున్నవి. ఈ విశేషణముల తాత్పర్యమిది - ఈ విశేషణములలో, 1. అవ్యక్తమ్, 2. నిర్గుణం, 3. సత్తా మాత్రం, 4. నిర్విశేషం అను నాల్గును ప్రకృతినుండి భగవానుని వేరుచేయు విశేషణములు. ఇతరములన్నియు పురుషుని నుండి వేరుచేయు విశేషణములు.

**1. అవ్యక్తం :–** వ్యక్తములైన యింద్రియములచే వ్యక్తముకానిది, అనగా నింద్రియ విషయము కానిది, ప్రాకృతేంద్రియా దర్శనీయము అతీంద్రియమునని భావము. ఇదియే యత్తదద్రేశ్య మగ్రాహ్యమ్' ఇత్యాది శ్రుతిచే (కాఠకశ్రుతి) ప్రతి పాదింపబడినది. ప్రధానములేక ప్రకృతి పృథివ్యాది రూపముగ వ్యక్తమైనది. కాని భగవానుని స్వరూపము ప్రకృతివలె వ్యక్తము కాదని తాత్పర్యము. ఇట్టిదను విషయమును ప్రమాణించునదే 'ఆద్యమ్' అను విశేషణము. 'ఆదౌ భవమ్' = ఆద్యమ్' వ్యక్తమైన అచిద్ద్రవ్యము కంటె (ప్రకృతికంటె) ఆదియందు కారణముగా నున్నట్టిదని తాత్పర్యము.

**2. నిర్గుణమ్ :–** మరిసూక్ష్మావస్థాపన్నమైన చిద్వస్తువా? (జీవతత్త్వమా?) అను ప్రశ్నకు సమాధానముగ కాదని చెప్పుటకు 'నిర్గుణమ్' అను విశేషణము. సత్త్వరజ స్తమోరూపములైన ప్రాకృత గుణములు లేనిది. ఈ విశేషణముచే సూక్ష్మావస్థా పన్నమైన చిద్వస్తువు కంటె పరమాత్మ రూపము భిన్నమని తెలియజేయ బడినది.

**3 సత్తామాత్రం :–** సత్ అనుశబ్దము నిరంతర మేకరూపమగు వస్తువును బోధించును. వృద్ధిక్షయాది రహితమని భావము. దీని తాత్పర్యమే 'నిర్వికారమ్' అను విశేషణముచే గూడ చెప్పబడినది. మరియు నిర్వికారమనగా శోకమోహాది వికారములు లేనిదని కూడ యర్థము.

**4. నిర్విశేషం :–** విశేషములనగా శబ్దస్పర్శ ప్రభృతులగు పృథివ్యాది భూతపంచకము యొక్క గుణములు, తద్రహితమని యర్థము.

5. 'బ్రహ్మజ్యోతిః' :- స్వయంప్రకాశమైన జ్యోతీరూపముగ సర్వత్ర వ్యాపించి యున్న పరబ్రహ్మతత్త్వము. ఈ విశేషణము ప్రకృతి పురుషాది తత్త్వముల కంటె భిన్నమై వాటికంటె ముందు కారణముగ నిత్యముండునదను తాత్పర్యమును వ్యక్తపరచుచున్నది.

6. ఆధ్యాత్మదీప :- మరిముక్త జీవులుకూడ ప్రకృతి పురుషాది భిన్నులే కదాయను శంకకు సమాధానముగా నీ విశేషణము వేయబడినది. 'ఆత్మని' అను సప్తమ్యర్థమున అవ్యయీ భావసమాసము 'ఆధ్యాత్మమ్ ' అనునది. ఆధ్యాత్మమ్ = ఆత్మయందు, దీపః = దీపమువలె స్వయముగ ప్రకాశించు నట్టిదియు, నిత్యము ఎట్టి సంకోచము (కుదింపు) లేని ధర్మభూతమైన జ్ఞానము కలవాడు = ఆధ్యాత్మదీపః ఇట్లనుటచే ముక్తజీవులకు కూడ సంసార దశయందు సంకోచమును పొందిన జ్ఞానమే కలదు కావున - భగవానుడు, ముక్తజీవుల కంటె భిన్నుడు. అట్లే నిత్యసిద్ధ జీవులకంటె గూడ భిన్నుడని చెప్పుటకే 'బ్రహ్మ' పదము వేయబడినది. నిరతిశయమైన బృహత్త్వము కలది కావున బ్రహ్మము. నిత్య సిద్ధజీవుల స్వరూపము కూడ అణుస్వభావమైనది. భగవానుని స్వరూపమట్టిది కాక, నిత్యనిరతిశయబృహత్త్వము కలది. ఈ విధముగ విశేషణములన్నింటి చేతను భగవానుని స్వరూపమే నిరూపింప బడినట్లైనది. అట్లేప్రకృత 'హరిభక్తి సుధోదయ' శ్లోకములందు కూడ విశేషణములు అప్రాకృ తత్వమును నిరూపించునవే నని గ్రహింప వలయును.

అస్థూలమ్ = ప్రకృతి సంబంధముచే పాంచభౌతికమైన శరీరము వలె స్థూలదశ కలది కాదు.

అహ్రస్వమ్ = పొట్టిదికాదు.

అనణు = జీవులవలె అణుస్వభావము కాదు.

అదీర్ఘమ్ = ప్రాకృతికమైన దీర్ఘత్వము (పొడవు) కలది కాదు.

అనామరూపం = ప్రాకృతిక నామరూపములు కలది కాదు.

యిట్టి వస్తువే అపరిచ్ఛిన్న స్వభావమై పరబ్రహ్మ రూపమనియు , ఆ పరబ్రహ్మమే శ్రీహరియనియు తాత్పర్యము. అంతియేగాని సర్వాత్మనా నిర్గుణుడు గుణరహితుడని యర్థము కాదు. అట్లన్నచో

'ఆత్మారామాశ్చమునయః నిర్గ్రంథా అప్యురుక్రమే ।
కుర్వన్త్య హైతుకీం భక్తి మిత్థం భూతగుణో హరిః ।'

అనియు, 'క ఉత్తమ శ్లోక గుణానువాదాత్' ఇత్యాదిగను భగవంతునకు చెప్పబడిన సకల కల్యాణ గుణవత్త్వము బాధింప బడవలసి వచ్చును.

యద్వాతి గుహ్యో స్థిరయోగియోగ్యా
కథేయ మాస్తాం పరతత్త్వ నిష్ఠా ।
తాత! స్వవక్త్రాదధికప్రమాణం
భక్ష్యం గ్రహీతుం. నహిశక్య మత్తుమ్ । 16

అనామ రూపో న, స మంజుకాశీ
మహోఘభిత్ పుణ్య సహస్రనామా ।
లీలా ధృత శ్రీమదనన్త రూపో
దుష్టాంతకః శిష్టజనేషు దాతా । 17

'తండ్రీ! పరతత్త్వమునకు సంబంధించిన యీనిష్ఠయు, కేవల స్థిరులైన యోగిజనులకు మాత్రమే యోగ్యమై, అతిరహస్యమైన యీ కథయు అట్లుండు కాక! తననోటి కంటె అధికప్రమాణము గల భక్ష్యవస్తువు నోటితో గ్రహించుటకుగాని, తినుటకుగాని నలవికాదు కదా! 16

'మనోహరముగ ప్రకాశించువాడును, మహాపాప నాశకములగు పవిత్ర సహస్రనామములు కలవాడును, లీలగా ధరింపబడిన శోభాసంపన్నమైన యపరిచ్ఛిన్న రూపము కలవాడును, (అనంతములైన రూపముకలవాడును) అయిన శ్రీహరి నామరూప రహితుడెంత మాత్రము కాదు. శిష్టజనుల విషయమున సర్వసంపత్ప్రదాతయైన శ్రీహరి, దుష్టజనుల కంతకుడై యున్నాడు.'

ఈ శ్లోకమున స్పష్టముగ భగవంతునకు అప్రాకృతములైన నామరూపములు కలవని నామరూప రహితత్వమును నిషేధించుట ద్వారా ప్రతిపాదింప బడుచున్నది. నామతత్త్వమును 'మహోఘభిత్పుణ్యసహస్రనామా' అను విశేషణముచేతను, రూపతత్త్వమును 'లీలాధృత శ్రీమదనన్తరూపః' అను విశేషణముచే భగవంతుని య ప్రాకృత దివ్యరూపము మహోజ్జ్వలమని నిరూపింప బడుచున్నది. ఈ విశేషణమే భగవన్మూర్తి మాధుర్యము నావిష్కరించుచున్నది. 17

'చతుర్భుజుడైన (నాలుగు భుజములు కలిగిన) భగవానుని సహస్రనామములలో (అసంఖ్యాకములైన పేరులలో) ఏఒక్కనామము నైనను ఎవ్వడు కీర్తించునో, స్మరించునో వానికే వాక్కు కలిగి నందులకు ఫలము కల్గుచున్నది. ఎవ్వరీ ఫలమును (నామకీర్తన స్మరణ ఫలమును) ఇతరములైన సాధారణ ఫలములతో సమానముగ చూచుదురో

నామ్నాం సహస్రేషు చతుర్భుజస్య
యః కీర్తయేదేక మపి స్మరేద్వా ।
వాచాం ఫలం, యేతుల యన్తి తస్య
ద్విషన్తి దేవాః కిల తద్విదస్తాన్ । 18

వారే, భగవంతుని తత్త్వము నెరిగిన దేవతలను ద్వేషింతురు.'

'దేవాః అనగా దేవజాతికి చెందినవారని సాధారణార్థము. కాని దీవ్యంతి ప్రకాశంతే ఇతిదేవాః' నిరంతరము ప్రకాశించు స్వభావము కలవారే దేవతలు. భగవదాయత్తమైన వాక్కుతో, భగవన్నామసంకీర్తన మొనరించుచు, నిరంతరము తైలధారా సమానమైన బుద్ధితో భగవంతుని దివ్యమంగళ విగ్రహమునే ధ్యానించుచు శ్రీహరి స్వరూప భావనా భావితాంతః కరణులైన వారే దేవతలు. కావునే భగవానుడు వారిని పీడించు రాక్షసుల చంపి (భగవద్ద్వేషుల చంపి) నిరంతరము వారిని (దేవతలను) రక్షించుచుండును. భగవానుని చక్రము, భగవద్ధ్యాన పరాయణములైన మనస్సుల రక్షించు చుండునని పూర్వము ధ్రువచరిత సందర్భమున 7వ అధ్యాయమున (18వశ్లోకవ్యాఖ్యానమున) తెలుపబడినది. 18

అట్లే హృదయము పరబ్రహ్మా యత్తమైనప్పుడు, సహస్ర మూర్తియగు (అసంఖ్యాకములగు నాకారములు కల) శ్రీహరి యొక్క ఏదియొ యొకస్వరూపమును అనగా అగ్ని, విష్ణువు, ఈశ్వర ప్రభృతులగు రూపములలో దేనినైనను మునులు ఉపాసనా భేదము నాశ్రయించి యారాధించిన వారై యమృతత్వమును పొందిరి. క్రిందటి 14, 15 శ్లోకముల వివరించు నప్పుడుదాహరించిన శ్రీభాగవతశ్లోకమున –

'మనోవచోభ్యామను మేయవర్త్మనో దేవక్రియాయాం ప్రతియంత్యథాపి ।'

ఇత్యాదిగా యాగాది వైదిక క్రియాకలాపము నందు ఇంద్రాగ్ని ప్రభృతి దేవతా నామములచే శ్రీహరినే యారాధించి, భగవానుని పొందుచున్నారని చెప్పబడినది. కనుకనే,

ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతి సాగరం ।

సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి ।

'ఆకాశమునుండి పడిన నీరు ఏ ప్రదేశమున పడినప్పటికిని చివరకు సముద్రమునే చేరినట్లు, ఏనామముతో, ఏదేవత నర్చించినను ఆయర్చనము సర్వదేవాత్మకుడు, సర్వఫలప్రదాతయైన శ్రీహరికే చెందునని చెప్పబడినది. గీతలో శ్రీ భగవానుడు–

తథా హృది బ్రహ్మపరే స్వరూపం
హౌతాశనం వైష్ణవ మైశ్వరంవా
భిన్నోపదేశా మునయః స్మరన్తః
సహస్రమార్తైరమృతత్వ మాపుః । 19

యేత్వన్య దేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః।
తేఽపి మామేవ కౌన్తేయ! యజన్త్యవిధి పూర్వకమ్ ।

'ఎవ్వరు ఇంద్రాది దేవతలకు భక్తులై శ్రద్ధతో త్రయీ (వేదత్రయము ఋగ్యజుస్సామాత్మకము) మాత్రనిష్ఠులై యాగముల ద్వారా నాయాయి దేవతల పూజింతురో వారు కూడ నన్నే ఆరాధించు చున్నారు. కాని వారియారాధనము విధి పూర్వకము కాదు. ' అని పేర్కొని యున్నాడు. ఈ శ్లోకతాత్పర్యమిది.

వేదాన్త వ్యతిరిక్తములైన ఋగ్యజుస్సామాత్మక వేదములచే విధింపబడిన ఇంద్రాది దేవతో ద్దిష్టములగు యాగాది కర్మములు, భగవత్పర్యన్త తా బుద్ధితో (అనగా భగవంతుడగు శ్రీహరికి మాత్రమే ఉద్దిష్టములను తాత్పర్యములతో) నాచరింపబడుట లేదు. కనుక, కేవల మాయాయి దేవతల నుద్దేశించి మాత్రమే చేయబడుచున్నవి కనుక, పరిమితమైన ఫలములనే యిచ్చును. అనగా సర్వదేవతాంతర్యామిగ భగవానుడున్నాడను వివేకము లేక, కేవలమాయాయి దేవతా యజన మాత్ర బుద్ధితో చేయబడుచున్నవి కనుక నవి, 'యవిధిపూర్వక'ములు. ఈ కారణముచే నాయారాధకులు ఆయాయి దేవతలమాత్రమే పొందగలుగు చున్నారు కాని పరమ పురుషుని కాదు. ఈ విషయమే ఈ క్రింది రెండు శ్లోకములలో స్పష్టపరుపబడినది.

'అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ ।
నతుమామ భిజానంతి తత్త్వేనాతశ్చ్య వంతి తే ॥
యాన్తిదేవవ్రతా దేవాన్పితౄన్యాన్తి పితృవ్రతాః ।
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజనోఽపిమామ్ ।'

'నేనే సర్వయజ్ఞములకు భోక్తను. నేనే ఫలప్రదాతను. నన్ను వాస్తవముగ నెరుగ జాలక (సర్వదేవాన్తర్యామి యై యుండి యజ్ఞభోక్తనై, ఫల ప్రదాతనై యున్నానని తెలియజాలక) ఆయాయి దేవతలయందే భోక్తృత్వ ఫలప్రదాతృత్వ బుద్ధినుంచి పరిమిత ఫలముల పొందుచు చ్యుతినొందుచున్నారు. దర్శపూర్ణమాసాది వైదిక, కర్మములచే ఇంద్రాద్యులను పూజించువారు, ఆయింద్రాది దేవతలను మాత్రమే పొందుదురు.

తస్యైవరూపాణ్యపరేస్మరన్తో
విధానతః కాలమృతీర్విజిగ్యుః ।
కించాత్ర యాని స్థిరజంగమానాం
నామాని రూపాణి పృథగ్విధాని ॥ 20

తస్యైవ విష్ణోః సకలాని తాని
ప్రపంచ భూతో హి విరాట్ స ఏవ ।
అవిస్మయత్వాదిదమ ప్రశస్యం
యదస్మ్యథృష్యః ఫణిభిశ్చ దైత్యైః ॥ 21

తమిత్థ మిష్టప్రదనామరూపం
వృథా ద్విషన్తః శరణం భవాబ్ధౌ ।
ఆత్మద్రుహస్తాత! భవన్తి శోచ్యాః
అజ్ఞాః ఖగాః పక్వవనం వృథైవ ॥ 22

పితృ యజ్ఞాదులచే పితృదేవతలను పూజించు చున్నామను బుద్ధికలిగిన వారు పితృ దేవతలనే పొందుదురు. ఎవ్వరు యక్షులు; రాక్షసులు, పిశాచములు మున్నగు భూతముల పూజించు చుంటిమని భావించి వారినే పూజించుదురో అట్టివారు భూతాదులనే పొందుదురు. కాని ఎవ్వరు దేవపితృ యక్షరక్షః ప్రభృతి శరీరముల యందు పరమాత్మయగు వాసుదేవుడే భోక్తగా ఫలప్రదాతగా నున్నాడని యెరిగి, నన్నే పూజింతురో వారు నన్నే పొందుదురు. కావున అన్య దేవతాపారమ్య బుద్ధికలవారికి కలుగు ఫలము పరిమితము కాగా, నన్నే ఆరాధించు వారి ఫలము అనవధికాతి శయానంద ప్రాప్తి యని భగవానుడు స్వయముగ పేర్కొనినాడు. కనుక శివాద్యన్య దేవతారాధన మొనర్చిన వారుకూడ తదంతర్యామి శ్రీహరియేనని యెరిగి యారాధించి నప్పుడే పరమ ప్రాప్యమును పొందుదురని యెరుగ వలయును. 19

భగవానుడగు శ్రీహరి రూపములనే యథావిధిగ స్మరించు చున్నవారై, మరికొందరు, కాలమును, మరణమును జయించిరి. అంతేకాక, కొందరు ఈ ప్రపంచమున స్థావరములు, జంగమములు అయిన వివిధ పదార్థముల నామములను, రూపములను కూడ ఆ శ్రీహరికి సంబంధించిన వానిగనే స్మరించుదురు. 20

ఈ ప్రంచమున గల ప్రతివస్తువు ఆ శ్రీహరిరూపమే. విరాట్ స్వరూపుడగు

యద్వా ప్రభు ప్రేరణయైవ సర్వే
ప్రవర్తమానాః సతిగర్హితేవా ।
విచిత్ర కర్మానుగ బుద్ధిబద్ధాః
కుర్యుః స్వయంకిం సతతాస్వతంత్రాః । 23

గురోస్తవ క్షోభకరం నవాచ్యం
మయా కథంచిత్తదలం వచోభిః ।
కురుష్వమేఽనుగ్రహ మార్య! యద్వా
తద్వా కరోమి స్వకృతంచ భోక్ష్యే ॥ 24

ఉక్త్వేతి గౌరవాజ్జోషం స్థితే ధర్మపరేసుతే
దైత్యరాట్ పరితో వీక్ష్య మాయీ భేదాదివా బ్రవీత్ । 25

అహో! పశ్యత! పుత్రస్య వర్ధితస్య క్రియాఫలమ్ ।
మమైవ ప్రతికూలాని ఖేదాయ వదతి చ్ఛలాత్ । 26

భగవానుడే సర్వజగదాత్మకుడు. కావుననే (నాయందును శ్రీహరియే అంతర్యామిగ నున్నాడు కనుక ) సర్పములచేతను, రాక్షసులచేతను, సమీపింపరాని వాడనైతిననుట ఆశ్చర్యకరము కాదు. కావున యిక్కడ ప్రశంసింప దగిన దేమియులేదు.

ఈ శ్లోకములలోను సర్వనామములు శ్రీహరి పరములేననియు, సర్వవస్తుస్వరూప ములు,తదంతర్యామియగు శ్రీహరివేననియు, ఈభావన పరిపూర్ణముగ కలవారిని ఏమియు పీడింప జాలవని చెప్పబడినది. 'విరాట్' శబ్దమునకు, అంతట వ్యాపించి విశేషముగ ప్రకాశించు వాడని యర్థము. 21

'లెస్సగ పండిన పండ్లతోటను అజ్ఞానముచే పక్షులు ద్వేషించి నట్లుగ సకల ప్రదాయక నామరూపములు కలగి, సంసారార్ణవ తరణమునకైకైకశరణమైన శ్రీహరిని వ్యర్థముగ ద్వేషించువారు, ఆత్మద్రోహులై (తమకు తామే ద్రోహము చేసికొను చున్నవారై) శోకింప దగియున్నారు. 22

'అయినను తమ ప్రభువుయొక్క ప్రేరణచే అత్యంత నింద్యమగు కర్మము నందుగూడ ప్రవర్తించుచున్న వారై, విచిత్రమైన కర్మానుసారిణి యగు బుద్ధిచే బంధింపబడి, నిరంతరము అస్వతంత్రు లైనవారు స్వయముగ నింత కంటె ఏమి

హే! మంత్రి సత్తమా బ్రూత! భవద్భిర్వావిచార్యతామ్ ।
యద్యేత దుక్తేవాగ్జాలే కించిత్ సారం ఛలంవినా ॥ 27

రే! మూఢ! పుత్ర! కాకథ్యం భాషసే త్వమనర్గలం ।
మత్తో మంత్రి వరేభ్యశ్చ కయాయుక్త్యాసి బుద్ధిమాన్ ॥ 28

జరయ్యానైవ జీర్ణాంగో, వ్యాధిభిర్నైవ కర్షితః ।
సర్వత్రానుప యోగీవా నత్వం యేన భజస్యజమ్ ॥ 29

దుర్లభం మత్సుతత్వంచ యౌవనం చేదృశీంశ్రియం ।
లబ్ధ్వాఽపి భోక్తుం నేశస్త్వం జాడ్యాత్ క్లీబ ఇవోర్వశీమ్ ॥ 30

చేయగలరు ? 23

తండ్రివైన నీకు ఏవిధముగను బాధను కలిగించునట్లు నేను మాటాడరాదు. కావున ఈ మాటలటు లుండనిమ్ము. ఆర్యా! నన్నను గ్రహింపుము. నేనేదియో యొకటినాకు తోచినది చేయుదును. స్వకృత ఫలమును నేనే అనుభవింతును. 24

పితృగౌరవముచే ధర్మపరుడైన పుత్రుడు ప్రహ్లాదుడిట్లు పలికి మిన్నక యుండగ, మా యావియగు నారాక్షసేంద్రుడు యిటునటుల చూచి ఖిన్నుడైనట్లిట్లు పలికెను. 25

'ఆహా! చూడుడు! పుత్రుని పెంచి పెద్దజేసి నందులకు కల్గిన ఫలమెట్టిదో! నాకే ప్రతి కూలములై భేదకరములైన మాటలను కపటములతో పల్కుచున్నాడు.' 26

'ఓ మంత్రి శ్రేష్ఠులారా! తెలుపుడు! వీడు పలికిన మాయపు మాటలలో కపటము లేని సారాంశమేమైన కలదా? 27

'ఓరీ! పుత్రుడా! మూఢుడా! నీవనర్గళముగా (అడ్డులేకుండగా) కపట వచనముల పల్కుచున్నావు. నా కంటెను, మంత్రివరుల కంటెను ఏకారణముగ నీవు బుద్ధిమంతుడవు?' 28

నీవు ముదుసలి తనముచే జీర్ణమైన దేహము కలవాడవు కావు! వ్యాధులచే గూడ పీడింప బడవైతివి. అంతటనుపయోగింప బడని వాడవు కూడ కావు. ఏలయీ అజుని భుజించు చుంటివి ?'

మంద! ధర్మజ్ఞమాత్మానం మన్యసే సతతం ఛలాత్ ।
వదసి ప్రతికూలంమే త్వైవ హితవాదినః ॥ 31

భజస్వ విషయాన్ రమ్యాన్ కాంతాకేలిరసోజ్జ్వలాన్ ।
త్యజ నిర్విషయావాచః త్వమాయుర్మావృథాకృథాః ॥ 32

సాభిలాషదృశః క్షీబాః కామినీ రిచ్ఛయా భజన్ ।
పునర్బ్రహ్మసుఖం శ్లాఘ్యమితి నైవ వదిష్యసి ॥ 33

మృగయా ద్యూత గీతేషు రసమాస్వాదయన్నవం ।
వివేక శిక్షాం గురుషు పూర్వవన్నైవ వక్ష్యసి ॥ 34

ముదుసలితనము, వ్యాధిగ్రస్తత, పనికిరాక పోవుట అనునవి ఈ దేహమునకు కల్గినప్పుడు అసమర్థులైన వారుమాత్రమే భగవంతు నాశ్రయింతురని హిరణ్యకశిపుని యభిప్రాయము. 29

'నపుంసకుడు జాడ్యవశమున సౌందర్యవతియగు నూర్వశి ననుభవింప జాలనియట్లు, దుర్లభమైన, మత్సుతత్వము (నాకుకొడుకువై పుట్టుట) యౌవనము, ఇట్టి సంపదలను, పొందికూడ జడుడవై (యుక్తాయుక్త వివేక శూన్యుడవై) వీటి ననుభవింప జాలకున్నావు.' 30

'ఓరీమందబుద్ధీ! ఎల్లప్పుడు కపటముగ నీకు నీవేధర్మజ్ఞుడనని భావించు కొను చుంటివా? నీ మేలును బోధించెడి నాకే ప్రతికూలముగ మాటాడుచున్నావు!' 31

ఓరీ! రమణీరమణములచే మనోజ్ఞములైన విషయసుఖముల ననుభవింపుము. నిరాలంబనము లైన యీ మాటలను విడువుము. నీయాయువును వ్యర్థ పుచ్చకుము.' 32

సుఖలాలసములైన కన్నులతో యౌవన మత్తలైన కామినుల ప్రీతితో ననుభవించితి వేని మరి ఇక పరబ్రహ్మ సుఖము గొప్పదని పలుకనేరవు. 33

వేట, జూదము, గానము, వీటిలోగల క్రొత్త చవులను రుచి చూచినచో నికముందు గురువుల వద్ద వెనుకటివలె జ్ఞాన బోధనముల చేయవు. 34

'నా బలముచే హరింప బడిన దేవసంబంధములగు భోగములను, విషయ

భుంక్ష్వ భోగాంశ్చ దివ్యాంస్త్వం విషయాన్ మద్బలా ద్ధృతాన్ ।
మూఢ సేవధి మారుహ్య పైత్రం త్యజసి కిం వృథా ॥ 35

మయాదత్తం సుఖం హిత్వా త్వముపేంద్రాద్వృథేచ్ఛసి ।
కిం నపశ్యసి దేవేంద్రం మదాజ్ఞాలాభతోషణమ్ ॥ 36

ఇత్యుక్త్వా దానవేంద్రేణ జగదుర్దైత్య మంత్రిణః ।
ప్రసాదం రాజరాజస్య రాజపుత్రాభినందయ ॥ 37

సహర్షం దీయమానేషు ప్రసాదం యస్య దేవతాః ।
ఆశీర్వాదేషు యాచన్తే సదా దుర్లభ మీప్సితమ్ ॥ 38

భూషా కాలేచ యస్యద్రాక్ చంద్రో దర్పణతాంగతః ।
హన్యతే స్వేచ్ఛయా గచ్ఛన్ నకదాచిద్విలంబతే ॥ 39

సుఖముల ననుభవింపుము. మూర్ఖుడా! నీ తండ్రిదగు ధన సంపత్తిని పొందియు వ్యర్థముగ విడతువేల.' (విసిన్వన్తి బధ్నన్తీతి, విషయాః ప్రాణిని కట్టి యుంచునవి విషయములని యర్థము). 35

నాచే ననుగ్రహింపబడిన సుఖమును విడచి నీవు, ఉపేంద్రుని నుండి వ్యర్థముగ సుఖమును కాంక్షించు చుంటివి. సాక్షాత్తు దేవేంద్రుడే నాయాజ్ఞా లాభముచే పరితుష్టి నొందుట ఏల చూడవు?' 36

ఈ విధముగ హిరణ్యకశిపునిచే చెప్పబడిన వారై రాక్షసమంత్రులు పలికిరి. 'ఓ రాజ కుమారా! రాజాధిరాజగు నీ తండ్రి యొక్క అనుగ్రహము నభినందింపుము. 37

దైవతములు సహితము నీ తండ్రిచే సానందముగ నీయబడిన యాశీర్వచనము లందు నిరతము సుదుర్లభమైన యనుగ్రహమునే యాచించు చుందురు. 38

'ఎవ్వనికి అలంకార సమయమున చంద్రుడు అద్దమైనాడో, స్వేచ్ఛగా వర్తించినచో చంపబడును కాన నెప్పుడును, ఆలస్యము చేయజాలడో; ' (ఆతనికి పుత్రుడవైతివని 42వ శ్లోకముతో అన్వయము) 39

'వరుణుడు ప్రయత్నపూర్వకముగా నెవ్వనికి పానీయమగు జలమును కలశమున నిరంతరము తేవలయునో, అది పరమానుగ్రహముగా భావింప బడుచుండునో;' 40

యస్య యోగ్యం ప్రయత్నేన జలేశః కలశోద్ధృతం ।
పానీయ మానయే న్నిత్యం మన్యతేఽనుగ్రహం పరమ్ ॥ 40

యస్య దూరస్థకృత్యేషు దూతోగచ్ఛన్ సదాఽనిలః ।
నతిష్ఠతి క్షణం తేన సత్యాఖ్యోఽభూత్ సదాగతిః ॥ 41

ఈ దృశస్యైక వీరస్య ప్రియః పుత్రోఽసి భాగ్యవాన్ ।
త్యజతేష్వేవ దేవేషు క్షీణేష్వేకతమం హరిమ్ ॥ 42

ఇత్థం విశృంఖలధియాం గిరం శృణ్వన్ మహామతిః ।
ప్రహ్లాదో గురువాక్యాని మేనే తద్విఘ్న మాత్మనః ॥ 43

శ్రీ నారద ఉవాచ –
అథా బ్రవీత్సతా న్నత్వా ప్రతివక్తుం నమేఽస్తిధీః ।
అనాదరక్షోభయాచ తూష్ణీం స్థాతుం నచక్షమః ॥ 44

ఎవ్వని సంబంధించిన దూరదేశ సంగతములైన కార్యములు నిర్వహింప వలసి నప్పుడు దూతగా వెళ్లిన వాయువు, ఒక్కక్షణము కూడ నాలసింపక తనకు గల 'సదాగతి' (ఎప్పుడు గమన మొనర్చువాడు) యనుపేరును సార్థక పరచు కొనెనో;' 41

అట్టి యసమాన పరాక్రమశాలికి ప్రియ పుత్రుడవైన నీవెంతో భాగ్యవంతుడవు, కావున, నిర్వీర్యులైన ఆదేవతలలోనే ఒకడైన హరిని విడచి వేయుము. (హరి కీర్తనమును విడువుమని యభిప్రాయము). 42

ఈ విధముగ అదుపులేని మనః ప్రవృత్తిగల మంత్రుల మాటను విని, మహాబుద్ధి శాలియగు ప్రహ్లాదుడు పెద్దలు మాటాడిన మాటలను తనకు ప్రతి బంధకములుగా తలచెను. 43

నారదుడు పల్కెను. పిమ్మట వారికి నమస్కరించి ప్రహ్లాదు డిట్లనెను. మీ మాట లకు ప్రతి సమాధానమిచ్చుటకు నాకుబుద్ధి కుశలత లేదు. కాని అనాదరము కల్గు ననియో, బాధ కలుగుననియో భయపడి మిన్నకుండుటకు కూడ నేనశక్తుడనే!' 44

సర్వప్రదాత యగు శ్రీహరి నారాధించుటలో నాకు కలుగుచున్న విఘ్నములన్నియు

ఆరాధనే సర్వదస్య విఘ్నం దైవకృతాస్తుమే ।
తత్త్వ ప్రవృత్తం పురుషం గురవో వారయన్తియత్ ॥ 45

వృతానివిఘ్నైః శ్రేయాంసి ప్రభో! సర్వాణి సర్వదా ।
శ్రేయస్తమా కథంసిద్ధ్యే న్నిర్విఘ్నా హరి భావనా ॥ 46

కదాచిత్ కస్యచిద్విష్ణౌ రమతే చంచలం మనః ।
ద్రావయన్త్యథ తద్విఘ్నాః శార్దూలా హరిణం యథా ॥ 47

సర్వేశ భావనా నిష్ఠం లోభయన్తీష్టదా స్సురాః ।
రక్షాంసివా భీషయన్తి, గురవో వారయన్తివా ॥ 48

దుర్లంఘ్యా నీదృశాన్ విఘ్నాన్ ధియా నిర్జిత్యయస్సుధీః ।
తమేవ భావయన్నాథం సతస్య పదమశ్నుతే ॥ 49

త్వయామంత్రివరైశ్శోక్త మవిచార్యైవ కేవలమ్ ।
వాక్యైశ్చారు తరాభాసై స్తద్వై విఘ్నాయ నాన్యథా ॥ 50

దైవకృతము లేనని భావింతును. ఏలన- తత్త్వమైన శ్రీహరి యందు ప్రవర్తించుచున్న జనుని(నన్ను) పెద్దలు నివారించు చున్నారు కదా! 45

ఓ రాజా! ఎల్లప్పుడు శ్రేయస్సులు బహువిధ విఘ్నములచే చుట్టు వారియుండును. సర్వ శ్రేయస్కరమగు శ్రీహరి భక్తి భావన, విఘ్నములు లేక ఎట్లు సిద్ధించును. 46

ఎప్పుడో ఒకప్పుడు, ఒక్కని చపలమైన మనస్సు శ్రీహరియందు లగ్నమై ప్రీతిని పొందును. అట్టి మనస్సునే విఘ్నములు, పెద్దపులులు లేడిని తరిమినట్లు తరుము చుండును. 47

శ్రీహరి ధ్యానలగ్నమైన మనస్సుగల జనుని, ఇష్టముల నిచ్చువారై దేవతలే లోభపరతురు. లేదా రాక్షసులు భయపెట్టుదురు లేదా తలిదండ్రులు మున్నగు పెద్దలే నివారింతురు! 48

దాటరాని యిట్టి విఘ్నములను బుద్ధితో జయించి, ఏ ధీశాలి ఆ శ్రీహరినే నిరంతరము చింతించునో, ఆతడు వైష్ణవ పదమును పొందజాలును. 49

విచార్య వదతో వక్త్రాత్ కథం వాగియ ముచ్చరేత్ ।
విషయాన్ భుంక్ష్వ పుత్రేతి పితుః సుతహితార్థినః ॥ 51

స్వత ఏవ దహత్యుగ్రే జనౌఘం విషయానలే ।
కథం చిద్విద్రుతం తాత! కథం మాంక్షేప్తుమిచ్ఛసి ॥ 52

స్వయమేవ జనాస్సర్వే పతన్తి విషయావటే ।
అంధా ఇవపురః కూపే పరైరప్రేరితా అపి ॥ 53

యస్తుతాన్ రక్షతి క్లిష్టాన్ జ్ఞాన మార్గోప దేశతః ।
సలోకస్య పితాజ్ఞేయో మాతా బంధుర్గురుశ్చసః ॥ 54

విషయా ననుధావన్తి తర్షాత్ సుఖధియో జనాః ।
అతృప్తాశ్చ నివర్తంతే మృగతృష్ణాం మృగాఇవ ॥ 55

భవాబ్ధౌ విషయగ్రాహం భయాద్విష్ణు ప్లవాశ్రితం ।
కరుణానాస్తితే తాత! పునర్మాంక్షేప్తు మిచ్ఛసి ॥ 56

నీ చేతను, మంత్రి వరులచేతను కేవలము విచారింపకయే మనోహరముగా నా భాసించు వాక్యములచే చెప్పబడినది. అది విఘ్నము కలిగించు తలపుతోనే తప్ప వేరు కాదు. 50

' కుమారుని మేలుకోరి పర్యాలోచన మొనర్చి పలికిన తండ్రి నోటినుండి "పుత్రుడా! విషయముల భోగింపు మనుమాట యెట్లావిర్భ వించును? 51

తండ్రీ! సహజముగనే జనబృందమును దహించునట్టి, విషయ సుఖరూపమగు దారుణాగ్నియందు, ఎట్లో దూరముగ పారిపోయిన నన్ను పడవేయ నెట్లిచ్ఛగించితివి? 52

సాధారణముగ జనులెల్లరు, విషయ సుఖములను గోతిలో ఇతరులచే ప్రేరేపింప బడకయే, గ్రుడ్డివారు నూతిలో పడినట్లు స్వయముగనే పడుచుందురు. 53

ఎవ్వడిట్టి క్లేశముల పాలైనవారిని జ్ఞానమార్గము నుపదేశించుట ద్వారా రక్షించునో ఆతడే లోకమునకు తండ్రి, తల్లి, బంధువు, గురువునని తెలియ వలయును. 54

స్వభావా ద్విషయాసక్తం ప్రోత్సాహయతి యో జనమ్ ।
సాజ్యమగ్నిం జిఘృక్షంతం బాలం తత్ర సపాత యేత్ ॥ 57

ఇంద్రియాణీంద్రియార్థేషు చాలయన్న బుధోజనః ।
తైరేవాశక్తి తైర్నిత్యం కుపుత్రైరివ పీడ్యతే ॥ 58

విషయార్థీ, పరాగ్వృత్తిః ప్రత్యగాత్మాన మీశ్వరమ్ ।
నైవ పశ్యేద్దిశం యామ్యాం గచ్ఛన్ మేరుగిరింయథా ॥ 59

విషయ బ్రహ్మణో ర్మార్గౌ విరుద్ధౌహి పరస్పరమ్ ।
అత్రాన్య మార్గనిరతో యాతి నాన్యం పరంనరః ॥ 60

ఎండమావి ననుసరించి లేళ్లు పరువెత్తినట్లు సుఖలాలసులైన జనులు విషయ సుఖములకై పరువెత్తు చున్నవారై తృప్తిని పొందజాలకయు అశక్తతచే వెనుకకు మరలుదురు. 55

తండ్రీ! సంసార సాగరమున విషయ సుఖములను మొసళ్లకు భయపడి శ్రీహరి యను నావను ఆశ్రయించిన నాపైనీకు కరుణ లేదా! ఏల మరల నన్నా విషయ సముద్రమున త్రోయ నెంచెదవు? 56

సహజముగ విషయా సక్తుడైన వానిని ఎవ్వడు ప్రోత్సహించునో వాడు ఆజ్యముచే ప్రజ్వరిల్లుచున్న అగ్నిని గ్రహింప నుంకించుచున్న బాలుని, ఆయగ్నిలోనే పడద్రోయు చున్నాడని భావింప వలయును. 57

ఇంద్రియములను వాటి విషయముల యందు స్వేచ్ఛగ ప్రవర్తింప జేయు పామరజనుడు నియమ విదూరములైన యా యింద్రియముల చేతనే కుపుత్రుల చేవలె పీడింప బడును. 58

యామ్యదిశను (ఉత్తరమువైపు) ప్రయాణించువాడు మేరుపర్వతమును దర్శింప లేనట్లు, విషయలాలసుడై భగవత్పరాఙ్ముఖమైన ప్రవృత్తి కలవాడు ప్రత్యగాత్మ యైన పరమేశ్వరుని దర్శింప జాలడు. ప్రత్యగాత్మ యనగా, తనకొఱకు తానే స్వతంత్రముగ (ఇతర నిరపేక్షముగ) ప్రకాశించువాడు. పరమాత్మకే ప్రత్యగాత్మ యని కూడ వ్యవహారము. 59

విషయ సుఖములకు చెందిన మార్గము, బ్రహ్మమార్గము, పరస్పర విరుద్ధములు.

తస్మాద్విషయ సక్తానాం తాత! దుఃఖపరంపరా ।
నకదాచిద్ భవేచ్ఛాంతిః బ్రహ్మైవైకం హి శాన్తిదమ్ ॥ 61

ప్రశంసితం త్వయా యత్తు సుఖం విషయ సంభవమ్ ।
బహుదుఃఖ విమిశ్రత్వా దల్పత్వాద్దుఃఖమేవతత్ ॥ 62

నాశదాహాపహరణం శంకా మిశ్రిత మల్పకమ్ ।
బహుప్రయాససంసాధ్యం ధిక్ సుఖంవిషయో ద్భవమ్ ॥ 63

నింబచూర్ణ కృతం పిండమన్తః స్వల్పగుడం నరః ।
కోలభేత మనఃప్రీతిం తాదృగ్వైషయికం సుఖమ్ ॥ 64

వీటిలో విషయ మార్గము నాశ్రయించినవాడు, సర్వోత్కృష్టమగు రెండవ మార్గమును పొందజాలడు.

ప్రవృత్తి మార్గము, నివృత్తి మార్గమునని, జీవులకు ద్వివిధమార్గము లున్నవి. ప్రవృత్తి మార్గమనగా సాంసారిక సుఖములకై తాపత్రయపడుట. నివృత్తి మార్గమనగా బ్రహ్మోపాసనము. మొదటి మార్గము జననమరణ చక్రముతో కూడి బంధకారణము. రెండవది మోక్షహేతువు. ఈ రెండింటిలో మొదటి దాని నాశ్రయించినవాడు నిత్యబద్ధుడై సంసార సాగరమున బడి తల్లడిల్లును. రెండవమార్గము నాశ్రయించినవాడు పరమానందమును పొందును. కావున రెండవ మార్గమే ఆశ్రయణీయమని తాత్పర్యము. దీనిని కఠోపనిషత్తు

అన్య చ్ఛ్రేయో అన్యదుతైవ ప్రేయః తే ఉభే నానార్థే పురుషం సినీతః ।
తయోః శ్రేయ ఆదదానస్య సాధుభవతి హీయతేఽర్థాద్య ఉప్రేయో వృణీతే ॥
శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేతః తే సంపరీత్య వివినక్తి ధీరః ।
శ్రేయోహి ధీరోఽభిప్రేయసో వృణీతే ప్రేయో మందో యోగక్షేమాద్వృణీతే ॥

అని పేర్కొన్నది. అత్యన్త ప్రశస్తమైన మోక్షమార్గమువేరు. ప్రీతిని గొల్పు భోగమార్గము వేరు. శ్రేయస్సు ప్రేయస్సు అని వ్యవహరింపదగు, ఈ రెండు మార్గములు పరస్పర విలక్షణమైన ప్రయోజనము కలవై పురుషుని బంధించుచున్నవి. ఈ రెండింటిలో శ్రేయో మార్గమును పరిగ్రహించిన వానికి అనగా మోక్షమార్గము

పర్వతం సర్వతః ఖాత్వా చిరం శ్రాన్తః కృశోజనః ।
విన్దేత్ కాచమణిం యద్వత్ తద్వత్ కామ బహిః సుఖమ్ ॥ 65

తావద్బాహ్య సుఖం శ్లాఘ్యం మన్యతే కృపణో జనః ।
యావద్వేదాన్త వాక్యేషు బాధిర్యం ననివర్తతే ॥ 66

నాశ్రయించినవానికి భద్రమగును. ఎవ్వడు ప్రేయోమార్గమును అనగా భోగమార్గము నాశ్రయించునో వాడు భ్రష్టుడగును. సహజముగ ఈ రెండు మార్గములు పురుషునికి సన్నిహితములుగనే ఉండును. కాని ఈ రెండింటిని లెస్సగా పర్యాలోచించి హంసలు నీరక్షీరములలో క్షీరమును గ్రహించునట్లు, ధీరుడగు జనుడు ఈ రెండిటిని వేరువేరుగా గుర్తించును. ప్రాజ్ఞుడగువాడు ప్రేయస్సు కంటె శ్రేయస్సునే సర్వోత్తమముగా భావించి పరిగ్రహించును. కాని మందబుద్ధి యైనవాడు ఈ రెండు మార్గములలోని మంచి చెడులను వివేచింపలేక లౌకికములగు యోగక్షేమముల మాత్రమే దృష్టియందిడుకొని ప్రేయోమార్గమునే(భోగమార్గమునే) ఎంచుకొనును. ఇది యుక్తము కాదని తాత్పర్యము. ఈ యుపనిషత్తాత్పర్యమునే హరిభక్తి సుధోదయ శ్లోకము స్పష్టపరచుచున్నది. 60

కనుక, తండ్రీ! విషయలంపటులైనవారికి దుఃఖపరంపర తప్పదు. ఒకప్పుడు కూడ శాంతి లేశమాత్రమైన లభింపదు. 61

విషయసుఖము చాల గొప్పదని నీచే ప్రశంసింప బడినదికదా! ఆసుఖము తుచ్ఛము. బహువిధ దుఃఖములతో కూడినది కావున దుఃఖరూపమే తప్ప వేరు కాదు. 62

నశించునో, దహింపబడునో, అపహరింపబడునో యను వివిధ శంకలకు ఆస్పదమై స్వల్పమయ్యును మిక్కిలి యాయాసముచే సాధింప దగినదియునగు విషయ సుఖమునకు తిరస్కారమగును గాక! 63

లోపల కొలదిగ బెల్లముంచి వేపపొడితో చేయబడిన ముద్దలను, తిని యెవ్వడు మనస్సున సంప్రీతుడగును? విషయసుఖమును నట్టిదే! 64

చాలకాలము శ్రమపడి కొండను త్రవ్వి కృశత్వమును పొందినవాడు చివరకు గాజుముక్కను పొందినట్లు బాహ్యమగు కామ సుఖము కూడనంతియే. 65

ఎంతవరకు పరబ్రహ్మ ప్రతిపాదకములైన వేదాన్తవాక్యముల పట్ల తన చెవిటి తనమును విడువ జాలడో అంతవరకా దీనజనుడు, బాహ్యమగు కామసుఖమునే పొగడుచుండును. 66

త్వాదృశస్య మహారాజ! యత్సుఖం ద్విపదామసౌ ।
ఆనందః పరమస్సోऽయం గుణితో బహుకోటిభిః ॥ 67

ప్రాజాపత్యః శ్రుతః సోऽయం బ్రహ్మానందమహాంబుధేః ।
ఉద్ధృతైక కణార్ధార్ధ కోటిభాగేన నో సమః ॥ 68

ఓ మహారాజా! నీ బోటి వారికి కల్గెడి యానందమేది కలదో అదియే మానుషానందము. కాని బ్రహ్మానందము దీనికి అనేక కోట్లు అతిశయించినది. ఎవ్వడు యువకుడు, బలవంతుడు, సమస్తైశ్వర్య పూర్ణమగు పృథివి కలవాడో వానికి కలుగునట్టి యానందము మానుషానందమన బడును. ఇట్టి యానందమును మహారాజు మాత్రమే పొందగలడని తాత్పర్యము. కాని యీ యానందము పరాకాష్ఠకాదు. దీని కంటెనెన్నో రెట్లు మిన్నయైన దేవానంద గంధర్వా నందాదులు కలవు. ఈ క్రమములో చతుర్ముఖ బ్రహ్మ యనుభవించు నానందము శ్రేష్ఠమైనది. మానుషానందము కంటె నీ యజానజ 'బ్రహ్మానందము' అనేక గుణములధికము. కానీయీ చతుర్ముఖ బ్రహ్మానందము కూడ 'పరబ్రహ్మానందము' నకు అంశాంశము మాత్రమే. ఈ పరమానందమును తృష్ణను జయించిన మహానుభావులు మాత్రమే పొందగలుగుదురు. కావుననే –

యచ్చకామ సుఖంలోకే, యచ్చదివ్యం మహత్సుఖమ్ ।
తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్ ॥

లౌకికమగు కామసుఖముకాని, దేవతలనుభవించు దివ్యసుఖముకాని కామతృష్ణాదుల జయించిన యోగికి కలుగు సుఖమునకు 16వ యంశమునకు కూడరాదు. ఇట్టి తృష్ణాక్షయ జన్యమగు సుఖమునకే లౌకికదైవిక సుఖములు చాలవన్నచో శ్రీహరి ప్రీతిరూపమగు పరమ సుఖమునకు కోట్లరెట్లు న్యూనాతి న్యూనములు, తుచ్ఛములేకదా! కావున సర్వథాత్యాజ్యములే అని యభిప్రాయము. 67

ఏది ప్రజాపత్యా నందమని వేదములలో కీర్తింప బడినదో, అది బ్రహ్మానంద మహాసాగరము నుండి వెలికి దీయబడిన ఒక్కకణపుటర్ధార్ధము యొక్క కోట్యాత్మకమగు నంశమునకు కూడ సమానము కాజాలదు.పరబ్రహ్మానందము ముందు చతుర్ముఖ బ్రహ్మానందము కూడ తుచ్ఛమేనని తాత్పర్యము. తైత్తిరీయమున నానందవల్లిలో వివిధములగు నానందములు చెప్పబడినవి. 68

గోవింద స్మరణ మాత్రము చేతనే లెస్సగ పొందదగిన యత్యుత్తమ

గోవిందస్మృతిమాత్రేణ సంప్రాప్తేఽత్యుత్తమే సుఖే ।
సుఖే నాల్పేన కస్తుష్యేత్ క్షీణచిత్తం వినానరమ్ ॥ 69

అనంత మజరం సత్యమసమం తదమిశ్రితమ్ ।
సుఖమావిర్భవే ద్బ్రాహ్మమచ్యుతస్మృతిమాత్రతః ॥ 70

ద్విపాత్త్వం జ్ఞానవేశంచ జనోలబ్ధ్వాఽతి దుర్లభమ్ ।
ఆశ్రయేద్విష్ణు మాశ్వర్వాక్ జరారోగాద్యుపద్రవాత్ ॥ 71

సుఖముండగా, కేవలము నష్టబుద్ధియగు కృపణ జనుడుతప్ప, ఎవ్వడల్ప సుఖముచే పరితుష్టుడగును?

భగవన్నామస్మరణ జన్యమగు పరమసుఖమును విడచి లౌకిక సుఖముల్కై ప్రాకులాడువాడు కామధేనువును విడచి గాడిదను ఆశ్రయించినట్లే యగునని తాత్పర్యము. 69

అచ్యుత నామమును స్మరించినంత మాత్రముననే కలిగెడి బ్రహ్మానందము (బ్రాహ్మసుఖము) అనంతము, అజరము, సత్యము, అసమము, అమిశ్రితము.

**అనంతమ్ :–** లౌకికములైన సుఖములన్నియు సవ్యాజములు. అనగా నేదియో కారణము నాలంబించి పుట్టునవి. కనుక కారణము నశింపగనే ఆ సుఖము కూడ నశించును. అనగా సాంతము. నాశసహితమని భావము. కాని భగవత్ స్మరణ జన్యమగు సుఖము శాశ్వతమైనది. నిత్యమైనది. నిర్వ్యాజమైనది.

**అజరమ్ :–** జీర్యతే ఇతి జరమ్. కాలవశమున నశించునది. అట్లుకానిది అజరమ్. అనగా, ఏ సుఖమైనను అనుభవ సమయముననే కాక కాలాంతరమున గూడ పరితోషజనకమై, శాశ్వతముగ నిలచియున్నచో నట్టిసుఖము అజరము. అనగా కాలవశమున క్షీణింపనిది. ఇట్టి సుఖము లోకమున నేదియు లేదు. కాని శ్రీహరి స్మరణ జన్యమగు సుఖము నిరంతరము, సర్వావస్థలయందు, దేశకాలవ్యవస్థతో సంబంధములేక పరితోషజనకమై యుండును.

**సత్యమ్ :–** కొన్ని సుఖములు భ్రాంతిరూపములై, అభ్రాంతి తొలగగనే దుఃఖాత్మకములుగ పరిణమించుట కలదు. గాజుముక్కను చూచి సూర్యకిరణ ప్రసారవశమున రత్నమని భ్రాంతి చెంది, తల్లాభజన్యమగు సుఖమును తాత్కాలికముగ ననుభవించియు, అదిరత్నము కాదని యెరిగి తరువాత పూర్వసుఖద్విగుణితమగు దుఃఖమును పొందుచున్నాము. కాని

సుస్థో యో నస్మరేద్విష్ణుం కథందోస్థ్యే సతతం భజేత్ ।
ఆదితో యదనభ్యస్తం తత్కాలే క ఇహాచరేత్ ॥ 72

పూర్వం రక్షామనాదృత్య మందః కాంతార మావిశన్ ।
సహసాదస్యు భిర్వ్యాప్తో విహ్వలః కింకరిష్యతి ॥ 73

తస్మాత్ సుస్థో భజేద్విష్ణుం భావిదుఃస్థితి హానయే ।
భక్తకాన్తం పద్మనేత్రం సతతం మానసోత్సవమ్ । 74

భగవత్స్మరణ సుఖము కారణాంతర బాధ్యము కాదు కావున సత్యము.

**అనమమ్ :—** నవిద్యతే సమం యస్యతత్ తనతో సమానమైన వేరొక సుఖములేనిది. అనగా నీ సుఖమును దేనితోను పోల్చరాదని తాత్పర్యము.

**అమిశ్రితమ్ :—** లోకమున కొన్ని సుఖములు దుఃఖ సంభిన్నములై యుండును. కుక్క మాంసరహితమగు నెముకను కొరికి నమలు నప్పుడు గాయమేర్పడి, దానినోటివెంట కారిన రక్తమునే అది యస్వాదించి సుఖించు చుండును. కాని కాలాంతరమున నది దుఃఖముగ పరిణమించును. చందనాది లేపనములు తాత్కాలికముగ ఆర్ద్రత (తడి) యున్నంతవరకు అనుభవ మనోజ్ఞము లయ్యును, ఆచందన రసమెండిపోయిన తరువాత శరీరము కఠిన స్పర్శ ననుభవించి దుఃఖమును పొందును. కామాది విషయ సుఖములన్నియు నిట్టివే. అనగాదుఃఖ మిశ్రితములగు సుఖములు. కనుక సుఖాభాసములు. కాని భగత్ స్మరణ సుఖము. సుఖతమము. దుఃఖామిశ్రితము. ఈ విశేషణములచే భగవత్ స్మరణ సుఖము నిరతిశయము, ప్రాణిమాత్రాభిలషణీయము నని తెలియుచున్నది. 70

పొందనలవి కాని రెండు పాదములు కల బుద్ధి జీవిత్వమును, జ్ఞానలవమును కూడ పొంది, జనుడు ముదుసలితనము, రోగములు మున్నగు నుపద్రవములు (విపత్తులు) దరిజేరకముందే, వెంటనే విష్ణువు నాశ్రయింప వలయును.

జరావ్యాధి గ్రస్తమైన శరీరముతో విష్ణువును కీర్తించుట ధ్యానించుట సాధ్యముకాదు కావున, అనేక జన్మకర్మ పరిపాకవశమున కలిగిన యపశుత్వమును (నాలుగు పాదములు లేకుండుటను) సార్థక పరచు కొనుటకై, పశువు కంటె తాను విలక్షణుడనని నిరూపించు కొనుటకైన శ్రీహరి నాశ్రయింపక తప్పదని తాత్పర్యము. 71

శరీర స్వాస్థ్యముకల వాడే శ్రీహరిని స్మరింపనప్పుడు, దుస్థితి యందున్నప్పుడెట్లు భజింపగలడు? మొదటినుండి యలవడనిది, చివరి కెవ్వడు చేయగలడు?

కింవాత్ర బహునోక్తేన మన్మనస్త్వీదృశం ప్రభో ।
ప్రసీదార్యావిచార్యైతత్ ప్రసీదన్తుచ మంత్రిణః ॥ 75

ఇతిరమ్యం వచః శృణ్వన్ వ్యధునోదసురః శిరః ।
అమృష్యమాణో దాసేరో జగ్ధ్వేవామ్రమసంప్రియః ॥ 76

పూర్వాపర పరామర్శ శూన్యః క్రోధానలా కులః ।
దిగ్గజాన్వై సమాహూయ వ్యాదిదేశాతిదుర్మదాన్ ॥ 77

బాలోఽప్యయం దిగ్గజేంద్రాః స్వకులంధగ్ధు మిచ్ఛతి ।
భవద్భిర్హన్యతాం ధూర్తః ప్రవృద్ధః క్వోపయోక్ష్యతే ॥ 78

ఏ విషయమైనను ముందునుండి యభ్యసింప బడినప్పుడే ఎప్పుడైన సులభముగ నాచరింపనగును. అట్లుకాని దొక్కసారిగ, తుదకాచరింపనలవి కాదుకదా! 72

మొదటనే (ముందే) రక్షణమును నిరాకరించి యడవిలో ప్రవేశించిన యవివేకి, ఒక్కసారిగ దొంగలచే చుట్టువడినప్పుడు వివశుడై యేమిచేయగలడు? 73

'కావున శరీరము సుస్థమై (రోగజరాది పీడితము కాక) యున్నప్పుడే, భవిష్యత్కాలమున రానున్న దురవస్థను బాపుకొనుటకై భక్తజనప్రియుడు, పద్మపత్ర విశాలనయనుడు, నిరంతరము భక్తజన చిత్తములకుల్లాసము, ఆనందము కలిగించు వాడునగు శ్రీహరిని సేవింప వలయును. 74

'ప్రభూ! వేయిమాటలేల? నాచిత్తమిట్టిదియే! దీనిని గురించి విచారింపక ప్రసన్నుడవుకమ్ము! ఓ మంత్రులారా! మీరును ప్రసన్నులు కండు' 75

ఒంటె తియ్యని మామిడి పండును నమిలి అయిష్టతను ప్రకటించినట్లు, హిరణ్యకశిపుడు తన కుమారుడు పల్కిన మనోహర వచనమును విని, సహింప లేనివాడై శిరఃకంపము నొనర్చెను. 76

ముందు వెనుకల నాలోచింపజాలనివాడై క్రోధాగ్నిచే వ్యాకుల పాటును చెందిన హిరణ్యకశిపుడు,మద వివశములైన దిగ్గజముల పిలచి యిట్లాదేశించెను. 77

అప్రగల్భుడయ్యును వీడు వంశ నాశనమునే కోరుచున్నాడు. పెరిగి నప్పటికిని వీని వలన నెట్టి యుపయోగములేదు. కనుక యీధూర్తుడు మీచే చంపబడును గాక! 78

అస్మచ్ఛత్రుం హరిం పూర్వమాశ్రితా యే మయాహతాః ।
తానేవ పశ్యతు హతో భవద్భిర్వైష్ణవ ప్రియాన్ ॥ 79

నియుక్తాః స్మోఽల్పకే కృత్యే ఇతి కార్యానచత్రపా ।
భవన్త ఏవ నిపుణాశ్చిత్రే శత్రువధే యతః ॥ 80

తచ్ఛ్రుత్వోద్యత శుండాలా మహేభాస్త త్ప్రియేచ్ఛవః ।
అహం పూర్వికయా జగ్ముర్హన్తుం దైత్యేంద్ర సేవకాః ॥ 81

మదాంధా జగృహుస్సర్వే ప్రాప్య విశ్వంభరప్రియమ్ ।
ప్రహ్లాదం తం కిలోత్క్షేప్తుం పూత్కారముఖరైః కరైః ॥ 82

మా శత్రువైన శ్రీహరి నాశ్రయించి నాచేతను, మీచేతను చంపబడిన వైష్ణవ ప్రియులనే, హతుడైన వీడును చూచునుగాక! 79

ఈ చిన్నపనిలో నియోగింప బడితిమని సిగ్గును చెందకుడు. శత్రువును చిత్రవధ చేయుటలో మీరే కుశలురు. 80

ఈ మాటలు విని యా మహాగజములు దైతేంద్ర సేవాతత్పరులై యాతనికి ప్రీతిని కల్గించు తలపుతో, అహమహమికతో, (నేను ముందు నేను ముందు అనుభావనతో) బాలుని చంపుటకై తుండముల పైకెత్తి యుద్యమించినవి. 81

మదముచే కనుగానని యాగజములు పూత్కారములచే ధ్వనించుచున్న తొండములతో శ్రీహరి ప్రియుడగు ప్రహ్లాదుని ఎత్తి పారవేయుటకై వాని చెంతకు చేరి వానిని బట్టుకొన్నవి. ఇచ్చట 'విశ్వంభర ప్రియమ్' అను పదముచే సమస్త విశ్వమును భరించిన భగవానుడు తన భక్తుని భారమును తప్పక వహించి రక్షించునను అభిప్రాయము వ్యక్తమగుచున్నది. 82

పిమ్మట ముల్లోకముల భరించువాడును, సకలగురువును నయిన యధోక్షజుని హృదయమున భరించిన వాడై ప్రహ్లాదుడు అత్యంత గౌరవాస్పదుడాయెను.

'గురుతరః' అత్యంత గురుత్వముకలవాడు. వినయాది గుణసంపత్తిచే సహజముగనే ప్రహ్లాదుడు గురుడు (గొప్పవాడు) శ్రీహరిని హృదయమున ధరించుటచే గురు తరుడునని యభిప్రాయము. పెద్దలచే గూడ గౌరవింప దగినవాడని తాత్పర్యము. అధోక్షజ శబ్దమునకు నిగ్రహీతేంద్రియులగు యోగుల హృదయము లందావిర్భవించు

అథత్రైలోక్య భర్తారం బిభ్రాణో హృద్యధోక్షజం ।
ప్రహ్లాదః సకలస్యాస్య గురుం గురుతరోఽభవత్ ॥ 83

యేషాం కందుక లీలాయై నపర్యాప్తాః కులాచలాః ।
తే తం చాలయితుం నాలం దిగ్గజాః విశ్వధృక్ప్రియమ్ ॥ 84

యస్సప్త సింధు పతిభిర్దిగి భైర్వరైశ్చ ।
సర్వైర్ధృతం స్వకృతమేత దజాండమీశః ।
లీలాఫలః శిశురివామలకం భిభర్తి
తస్మిన్ స్థితేహృది కథం దిగిభైః సధృష్యః ॥ 85

తమిత్థముక్షేప్తు మశక్ను వన్తః ।
ప్రవృద్ధరోషాః పృథుదంత శూలైః ।
దిక్కుంజరాస్తే నతపూర్వకాయాః
మత్తా నిజఘ్నుః సకలేశ రక్ష్యమ్ ॥ 86

వాడని యర్థము. అధోముఖాని= అంతర్ముఖములైన, అక్షాణి= ఇంద్రియములు; యేషాంతే = ఎవ్వరికి కలవోవారు; అధోక్షాః = అధోక్షులు; ఇంద్రియముల నిగ్రహించినవారు. తేషుజాయతే ఇతి అధోక్షజః అట్టివారి హృదయముల యందావిర్భవించు వాడని యర్థము. ఉపాసకుల హృదయ కమలముల నివసించు పరమాత్మయని తాత్పర్యము. 83

ఏ దిగ్గజములకు బంతులాడుటకు కులపర్వతములు కూడ చాలవో అట్టి దిగ్గజములే విశ్వంభర ప్రియుడగు ప్రహ్లాదుని కదిలించుటకు సమర్థములు కాలేదు. 84

లీలా మాత్ర ప్రయోజనుడైన, యే శ్రీహరి తనచే నిర్మింపబడి సప్తసముద్రములచేతను దిగ్గజముల చేతను ధరింపబడుచున్న యీ బ్రహ్మాండమును పసిపిల్లవాడు చేతియందు ఉసిరికాయను ధరించినట్లు, భరించుచున్నాడో, అట్టి సకలాజాండ భర్తయగు శ్రీమన్నారాయణుడు తన హృదయమున నున్నప్పుడా ప్రహ్లాదుడు, దిగ్గజములచే నెట్లు పీడింప బడగలడు? 85

సకలేశ్వరుడగు శ్రీహరిచే రక్షింపబడుచున్న ప్రహ్లాదుని పై కెత్తుట కెట్లు

అథక్షణాద్దిగ్గజ దంత మాలా
శ్ఛిన్నా స్స మూలం న్యపతన్ ధరణ్యామ్ ।
మదోరుధారాః సహసా నివృత్తాః
తథాప్రవృత్తాః క్షతజోరుధారాః ॥ 87

ఆర్తాః స్వరై ర్ద్వ్యాం పరిపూరయన్తో
దిశోవిభేజు ర్దిగిభా స్తతస్తే ।
దైత్యేశ చిత్తంచ భువం చ పాదైః
ప్రకంపయన్తో భయభూరివేగైః ॥ 88

ఇత్థం ద్విజేంద్రాచ్యుత భక్తినిష్ఠ మాశా గజాస్తే దదృశుర్న ధీరమ్ ।
దంశా ఇవాద్రిం శలభా ఇవాగ్నిం శోకా ఇవాత్మజ్ఞ మజాఇవేభమ్॥89

తతో హిరణ్యాకశిపుః పుత్రం దృష్ట్వా తమవ్రణం ।
అచ్యుతా దచ్యుతం మూఢో దగ్ధుం దైత్యా నచోదయిత్ ॥ 90

ప్రయత్నించి యసమర్థము, వృద్ధినొందిన రోషము కలవియు వంచిన పూర్వదేహము కలవియు, మదించినవియునగు నా యేనుగులు పెద్దవగు శూలములవంటి దంతములతో వానిని పొడిచినవి. 86

అంతట నొక్కక్షణమున దిగ్గజముల దంతపంక్తులు మూలము నుండి విరిగి నేలపై బడినవి. మదజలధారలింకి పోయినవి. రక్తధారలు ప్రవహింప జొచ్చినవి.87

బాధచే విహ్వలములైన యా దిగ్గజములు ఆర్తనాదముచే నాకసమును పూరించుచున్నవై. హిరణ్యకశిపుని హృదయమును, భూమిని ఒక్కమారుగ భయముచేనతి వేగముగల పాదములతో కంపింప జేయుచున్నవై, దిక్కులను విభజించు కొన్నవి (దిక్కుల వెంట పరువెత్తినవని తాత్పర్యము). 88

ఓ ద్విజేంద్రా! (మునిశ్రేష్ఠా!) దంశములు (కీటకములు) పర్వతమును, మిడతలు అగ్నిని, శోకములు ఆత్మజ్ఞాన సంపన్నుని, గొర్రెలు ఏనుగును చూడజాలని యట్టులు ధీరుడును శ్రీహరిభక్తి నిష్ఠుడునగు ప్రహ్లాదుని యాదిగ్గజములు చూడలేకపోయినవి. 89

చోదితాశ్చాసురా వహ్నౌ సమీరణ సమేధితే ।
సాధుం నిక్షిప్య కాష్ఠైఘై శ్చాదయాంచక్రిరే భృశమ్ ॥ 91

అథజ్వాలా మహాజిహ్వః ప్రచండః సర్పిషానలః ।
దేవాన్ వ్యద్రావయత్ స్వర్గాత్ యుగాన్తోత్థ ఇవోష్మణా ॥ 92

తాదృశస్య మహావహ్నేః ప్రహ్లాదః సోఽన్తరేస్థితః ।
అలక్షితస్తదా ధీరః సస్మార జలశాయినమ్ ॥ 93

మహాబ్ధౌ శేష పర్యంకే శయానం మంత్రమందిరే ।
అంతర్జలే జగన్నాథం సోహమస్మీత్య చింతయత్ ॥ 94

ఇత్థం ధ్యానాచలే తస్మిన్ శశామ సహసానలః ।
మహాజల ప్రవాహేన సంప్లావిత ఇవాభితః ॥ 95

పిమ్మట నా హిరణ్యకశిపుడు ఎట్టిగాయములులేని పుత్రుని జూచి అచ్యుతుని నుండి, యెంతమాత్రము జారిపోని చిత్తముగల ప్రహ్లాదుని దహింపుమని, మూర్ఖుడై రాక్షసుల ప్రేరించెను. 90

ఇట్లు హిరణ్యకశిపు ప్రేరితులైన రాక్షసులు వాయువుచే ప్రజ్వరిల్లి జేయబడిన యగ్నిలో సాధువగు బాలకుని యుంచి పైని బాగుగ కట్టెలతో కప్పివెచిరి. 91

అంతట నాయగ్ని ఘోరములైన జ్వాలలను నాల్కలసాచి, నేతిచే ప్రవృద్ధమై ప్రలయ భయంకరమై, తన వేడిచే దేవతలను సహితము స్వర్గము నుండి వెడల నడచినది. 92

అంతటి ప్రచండమైన మహాగ్నిలో నుండియు పైకగుపించని ప్రహ్లాదుడు స్థిరచిత్తుడై క్షీరార్ణవ శాయియగు శ్రీమన్నారాయణుని స్మరించినాడు. 93

ఇట్లా యగ్నిలోనున్న ప్రహ్లాదుడు మహాసాగరాంతర్జలములందు మంత్రాత్మక మందిరమున నాదిశేషుని శయ్యగ జేసికొని పవ్వళించిన సర్వజగన్నాధుడగు శ్రీమన్నారాయణుని "సోఽహమ్" (సర్వాంతర్యామియగు శ్రీహరికంటె వేరుగ లేనను) భావముతో ధ్యానించెను.

సోఽహమ్ = ఆతడేనేను – అనగా శ్రీహరి యంశభూతులే సర్వజీవులు కావున, అంతర్బహి ర్వ్యాప్తుడైన యా పరమాత్మకంటె వేరుగ స్వతంత్రమై యేదియు లేదు

నిఃశేషమసురా వహ్నౌ హతాచ్ఛాన్తే సవిస్మయాః ।
పునశ్చ జ్వాలయామాసు ర్నైవాచేష్టత హవ్యభుక్ ॥ 96

గురుం దృష్ట్వేవ సచ్ఛిష్యః సర్పోవాऽగద ధారిణమ్ ।
ధ్యానాద్విష్ణుమయం జ్ఞాత్వా తంనైవోచ్చైర భూచ్ఛిఖీ ॥ 97

యేషాం భవమహావహ్ని ర్నాలం తాపాయ దుర్జయః ।
కథంతే వైష్ణవాస్తాత! తప్యన్తే ప్రాకృతాగ్నినా ॥ 98

అథశాన్తే మహావహ్నౌ నిర్వికారం నిరీక్ష్యతం ।
దైత్యేంద్రః క్రోధ తామ్రాక్షః స్వయం ఖడ్గము దైక్షత ॥ 99

తతస్తూర్ణం సముత్థాయ దైత్యరాజ పురోహితాః ।
మూర్ధం ప్రాంజలయః ప్రాహుర్ద్విజాః శాస్త్ర విశారదాః ॥ 100

కావున, నేను శ్రీహర్యాత్మకుడనని భావించుటే 'సోహమ్' భావన. మంత్ర మందిరమనుటచే భగవానుడు మంత్రగుప్తుడై యుండుననియు, ఆ మంత్రమును మననము చేయగా ధ్యానగోచరుడగుననియు వ్యక్తమగుచున్నది. 94

ఇట్లుచంచలధ్యాననిష్ఠుడుకాగా, నలువైపుల మహాజల ప్రవాహములచే చుట్టబడి ముంచి వేయబడినట్లొక్క మారుగ నా ప్రచండాగ్ని యారిపోయినది. 95

ఒక్కసారిగ నావహ్ని పూర్తిగ నారిపోవుట చూచి యాశ్చర్యమును చెందిన యా రాక్షసులు, మరల నంటించిరి. కాని యావహ్ని ప్రజ్వరిల్లలేదు. 96

గురువును చూచిన సద్విద్యార్థివలె, ఔషధమును చేతపట్టుకొన్న పాముల వానిని చూచిన పామువలె నాయగ్ని, సర్వమువిష్ణుమయముగా భావించి ధ్యానించుచున్న ప్రహ్లాదుని జూచి శిరస్సు నెత్తలేదు. 97

దుర్జయమైన (జయింప నలవికాని) సంసార మహావహ్ని సహిత మెవ్వరికి తాపమును కలిగింప జాలదో యట్టి వైష్ణవులు ప్రాకృతమైన (సాధారణమైన) యగ్నిచే నేల తపింతురు? 98

అంతట నాయగ్ని చల్లారగా, చెక్కు చెదరని యా బాలకుని చూచి క్రోధముచే నెర్రనైన కన్నులు గల హిరణ్యకశిపుడు స్వయముగ తన కత్తివంక జూచెను. 99

త్రైలోక్యం కంపతే దేవ! భృశం త్వయ్యసి కాంక్షిణి ।
ప్రహ్లాదస్త్వాం నజానాతి క్రుద్ధం స్వల్పో మహాబలమ్ ॥ 101

తదలం దేవ! రోషేణ నవిహన్తుం శశం హరిః ।
విదధాతి స్వయం యత్నంవయం తత్ర యతామహే ॥ 102

నశక్యో హన్తుమస్మాభిరితరోఽత్యను కంపితః ।
బత్రైష కరుణా పాత్రం త్వత్సుతోఽప్యసుధీర్జడః ॥ 103

తదితః పరమప్యేవం బుధ్యా బుద్ధిమతాం ప్రభో !
ఉపాయైర్యోజయిష్యామోవయం యస్యహితే రతాః ॥ 104

యద్యస్మద్ వచనం పథ్యం నశ్రోష్యతి తవాత్మజః ।
నిర్విచారం హనిష్యామః తతస్త్వం భూప! మాక్రుధః ॥ 105

అప్పుడు వెంటనే యాసనముల నుండి లేచి, శాస్త్రవిశారదులు హిరణ్యకశిపుని పురోహితులునగు ద్విజులు, మ్రొక్కుచు నామూర్ధునుద్దేశించి యిట్లుపలికిరి. 100

'దేవా! నీవుకత్తి నెత్త గోరితివేని ముల్లోకములు వణకును. అల్పుడైన ప్రహ్లాదుడు, మహాబలుడవైన నిన్ను క్రుద్ధునిగా నెరుగ జాలడు.' 101

'ప్రభూ వీనిపట్ల నీవు కోపగించుట చాలును. కుందేలును చంపుటకు సింహము తానుగ యత్నింపదు కదా! మేమే వానివిషయమున ప్రయత్న మొనరింతుము.' 102

అత్యంతము అనుకంపితుడైనవాడు (దయతో చూడబడినవాడు) అన్యుడెవ్వడు మాచే చంపదగినవాడు కాడు. అయ్యో! అజ్ఞాని జడుడునైన నీ పుత్రుడు కూడ మాకు కరుణాపాత్రుడే! 103

ప్రభూ! ఇకముందు వీనిని, వివిధోపాయములతో, వీనిమేలు గోరిన వారమగుట, బుద్ధిమంతు లందరిలో బుద్ధిచే శ్రేష్ఠుడగు నట్లు చేయగలము. 104

'ఒకవేళ హితకరమగు మావచనమును వీడువిననిచో ఆలోచింపకయే వీనిని వధింతుము. కనుక రాజా! నీవు కోగింపకుము.' 105

మాశాస్త్ర రూపములగు నస్త్రములచే వీడు చంప బడకపోవుట యాశ్చర్య

శాస్త్రైస్త్రైర్యది వధ్యోఽసౌ నతుతత్రాస్తి విస్మయః ।
బలం హ్యస్య విజానీమః కృత్స్నం, తత్రచ భేషజమ్ । 106

అలం బహూక్త్యా పశ్యాస్మద్బలం, క్రోధం త్యజప్రభో !
త్వత్ క్రోధస్య నయోగ్యోఽయం దేవ! త్రైలోక్యభీషణ । 107

ఉక్త్వేతి కుటిల ప్రజ్ఞా దైత్యం దైత్యపురోధసః ।
ఆదాయ తదనుజ్ఞాతాః ప్రహ్లాదం ధీధనం యయుః । 108

వ్యచింతయన్మహాత్మానం వశీకర్తుంతు తేఽనిశం । 109

విపత్ప్రణాశనం హరిం విచిన్తయన్ విమత్సరః ।
సచాపి విష్ణు తత్పరో గురోరువాస మందిరే । 110

ఇతి నారదీయే హరిభక్తి సుధోదయే దశమోధ్యాయః

మేమియు కాదు. వీని బలమేమో మేము పూర్తిగ నెరుగుదుము. దానికి మందును గూడ యెరుగుదుము. 106

'వేయిమాట లేల? ప్రభూ! మాబలమును పరికింపుము. క్రోధమును విడువుము. త్రిలోక భయంకరా! నీ క్రోధమున కీతడు యోగ్యుడుకాడు.' 107

ఈ విధముగ పలికి, వక్రబుద్ధులగు నారాక్షస పురోహితులు ఆతని యాజ్ఞ బడసిన వారై ప్రశస్త బుద్ధి సంపన్నుడైన ప్రహ్లాదుని తోడ్కొని పోయిరి. 108

మహానుభావుడగు నాప్రహ్లాదుని వశపరచు కొనుటకే వారు నిరంతరము ఆలోచించిరి. 109

సకలా పదల హరించు శ్రీహరిని ధ్యానించువాడై, యెట్టి మాత్సర్యములేక విష్ణుతత్పరుడైన యాప్రహ్లాదుడు గురునివాసమున నుండెను. 110

ఇది శ్రీ నారదీయ పురాణాంతర్గతమగు హరిభక్తి సుధోదయమున

పదియవ యధ్యాయము.

# ఏకాదశాధ్యాయము

**ఏకాదశాధ్యాయసారము:–** గురుగృహమున నున్న ప్రహ్లాదుడు నిఖిలమును 'అనంత' మయముగా భావించుచు బాహ్యవిషయ విరక్తుడై సంచరింప దొడగెను. వినునప్పుడును, విహరించునప్పుడును, అన్న పానాదుల యందును సమాన మనస్కుడై వైరాగ్య సంపదతో నొప్పారు ప్రహ్లాదుని చూచి తోటి బాలురు ఇట్లడిగిరి. 'ఓ రాజపుత్రా నీ చరిత్ర చాల అచ్చెరువు ను గొల్పుచున్నది. భోగలాల సత యెంత మాత్రము లేనవాడవై ఏదియో నిరంతరము హృదయమున ధ్యానించుచు ఆనందము ననుభవించుచున్నావు. ఇందే దేని రహస్యము కాని యంశమున్నచో మాకును తెల్పుము. శత్రు ప్రేరితములైన నిన్ను పీడించిన భటులవలన గాని – పాములు – ఏనుగులు అగ్ని వీటి వలన నెంత మాత్రము చెదరక నీవేల యుండ గల్గితివి?' అని యడిగిన మంత్రి పుత్రులతో ప్రహ్లాదుడు మంత్రి పుత్రులకు తత్త్వమును ప్రతిబోధించుట 6వ శ్లోకమునుండి అధ్యాయము చివర వరకు దాదాపు 85 శ్లోకములలో నిబంధింప బడినది. ఈ శ్లోకములలో ప్రహ్లాదుడు మంత్రి పుత్రులకు ఎన్నియో వేదాన్త రహస్యములను దృష్టాన్త పురస్సరముగా వివరించెను. గర్భస్థదశలో ప్రాణిపొందెడు నరకమును కండ్లకు కట్టినట్లు వర్ణించును. గర్భమున వివిధ క్లేశముల పడిన జీవి ఎటులనైన బయలు పడ వలెనని యత్నించును. ఎట్టకేలకు బయలు పడియు పూర్వజ్ఞానమును కోలుపోవును. గర్భస్థుడగు జీవుడు యోగివలె సర్వము నెరుగును. కాని గర్భమునుండి సూతికా వాయువులచే నెట్ట బడగానే జ్ఞానవిహీనుడై పడును. బాల్యమున నాతని యజ్ఞాన చేష్టలు, యౌవన మదవిహ్వలత, సంసారమున బడిన తరవాత వాని వివశత్వము వాడనుభవించు క్లేశములు, వార్ధకమున మరణము ననుభవించుట, మున్నగునవి లెస్సగా విశ్లేషించి ప్రహ్లాదునిచే నిరూపింపబడినవి. భగవదారాధనా వైశిష్ట్యము, సర్వత్ర సమభావన, మనస్సు యొక్క స్వభావము నెరుగుటలో క్లేశము, మనో నిగ్రహము నందలి క్లిష్టత, యోగము నాశ్రయించుటలోని గౌరవలాఘవములు, మైత్రీ సత్సంగ ధ్యానాదుల విశిష్టత, భగవద్విగ్రహాను చింతనా విధానము మున్నగు ననేక విషయములు గంభీర భావ గర్భితములుగా వివరింప బడినవి. ఈ దృష్టితో నీ యధ్యాయము చాల ప్రాధాన్యమును వహించు చున్నది.

శ్రీ నారదఉవాచ -
అథస గురుగృహేఽపి వర్తమానః
సకలవిదచ్యుత పుణ్యరక్తచేతాః ।
జడ ఇవ విచచార బాహ్యకృత్యే
సతతమనంతమయం జగత్ ప్రపశ్యన్ ॥ 1

శ్రుతి విహరణ పాన భోజనాదౌ
సమమనసం సతతం విరక్తి భాజమ్ ।
సహగురుకుల వాసినః కదాచిత్
శ్రుతి విరతావ వదన్ సమేత్యబాలాః ॥ 2

తవ చరితమహో విచిత్రమేతత్
క్షితిపతిపుత్ర ! యతోఽన్యభోగలుబ్ధః ।
హృదికిమపి విచిన్త్యహృష్టరోమా
భవసి యదాచ వరాంగ యద్యగుహ్యమ్ ॥ 3

శ్రీ నారదముని పల్కెను. అంతనా ప్రహ్లాదుడు, ఆచార్యుని యింటిలో నున్న వాడైనప్పటికి, సమస్త తత్త్వము నెరిగిన వాడును, శ్రీహరి యందనురక్తమై పవిత్రమైన చిత్తము కలవాడును, నిరంతర మీ సకలజగత్తును శ్రీహరి మయముగా భావించుచు దర్శించు చున్నవాడై బాహ్యక్రియలపట్ల నుదాసీనుడై జడునివలె ప్రవర్తించ సాగెను. 1

లౌకిక వచనముల వినుట, తోటి వారితో తిరుగాడుట, త్రావుట, భుజించుట మున్నగు క్రియల యందిన్నింటను, ఏకాకారమగు (ఎట్టివిశేషములేని) ప్రవృత్తి కలవాడును (యాంత్రికముగ నాయాయికృత్యముల నిర్వర్తించు వాడును) నిరంతరము బాహ్య విషయముల యందు వైరాగ్యము చెందినవాడును, అయిన ప్రహ్లాదుని, ఏకాన్త ప్రదేశమున తోటి గురుకుల నివాసులైన పిల్లలు దరిజేరి యిట్లనిరి. 2

ఓ రాజకుమారా! నీ చరిత్రము చాల విచిత్రముగ నున్నది. భోగముల యందెట్టి లోభము నీకు లేదు. హృదయమున నేదియో ధ్యానించి యానంద పులకాంచితుడ వగుచుందువు. ఇది రహస్యము కాకున్నచో మాకు తెలుపుము. (అని పుర్వ శ్లోకముతో అన్వయము) 3

ప్రతిభయ భటనాగ భోగివహ్నీన్
దితిజపతి ప్రహితాన్ విజిత్య సుస్థః ।
కథమసి? బలవానసీదృశస్త్వం
సుఖవిముఖః పరమత్ర కౌతుకం నః ॥ 4

ఇతిగదిత వతః స మంత్రిపుత్రాన్
అవదదితి ద్విజ! సర్వవత్సలత్వాత్ ।
శృణుత! సుమనసః సురారి పుత్రాః
యదహమనన్యరతి ర్వదామిపృష్టః ॥ 5

ధనజన తరుణీ విలాసరమ్యో
భవవిభవః కిలభాతి యస్తమేనం ।
విమృశత ! సుబుద్ధైరుతైష సేవ్యో
ద్రుతమథవా పరివర్జ్య ఏషదూరాత్ ॥ 6

ప్రథమమిహ విచార్యతాం యదద్య
జఠరగతైరను భూయతే సుదుఃఖమ్ ।
కుటిలితతనుభిః సదాగ్నితాపైః
వివిధ పురాజననాని సంస్మరద్భిః ॥ 7

రాక్షసేంద్రునిచే పంపబడిన దుర్వార పరాక్రముులైన భటులను, ఏనుగులను, సర్పములను, అగ్నిని జయించి ఎట్టి బాధయులేక యుంటివి. బాలుడవయ్యును ఇంతటి బలవంతుడ వెట్లైతివి? నీవు విషయ సుఖముల పట్ల విముఖుడ వైతివి. ఇది చాల కుతూహలమును పుట్టించుచున్నది. 4

ఇట్లు పలికిన మంత్రి పుత్రులతో పాటు ఇతర బాలకుల నుద్దేశించి, ప్రహ్లాదుడు, సర్వప్రాణుల పట్ల (అందరి పట్ల) వాత్సల్యము కలవాడగుటచే నిట్లనెను. ఓ మంచి మనస్సుగల రాక్షస పుత్రులారా! వినుడు! నేనెట్లుగ ఇతర విషయముల పట్ల విముఖుడనైతినో, మీచే నడుగ బడితిని గాన చెప్పుదును. 5

ఐశ్వర్యము, బంధు జనులు, స్త్రీల విలాసములు వీటిచే మనోజ్ఞముగ కన్పట్టు ఈ సంసార వైభవమును ఒక్కసారి విమర్శింపుడు! విద్వాంసునిచే ఇది సేవింపనగునా? లేక వెంటనే దూరముగ విడువదగునా ? 6

అహమిహ వివసామ్యమేధ్య పంకే
జఠర గృహేబత! పూర్వమస్మృతేశః ।
బహువిధ బహుజన్మభిశ్చ ఖిన్నో
ననిజహితం కృతవానహో౽తిమూఢః ॥ 8

వపురిహ పరితప్యతే యదుగ్రైః
కటులవణామ్ల రసైశ్చ మాతృభుక్తైః
అచల మనవకాశతః సుదుఃఖం
ఫలమిద మచ్యుత విస్మృతేః ॥ 9

కరాగృహే దస్యురివాస్మబద్ధః
జరాయునా విట్కృమి మూత్రపూయే ।
క్లిశ్యామి గర్భే౽ప్యసకృన్ముకుంద –
పదాబ్జయో రస్మరణేన కష్టమ్ ॥ 10

ఇతఃపరంత్వచ్యుతమేవ యత్నాత్
సాదా భజిష్యే విగతాన్యతృష్ణః ।
స్యాన్నిర్గమో మేజఠరాత్ కదాను
నపూర్వవన్మోధ్య మహం భజిష్యే ॥ 11

ఒక్కసారి యీనాడు, మాతృగర్భమున, గుండ్రముగ చుట్టుకొన్న దేహములు కలిగి, నిరంతరము తపించుచు, పూర్వజన్మముల నన్నిటిని స్మరించుచున్న వారి దుర్భర దుఃఖమును మొట్టమొదట విచారింపుడు ! 7

అపవిత్ర పంకిలమైన ఈ గర్భకుహరమున నివసించుచున్న వాడనై పూర్వము ఈశ్వర స్మరణము లేకయే, అనేక విధజన్మ క్లేశముల చెంది, అత్యంత మూర్ఖుడనై నాకేది మేలో అది చేయలేక పోయితిని. 8

(మాతృగర్భమున నున్నప్పుడు) తల్లి భుజించిన కారము, ఉప్పు, పులుపు మున్నగు తీవ్రరసముల చేతను, కదలుట కవకాశము లేకయు, బహుదుఃఖము ననుభవించిన యీశరీరము పరితపించుట, శ్రీహరి విస్మరణ ఫలమే. 9

కారాగారమున దొంగవలె, విట్(మలము) కృములు, మూత్రము, మున్నగు

ఇత్థం మహోగ్రోదరతశ్చ జన్తు
ర్వినిర్గమం వాఞ్ఛతి పథ్యకృత్యే ।
బద్ధః పశుర్వా నిజబంధ ముక్తిం
పశ్యన్నదూరాత్తృషి తప్త డాగమ్ ।  12

తస్మాత్సుఖం గర్భశయస్య నాస్తి
గర్భాత్తతో నిష్పతితశ్చ సద్యః ।
బాహ్యానిలస్పర్శమవాప్య మూర్ఛాం
ప్రాప్నోతి మాత్రా సహభూరిదుఃఖామ్ ।  13

కశ్మల పదార్థములచే దుర్భరమైన జరాయువు(గర్భకోశము) చే బంధింప బడినవాడనై ముకుంద పాదకమలస్మరణము లేకయే క్లేశముల ననుభవించు చున్నాను.  10

ఇకముందు ఇతరములపట్ల తృష్ణను(అత్యాశను) విడచి ప్రయత్న పూర్వకముగా నిరంతరము శ్రీహరినే భజింతును. అయ్యో! ఈ గర్భమునుండి నాకెప్పుడు విమోచనము కలుగునో కదా! వెనుకటివలె ఇకమూఢత్వమును పొందను.  11

రాటకు కట్టబడిన పశువు, దగ్గరగ కన్పట్టు చెరువును చూచి దాహముతో కట్టు త్రెంచుకొన తలంచినట్లు, గర్భకుహరమున బంధింపబడిన ప్రాణి క్లేశమును బాపుకొను తలపున నాక్లేశబాహుళమగు నుదరమునుండి విముక్తిని కోరును.  12

కావున గర్భమున శయినించు ప్రాణికి సుఖము లేదు. ఆ గర్భమునుండి (సూతికావాయువులచే నెట్టబడి) వెంటనే బయలుపడి, వెలుపలి గాలులచే స్పృశింపబడినవాడై., తల్లితోపాటు, దుఃఖభాజనమైన మూర్ఛ ననుభవించుచున్నాడు.

7వశ్లోకము నుండి 13 వశ్లోకమువరకు ప్రతిప్రాణియు గర్భమున ననుభవించు దుర్భర వేదన వర్ణింపబడినది. శ్రీమద్భాగవత తృతీయ స్కంధమందలి 31వ యధ్యాయమున మాతృగర్భమున ప్రాణి యనుభవించు క్లేశములును, ప్రాణి తన పూర్వజన్మవృత్తముల స్మరించి పరిదేవనల నొందిభగవచ్ఛరణాగతుడై యాక్లేశముల బాపుకొన నిచ్చగించియు; గర్భకుహరమునుండి బయల్వెడలిన వెంటనే పూర్వస్మృతి వికలుడై సంసారమున బడి మాయామోహితుడై మాటిమాటికి గర్భశయన క్లేశముల ననుభవించు చున్నాడని చెప్పబడినది.

విచేష్టమానోఽథ చిరేణ జన్తు
ర్గర్భే యథావేత్తిన కించిదత్ర
ఆశాశ్చతాస్తా విఫలా భవన్తి
పురస్థ మృత్యోరివ భోగవాంఛాః । 14

యుక్తోమునిర్వేత్తి యథానసర్వం
గర్భంగతో, వృత్తితవాన్నవేత్తి
జాగ్రద్య థావేత్తి హితం నగర్భే
సుషుప్త వచ్చాత్ర గతో నవేత్తి । 15

'దేహాన్య దేహవివరే జఠరాగ్నినాసృగ్
విణ్మూత్ర కూప పతితో భృశతప్తదేహః ।
ఇచ్ఛన్నితో వివసితుం గణయన్ స్వమాసాన్
నిర్వాస్యతే కృపణధీః భగవన్! కదాను ? । (శ్రీ భాగ. 3-31-17)

'ఓ భగవానుడా! దేహధారినైన నేను జఠరాగ్నిచే తపించిన దేహము కలవాడనై రక్తవిణ్మూత్ర పంకిలమైన అన్యశరీర గర్భకుహరమున పడినవాడనై, ఈ గర్భక్లేశమునుండి బయలుపడనెంచి, నెలలు లెక్కించు చున్నాను. దీనుడనైన నేనెప్పుడు విముక్తిని పొందుదునో కదా! ' అని భావించియు,

'సోఽహం వసన్నపి విభో బహుదుఃఖ వాసం
గర్భాన్న నిర్జిగమిషే బహిరంధ కూపే ।
యత్రోప యాతముప సర్పతి దేవమాయా
మిథ్యామతిః యదను సంసృతి చక్రమేతత్ ।' (శ్రీ భాగ. 3-31-20)

'కనుక నేనీవివిధ దుఃఖభాజనమైన గర్భకుహరము నుండి, వెలుపలగల అంధకార కూపమున పడజాలను. అక్కడ పడిన తరువాత మాయచేతను మిథ్యాబుద్ధిచేతను తన్మూలమగు జననమరణ చక్రముచేతను ఆవిష్టుడను కావలసినదేకదా! అని తత్త్వము నెరిగిన వాడయ్యెను,

అథాస్య బాహ్యానిలఖడ్గ భిన్న
జ్ఞానోరువృక్షాత్ పునరంకురాభమ్ ।
అకల్పనం జ్ఞానముదేతి బాల్యే
తద్వర్ధతే తద్వపుషైవ సార్థమ్ । 16

జ్ఞానాంకురం తత్పరివర్ధ యన్తి యే
సచ్ఛాస్త్ర సత్సంగతి తోయసేకైః ।
తేఽతి ప్రవృద్ధాత్ ఫలమాప్నువంతి
మోక్షాభిధం జ్ఞానతరోర్ధురాపమ్ । 17

'తస్మాదహం విగతవిక్లవ ఉద్ధరిష్యే
ఆత్మానమాశు తమసః సుహృదాత్మనైవ ।
భూయో యథావ్యసన మేతదనేక రంధ్రం
మామే భవిష్య దుపసాదిత విష్ణుపాదః । (శ్రీ భాగ. 3-31-21)

కావున నేనీవైక్లబ్యమును విడచి నాయంతటనేనే వెంటనే యాత్మోద్ధరణ మొనరించు కొందును. శ్రీహరి పాదము నాశ్రయించిన నాకీ బహుక్లేశ భాజనమగు నీ గర్భవాసదుఃఖము మరల రాకుండునుగాక!' అని నిశ్చయము నొనర్చిన వాడయ్యును- మాతృగర్భము నుండి బయల్వెడలిన వెంటనే పూర్వస్మృతిని సంపూర్ణముగ కోలుపోయి యథాపూర్వముగ సంసారచక్రమున బడుచున్నాడు. భాగవత గ్రంథ తాత్పర్యమునే శ్రీ హరిభక్తిసుధోదయము ముందుముందు శ్లోకములలో స్పష్టపరచుచున్నది. 13

చాలకాలము మాతృగర్భమున నిటునటు కదలాడిన ప్రాణి యేమేమి భావించునో వాటిని యీ భూమిపై భావింపజాలడు. మృత్యు ముఖమున నున్నవాని భోగవాంఛలు వ్యర్థములైనట్లు, గర్భకుహరమునుండి వెలుపలికి వచ్చిన ప్రాణి యొక్క ఆశలన్నియు విఫలములే యగుచున్నవి.

గర్భమున యాతన ననుభవించు నప్పుడున్న హరిస్మృతి యిసుమంతయు నిప్పుడుండదని తాత్పర్యము. 14

యోగియైనముని యెట్లుగ సమస్తము నెరుగునో, గర్భస్థుడగు శిశువంతయు నెరుగును. కాని, వాడే గర్భమునుండి బయల్వెడలినప్పుడేమియు నెరుగజాలడు. గర్భమున మేల్కొని గర్భక్లేశము నెరిగిన వాడయ్యును భూమిపై బడిన తరువాత

యేత్వర్థకామానను యాన్తి తేషాం
తర్షాగ్నితప్తం నహివృద్ధిమేతి ।
జ్ఞానాంకురం తేనఫలాయ నాలం
తచ్ఛిద్యతేఽథో మరణాసి పాతాత్ ॥ 18

పునశ్చగర్భే భవతి ప్రవృద్ధ
మేవం హ్యనన్తాజని మృత్యుమాలా ।
జనస్య తస్మాత్ పరివర్ధయేతజ్
జ్ఞానాంకురం తత్ఫలమీశభక్తిః ॥ 19

నిదురించుచున్న వానివలె నేమియు నెరుగజాలడు. అనగా గర్భముననున్న శిశువుకు గల తత్త్వజ్ఞానము బహిర్గతుడగువాని కుండదని తాత్పర్యము. 15

పిమ్మట నాశిశువునకు బాహ్యవాయువులను ఖడ్గముచే జ్ఞానమహావృక్షము భిన్నముకాగా, మొలకవలె సూక్ష్మముగ మిగిలియున్న చెట్టునుండి క్రమముగ చివుళ్లుపుట్టినట్లు జ్ఞానాంకురము క్రమముగ బాల్యమునుండి వాని శరీరముతో పాటుగ పెరుగుచుండును. ఇచ్చట బాహ్యవాయువులనగా మాయాత్మకములగు ప్రాకృతిక ధర్మములని యర్థము. 16

ఈ జ్ఞానపు మొలకలను, ఎవ్వరు తత్త్వ ప్రతిపాదకములగు శాస్త్రములను, సజ్జన సాంగత్యమును జలముగ జేసితడిపి పెంచుదురో వారు, పెరిగి మహావృక్షమైన జ్ఞానమునుండి, దుర్లభమైన మోక్షఫలమును పొందుచున్నారు.

ఈ రెండు శ్లోకములలోను గర్భముననున్నప్పుడు శిశువుకు గల తత్త్వజ్ఞానము, నిశ్చయము - వెలుపల బడిన తరువాత లేకున్నను మయాఖడ్గముచే ఖండింపబడిన జ్ఞానవృక్షపుటంకుర మింకను మిగిలియుండుననియు, దానిని సద్ విద్యచేతను, సత్సాంగత్యము చేతను వృద్ధిపొందించు కున్నచో, ప్రాప్యస్థితిని పొందవచ్చుననియు చెప్పబడినది. దీనికి విపరీతమైన స్థితిగలిగి నప్పుడేమి కల్గునో ముందు శ్లోకమున చెప్పబడినది. 17

ఎవ్వరు నిరంతరము అర్థము, కామము అను నీరెండింటినే యనుసరించు చుందురో, వారి జ్ఞానాంకురము విషయలాలసతయను నగ్నిచే కాల్చబడినదై వృద్ధిచెందక ఫలమునీయజాలదు. మరియు మరణమను కత్తిమీద పడగనే (మధ్యలోనే) భిన్నమై నశించుచున్నది. 18

దుఃఖం స్త్రీ కుక్షిమధ్యే ప్రథమ మిహభవేత్ గర్భవాసే నరాణాం
బాలత్వే చాతిదుఃఖం మలలులితతనుస్త్రీపయః పానమిశ్రమ్ ।
తారుణ్యేచాతిదుఃఖం భవతి విరహజం, వృద్ధభావోఽప్యసారః
సంసారేవా మనుష్యాః! యదివదత! సుఖంస్వల్పమప్యస్తికించిత్॥20

ఉక్తః ప్రసంగాదిద మార్యపుత్రాః !
శృణ్వన్తు బాల్యేపి జనస్యదుఃఖమ్ ।
అప్యాధిభిర్వ్యాధిభిరర్ద్యమానో
నాఖ్యాత్తమీశం సహివేదనార్తః ॥ 21

పరేచ్ఛయా భోజన మజ్జనాదౌ
క్లిశ్యత్యథ క్రీడన కేమసక్తః ।
కరోతి హాస్యం పురుషార్థబుద్ధ్యా
యతించిదన్యైః సవృథాశ్రమార్తః ॥ 22

మరల (దేహపాతానంతరము) గర్భమున ప్రవేశించినప్పుడా జీవుని జ్ఞానాంకురము వృద్ధిచెందుచున్నది. ఇట్లేమరణ పరంపర అనంతముగా నేర్పడినది. కావున నా జ్ఞానాంకురమును వృద్ధిచెందించు కొనవలయును. దాని ఫలమే శ్రీహరిభక్తి. 19

మొదట నారీజన గర్భమున నివసించుటచే నరుడు దుఃఖము ననుభవించుచున్నాడు. బాల్యమున వివిధ మలసంకులమైన స్త్రీజనస్తన్యపానముతో పాటు మిక్కిలి దుఃఖము ననుభవించు చున్నాడు. యౌవనమున ప్రియజనవిరహము వలన మిగులదుఃఖించు చున్నాడు. ఇకవార్ధకము నిస్సారమేకదా! ఇట్లు ఓ మానవులారా! ఈ సంసారమున, ఏ స్వల్పమైన నెట్టిదైన సుఖమున్నదా? చెప్పుడీ !

ప్రతి మానవునకు గర్భవాస దుఃఖము, బాల్యక్లేశములు, యౌవనమున కామపీడనము, వార్ధకమున జరావ్యాధికష్టములు అపరిహార్యములై యుండును. కావున సంసారము, దుఃఖభాజనమేగాని అందు సుఖము ఏలేశమైనను నుండదు. ఉండెనాయది యాభాసరూపమే తప్ప వాస్తవము కాదని తాత్పర్యము.

కావున జన్మసిద్ధమైన జ్ఞానలవమును సజ్జన సాంగత్యముచేతను, భగవదను ధ్యానాదుల చేతను వృద్ధినొందించు కొని, శ్రీహరి భక్తిని, సాధించి, యీ జననమరణ

బాల్యేఽజ్ఞతా సాహిసుదుఃఖహేతుః
యూనశ్చశ్శృణ్వ్యస్వసుఖం భవన్తః ।
సబాధ్యతే పంచశరేణ నిత్యం
పంచేంద్రియైశ్చాధి సహస్ర బాధ్యః ॥ 23

పరాత్పరం దుర్లభమేవ వాంఛన్
సదైవ సీదత్యవినీత చిత్తః ।
స్వైరర్థదారై ర్నహితోషమేతి
ప్రాయః స్వభావో హ్యయమేవ యూనామ్ ॥ 24

యేఽపిస్వకైర్దారధనైః సుతుష్టా
స్తేషాంచ నాస్త్యేవ సుఖం భవేఽస్మిన్
సర్వేహ్యనిత్యా విభవాస్త దేషాం
నాకేసుఖాత్ కోటిగుణంహి దుఃఖమ్ ॥ 25

చక్రమునుండి విముక్తుడై మాత్రమే, ప్రాణి, సుఖమును పొందగలుగునని యభిప్రాయము. 20

ఓ ఆర్యపుత్రులారా! ప్రసంగవశమున దీనిని చెప్పితిని. ఇక బాల్యమున నరునకు గల దుఃఖమును వినుడు. వివిధములైన మనోవ్యథలతోను, శారీరములగు వ్యాధులతోడను పీడింపబడినవాడై, వేదనా వివశుడైన నరుడు శ్రీహరిని కీర్తింపజాలడు. 21

బాల్యవశమున నస్వతంత్రుడై తలిదండ్రుల యిచ్చిననుసరించి భోజనము, స్నానము మున్నగు కృత్యముల నొనర్చుచు దుఃఖించుచుండును. మరియు నాటవస్తువుల యందాసక్తుడై పరులతోగూడి ఇదియే పురుషార్థమను బుద్ధితో హాస్యములాడుచు వ్యర్థముగ శ్రమార్తుడగు చుండును. 22

బాల్యమున నజ్ఞానమే మహాదుఃఖకారణము. ఇకయౌవన దుఃఖమును వినుడు. నరుడు యౌవనమున మన్మథ పీడితుడై కామాతురతతో నైదేశంద్రియముల కలిగి యుండియు వేలాది మనోవ్యథల పొందుచున్నాడు. 23

ఒకదాని కంటె నొకటి దుర్లభమైన కోరికల కోరుచు నిరంతరము వినయదూరమైన మనస్సు కలవాడై యౌవనమున దుఃఖించును. తనదగు ధనము, కాంతమున్నగు

జనోఽత్రయః స్పృహ్యతి దారపుత్ర
ధనేషు, తద్దుఃఖమిహేతురాణామ్ ।
బీజాని, ధత్తేహృది, తేచకాలే
విదారయన్త స్తనుముద్భిదన్తి । 26

పర్యన్తదుఃఖాన్ ధనదారపుత్రాన్
అనాత్మవాన్ క్రీడతి యత్ ప్రగృహ్య
అమంత్రవిద్వ్యాల శిశుం ప్రగృహ్య
మౌఢ్యేన యత్ క్రీడతి దైత్యపుత్రాః ॥ 27

నావం శ్రయేద్వా జరతీం మహోబ్ధౌ
శాఖాం మహీరూహ్చామపి ఛిద్యమానామ్ ।
ధ్రువం ప్రణాశాన్ విషయాన్ దురాపాన్
విశ్వస్యయః శోకమపారమిచ్ఛేత్ ॥ 28

వాటిచే పరితుష్టినొందక దుఃఖము ననుభవించును. సాధారణముగ యౌవనమున నెల్లరి స్వభావమిదియే. 24

ఎవ్వరు తనదగు దారధనసంపత్తిచే పరితుష్టులై యుందురో వారికి కూడ యీ సంసారమున సుఖమేమాత్రములేదు. ఇచ్చటగల విభవము (సంపత్తు) లన్నియు నశ్వరములే. కావున స్వర్గమున గూడ సుఖము కంటె కోటిరెట్లుదుఃఖమే అధికముగా గలదు.

మానవ దేహధారణము, ఐహిక భోగానుభవము ఎట్లుగ సంసారమే తప్పవేరు కాదో, అట్లే దేవదేహ ప్రాప్తి, స్వర్గ సుఖానుభవము కూడ సంసార భేదమే తప్పవేరుకాదు. "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి" (పుణ్యక్షయము కాగానే మరల మర్త్యలోకమున ప్రవేశింతురు) అని చెప్పబడినట్లు, పుణ్యమున్నంతవరకు స్వర్గసుఖాభాసముల ననుభవించియు కోటి గుణితమైన దుఃఖమునే తరువాత యనుభవించుచున్నాడు. కావున నైహికసుఖములు దుఃఖాత్మకములే అయినట్లు స్వర్గసుఖములును దుఃఖాత్మకములేనని తాత్పర్యము. 25

నరుడీ లోకమున భార్యాపుత్రులు, సంపదలు అనునీవిషయముల యందు స్నేహముంచి దానివలన దుఃఖము ననుభవించుచున్నాడు. దుఃఖపీడితులైన నరులు

తస్మాన్నయూనాం సుఖమస్తిదైత్యాః !
వృద్ధస్యశోకాస్తు నవర్ణనీయాః ।
తేహ్యాధిరుగ్దుఃఖమహానదీనాం
మహార్ణవత్వేవిధినా ప్రయుక్తాః ॥ 29

కించాత్రజన్తోః సుఖకారణం హి
సర్వాస్వవస్థాస్వపి నాన్యదస్తి ।
పరంతుయేఽమీ విషయాన్ దురాపాన్
హిత్వైవ తంయాన్తి చతత్ర ధీరాః ॥ 30

అపుత్రతాదుఃఖ మతీవదుఃఖమ్
కుపుత్రతా దుఃఖతరం తతోఽపి ।
లబ్ధేషు పుత్రేష్వపి సత్సు కాల
ధర్మంగతేష్వార్తిజుషాం, శ్రియాకిమ్ ॥ 31

తమహృదయమున నేదుఃఖబీజముల ధరించుచున్నారో, అవి యంకురములై తనువును ఛేదించుచున్నవి. 26

ఓ రాక్షస కుమారులారా! చివరకు దుఃఖమున పర్యవసించునట్టి ధనము, భార్య, బిడ్డలు మున్నగు వాటిని పరిగ్రహించి, ఆత్మానాత్మ వివేక శూన్యుడగు నరుడు క్రీడించుచున్నాడు. ఇది కేవలము గరుడమంత్రము నెరుగనివాడు సర్పశిశువుతో నాడుకొనుచున్నట్లేనని యెరుగవలయును. 27

మహాసముద్రమున జర్జరమైన నౌకనాశ్రయింపవచ్చునా? రెండుగా చీలి ముక్కలగుచున్న పెద్దకొమ్మనైనను పట్టుకొనవచ్చునా? నిక్కముగ వినాశ్యములును పొందరానివియునగు విషయములపట్టుకొని యీప్రాపంచిక మహాశోకమును తరింప నెంచుటయు నట్టిదేకదా! 28

కనుక యౌవన వంతులకు సుఖములేదు. ఓదైత్యులారా! ఇకవృద్ధుల శోకములు వర్ణింపనలవికానివే! ఏలన నాశోకములు మనోవ్యథారోగ దుఃఖాత్మకములైన మహానదులకు ప్రవేశస్థానమైన మహాసముద్రముగా బ్రహ్మచే కల్పింపబడినవి. 29

మరియు నీ ప్రాణికి సర్వావస్థలయందు శ్రీహరిశరణము కంటె వేరుగ సుఖకారణ

నష్టేసుతాదౌ హినృణాం సురమ్యా
లక్ష్మీరపి ప్రత్యుత దుఃఖహేతుః ।
వసంతమందానిల చంద్రి కాది
పశ్యన్హి తప్తోవిరహీ సుతప్తః ।

32

జనస్య కించాత్ర సమక్ష దృష్టా
సర్వాస్వవస్థాస్వపి మృత్యుభీతిః ।
కథంక్వవా కేన కదా మమేతి
విధూయతాం కింవిషయై స్సుఖం స్యాత్ ॥

33

నద్యంబు పానాన్నమృగాహిపక్షి
పశ్వాదిభిశ్చాత్ర మృతిర్హిదృష్టా ।
కింసంఖ్యయావా నతదస్తి వస్తు
జనస్యయేనాత్ర ననాశశంకా ॥

34

మేమియులేదు. కాని ఎవ్వరీ దుర్లభముృలైన విషయ సుఖములవిడచి యా శ్రీహరిని శరణుజొత్తురో, వారే ధీరులు.

30

పుత్రులు లేనందువలన కల్గిన దుఃఖము దుర్భరమైనది. కుపుత్రుల (దుష్టపుత్రుల) కలిగియుండుట దీనికంటె మిక్కుటమగు దుఃఖము. పుత్రుల పొందియు వారు కాలధర్మమును (మృతిని) పొందినప్పుడు నితాంత దుఃఖితులైన వారికి సంపదతో పనియేమి?

31

పుత్రకళత్రాదులు నశించినప్పుడు నరులకు పూర్వమెంతరమణీయ మైన దయ్యును, సంపద, మిక్కిలి దుఃఖకారణమగును. ప్రియవిరహదుఃఖితుడైనవాడు వసంతము, మందవాయవులు, వెన్నెల, శీతలద్రవ్యముల జూచియు మిగుల తపించును కదా!

32

మరియు నరున కిచ్చట సర్వావస్థల యందును మృత్యుభయమనునది ప్రత్యక్షదృష్టమే. ఎట్లు, ఎక్కడ, ఏవిధముగ, ఎప్పుడు నాకీమృత్యువు సంప్రాప్తమగునని కంపించువారికి, విషయముల వలన సుఖమేలకల్గును?

33

దేశశ్చకాలశ్చ నసోఽస్తిదైత్యా
జనస్య యేనాత్ర ననాశశంకా
విచార యంశ్చేతదిహార్ధదారైః
కోవాసుఖీ జర్జరితాంతరః స్యాత్ ॥ 35

బాధిర్య మాంధ్యం వికలాంగ భావా
రోగాః సుఘోరాయదివా హఠాత్ స్యుః ।
తదానృణాం జీవన మప్యనిష్టం
బతాతిదూరే విషయేషురాగః । 36

దృష్టం భవద్భిశ్చ యదుక్త మేతత్
యేతత్ర సక్తా విషయే రమన్తే ।
అజ్ఞానినస్తే నవిచార యన్తి
కామాది వశ్యాఃనచతే ప్రమాణమ్ ॥ 37

నదీజలపానమే ఆహారముగాగల మృగములు, సర్పములు, పక్షులు, పశువులచే గూడ నిచ్చట మరణము ప్రత్యక్షముగ దర్శింప బడినదే. నరున కిచ్చట సంఖ్యా పరిగణనము వలన నేమియు ప్రయోజనములేదు. ఇచ్చట మరణశంకలేని దొక్కటి కూడలేదు. 34

పర్యాలోచనమొనర్పగా నీలోకమున జనునకు నాశనశంకలేని (మృత్యువు కల్గునేమోనను భీతికి అవకాశములేని) దేశముకాని, కాలముగాని, యెంతమాత్రము లేదు. అనగా సర్వదేశ సర్వకాలము అందును మృత్యుభయమపరిహార్యమై యున్నదని భావము. కావున శిథిలమైన మనస్సుగల యే నరుడు యీలోకమున సంపదలచేతను దారపుత్రాదులచేతను సుఖించగలడు? నిరంతరమృత్యుభయము గలనరునకు బాహ్యసుఖము లేవియు సుఖములు కావని తాత్పర్యము. 35

చెవిటితనము, గ్రుడ్డితనము, అంగవైకల్యము, రోగముమున్నగు ఘోరములన్నియు ఒక్కుమ్మడిగా పైనిబడినచో, నరులకప్పుడు జీవితముగూడ నయిష్టమేయగును. అట్టియెడ, అయ్యో! విషయసుఖముల పట్ల ననురక్తిని గుఱించి ఏమిచెప్పవలయును? (వాటిపట్ల మిక్కిలి విరక్తియే కల్గునని తాత్పర్యము). 36

ఏవంభవో దుఃఖమయః సదైవ
సేవ్యః కథం దైత్యసుతాః ప్రవృద్ధైః
కిన్తు ద్విపాత్యేఽప్యధికేయమార్తిః
స్వప్రాపమేతచ్చ నకర్మిణోఽస్య ॥ 38

గంతవ్యమేవం హ్యవశేన యోనీ
ర్నానావిధాః కర్మవిపాక భేదాత్ ।
జీవేన తత్రాపిచనః సమక్షం
దృష్టాఃసుఘోరా వివిధా హ్యవస్థాః ॥ 39

భూత్వా మృగాః కర్మవశేన జీవా
వనేచరన్తో బత! నిత్యభీతాః ।
వ్యాఘ్రైశ్చ సింహైశ్చ ఖలైర పాపాః
క్రోశన్తి భక్ష్యాః కున్నపైశ్చవధ్యాః । 40

కంటికగుపించు బాహ్యసుఖము గురించి మీరేమి చెప్పితిరో, ఆ బాహ్యసుఖమున నాసక్తికలవారే దానిననుభవించి సుఖింతురు. వాస్తవమునకట్టివారు కామాది పరతంత్రులై యజ్ఞానమున పడియుండి, యుక్తాయుక్తముల విచారింప కున్నారు. వారుమనకు ప్రమాణము కాజాలరు. 37

ఈ విధముగ నోదైత్యపుత్రులారా! నిరంతర దుఃఖభాజనమైన యీసంసారము పెరిగిన మీరేల పొందవలయును? మరియు నీ దుఃఖము మనుజత్వమున మిక్కుటము. అది కర్మవశ్యుడైన ప్రాణికి అపరిహార్యమై యున్నది (తప్పక పొందవలసియే యున్నది). 38

ప్రతిమానవుడును తనకర్మముల పరిపాకము (పరిణామము)ను బట్టి అనేకవిధములగు జన్మములనెత్తవలసియే యున్నది, మరియు మనయెదుటనే జీవునిచే ననుభవింపబడు వివిధములైన దురవస్థలు కనుపించుచున్నవి కదా! 39

కర్మవశమున నీజీవులు మృగములై పుట్టి వనములలో సంచరించుచు పరులకెట్టి యపకారము చేయనివయ్యును, నిరంతరము మృత్యుభీతిని పొందుచు క్రూరములైన పులులచేతను, సింహములచేతను, భక్షింపబడి యాక్రోశించుచున్నవి. మరియు దుష్టప్రభువులచే (వేటలో) చంపబడుచున్నవికదా! 40

నిష్కారణం హస్తి శుకౌచ బద్ధౌ
స్మృత్వాబలం పశ్యత శోకతప్తౌ ।
భారం పశుర్భూరి బిభర్తి దుఃఖాత్
తేనాపరాధః కిమకారి భూరి ? 41

మేషాశ్చయుద్ధేబత! కుక్కుటాస్తు
దృష్టాహతాస్తే పరఖేల నార్థమ్
ఇత్యాది కర్మానుగ యోని భాజాం
దుఃఖేష్వియత్తాస్తిన దైత్యపుత్రాః ॥ 42

కించైత దుక్తంఖలు జంగమత్వే
సుప్రాప మేతచ్చన కర్మణోఽంగ!
వ్రజన్తి హి స్థావరతా మవశ్యం
జీవాస్తతః కష్టతరం నుకింవా? 43

ఎట్టికారణము లేకయే బంధింపబడిన ఏనుగు, చిలుక అనునవి తమబలమును స్మరించి, దుఃఖించుచున్నవి. చూడుడీ! పశువు, దుఃఖించుచు అత్యధికమగు భారమును మోయుచున్నది. దానిచే నెట్టియపరాధము చేయబడినది?

మానవుడుగాని, తిర్యక్కులుగాని తామెట్టియపరాధము చేయకయే వివిధక్లేశముల ననుభవించుచున్నారు. మరణించు చున్నారు. దీనికి కారణము కర్మ పరిపాకమే తప్పవేరుకాదని తాత్పర్యము. 41

ఓ రాక్షసకుమారులారా! మేకలు (గొఱ్ఱెలుమున్నగునవికూడ) కోళ్లుఇతరుల వినోదపరచుటకై పోరుకుతలపడి చచ్చుచున్నవి. అయ్యో! ఈ విధముగ కర్మానుసారియగు జన్మముకల మానవులకు, పశుపక్ష్యాదులకును, వారనుభవించు దుఃఖములకు ఇంతయని పరిమితిలేదు.

మేకలకు, గొఱ్ఱెపొట్టేళ్లకు, కోళ్లకుపందెములుపెట్టి అవిపోరుచుండగా వినోదించుట లోకమున కలదు. ఇక్కడనివి తమయపరాధ మేమియులేకయే, ఇతరులనానంద పరచుటకై తామున్మృతి చెందుచున్నవి. ఇది కర్మ విపాకమేతప్ప మరేమియు కాదుకదా! 42

ఏవం భవేఽస్మిన్ పరిమార్గమాణా
వీక్షా మహేనైవ సుఖాంశ లేశమ్
యథా యథా సాధు విచారయామః
తథా తథా దుఃఖ మయం హి విద్మః ॥ 44

తస్మాద్భవేస్మిన్ కిల చారురూపే
దుఃఖాకరే నైవ పతన్తి సన్తః ।
పతన్తి తేఽ తత్త్వవిదః సుమూఢాః
వహ్నౌ పతంగా ఇవ దర్శనీయే ॥ 45

యుజ్యేత వాస్మిన్ పతనం సుఖాభే
యద్యస్తి నాన్యచ్ఛరణం సుఖాయ ।
అవిందతా మన్నమహో క్షుధార్తానాం
యుక్తంహి పిణ్యాక – తుషాది ఖాదనమ్ ॥ 46

ఓయీ! బాలకులారా! ఇంతవరకు చలనశీలములగు.(జంగమములగు) మానవ పశుపక్ష్యాదుల గుఱించి చెప్పితిని. కర్మవశ్యుడైనవానికి క్లేశసంతతి పొందరానిది కాదుసుమా! (తప్పకపొందవలసినదే) ప్రతిజీవియు తప్పక స్థావరజన్మమును గూడ పొందవలసినదే. ఇంతకంటె కష్టమింకేమియున్నది?

స్థావరములనగా పర్వతములు, వృక్షములు మున్నగు చలనరహితములగు పదార్థములు. స్థావరజన్మముకూడ కర్మపరిపాక లభ్యమేనని తాత్పర్యము. 43

ఈ విధముగ జననమరణ చక్రాత్మకమగు నీసంసారమున పరిభ్రమించుచున్న వారమై లేశమాత్రమైన సుఖమును పొందజాలకున్నాము. ఆలోచించినకొలది యీ సంసారము బహులదుఃఖభాజనమేనని తెలియుదుము. 44

కనుక నీ యాపాతరమణీయమును (సుందరముగ కన్పట్టునది) క్లేశసంకులము నగునీ సంసారమున వివేకులగు సజ్జనులు పడజాలరు. ఇక అవివేకులగు మూఢులు ఎఱ్ఱగ కన్పట్టు వహ్నిలో మిడతలు పడినట్లు యీ రమణీయాభాసమగు సంసారమున బడినశించుదురు. 45

ఇంతకంటె సుఖహేతువగు వేరొక శరణము (ఆశ్రయము) న్నప్పుడు, ఈ

అస్తుత్విదం శ్రీపతి పాదపద్మ –
ద్వంద్వార్చనం ప్రాప్య మనంత మాద్యమ్ ।
బ్రాహ్మ్యం సుఖం సత్య మతాపమిశ్రం
సాధారణం సర్వజనస్య చ స్వమ్ ॥ 47

తచ్చార్చ్యతే శ్రీపతిపాదపద్మ
ద్వంద్వం నవస్త్రై ర్నధనైః శ్రమైర్నః ।
అనన్య చిత్తేన నరేణ కింతు
ధియార్చ్యతే మోక్షసుఖ ప్రదాయి ॥ 48

అక్లేశతః ప్రాప్యమిదం విసృజ్య
మహాసుఖం యోఽల్పసుఖాని వాంఛేత్ ।
రాజ్యం కరస్థం స్వమసౌ విసృజ్య
భిక్షా మటేద్దీనమనాః సుమూఢః ॥ 49

సుఖాభాసమగు సంసారమున పడుటయుక్తమా? అన్నము నెరుగజాలని కృశజనులకు మాత్రమే ధాన్యపుపొల్లును, నూనెదీసివేయగా మిగిలిన పిప్పినిదినుట యుక్తము కాగలదు.

ఆకలి గొన్నవాడు అన్నమునే తినవలయును కాని, నూనెతీసివేయగా మిగిలిన పిప్పిని, ధాన్యపు పొల్లును, కాదు. అట్లే సుఖార్థులైనవారు నిత్యసుఖస్వరూపుడగు శ్రీహరి నాశ్రయింప వలయునేగాని యీసంసారమును కాదని తాత్పర్యము. 46

సర్వజనులకు సాధారణముగా పొందదగినదియు, తనకు సర్వస్వమైనదియు, తాపమిశ్రితము కానిదియు, అనంతము ఆద్యము పరబ్రహ్మ సంబంధమునగు శ్రీహరి పాదకమలారాధన రూపమగు సుఖమే మనకు కల్గునుగాక! 47

ఆ పరమప్రాప్య సుఖరూపమగు శ్రీహరి పాదకమలయుగళార్చనమే మనకు అవశ్యము. అది వస్త్రములచే గాని, సంపదలచేగాని, మనమొనర్చెడి శ్రమములచేగాని పొందదగదు. కేవలము అనన్య భావభరితమగు మనస్సుద్ధిగల మానవునిచే మాత్రమే బుద్ధితో పొందదగియున్నది. ఆయర్చనమే మోక్షరూపమగు పరమ సుఖము నిచ్చునది. 48

[illegible] శ్రీహరి పాదకమలార్చనారూపమగు మహాసుఖమును విడచి

యేత్వత్ర సక్తా విషయే రమన్తే
సుసాధనే బ్రహ్మసుఖే హితేఽన్ధాః ।
బుధైః సుశోచ్యా అపి తేనతస్మిం
స్తుష్యన్తి యేదృష్ట పరావరత్వాత్ ॥ 50

ఏవం భవం దుఃఖ మయం విదిత్వా
దైత్యాత్మజాః సాధుహరిం భజధ్వమ్ ॥
తతో భవన్తోఽప్యపరోక్ష మేవ
ద్రక్ష్యంతి సంసార ఫలం చ వః స్యాత్ ॥ 51

అసార సంసార తరోరపీదం
కృష్ణార్చనం సత్ఫల మేక మస్తి ।
భవం వినాపీశ్వర పూజనేఽలం
లయేహి జీవాశ్రితలింగ దేహాః ॥ 52

యెవ్వడు తుచ్ఛములగు సుఖముల గోరునో, వాడు చేతిలోగల తన రాజ్యమును విడచి మూఢుడై బిచ్చమెత్తుకొను దీనుడేనని భావింపనగును. 49

ఎవ్వరు సులభసాధ్యమగు బ్రహ్మసుఖమును దర్శింపజాలని యంధులై యీ విషయసుఖమున నాసక్తిగొని రమింతురో వారు విజ్ఞులచే శోకింపదగియే యుందురు. అట్టివారు పరావరుడగు పరమాత్మను దర్శించినప్పుడే తుచ్ఛ సుఖమున పరితృప్తి నొందరు. 50

కనుక, దైత్యపుత్రులారా! ఈ విధముగ నీ సంసారము దుఃఖమయమని యెరిగి శ్రీహరిని లెస్సగ భజింపుడు దానిచే మీరు ప్రత్యక్షముగనే పరమ సుఖమును బడయుదురు. మరియు నీ లౌకికసుఖము కూడ మీకు సులభమగును.

శ్రీహరి నాశ్రయించినందున నైహికాముష్మిక సుఖముల రెండింటిని బడయవచ్చునని తాత్పర్యము. 51

నిస్సారమగు సంసార వృక్షమునుండి కూడ శ్రీహర్యారాధనమను నుత్తమ ఫలము కల్గుచున్నది, భవము(సంసారము) లేకున్నను, ప్రలయమున గూడ జీవుల నాశ్రయించి యున్న లింగదేహములు భగవదారాధనా సమర్థములే. కరచరణా ద్యవయములతో

తస్మాద్భవం ప్రాప్య జగన్నివాస -
- మారాధయేదేవ విసృజ్యరాజ్యమ్ ।
ఏవం జనో జన్మఫలం లభేత
నోచేద్భవాబ్ధౌ ప్రపతేదధోఽధః । 53

సంసార సంస్థా హరిమర్చయిత్వా
తమేవ సంసార మధోనయన్తు ।
ఏతావతా వోఽస్తు కృతఘ్నతాపి?
మావః పదం సంసృతి రాక్రమేత । 54

తస్మాద్భవన్తో హృదిశంఖ చక్ర -
-గదాధరం దేవ మనంత భాసం।
స్మరన్తు నిత్యం వరదం ముకున్దం
సద్భక్తి యోగేన నివృత్తి కామాః । 55

స్థూలముగ కన్పట్టునీ దేహమునకు లోనగల సూక్ష్మదేహమే లింగదేహము. అది ప్రలయదశలో గూడనుండును. స్థూలదేహమునకే, నాశనము తప్పలోనగల సూక్ష్మదేహమునకు కాదు. కావున ప్రలయదశలో లింగ దేహములతోనే భగవదారాధన మొనర్పవచ్చునని తాత్పర్యము. 52

కావున నీ సంసారమున బడిన ప్రతిప్రాణియు శ్రీహరి నర్చింప వలసియున్నది. కనుక తాముగూడ రాజ్యమును విడచి భగవదారాధనమొనర్చి తీరవలయును. జనుడీ విధముగనే జన్మసాఫల్యమును పొందవలయును. లేనిచో సంసారసాగరపు టట్టడుగున పడవలసినదే! 53

సంసారమునందున్న వారైనప్పటికిని శ్రీహరి నర్చించి యీ సంసారమునధఃక రింతురు గాక! ఈ ప్రకారముగ మీకుకృతఘ్నత యుండవచ్చునా? మీ స్థానమును సంసార మాక్రమింప కుండును గాక! 54

కావున, మీరు శంఖచక్రగదాధరుడును, అపరిమేయ ప్రభాభాసమానుడును, నిత్యుడును, కోరిన కొర్కుల నీడేర్చువాడునుఅగు ముకుందుని, సర్వోత్తమమగు భక్తియోగముచే సంసార నివృత్తియందే కోరికగలవారై స్మరింతురు గాక! 55

సర్వేషు భూతేషుచ మిత్రభావం
భజన్త్వయం సర్వగతోహి విష్ణుః ।
కుర్వన్తు రోషం నిజ ఏవ రోషే
కామేచ, తావేవ హి సర్వశత్రూ ॥ 56

అప్యర్చయిత్వా ప్రతిమాసు విష్ణుం
క్రుద్ధ్యన్ జనే, సర్వమయం తమేవ ।
అభ్యర్చ్య పాదే ద్విజ మస్య శీర్షి
ద్రుహ్యన్నివాజ్ఞో నరకం ప్రయాతి ॥ 57

అనాస్తి కత్వాత్ కృపయా భవద్భ్యో
వదామి గుహ్యం భవసింధు సంస్థాః ।
ఆస్థేయ మేతన్మునివృంద జుష్టం
జ్ఞానం త్రయీ సిద్ధమనన్య భావైః ॥ 58

భగవానుడగు శ్రీమహావిష్ణువు సర్వజీవ జడవస్తుజాత మందంతర్యామిగ నున్నాడు. కావున సర్వము విష్ణుమయమే. కనుక సర్వప్రాణులయందును మైత్రినే కలిగి యుందురు గాక! మరియు క్రోధమునను, కామమునను రోషము నావిష్కరింపుడు. వాస్తవమునకా రెండేకదా సర్వులకు శత్రువులు. శత్రువులుకాని హరిభక్తులయెడ నిష్ఫలమగు క్రోధమును వీడి, వాస్తవ శత్రువులైన కామక్రోధములనే ద్వేషించి నిరాకరింప వలయునని తాత్పర్యము. 56

పూజార్హుడగు విప్రుని పాదములను పూజించి, శిరస్సును పగులగొట్టి ద్రోహమొనర్చు మూఢుడు నరకమున బడినట్లే, సర్వజగన్మయుడగు శ్రీహరిని విగ్రహమున నర్చించి, ఆ భగవానునే హృదయమున ధరించుచున్న ప్రాణిని క్రోధముతో హింసించుట, మౌఢ్యమేకాక, నరకహేతువగును.

సర్వవస్తు జాతములనగా చేతనాచేతనాత్మక ప్రపంచమంతయు భగవదాత్మకము కావుననే వస్తువునుగాని యేప్రాణినిగాని ద్వేషించి హింసింపరాదని తాత్పర్యము. విగ్రహమున మాత్రమే భగవానుని చూచి తోటిప్రాణులయందు భగవానుని చూడలేని వాడొనర్చు అర్చనము నిష్ఫలమేనని యెరుగవలయును. 57

యద్యన్మనో దర్శయతీహనానా
తత్తత్త్వయ త్వాదవిశేష మేకమ్ ।
బ్రహ్మాత్మ, తత్కార్యతయా తదేత
న్న విస్మరేద్దైత్య సుతాః కదాచిత్ ॥ 59

ఆత్మాన మేతద్ధిమనో మలాఢ్యం
ప్రచార యత్యత్ర పృథక్ ప్రదర్శ్య
తేనా ప్రమత్తో మనసః స్వభావం
జ్ఞాత్వాచ రేత్తత్ప్రతి కూలమేవ ॥ 60

ప్రోత్సాహ యేద్యస్తుమనో మలాఢ్యం
ప్రదర్శయే ద్వస్తు విభిన్నమేవ
సవాసనాఖ్యం విదధాతి తస్మిన్
భూయోమలంభేదవితాన మూలమ్ ॥ 61

సంసారార్ణవమగ్నులైన ఓ దైత్యకుమారులారా! మీ యందాస్తిక్యబుద్ధి యింకను కలదు కనుక మీకీ తత్త్వరహస్యము నెరిగించుచున్నాను. మునిజనులచే నాశ్రయింపబడిన యీ వైదిక విజ్ఞానమే, అనన్య భావనకల మీచే నాశ్రయింప దగియున్నది. 58

ఓ దైత్యకుమారులారా! ఈ మనస్సుకు గోచరించెడి యీజీవ జడాత్మకము సురనరతిర్యక్ స్థావరాత్మమునైన సమస్తవస్తుజాతము బ్రహ్మాత్మకము. అనగా పరబ్రహ్మమునే "ఆత్మగా" కలిగియున్నది కనుక 'బ్రహ్మాత్మకత్వ' స్వభావమును బట్టి యవిశిష్టమై యేకరూపముగనున్నది. దీనికి కారణము బ్రహ్మమువలన పుట్టిన దగుటయే. ఈవిషయము నెప్పుడు మరువరాదు. భగవానుడు శ్రీగీతలో -

'మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగుణా ఇవ॥ ' అని చెప్పినాడు.

పువ్వులు వివిధ వర్ణగంధ సౌందర్యాది స్వరూప స్వభావ భేదములు కలవయ్యును మాలగా గ్రుచ్చబడి యెట్లుగ నభిన్నములై యుండునో, అట్లే స్వస్వకర్మాను రూపములైన దేవ, మనుష్య, పశు, పక్షి, పర్వత, ద్రుమ, కాష్ఠ, లోష్టాది వివిధ స్వరూప స్వభావభిన్నములైన దేహముల ధరించిన యీ జీవరాశి, పరబ్రహ్మమగు శ్రీహరి నుండి పుట్టినదగుట చేతను, తనచేపుట్టింపబడిన చిదచిదాత్మక (జీవజడాత్మక) ప్రపంచమున తానంతర్యామిగా

ప్రవేశించి భగవానుడు లోనుండి ప్రవృత్తినివృత్తుల నియమించుచున్నాడు కనుకను, బ్రహ్మాత్మకము. సూత్రమున మణిగణము గ్రుచ్చబడినట్లు భగవంతుని యందే సమస్తము ప్రతిబద్ధమై యున్నది. బ్రహ్మ ఆత్మాయస్యతత్ – పరబ్రహ్మమే ఆత్మగా కలది. కనుక విష్ణుమయమైన యీ ప్రపంచమున గల సమస్త వస్తుజాతమునకును బ్రహ్మాత్మకత్వమును బట్టి పారస్పరిక భేదము సర్వాత్మనా అపరిగణనీయము. కావున, నేను నావాడు, పరుడు ఇత్యాది భేదము ఔపాధికమై వారివారి మనస్సుల యొక్క లక్షణములచే కల్పింపబడినది. దీనిని బట్టియేద్వేష్యుడు, అద్వేష్యుడు మున్నగు భేదము, ఈ ప్రపంచమును భగవన్మయముగా చూడని వారికే తప్ప భగవన్మయతా బుద్ధికలవారికి కాదు. కావున, మమకారాదులతో పాటు ద్వేషాదులను కూడ విడువ వలయునని తాత్పర్యము. 59

ఈ ప్రపంచమున వివిధ దోషదూషితమైన మనస్సు, భగవన్మయములైన వస్తువులను భిన్నభిన్నముగ దర్శింపచేయుచు ఆత్మను వంచించుచున్నది. కనుక మనస్సు యొక్కస్వభావము నెరిగి ఎట్టి ప్రమాదమునకు (అనవధానతకు) లోనుకాక మనస్సునకు ప్రతికూలముగనే ప్రవర్తింప వలసియున్నది.

భగవన్మయమగు నీ ప్రపంచమునగల వస్తువులన్నియు చిత్త్వఅచిత్త్వ స్వభావము ను బట్టి సమానములే అయినను రాగద్వేషాది దూషితమగు మనస్సుచే అసమానములుగ (విసదృశములుగ) దర్శింపబడుచున్నవి. అనగా జీవులందరు తత్తత్కర్మములచే సముపార్జితములైన యుపాధులనుబట్టి వేరుగనున్నప్పటికిని, చైతన్య స్వభావమును బట్టి సమానోపాధికృతమైన భేదము కలవారయ్యును పరమాత్మ చైతన్య విశిష్టులు కావున సమానులే. కాని మనస్సు సహజమైన రాగద్వేషాది దోషసక్తిచే 'నాకు సంబంధించినది (మమ) పరునకు సంబంధించినది (పరస్య) అని భేదముచే గ్రహించుచున్నది. కాని యీ జగత్తు భగవన్మయమను వివేకము కలవారికి ఆత్మీయత్వ పరకీయత్వాది భేదము లెంతమాత్రము లేక – సర్వము బ్రహ్మాత్మకముగ సమానముగనే కన్పట్టును. ఇట్టి దృష్టియే సమదర్శనము. దీనినే గీతాచార్యుడు –

'సమంపశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।

నహినస్త్యాత్మనా త్మానంతతో యాతి పరాంగతిమ్ ।

సర్వవస్తువుల యందీశ్వరుడు సమానముగ నున్నాడని యెరిగి, అట్లే దర్శించువాడు, ఆత్మనాశనము నొందక పరమాత్మను పొందును.' అని చెప్పియున్నాడు. మరియు –

తతఃపునస్తత్ సమలం తథైవ
ప్రకాశ యేద్యస్తు మనో విరుద్ధమ్ ।
అభేదదృక్స్యాత్ ప్రయతః క్రమాత్స
భూయో మలస్యాను దయాత్ సుఖీస్యాత్ ॥ 62

'సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥'

ఇత్యాదిగ ప్రకృతి వియుక్తములైన సర్వభూతములకు జ్ఞానమే స్వరూపముకాన నవియన్నియు సమానములే. అనగా జీవాత్మలన్నియు జ్ఞానస్వరూపములే కనుక సమానములని యెరిగిన యోగి సర్వభూతములు తనతో సమానములనియు, తాను సర్వభూత సమానుడనియు భావించి భేదము, వైషమ్యములేక సామ్యదర్శనుడగును అని చెప్పబడినది.

ఇట్టి సర్వసమత్వదర్శనమే యోగమనియు, సమదర్శనముకలవాడే పండితుడనియు, 'పండితాస్సమదర్శనః' అని గీతవక్కాణించుచున్నది. ఎవ్వడు ఆత్మ సామ్యముచే సమస్తమును దర్శించునో వాడేయోగి. దీనినే శ్రీగీత -

'ఆత్మౌ పమ్యేన సర్వత్రసమం పశ్యతియోఽర్జున ।
సుఖం వాయదివాదుఃఖం సయోగీ పరమోమతః ॥'

అని చెప్పుచున్నది. ఇట్టి సమదర్శనమునకు మనోవశ్యత అత్యావశ్యకమని శ్రీగీత బహుధా ప్రతిపాదించుచున్నది. మనస్సును వశపరచుకున్నవాడే స్థితప్రజ్ఞుడు. మనస్సుచే రాగద్వేషాది దోషవశమున దర్శింపజేయబడు వైషమ్యమును దూరీకరించుటకు మనస్సును భగవదాయత్తము చేయుట ఒక్కటే ఉపాయము. 60

వివిధ దోషజుష్టమగు మనస్సును ఎవ్వడు ప్రోత్సాహపరచునో, వానికామనస్సు కామద్వేషాది మూలమగు వైషమ్యమునే దర్శింప జేయును. ఇట్లు మనస్సును ప్రోత్సహించువాడు దానికి 'వాసన' (సంస్కారము)యని పిలువబడు వైషమ్య దర్శనకారణమగు దోషమును అధికముగా కల్గించు చున్నాడు.

మనస్సును సహజముగానంటిపెట్టు కొనియున్న ప్రాకృతికములైన కామక్రోధాదులను, మనస్సునుండి, దూరీకరించుటకే యత్నింపవలయును కాని, ఆదోషములను విజృంభింప చేయరాదు. అట్లు చేసినప్పుడా మనస్సు మరింత మలినమై బంధ కారణమగునని తాత్పర్యము. 61

పూర్వస్థితేచాపి మలేప్రణష్టే
దృఢం మనః స్యాత్ ప్రభు, శుద్ధబోధే ।
తస్యప్రణాశశ్చ నిరోధ సాధ్యః
తస్మాన్నిరోధే మనసో యతేత । 63

కనుక జనునిచే ప్రోత్సహింపబడిన మనస్సు దోషదూషితమై ఈ ప్రపంచమును విషమముగనే దర్శింప జేయును. కావున క్రమముగ నింద్రియ నిగ్రహముకలవాడై మరల నామనస్సునకు మాలిన్య మంటకుండునట్లును సర్వప్రాణులు సమానములేనని స్ఫురించునట్లును, ప్రయత్నించి సుఖపడవలయును. 62

పూర్వమే సంక్రమించిన మలము (దోషము) నశింపగా స్థిరత్వమును పొందిన మనస్సు విశుద్ధమగు తత్త్వజ్ఞానమును పొందుటలో సమర్థమగును. పూర్వముగల యాదోషము తొలగుటకు మనస్సు నరికట్టుటయే సాధనము. కావున మనోనిగ్రహమునకై యత్నింప వలయును. 63

నిగృహీత బుద్ధులగు మహానుభావులు, మనస్సును నిర్విషయ మొనర్చుటనే మనోనిరోధమని చెప్పుచున్నారు. తగిన సాధన సంపత్తి (ఉపాయములు) లేనిచో నీ మనోనిరోధము (అనగా మనస్సును నిర్విషయ మొనర్చుట) సాధ్యము కాదు. కనుక సజ్జనులు మనోనిగ్రహమునకు వివిధోపాయముల చెప్పుచున్నారు.

విషయ శబ్దమునకు 'విసినోతి అవబధ్నాతి ఇతివిషయః' ప్రాణిని కట్టివైచియుంచునది విషయమని నిర్వచనము. మనస్సు - కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము, అనునీ పంచజ్ఞానేంద్రియములను ప్రణాళులుగా జేసికొని విషయములయందు ప్రవర్తించును. అనగా నీ యింద్రియములు వాటికిగల గ్రహణశక్తిచే నేయేవస్తువులను గ్రహించుచున్నవో అవియే విషయములు. మనస్సు యింద్రియముల ద్వారా విషయము గ్రహించి వాటితో సంగమేర్పరచుకొనును. ఈ విషయసంగము వలన , వాటియందు, కామము, ఆ కామము తీరనప్పుడు క్రోధము, తన్మూలముగా మోహము, దానివలన స్మృతి విభ్రమము, దానివలన బుద్ధినాశము, చివరకు ప్రాణినాశనమునకు కారణమగు చున్నదని, శ్రీగీత-

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూప జాయతే ।

సంగాత్సం జాయతే కామః, కామాత్క్రోధోఽ భిజాయతే ।'

ఆహుర్నిరోధంచ తమేవ ధీరా
యచ్చేతసో నిర్విషయత్వ మస్య ।
సుదుష్కరం చైత దిహోను పాయైః
తస్మాదు పాయాన్ ప్రవదన్తి సన్తః । 64

క్రోధాద్భవతి సంమోహః, సంమోహాత్ స్మృతి విభ్రమః ।

స్మృతిభ్రంశా ద్బుద్ధినాశః, బుద్ధినాశా త్ప్రణస్యతి ॥ (26.62, 63)

అని చెప్పుచున్నది. కావున, సర్వానర్థములకు – మనస్సు విషయముల యందు ప్రవర్తించుటే హేతువు. కనుక, మనస్సును విషయములయందు ప్రవర్తించకుండ నడ్డగింప వలయును. ఇదిసులభసాధ్యము కాదు. కనుక మనోనిరోధమును సాధించుటకు పెద్దలు కొన్నియుపాయముల చెప్పినారు. శ్రీగీతాచార్యుడు –

'సంకల్ప ప్రభవాన్ కామాంస్త్యక్త్వా సర్వాన శేషతః ।

మనసై వేంద్రియ గ్రామం వినియమ్య సమన్తతః ।

శనైశ్శనైరు పరమే ద్బుద్ధ్యాధృతి గృహీతయా ।

ఆత్మసంస్థం మనఃకృత్వా నకించిదపి చింతయేత్ । ( శ్రీగీత, 6-24,25)

ఇత్యాదిగ, 'స్పర్శజములు, సంకల్పజములు నని రెండు విధములుగా నున్న కామములలో, స్పర్శజములైన శీతోష్ణాదులను, వాస్తవమునకవి యవర్జనీయములైనను, శీతోష్ణాది నిమిత్తములగు హర్షోద్వేగములను విడచుటద్వారా నియమించవలయును. సంకల్పజములైన పుత్రక్షేత్రాది రూపములగు కామములను, మనస్సును వాటినుండి వేరుచేయుటద్వారా తదనుసంధానమును విడచుట ద్వారా నియమించవలయును. ఈ విధముగ సర్వవిషయములనుండి ఇంద్రియ సమూహమును నియమించి, మెల్లమెల్లగా, ధ్రుతితో వివేకముతో కూడిన బుద్ధిచే మనస్సును, ఆత్మయందే నిలిపి యితరత్ర ప్రవర్తింప కుండునట్లుచేసి, సర్వాత్మనా విషయధ్యానమును దూరీకరింప వలయును.' అని చెప్పియున్నాడు. ఈమనస్సెట్లువైపునకు ప్రవర్తించు చుండునో, ఆయాయి విషయముల నుండి దానిని మరలింపవయును. కాని చంచలమగు మనస్సును, విషయమునుండి నిగ్రహించుట సాధ్యముకాదు కదా! అన్నచో అభ్యాసముతోడను, వైరాగ్యముతోడను, దానిని సాధింపవలయునని శ్రీగీతాచార్యుని యుపదేశము.

పంచప్రకారం సగుణం వదన్తి
ధ్యానం నిరోధే మనసోఽభ్యుపాయం
వాయ్వోశ్చబంధే హృదినాదసేవా
నివృత్త చిత్తస్య బహిః ప్రపంచాత్ ॥ 65

దైత్యాః ప్రపంచో ద్వివిధో బాహ్యశ్చాభ్యన్తర స్తథా ।
ధనదారాది కో బాహ్యో గౌణో, ధ్యానాదిరాంతరః ॥ 66

తత్రాంతరం సమాశ్రిత్య తావద్బా హ్యంత్యజేత్సుధీః ।
నహికించి దనాలంబ్య బాహ్యత్యాగి మనోభవేత్ ॥ 67

'అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేనతు కౌంతేయ! వైరాగ్యేణచ గృహ్యతే ॥' ( శ్రీగీత- 6-35)

అభ్యాసమునకు కూడ సమర్థులు కానివారికి , భగవదాయత్తముగ భగవదారాధనా రూపముగ కర్మాచరణ మొనర్చుట తప్పవేరుమార్గములేదని శ్రీభగవానుడు,

'అభ్యాసేప్యసమర్థోఽసి మత్కర్మ పరమోభవ ! '

అని చెప్పియున్నాడు. ఈ విషయమమే ప్రస్తుత గ్రంథమున(హరిభక్తి సుధోదయమున))
'తత్కర్మ కుర్వన్ ధ్యాయంశ్చ శంఖచక్ర గదాధరం'

ఇత్యాదిగ 73వ శ్లోకమున చెప్పబడినది. 64

మనస్సును నిరోధించుటలో సాధనమైన సగుణధ్యానము, ఐదువిధములుగా నున్నది. బాహ్యమగు ప్రపంచము నుండి నివర్తించిన (మరలిన) మనస్సుగల వానికి (ప్రాణాయామ విధానమున) ఉచ్ఛ్వాస నిశ్వాసవాయువులను హృదయమున బంధించినపుడు (అవ్యక్తమైన) నాదము శ్రవణగోచరమగును. 65

ఓ దైత్యబాలకులారా! ప్రంచము బాహ్యము, ఆంతరమునని ద్వివిధముగా నున్నది. ధనము, భార్యాపుత్రాది రూపమగునది బాహ్యప్రపంచము. ఇకధ్యాన వశమున మనస్సున గోచరించెడిది, ఆంతర ప్రపంచము. ఇదిగౌణము. అనగా గుణ సంబంధమైనది. 66

విద్వాంసుడైనవాడు ఆంతరమగు ప్రంచమును ఆశ్రయించి బాహ్యమగు ప్రపం

యథా వ్రజాన్నీయమానః పశురేకో బలాజ్జనైః ।
నత్యజేద్వ్రజమభ్యస్తం భూయో భూయోఽనుధావతి ॥ 68

అథబద్ధో సహాన్యేన పశునా నీయతేశనైః ।
వ్రజవిస్మృతి పర్యంతం తేనైవ సహతిష్ఠతి ॥ 69

అథవిస్మృత గోవిందః తేనాపి సవియుజ్యతే ।
విజ్ఞేయామనసోరీతి రేవ మేవ విచక్షణైః ॥ 70

గౌణధ్యానాది యోగేన మనోబాహ్యాత్ సమానయేత్ ।
బాహ్యవిస్మృతి పర్యన్తం స్థిత్వైవ త్యాజయేచ్చతత్ । 71

చమును విడువవలయును. ఏలన, ఏదియోయొక ఆలంబనము లేనిదే మనస్సు బాహ్యప్రంచమును విడువజాలదుకదా! 67

ఎట్లుగ గొల్లపల్లెనుండి జనులచే బలాత్కారముగ తీసికొని వెళ్లబడు పశువు పూర్వా భ్యాసవశమున నాపల్లెను విడువజాలక మాటిమాటికి అచ్చటికే పరువెట్టు చుండునో - 68

మరియు, వేరొక పశువుతో కట్టబడినదై మెల్లగా పల్లెను మరచునంతపట్టు, తోడ్కొనిపోబడినదై, రెండవ పశువుతో కలిసియుండునో - 69

అట్లే మనస్సుగూడ బాహ్యవిషయమును క్రమముగ విడచి యాంతరమగు గోవింద స్మరణముతో కూడియుండునట్లొనర్పవలయును. అట్లుకాక, గోవిందుని విస్మరించినవాడు, గోవిందునిచే వియుక్తుడగును. తత్త్వవిచక్షణులైనవారు మనస్సు యొక్క ప్రవర్తనలోగల రీతిని తెలిసికొనవలయును.

పూర్వశ్లోకములలో (68,69) మనస్సు పశువుతో పోల్చబడినది. పల్లెయందు గాఢానుబంధము కలదయ్యును, పశువు వేరొక పశువుతో కూర్చబడినప్పుడు, తత్సాంగత్యమున క్రమముగ పల్లెను మరచినట్లు, బాహ్యవిషయాసక్తమగు మనస్సు ఆంతరమగు భగవత్తత్త్వముతో ధ్యానవశమున కూర్చబడినప్పుడు, క్రమముగ బాహ్యవిషయమును మరచిపోవును. ఇదియే అభ్యాసము. 'అభ్యాసేనతుకౌంతేయ' ఇత్యాది గీతావచన నిదిష్టముకూడ నిదియే. 70

బాహ్యవిషయములందు ప్రవర్తించుచున్న మనస్సును, మొదట వెలుపలి

ఏవం నిర్విషయం చేతః క్రమాద్భవతి నాన్యథా ।
క్రమం విసృజ్య రభసాదారురుక్షుః పతత్యధః ॥ 72

ప్రపంచమునుండి మరల్చి, మనస్సుచే లోపల కల్పింపబడిన ధ్యానరూపమగు గౌణప్రపంచము వైపునకు తోడ్కొనిపోవలయును. ఇట్లు బాహ్యప్రపంచమునుండి మరల్చబడి దానిని మరచిపోవు నంతవరకు అట్లేనిలిపియుంచి, తుదకు ధ్యానాదికల్పితమైన ఆంతర ప్రపంచమునుండి కూడ మనస్సును వెనుకకు మరల్చి, ఆయాంతర ప్రంచమును కూడ విడువవలయును.
71

ఈ ప్రకారముగ, బాహ్యవిషయ శూన్యముగ మనస్సు క్రమముగనే యేర్పడును తప్పవేరుగకాదు. ఈక్రమమును విడచి తొందరపాటుతో ఒక్కపారిగ పైదశను అందుకొనవలెనని కోరువాడు క్రిందబడును. ఏదేని ఒకపెద్దచెట్టు నెక్కవలయునన్న క్రమముగా ఒక్కొక్క కొమ్మనందుకొని యెక్కవలయునేకాని ఒకసారిగ చిటారుకొమ్మనందుకొన యత్నించిన వైఫల్యమే కల్గునుకదా! అట్లేయిదియునని తాత్పర్యము.
72

భగవదారాధన రూపమగు కర్మమును చేయుచు, శంఖచక్ర గదాదులతో కూడిన శ్రీమన్నారాయణుని దివ్యమంగళ విగ్రహమును ధ్యానించుచు యమనియమాది గుణములతో కూడినవాడై, క్రమముగ పరమ పదమును చేరగలడు.

భగవద్గీతలో భగవానుడు –

'స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్ చక్షుశ్చైవాన్తరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌకృత్వా నాసాభ్యన్తర చారిణౌ ॥
యతేంద్రియ మనోబుద్ధిః మునిర్మోక్ష పరాయణః ।
విగతేచ్ఛా భయక్రోధో యస్సదాముక్త ఏవసః ॥'

'బాహ్యేంద్రియ వ్యాపారములను ఉపసంహరించి, యోగమునకు యోగ్యమైన ఆసనమున ఋజుదేహముతో (తిన్ననైన దేహముతో) కూరుచుండి, రెండుకన్నులను, కనుబొమలనడుమ (నాసికాగ్రమున) నిగడ్చి, ప్రాణము, అపానములను రెండు వాయువులను (ఉచ్ఛ్వాస, నిఃశ్వాసములను) సమానముగా జేసి, ఆత్మావలోకము కంటె ఇతరత్ర, ప్రవర్తింప నలవికానట్లు, ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని నిగ్రహించి, ఈ

తత్కర్మ కుర్వన్ ధ్యాయంశ్చ శంఖ చక్రగదాధరం ।
యమాదిగుణ సంపన్నః క్రమాద్గచ్ఛేత్ పరం పదమ్ ॥ 73

కారణముగనే కోరికలను, భయమును, క్రోధమును విడచినవాడై మోక్షపరాయణుడైన ముని సాధనదశయందే ముక్తుడైనట్లే ' (అనగా ముక్తి వారికి కరతలామలకమగునని తాత్పర్యము) అని చెప్పియున్నాడు. దీనిని బట్టి క్రమమైన సాధనము ద్వారానే పరమపదమును పొందవలయునని స్పష్టపరుపబడినది.

యమాది గుణములనగా యోగశాస్త్రమున చెప్పబడిన, 'యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, అహింస, ధ్యానము, సమాధి' అను అష్టాంగములే. అహింస, సత్యము, అస్తేయము (పరద్రవ్యము నపహరింపకుండుట) బ్రహ్మచర్యము, అపరిగ్రహము అనునవియమములు. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము అనునవి నియమములు.

ఆసనమనగా సుఖముగ కూరుచుండుట. దీనివలన ధ్యానము సిద్ధించును. శ్వాస, ప్రశ్వాస అను రెండింటికిని సంబంధించిన గతిని క్రమబద్ధమొనర్చుట ప్రాణాయామము. దీనివలన ప్రాణశక్తి పొడిగింపబడును కనుక ఇది ప్రాణ +ఆయామము.

కన్ను, ముక్కు మున్నగు ఇంద్రియములను వాటివాటి విషయములపై ప్రవర్తింపజేయనీయక వాటిఅంతర్ముఖమొనర్చుట ప్రత్యాహారము.

మనస్సును ఒకే లక్ష్యమున నిగిడ్చుట ధారణ. దీనినే ఏకాగ్రతయనవచ్చును. ఏవిషయమునందు మనస్సు నిగిడ్చబడినదో దానినే ధారావాహికముగ (ఎడతెగకుండగ) అనుచింతనము చేయుటధ్యానము. ఈ ధ్యానమువలన మనస్సు ఇతరవిషయ శూన్యమై కేవలధ్యేయ వస్తువు నందుమాత్రమే లీనమగుట సమాధి.

ఈ పైనిపేర్కొనబడిన యష్టాంగ యోగ విధానమున భగవద్ధ్యానమొనర్చుట క్రమమైన సాధన ప్రక్రియ. ఇదియు భగవత్ప్రాప్తికి మార్గమే. కాని ఈ మార్గము క్లేశబహుళము. ఏలన, కొందరికి మధ్య కొన్నిశక్తులు వశపడును. వీటివలన మనస్సునకు పరమలక్ష్యమైన పరమాత్మ తత్త్వము దూరము అగుట కవకాశము కలదు. కనుకనే ఈ అధ్యాయము నందు చివరగల 87వ శ్లోకమున –

'అథదుర్గమ యోగతంత్రకే ' ఇత్యాదిగ యోగమార్గము క్రమమైన మార్గమే అయినను క్లేశబహుళమని చెప్పబడినది. శ్రీగీతలో –

సఖాయో బహునోక్తేన కింవః? సారతరం బ్రువే ।
కురుధ్వం సంగతిం సద్భిః శ్రుణుధ్వం వైష్ణవీః కథాః ॥ 74

మైత్రీం భజధ్వం సర్వత్ర, జ్ఞాత్వావిష్ణుమయం జగత్ ।
సదైవ విష్ణుం స్మరత! సర్వక్లేశవినాశనమ్ ॥ 75

సత్సంగతిరలబ్ధాచేత్ ఏకఏవ సదావసేత్ ।
నాలపేద్ విష్ణువిముఖైః నచతాన్ పరిభూషయేత్ ॥ 76

ద్విజేషు, గోషు, గురుషు, గుణదృష్టిః సదా భవేత్ ।
విషయేషుచ సర్వేషు దోషదృష్టిః సదాభవేత్ ॥ 77

'మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాంవేత్తి తత్త్వతః ॥'

అని పేర్కొనబడినది. 73

ఓ మిత్రులారా! అధికముగ మాటాడుటేల? మీకు సారవత్తరమగు నంశమును చెప్పుచున్నాను. సజ్జనులతో సాన్నిహిత్యమును పొందుడు! విష్ణుమహిమను కీర్తించుగాథలను వినుడు. 74

ఈ ప్రపంచమంతయు విష్ణుమయమని తెలిసికొని ఎల్లయెడల మైత్రిని ప్రకటింపుడు! సమస్త క్లేశముల నశింపజేయు శ్రీవిష్ణుని నిరంతరము చింతింపుడు. 75

ఒకవేళ సజ్జన సాంగత్యము లభింపనిచో వంటరిగనే నివాసముండవలయును. ఎవ్వరు విష్ణువునకు విముఖులై యుందురో అట్టివారితో మాటాడుటగాని, వారిని కీర్తించుటద్వారా సమ్మానించుటగాని చేయరాదు. 76

బ్రహ్మజ్ఞాన సంపన్నులైన విప్రులయందును, గోవులయందును, మంత్రాదుల నుపదేశించి ఆత్మోజ్జీవనమునకు ఆలంబనములైన ఆచార్యులయందును గుణములనే యెంచవలయును(దోషముల నెన్నరాదని తాత్పర్యము) లౌకికములై పతన హేతువులైన విషయములపట్ల దోషదర్శనమే (ఇవిదోషములనుభావము) ఉండవలయును.77

తనకిష్టమైనది లభించినప్పుడు కలుగు సుఖమును, ఆపదలు కలిగినప్పుడు,

ఇష్టప్రాప్తి విపత్త్యోశ్చమనః సామ్యేన ధారయేత్ ।
సంకల్ప యేన్నయత్ కించిద్, జిజ్ఞాసేద్బ్రహ్మ సర్వదా । 78

సదాచ అపరరాత్రేషు సౌమ్య చిత్తేన భావయేత్ ।
క ఆత్మా? కింమయోదేహః ? కింమనః ? కేదశానిలాః । 79

కీదృగ్ వృత్తీని చాక్షాణి ? భేదఃకః పరజీవాయోః ?
కేనైతత్ సృజ్యతేవిశ్వమ్ ? కింమయం? కేనధార్యతే । 80

వేదానాంక్వచ తాత్పర్యం? బంధోమోక్షశ్చ కీదృశః ?
శ్రోతా, మంతా, తథాద్రష్టా, కర్తా, రసయితాచకః ? 81

కలిగెడు దుఃఖమును సమానముగనే పరిగ్రహింపవలయును. 'ఇదిచేయుదును' ఇది చేయను' ఇత్యాదిగ మనస్సున సంకల్ప(వికల్ప)ముల చేయరాదు. (దానివలన రాగద్వేషములు విజృంభించు నవకాశము కలదు). నిరంతరము పరబ్రహ్మమగు శ్రీహరిని గురించి జిజ్ఞాస నొనర్పవలయును.

జిజ్ఞాస యనగా తత్త్వవిచారణము. దీనినే వేదాన్తమని యందురు. భగవత్ స్వరూపమును, జీవస్వరూపమును, వీరికిగల పరస్పర సంబంధమును నిష్కర్షించిన యుపనిషద్వాక్యములను, పెద్దలయంతేవాసమున లెస్సగ విచారణ మొనర్చినచో తనకు పరమప్రాప్యమైనదేదో విశదపడును. ఇదియే బుద్ధిమంతమగు ప్రాణికోటికిగల పరమలక్ష్యము. 78

ఎల్లప్పుడు రాత్రి చివరి భాగమందు (బ్రాహ్మముహూర్తమందు) ప్రసన్నమైన మనస్సుతో 'ఆత్మయనేమి?' 'ఈదేహమే యంశములతో కూడియున్నది?' 'మనస్సనగానెట్టిది?' 'దశవిధప్రాణములననేవి?' ఇత్యాది విషయములను లెస్సగా విచారింప వలయును.

రాత్రియొక్క అపరభాగమందు అనగా బ్రాహ్మముహూర్త సమయమున మనస్సు పూర్వపుసంస్కారములనుండి విడివడి ప్రసన్నముగా నుండును. ఈ సమయము తత్త్వవిషయ పర్యాలోచనమునకు చాలమంచిది. ప్రసన్న చిత్తమందు భావింపబడిన యంశములు లెస్సగా లగ్నములగును.

ఆనందః సర్వగో నిత్యః స్వతః కస్మాన్నదృశ్యతే ।
ఇత్యాది బ్రహ్మగహనమాత్మనైవ విభావయేత్ ।
ఉపగమ్యచ సద్వృద్ధాన్ భక్త్యాపృచ్ఛేత్ పునఃపునః । 82

దశవిధ వాయువులనగా ప్రాణము (హృదయమందుండునది) అపానము (గుదప్రదేశమున నుండునది) సమానము (నాభిప్రదేశమున నుండునది) ఉదానము (కంఠప్రదేశమున నుండునది) వ్యానము (సర్వశరీరమున వ్యాపించియుండునది) నాగము (వాగ్ద్వారమున నుండునది) కూర్మము (నేత్రముల తెరచినప్పుడుండునది) కృకరము (తుమ్మును కలిగించునది) దేవదత్తము (ఆవులింతను కలిగించునది) ధనంజయము (సర్వశరీరమును వ్యాపించియుండి ప్రాణరహితమైనదేహమున గూడనుండునది) ఇవియే 'పది వాయువులు' వీటి స్వరూప స్వభావముల భావింపవలెనని తాత్పర్యము. 79

ఇంద్రియముల ప్రవృత్తియెట్టిది? జీవాత్మకు, పరమాత్మకుగల భేదమెట్టిది? ఈసమస్త బ్రహ్మాండము ఎవ్వనిచే సృజింపబడుచున్నది? ఈవిశ్వమేపదార్థముతో నిండియున్నది? ఎవ్వనిచేనిదిధరింపబడుచున్నది? (అక్షములనగాఇంద్రియములు)80

వేదములచే ప్రధానముగ ప్రతిపాదింపబడు తత్త్వమేది? బంధమనగానేమి? మోక్షమనగా నెట్టిది? ఈ సృష్టిలోగల పదార్థజాతమును గురించి వినువాడెవ్వడు? వీటిని మననము చేయువాడెవ్వడు? అట్లేవీటిని దర్శించు వాడెవ్వడు? సమస్త క్రియలను నిర్వహించువాడెవ్వడు? వాటి ఫలము ననుభవించువాడెవ్వడు? 81

అంతట వ్యాపించియుండి నిత్యమై యున్న ఆనందస్వరూపమగు పరబ్రహ్మమేల కనుపించుటలేదు? ఇత్యాదిగ అత్యంత క్లిష్టమైన బ్రహ్మతత్త్వ విషయమును తనంత తానుగనే భావింపవలయును. తత్త్వజ్ఞాన సంపన్నులైన పెద్దలదరిచేరి నమ్రభావముతో మాటిమాటికి పరిప్రశ్న మొనరింపవలయును. 79వ శ్లోకమునుండి యింతవరకు ప్రతిప్రాణియు తప్పక పర్యాలోచన మొనర్పవలసిన విషయములు నిర్దేశింపబడినవి.

ప్రతిప్రాణియు మొట్టమొదట ఆత్మయననేమో ఈదేహముననేమో యెరుగవలయును. ఏలన- దేహాత్మలకు గలభేదము తెలియక ఆత్మయందు దేహబుద్ధిని, దేహమందు ఆత్మబుద్ధిని, యుంచి సాంసారిక సుఖదుఃఖవలయమున సర్వప్రాణి చిక్కుకొనుచున్నది. దేహమువేరు – ఆత్మవేరు, అనువివేకము లేకపోవుటయే అవిద్య. లేకఅజ్ఞానము. దీనివలన ప్రతిప్రాణియు తన ధర్మమేదో తెలియక, దేహధర్మమునే ఆత్మధర్మముగా భావించి, దేహధర్మమునుబట్టి బంధుత్వముగల దారపుత్రాదుల

**సతతం హరిమర్చయేత్ తథా, స్తవవాక్యైః ప్రయతో యతాత్మతః**
**అవశాచ్చ్యుతమేవకీర్తయేత్, మదమానాది దశాస్వపిస్వయమ్ ‌। 83**

తోడనే తనకు నిత్యసంబంధమని భ్రమసి, వారికి బాధకలిగినప్పుడు తానును బాధచెందుచున్నాడు. దీనినే వైక్లబ్యమనియందురు. ఇట్టియనుబంధమునకు దేశకాలముల యౌచిత్యము ఎంత మాత్రము పట్టదు.కనుకనే, మహాసంగ్రామారంభమున, అస్థానమైన స్నేహముచే,కృపణుడై, ఏదిధర్మమో, ఏదియధర్మమో తెలియజాలక, తనకు స్వభావసిద్ధమైన క్షాత్రధర్మమును విడచి యుద్ధపరాఙ్ముఖుడైన యర్జునుని వైక్లబ్యమును పోద్రోలుటకై శ్రీహరి శ్రీగీతనుపదేశించినాడు. శ్రీగీత దేహాత్మవివేకమును కలిగించుటతోడనే ఆరంభమైనది. ఇట్టి అవివేకమూలమైన సంసారమునకు మనస్సుమూలకారణము. 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' మనుష్యుల కు కల్గెడి సంసార బంధమునకుగాని, ఈ బంధము నుండి విడివడుటకుగాని మనస్సేకారణము. కనుక దీనిని నిగ్రహింపవలయుననియే, స్థితప్రజ్ఞాది లక్షణములను టంకించుటద్వారా శ్రీభగవానుడు నిరూపించినాడు. ఈ మనస్సుయొక్క ప్రవృత్తిపైననే ప్రాణవృత్తులయొక్కయు, ఇంద్రియ ప్రవృత్తులయొక్కయు, ప్రసార మాధారపడి యున్నది. కనుక మొదట ఆత్మను గురించియు, దేహమును గురించియు, మనస్సు గురించియు, ప్రాణముల గురించియు, ఇంద్రియ ప్రవృత్తుల గురించియు తెలిసికొన వలయునని నిర్దేశింపబడినది. ఇవి తెలిసిన తరువాత దేహమువేరు, ఆత్మవేరు, ప్రాణేంద్రియ ప్రవృత్తులకు మనస్సు మూలమనియు, దానినరికట్ట వలయుననియు తెలియును. ఇట్లు అరికట్టబడిన మనస్సును పరమాత్మకు ఆయత్తము చేయవలయును! ఇదికుదురవలయునన్న పరమాత్మ యొక్కస్వరూపము తెలియవలయును! పరమాత్మ గురించి తెలియనిదే తదుపాసనము కుదరదుకదా! పరమాత్మకు జీవునకు గలభేదము, పరస్పర సంబంధములు విచారించుటయే బ్రహ్మజిజ్ఞాస. బ్రహ్మజిజ్ఞాసకు వేదాన్త వాక్యరూపములగు ఉపనిషత్తులు విషయములగును. ఇవి వేదములకు శిరస్సులు కనుక, వేదమున కంతటికి, ఉపనిషత్తులందు ప్రతిపాదింపబడు బ్రహ్మతత్త్వమందే తాత్పర్యమని నిష్కర్షింపబడుటచే దానిని తెలిసికొనును. దీనివలన పరమాత్మకు దూరమైయుండుట బంధమనియు, పరమాత్మకు అధీనములైన, సమస్తేంద్రియప్రవృత్తులు, మనః ప్రవృత్తి కలిగియుండుట, మోక్షహేతువనియు, పరమాత్మయగు శ్రీహరియొక్క మధుర మంగళ దివ్యవిగ్రహ దర్శన, తద్గుణకీర్తన, శ్రవణాదులు దానికి ఉపాయములనియు తెలిసికొనును.

సతతంచ తమేవ భావయేత్ । సయథాచిహ్న ధరశ్చతుర్భుజః ।
పరితఃకిలదృశ్యతే ప్రభుఃప్రకటః స్వప్నదశాస్వపి ప్రియః ॥ 84

రమయేచ్చ మనస్తథాహరౌ
సతతం కాన్తతమే యథైవతత్ ।
స్వయమేవ తమంజ సాఽన్వియాత్
పశురభ్యస్త మివాలయం స్వకమ్ ॥ 85

నిరంతరభగవద్గుణానుభవముచే, తానువినుటలేదనియు, తాను మననము చేయుట లేదనియు, తానుద్రష్టకాడనియు, తనకు కర్తృత్వము, భోక్తృత్వములు లేవనియు, తనయందుండి తనను ప్రవర్తింపజేయునట్టి పరమాత్మయే శ్రోత, మంత, ద్రష్ట, కర్త, భోక్తయునని యెరుగుము. ఇది యెరిగి తన సర్వప్రవృత్తులను భగవదాయత్త మొనర్చినప్పుడే, నిత్యము, సర్వత్రవ్యాపించియున్న పరమాత్మ యొక్క నిరతిశయయానంద స్వరూపము అనుభవ గోచరమగుననియు తెలిసికొనును. మరి, ఈ తత్త్వమెరుగుటెట్లు? అన్నచో శ్రీహరిగుణానుభవపరిణత చిత్తులగు భాగవతోత్తములైన యాచార్యులనాశ్రయంచి పరిప్రశ్నమొనర్చుటయే! దీనినే భగవానుడు శ్రీగీతలో -

'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।

ఉపదేక్ష్యన్తి, తే, జ్ఞానం, జ్ఞానినస్తత్త్వ దర్శినః ॥' (శ్రీగీత -4-34)

'తత్త్వజిజ్ఞాసువులైన వారు- తత్త్వజ్ఞానులు, భగవద్గుణానుభవ పరిపక్వ బుద్ధులైన వారినాశ్రయించి నమ్రభావమున నమస్కరించుట, వినయముగ ప్రశ్నించుట, వారికి తగిన సేవనొనర్చుటల ద్వారా తత్త్వోపదేశమును పొందవలయును'. అని పేర్కొనినాడు. ఈ విధముగ పై శ్లోకములలో ప్రతిజీవికి అత్యావశ్యకమైన తత్త్వజిజ్ఞాసనుగురించి సూచింపబడినది.

82

ఈ విధముగ నిగృహీతేంద్రియుడై శ్రీహరి గుణముల స్తవన మొనర్చుట ద్వారా తదర్చనమునొనర్పవలయును. ఒక్కొక్కప్పుడు ప్రాకృతదేహమును ధరించి యున్నందువలన, మదము, అభిమానము మున్నగునవి తనకు తెలియకయే పొడసూపినను శ్రీహరిగుణ కీర్తనమును మాత్రము విడువరాదు.

ఇతి సత్పథవర్తినాం హరిః కృపయా మంత్రిసుతాః ప్రసీదతి ।
స్వపదంచ దదాతి దుర్లభం విమలజ్ఞాన పురఃసరం క్రమాత్ ॥ 86

అథదుర్గమ యోగతంత్రకే
చరతామత్ర రతిః క్రమాద్ భవేత్ ।
పరదేశ పురే యథా తతో
నహి నిర్విఘ్నమియాత్ ఫలం మహత్ ॥ 87

అనగా శ్రీహరిగుణకీర్తనమే ప్రకృతిసిద్ధములైన మదాభిమానాదుల పోద్రోలునని తాత్పర్యము. 83

నిరంతరము పూర్వోక్తములగు శంఖచక్రాది చిహ్నములధరించిన చతుర్భుజుడగు శ్రీహరిని (మనస్సున) చింతింపవలయును. సర్వనియామకుడగు శ్రీహరి స్పష్టముగ, ప్రేమాస్పదుడై (అన్నిదశలయందును) కలలోకూడ అంతట వ్యాపించి గోచరించుచున్నాడు కదా! 84

కావున, అత్యన్త ప్రేమాస్పదుడైన శ్రీహరియందు మనస్సు తనంతతానుగనే యెట్లు తగుల్గొనియుండునో అట్లుగ నిరంతరము మనస్సును శ్రీహరియందే క్రీడింప జేయవలయును. అప్పుడు మాత్రమే చంచలమైన మనస్సు, పూర్వము బాగుగ నలవాటు పడిన నివాసస్థానమున పశువు తనంతతాను ప్రవేశించినట్లు మనస్సు కూడ శ్రీహరియందే ప్రవేశించును. 85

ఓ మంత్రి పుత్రులారా! ఈ విధముగ సన్మార్గమందు ప్రవర్తించుచున్నవారికి శ్రీహరి దయతో ప్రసన్నుడగును. అంతియేకాదు సామాన్య జనులకు పొందనలవికాని 'తనదివ్యధామమును' (పరమ పదమును) నిర్మలమైన జ్ఞానతోపాటుగ, క్రమముగ ననుగ్రహించును. దీనినే శ్రీగీతలో భగవానుడు- 'మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్' అని పేర్కొనినాడు. 86

ఇక, క్లిష్టమైన యోగమార్గమున (అష్టాంగయోగాభ్యాస విధానమున) వర్తించు చుండువారికి శ్రీహరిభక్తియందు అభిరుచి క్రమముగ మాత్రమే కలుగును. ఏలన, పరదేశమునకు చెందిన పట్టణమున నున్నవానికి, వాడొనర్చు వ్యాపారముల ఫలము,

బహునా కిమహో! భవాంబుధౌ
హరిరేవాత్ర పరాయణం పరం
శతశోఽథ వదామి దైత్యజాః
హరిరేవాత్ర పరాయణం పరమ్ ‖ 88

హరిః పరాయణం పరం హరిః పరాయణం పరం
హరిః పరాయణం పరం పునః పునర్వ దామ్యహమ్ ‖ 89

అనేక విఘ్నములతోకూడి యుండియెట్లు సులభముకాదో అట్లే ఈయోగ మార్గాను యాయులకును అనేక విఘ్నములు ఫలప్రతిబంధకములే యగును. దీనిని బట్టి యోగముకంటె భగవద్భక్తియే సులభసాధనమని తాత్పర్యము. 87

ఓ దైత్యపుత్రులారా! వేయిమాటలేల? ఈ సంసారసాగరమున బడినవారికి శ్రీహరి కంటె వేరుగ ఏడుగడలేదు. నూరుసారులు చెప్పుచున్నాను. శ్రీహరియే పరమప్రాప్యతత్త్వము. వేరొకరుకాదు. 88

శ్రీహరియే పరమ పరాయణము. (ప్రాప్యతత్త్వము) శ్రీహరియే పరమ పరాయణము. శ్రీహరియే పరమపరాయణము మాటిమాటికి దీనినేనేను ఉద్ఘోషించుచున్నాను. 89

నాయందుగల ప్రేమతో, 'నీతండ్రిచే ప్రయోగింపబడిన యస్త్రాదులను నీవెట్లు జయించితివని' మీరడిగినారు. ఇదియంత ఆశ్చర్యమును కలిగించు విషయము కాదు. కేవలము 'అణిమ మున్నగు అష్టసిద్ధులు శ్రీహరి స్మరణమునకు విఘ్నకారములే తప్పవేరుకాదు.

ఎవ్వరు నిరంతర శ్రీహరిస్మరణ సంసక్తులో వారికి సిద్ధింపని శక్తులేవియులేవు. వారు వేటినైన అనాయాసముగ జయింపగల్గుదురు. ఇట్టివారికి అణిమ, లఘిమ, గరిమ మహిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అను అష్టవిధసిద్ధులు కరతలా మలకములగును. కాని యాదశలో వారిసిద్ధులకు లొంగినచో పరమప్రాప్యమగు శ్రీహరి

గదితంచ భవద్భిరాదరాత్
కథమస్త్రాది జితం త్వయేతియత్ ।
తదవిస్మయనీయమీశ్వర
స్మృతివిఘ్నా హ్యణిమాది సిద్ధయః ॥ 90

జనస్యవిష్ణుసేవనే విముక్తి రేవ సంఫలమ్
తదంతరాయతాంత్వి మావ్రజన్తి సర్వ సిద్ధయః । 91

ఇతి నారదీయే హరిభక్తిసుధోదయే ప్రహ్లాదచరితేఏకాదశోఽధ్యాయః

దివ్యపదమునకు దూరమై పోవుదురు. "అనగా నీయష్టసిద్ధులు శ్రీహరిస్మృతికి ప్రతిబంధకములని తాత్పర్యము. వీటికి వశపడక పరమప్రాప్యమందు లక్ష్యమును నిగిడ్చిన వారేధన్యులని తాత్పర్యము. 90

ఎవ్వడు శ్రీహరి పాదకమలముల నర్చించునో అట్టివానికి ముక్తియే పరమఫలము. ఈ సిద్ధులు కేవలమాముక్తి ప్రాప్తికి ప్రతిబంధకములే యగును. 91

ఇదినారదీయ పురాణాంతర్గతమగు హరిభక్తి సుధోదయమునగల

ప్రహ్లాద చరితమున పదకొండవ యధ్యాయము.

# ద్వాదశాధ్యాయము

ద్వాదశాధ్యాయసారము : రాక్షస కుమారుల నుద్దేశించి ప్రహ్లాదుడు ప్రతిబోధించిన తత్త్వ విషయమును విని భీతిల్లినవారై కొందరు హిరణ్యకశిపునకి విషయము నెరుకపరచిరి. ఈ మాటవిని, రోషావిష్టుడై హిరణ్యకశిపుడు వంటవాండ్రను పిలచి రహస్యముగా విషమును కలిపించెను. కాని, శ్రీహరి యా విషమును జీర్ణింపజేసెను. విషమును, అమృతమును ఏదితిన్నను, వానికి నిరంతర శ్రీహరిస్మరణమే తప్ప బాహ్యస్మృతిలేదు. విషమిటు జీర్ణమగుటగని రక్షోనాథుడు క్రోధాన్విడై పురోహితులను పిలచి నిందించి బెదిరించినాడు. పరతంత్రులైన యా బ్రాహ్మణులు తమ మంత్రబలముచే ఘోరమగు 'కృత్య' యను శక్తిని సృజింతుమని రాక్షసేంద్రునకు విన్నవించి, ప్రహ్లాదుని పలువిధముల భయపెట్టిరి. ప్రహ్లాదుడు వినమ్రుడై 'మంత్రశక్తిని' వ్యర్థపరుపవలదని ప్రార్థించెను. కాని, మంత్రగర్వితులు క్రోధవివశులునైన బ్రాహ్మణులు శ్రీహరి భక్తుని ప్రభావము నెరుగజాలక, తమమంత్ర ప్రభావముచే భయంకరమగు 'కృత్య' యను శక్తిని సృజించిరి. అది జ్వాలా విగ్రహయై, నాలుక సాచి, భయంకరముగ జడల విదల్చుచు, త్రిశూలమును త్రిప్పుచు ప్రహ్లాదునిపై బడెను. దానినిజూచి భీతిల్లిన పురజనులు భోరున ఆక్రోశించుచు హిరణ్యకశిపుని శరణు జొచ్చిరి. 'కృత్య' తన త్రిశూలముతో ధ్యాననిష్ఠుడగు ప్రహ్లాదుని కొట్టినది. కాని, భగ్గున మండుచున్న ఆత్రిశూలము సహితము ప్రహ్లాదుని స్పృశించి చల్లబడి పోయెను. వివేక సంపన్నుడగు వానిని త్రిగుణాత్మకమగు ప్రకృతి దరిజేరలేనట్లు, ఆకృత్యాశక్తి ప్రహ్లాదుని దరిచేర లేకపోయినది. తన శూలము వ్యర్థమగుట చూచి వశముతప్పిన ఆ మహాశక్తి దానిని ప్రయోగించిన బ్రాహ్మణుల పైననే తిరుగబడినది. దక్షిణావిహీనమైన యజ్ఞమువలె నిష్ఫలమైన ఆశక్తి వారినే చుట్టుముట్టెను. అంతనా బ్రాహ్మణులు తాము ప్రయోగించిన కృత్యాశక్తి తామే పడిపోవుచున్న జాలని వారై రక్షింపుమని ప్రహ్లాదునే వేడిరి. ప్రహ్లాదుడాద్విజుల రక్షింపవెంచి శ్రీహరినే శరణు జొచ్చెను. శ్రీహరికృపచే బ్రాహ్మణులు కృత్యాశక్తి నుండి రక్షింపబడిరి. బ్రాహ్మణశక్తి భగ్నమగుటగని రాక్షసేంద్రుడు చింతపడెను. మరల ఛల భాషణముచే కుమారుని వశపరచుకొన యత్నించెను. తండ్రి మాటలకు ప్రహ్లాదుడు తాత్త్విక బుద్ధి పరిపక్వములగు ప్రతి సమాధానముల నిచ్చెను. పిమ్మట ప్రాసాదాగ్రమునుండి పుత్రుని పడద్రోయించెను. ఆదివరాహ సముద్ధృతయగు పృథివి ఆవిష్ణుభక్తుని చేతులతో పైకెత్తెను.

శ్రీ నారద ఉవాచ -

ఇతి యోగీశ్వరే ణోక్తం ప్రహ్లాదేన దయాబ్ధినా ।
నిశమ్య ధన్యతాం యాతాః కేచిత్ తత్సహచారిణః । 1

అన్యేతు రక్షః పతయేశశంసుః దారకా భియా! ।
అధ్యాపయతి యత్కించిత్ దేవాస్మానపి తేసుతః । 2

ధ్యానంధ్యేయో హరిర్మోక్ష ఇత్యాది బహుజల్పతి ।
త్వత్సన్నిధావేవ, తతో భీతాస్త్వాం వయమాగతాః । 3

అథాతి రోషా ద్దైత్యేంద్రః తస్మై విషమదాపయత్ ।
అనఘాయ, నవేదాసౌ తదేవహ్యాత్మనో విషమ్ । 4

అవిజ్ఞాతం దదుఃసూదాః ప్రహ్లాదాయ మహాత్మనే ।
మహావిషం సర్వభక్ష్యేభూరి దైత్యేశ్వరాజ్ఞయా । 5

శ్రీ నారదముని చెప్పెను. ఈ విధముగ దయాళువు యోగి శ్రేష్ఠుడునగు నా ప్రహ్లాదునిచే పలకబడిన విషయమును విని ఆతని మిత్రులలో కొందరు ధన్యులైరి. 1

మరికొందరు హిరణ్యకశిపుని వద్దకేగి ' ఓ దేవా! నీకుమారుడు మాకు కూడ ఏదియో బోధించుచున్నాడని ' పేర్కొనిరి. 2

ధ్యానము, ధ్యేయము, హరి, మోక్షము, మున్నగు విషయములను పలువిధముల ప్రేలుచున్నాడు. కనుక భయపడినవారమై నీ వద్దకే మేమరుగు దెంచితిమి.(అని పలికిరి.) 3

పిమ్మట దైత్యేంద్రుడుగు నా హిరణ్యకశిపుడు క్రోధముతో మహాత్ముడగు ప్రహ్లాదునకు విషమిప్పించెను. అది తనకే విషముగ పరిణమించునని యాతడెరుగజాలడయ్యెను. 4

హిరణ్యకశిపుని యాజ్ఞనుబట్టి, వంటవారు మహానుభావుడగు ప్రహ్లాదునకు తెలియకుండగనే ఆతని యాహారములలో అధికముగ ప్రభావవంతమగు విషమును పెట్టిరి. 5

పిమ్మట శ్రీహరి, సహజముగనే ప్రహ్లాదునిచే నిరంతరము స్మరింపబడు

అథవిష్ణుః స్వభావేన ప్రహ్లాదేన సదాస్మృతః ।
అజ్ఞాత దత్తమజ్ఞాతం జారయామాస తద్విషమ్ ॥ 6

రరక్ష భగవాన్ భక్తమజ్ఞాతా ద్విజదుర్విషాత్ ।
మాతా రక్షతి బాలంహి తదజ్ఞాత భయాదపి ॥ 7

విషం సుధాం వాభుంజానో భోక్తారం విష్ణుమేవసః ।
సదాధ్యాయతి నాత్మానం విషం తస్యకరోతి కిమ్ ॥ 8

తంచ భుక్త విషం దృష్ట్వా నిర్వికారం భియాగురుః ।
స్వయం వికార మగమత్ సత్యం తద్ధ్యాత్మనో విషమ్ ॥ 9

అవిజ్ఞాతే విషే జీర్ణే విస్మయం పరమం యయౌ ।
ప్రహ్లాదరక్షకం దేవం సర్వజ్ఞం ననవేద యత్ ॥ 10

చుండినవాడై, ఆతనికి తెలియ కుండగ నిచ్చిన విషమును తెలియకుండగనే తొలగించివైచెను. 6

భగవానుడగు శ్రీహరి - తెలియరాని దుష్టమగు నావిషము నుండి భక్తుడగు ప్రహ్లాదుని రక్షించెను. పిల్లవానికి తెలియనిదగు భయమునుండి (ఆపదనుండి) తల్లి బాలుని రక్షించును కదా! 7

నిరంతర హరిస్మరణ నిమగ్నుడగు ప్రహ్లాదుడు విషముతిన్నను అమృతమును త్రాగినను, తనలోనున్న శ్రీమన్నారాయణుడే పరిగ్రహించుచున్నట్లు భావించువాడు కనుక, భోక్తృత్వ మెంత మాత్రములేని యాప్రహ్లాదుని విషమేమి చేయగలదు? 8

విషముతిన్నను ఎట్టివికారములకు లోనుగాని ప్రహ్లాదుని జూచి, భీతితో నా హిరణ్యకశిపుడే స్వయముగ వికారమునకు ఆస్పదుడైనాడు. నిక్కముగ కుమారునకు పెట్టిన విషము తనకుతాను తిన్నట్లేగదా? 9

ప్రహ్లాదుని రక్షించువాడా సర్వజ్ఞుడు దేవదేవుడునైన నారాయణుడని యెరుగడు కనుక, పుత్రునకు తెలియకుండగ పెట్టిన విషము జీర్ణమగుటను గని యాహిరణ్యకశిపుడు అచ్చెరువు పొందెను. 10

అంతనా హిరణ్యకశిపుడు క్రోధముచే కనుగాననివాడై పురోహితుల బిలిచి,

అథా హూయసదైత్యేన్ద్రః క్రోధాన్ధః స్వపురోహితాన్ ।
రేరే క్షుద్రద్విజా యూయం మత్ఖడ్గ బలితాంగతాః ॥ 11

హన్యమనోమయా మూర్ఖైః భవద్భిః పరిరక్షితః ।
యద్భవద్భిః మృషాలాపైర్యుష్మాన్ హత్వా నిహన్మి తమ్ ॥ 12

అథరక్షః పతింక్రుద్ధం జగుస్తే సభయం ద్విజాః ।
ద్రాగిమేఽభిచరిష్యామో రాజరాజ తవాత్మజమ్ ॥ 13

క్రుద్దైర్వ్యధివ దస్మాభిః తర్పితోఽద్యహుతాశనః ।
కృత్యాం దాస్యతి నో ఘోరాం పశ్యమంత్రబలం ప్రభో ॥ 14

ఉక్త్వేతి బుద్ధి సంపన్నాః తద్విసృష్టాః పురోహితాః ।
ఊచుః ప్రహ్లాదమేకాన్తే బహూపాయైర్మహాబలమ్ ॥ 15

'ఒరోరీ! క్షుద్ర బ్రాహ్మణులారా! మీరు నాఖడ్గమునకు బలియైనారు' అని పరుషములాడెను. 11

'నాచే చంపబడుచున్న వీడు, మిథ్యాలాపములనొనర్చిన మూర్ఖులగు మీచే రక్షింపబడినాడు కావున, మిమ్ములనుజంపివానినిచంపుదును.' (అని పలికెను) 12

అంతనిట్లు క్రోధావేశవివశుడైన హిరణ్యకశిపుని గాంచి భయగ్రస్తులైన యా బ్రాహ్మణ పురోహితులు 'ఓ రాజరాజా! ఇదుగో ఇప్పుడే నీకుమారుని అభిచారిక ప్రక్రియా ద్వారమున మేము చంపుదుము.' 13

'క్రోధమును పొందిన వారమగు మేము అగ్నిని హవనమున తృప్తిపరతుము. అప్పుడాతడు ఘోరమగు 'కృత్య' యనుశక్తిని అనుగ్రహింపగలడు. ప్రభో! మా మంత్ర బలమును చూడుము.' 14

ఇట్లు, అప్పటికప్పుడు తాత్కాలికమగు సమాధానమీయగల తెలివిగల యాబ్రాహ్మణులు, హిరణ్యకశిపునిచే విడువబడినవారై, ఏకాన్తమున అనేక విధములగు ఉపాయములతో మహాబలుడగు ప్రహ్లాదుని వశపరచు కొనదలచినవారైపలికిరి.15

'ఓ రాజపుత్రా! మహానుభావా! నీ బల సంపదలు మాచేచూడబడినవి. నీవు భయంకరములగు శస్త్రాదుల నన్నింటిని సుఖముగనే లెస్సగ జయించితివి.' 16

రాజపుత్ర! మహాభాగ! దృష్టాస్తే బలసంపదః ।
సుఖేనైవ త్వయా సాధు ఘోరాః శస్త్రాదికాః జితాః ॥ 16

అస్మాభిర్దైత్యరాజేన త్వద్వధే చోదితైరపి ।
ఉపేక్ష్యతే శ్రీశభక్తో ద్విజైస్త్వం తన్నవేత్సిచ ॥ 17

దైత్యరాజశ్చ సహతే నహి మానీ హరిస్తవమ్
త్వయాచ నహరి స్త్యాజ్యో భక్తైనైతత్తు సంకటమ్ ॥ 18

స్వయత్నైః త్వాం వధిష్యన్తి రాక్షసా ఇతి ధీర్నసః ।
వైష్ణవోనతు వధ్యోఽన్యైః వయం తత్ర ప్రచోదితాః ॥ 19

సూక్ష్మ బుద్ధిస్తవ పితా జ్ఞాతవానద్యనో బలం ।
ఆగ్రహోత్తన్ని యుక్తాస్మః తేన నోపేక్షితుంక్షమాః ॥ 20

అస్మాభి స్త్వద్యహన్తవ్యః సాధుస్త్వం బత! నిర్ఘృణైః ।
రాజోపజీవిభిః పాపైర్ధిగిమాం పరవశ్యతామ్ ॥ 21

బ్రాహ్మణులమగు మేము – రాక్షసరాజుచే నిన్నుచంపుటకై ప్రేరింపబడినవారమై నప్పటికి, శ్రీహరిభక్తుడవగు నీవు, మాచే చంపబడకయే ఉపేక్షింప బడినావు. నీవీ విషయము నెరుగ వైతివి. 17

'దైత్యరాజగు హిరణ్యకశిపుడు దురభిమానియై శ్రీహరి స్తవనమును సహింప జాలకున్నాడు. మరి శ్రీహరి భక్తుడవగు నీచే హరిత్యజింపబడ డయ్యెను. ఇదియే మాకు సంకటముగ పరిణమించినది. 18

'రాక్షసులు తమంత తాము తమప్రయత్నములచే నిన్ను చంపగలరను తలంపుమాకు లేదు. వైష్ణవుడితరులకు వధ్యుడు కాడుకదా! కావుననే మేమీ విషయమున ప్రేరింపబడితిమి.' 19

'నీతండ్రి మంచి సూక్ష్మమగు బుద్ధికలవాడు, కనుకనే మాబలము నెరిగినవాడు. అభినివేశముతో మమ్ములను నియోగించినాడు. కనుక మమ్ముపేక్షించుట నీకెంత మాత్రము తగదు.' 20

ఏవం స్థితోఽపితే తాత! త్రాణమస్త్యేకముత్తమమ్ ।
విసృజ్యాశు హరిం వాచా రాజానం పితరం స్తుహి ॥ 22

మనసైవార్చయ హరిం, క్షేమోహి మనసార్చనమ్ ।
తత్ కథాం త్యజ వాచి త్వమను వర్త్యోహి తేపితుః 23

యద్వాన్యద్ బ్రూమహే సత్యం యదిన క్రోధమేష్యసి
శ్రీమత్ కుల ప్రసూత స్త్వం రాజరాజస్య చాత్మజః ॥ 24

వజ్రకాయో, యువా, ధీమాన్ రాజలక్షణలక్షితః ।
పితృద్విషి హరౌభక్తి మకాలే వత్స! మాకృథాః ॥ 25

శ్రుత్వేతి యోగీ విప్రాణాం వాచోదుర్జ్ఞాన బృంహితాః ।
అహోహి, మాయేత్యుక్త్వా తాంస్తూష్ణీంక్షణముద్వైక్షత ॥ 26

విస్మయానిమిషాక్షఃసన్ కించిద్వ్యక్రోన్నతాననః ।
వీక్షమాణోద్విజానజ్ఞాన్ ప్రహ్లాదోఽకమ్పయచ్ఛిరః ॥ 27

'అయ్యో! రాజునాశ్రయించి బ్రతుకువారమై దయాహీనులమగు మాచే సజ్జనుడవగు నీవుచంపబడనున్నావు గదా! ఈపరాధీనత తిరస్కరింప దగునుగాక!' 21

ఇట్టి(శోచనీయ)స్థితిలో నున్నప్పటికిని నీకు రక్షకమైన ఉత్తమోపాయమున్నది. వెంటనే శ్రీహరిని విడచి, వాక్కుతో, రాజగునీతండ్రిని స్తుతింపుము. 22

'కనుక, మనస్సుతోడనే హరినర్చింపుమము. మనస్సుతో నర్చించుటయే క్షేమము. నీవాక్కున హరిప్రసంగమును విడువుము. నీవు నీ తండ్రిని అనుసరింపదగిన వాడువుకదా!' 23

'నీవు మాపట్ల క్రోధమును పొందవేని నీకు వేరొక హితమునుగూడ చెప్పుదుము. భాగ్య సంపన్నమగు రాజకులమున పుట్టిన నీవు రాజరాజగు హిరణ్యకశిపుని పుత్రుడవు.' 24

'వజ్రసమాన దేహుడవు, యువకుడవు, బుద్ధిమంతుడగు, రాజ లక్షణములతో కూడినవాడవు. నాయనా! ఇట్టి నీవు, నీ తండ్రని ద్వేషించునట్టి శ్రీహరిపై అసందర్భమగు భక్తినుంచకుము.' 25

అథాహ కిం ద్విజవరాః కాలోఽస్తి హరిపూజనే ।
సాధువేదాన్త సిద్ధాన్త మార్గోఽసౌ కింనిరూపితః । 28

ఏవం పునర్నవక్తవ్యమితి వక్తుం నమేక్షమా ।
గురవోహి భవన్తోఽపి తస్మాద్బ్రూత యథాసుఖమ్ 29

యుక్తమైశ్వర్య మత్తానా మజ్ఞానాం వక్తుమిచ్ఛయా ।
విప్రాణాం వేదవిదుషామ ప్యేవం వాక్ప్రసర్పతి? । 30

పథ్యంవక్తుం ప్రతిజ్ఞాయ గురుభిః శిష్యవత్సలైః ।
అకాలే వైష్ణవీంభక్తిం త్యజేత్యుక్త మహోబుధైః । 31

ఈ విధముగ నాబ్రాహ్మణ పురోహితులు పల్కిన దుష్టమైన జ్ఞానముతో పోషింపబడిన మాటలను విని, నిగృహీతేంద్రియుడగు ప్రహ్లాదుడు, 'అహో! ఏమి యీమాయ' అని పలికి ఒక్కక్షణము ఏమియు మాటాడక పరికించెను. 26

ఆశ్చర్యముతో రెప్పపాటు మరచిన దృష్టికలవాడును, కొలదిగ పైకివంచిన వదనము కలవాడునుఅగు ప్రహ్లాదుడు, జ్ఞాన శూన్యులగు నా విప్రులను చూచుచున్నవాడై తన శిరస్సు నిటునటు కదల్చెను. 27

పిమ్మట ప్రహ్లాదుడు ఇట్లు పలికెను. 'ఓబ్రాహ్మణ శ్రేష్ఠులారా! శ్రీహరిని పూజించుటకు వేరుగ సమయమేదైన కలదా? ఏమీ! ఉత్తమమైన వేదాన్త సిద్ధాన్తము యొక్క మార్గమిదియని మీరు నిరూపించినది? 28

'మరల నిట్లు పలుకవలదనియనుటకు నాకుసామర్థ్యము లేదు. మీరును నాకు గురువులు కదా! కనుక సుఖముగ మీయిచ్ఛ వచ్చినట్లు మాటాడుడు.' 29

'ఐశ్వర్యముచే మదించిన జ్ఞాన విహీనులకు తమయిచ్ఛకు వచ్చినట్లు మాటాడుట యుక్తము కావచ్చును. వేదవేత్తలగు విప్రులకు ఇట్టివాక్కు ఎట్లు ప్రసరించుచున్నది ?' 30

'హితము చెప్పుదుమని ప్రతినబూని శిష్యవాత్సల్యముగల విద్వాంసులగు గురువులచే, అసందర్భముగ విష్ణుభక్తిని విడువుమని యుపదేశింపబడినది. అహో! చాల ఆశ్చర్యము!' 31

భవతాపాగ్ని తప్తస్య విష్ణుహ్రద మహాశ్రయం ।
జనస్యజానతో బ్రూత కఃకాలో ద్విజసత్తమాః ॥ 32

తాపత్రయమహా జ్వాలామిలితే దేహమందిరే ।
విష్ణుభక్తిరసైః శాన్తిం జానన్ కః కాలమీక్షతే ॥ 33

కాలోఽస్తి యజ్ఞే, కాలోఽస్తి దానే, కాలోఽస్తి సజ్జపే ।
సర్వేశ భజనే కాలం వీక్షమాణాస్తు వంచితః ॥ 34

ఆజన్మ మరణం విష్ణుం భజమానా మహాధియః ।
క్షణేఽప్యన్తర్హితే విఘ్నైః శోచన్త్యసిహతా ఇవ ॥ 35

' ఓ ద్విజోత్తములారా! సంసారాగ్నిచే పరితప్తుడై విష్ణువను మహాసరస్సొకటి (తాపము తీర్చునది) కలదని ఎరిగినవ్యక్తికి వేరుగ సమయమేముండును? చెప్పుడు? తాపము కలిగిన వెంటనే తాపమును బాపుకొనుటకై చల్లని మడుగున దిగినట్లు, సంసార తాపతప్తులైనవారు సమయాసమయముల విచారింపకయే శ్రీహరి భక్తియను హ్రదమున ప్రవేశింపవలయునని తాత్పర్యము. 32

ఆదిభౌతిక ఆధిదైవిక ఆధ్యాత్మికములనుమూడు తాపములనెడి మహాగ్నులచే చుట్టువారిన ఈ శరీరమను గృహమునకు విష్ణుభక్తియను జలములచే మాత్రమే ప్రశమనమని యెరిగి ఎవ్వడు కాలముకొరకు నిరీక్షించును? (ఎవ్వడు కాలము కొరకు నిరీక్షింపడని తాత్పర్యము). 33

యాగమొనుర్చుటకు సముచితమైన కాలమనునది కలదు. దానమొనర్చుటకు గూడ కాలమున్నది. అట్లే ఉత్తమమైన మంత్ర జపమొనర్చుటకుగూడ సముచిత కాలమున్నది. కాని సర్వేశ్వరుడగు శ్రీమన్నారాయణుని భజించుటకు కాలమనునది వేరుగలేదు. ఎవ్వడు శ్రీహరి భజనమున కాలము కొరకు నిరీక్షించునో వాడు వంచింప బడినాడని యెరుగ వలయును. 34

పుట్టినది మొదలు మరణించువరకు నిరంతరము శ్రీహరినే సేవించునట్టి విద్వాంసులు ఒక్కక్షణము శ్రీహరిసేవ విఘ్నితమైనను కత్తిచేకొట్టబడిన వారివలె దుఃఖింతురు . 35

బాగుగ దప్పికగొన్న పశువు నీరు త్రావుచు, ఇసుమంత వ్యవధానమునైన ఎట్లు

పశుర్యథాఽతితృషితః పిబన్న సహతేఽన్తరం ।
భజమానాస్తథా విఘ్నం భవక్లిష్టాః సుబుద్ధయః ॥ 36

వాగ్భిః స్తువన్తో మనఆస్మరన్తః
తన్వా నమన్తోఽప్యనిశం నతుష్టాః ।
భక్త్యా స్రవన్నేత్రజలాః సమస్త
మాయుర్హరేరేవ సమర్పయన్తి ॥ 37

తమీశ్వరం సర్వమయం వరేణ్యం
త్యజామి వాచా కథమన్యభీతః ।
కిమస్తి శాస్తా తమృతే జనానాం
విప్రాః స ఏవ హ్యఖిలస్య శాస్తా॥ 38

కించాన్య భీతేన నరేణ భూయః
సర్వేశ సంకీర్తనమేవ కార్యమ్ ।
పితా స ఏవ హ్యఖిలస్యనాథో
రక్షత్యదోషాన్, వినిగృహ్యదుష్టాన్ ॥ 39

సహింపదో, అట్లే హరిభక్తి పరాయణులగు సద్బుద్ధులు ఈ సంసార క్లేశముల నను -భవించు చున్నను శ్రీహరి భజనమున కిసుమంత వ్యవధానము నైనను సహింపజాలరు. 36

వాక్కులతో స్తుతించుచు, మనస్సుతో స్మరించుచు శరీరముతో ప్రణమిల్లుచు నిరంతరము భగవత్సేవలో పరితృప్తిని చెందని భక్తులు కన్నులు వెంట నీరు జాలువారు చుండగ, భక్తిపరవశులై తమ ఆయుస్సు సంపూర్ణముగ శ్రీహరికే సమర్పించుదురు. 37

సర్వాత్మకుడును, భక్తజనులచే వరణీయుడును, సర్వనియామకుడును అయిన శ్రీహరిని వాక్కులతో స్తుతింపక ఇతరభీతిచే ఎట్లు విడతును? ఓ విప్రులారా! శ్రీహరికాక వేరుగ నీ ప్రపంచమును -శాశించు వాడెవ్వడున్నాడు? ఆతడే అఖిల నియామకుడు. 38

మఱియు, ఇతరునివలన భయమును పొందిన నరుడు అధికముగ సర్వేశ్వరుడగు

తత్కీర్తనం స్వల్పఫలం హిమత్వా
త్యజేతినూనం కథితం భవద్భిః ।
తస్మిన్ ఫలం శ్రావయితుం త్రినేత్రః
శ్రోతుంచ తత్పద్మభవోఽధికారీ॥ 40

రోషే పితుర్మే భవతాంచ హేతుః
కః పుణ్య కీర్తేః కథనే వదన్తు ।
ద్వేష్యః కథం విష్ణురథో జనైఃస్యాత్
స చాత్మకై ర్మేఘ ఇవాశు పేయః ॥ 41

ఏష యుష్మదభిప్రాయో జరీరోగీ హరిం భజేత్ ।
ఇయం దురాశా జంతూనాం హఠాదేవ మృతిర్యతః ॥ 42

ద్విపాత్వం దుర్లభం లబ్ధ్వాఽప్యేవం మూఢో దురాశయా ।
తాలాదివాధః పతతి తస్మాద్విష్ణు మనర్చయన్ ॥ 43

శ్రీహరినే కీర్తింపవలయును. ఆతడే నిఖిల జగత్పిత, అఖిలనాథుడు. ఆతడే దోషములులేని సజ్జనుల రక్షించును. దుర్జనుల నిగ్రహించును. 39

శ్రీమన్నారాయణుని కీర్తనమువలన కలుగు ఫలము స్వల్పమైనదని భావించియే, విడువుమని మీరు నాతో చెప్పి యుందురని భావింతురు. (కాని) శ్రీహరి కీర్తనము చేసినప్పుడు ఫలమెట్టిదియో వినిపించుటకు పరమశివుడును, వినుటకు శ్రీహరి నాభికమలమునుండి పుట్టిన బ్రహ్మయు అధికారము కల్గియున్నారు. 40

పావన యశస్కుడగు శ్రీహరినికీర్తించు విషయమున మీకును మాతండ్రికిని క్రోధము కలుగుటకు కారణమేమో చెప్పుదురుగాక! జనులకు సర్వవ్యాపియైన నారాయణుడు ద్వేషింపదగిన వాడెట్లగును. ఆయన చాతకపక్షులచే మేఘమువలె కేవలము ఆస్వాద్యుడే అగుచున్నాడు.

శ్రీహరి రూపగుణాదులు సర్వలోకా స్వాద్యములని తాత్పర్యము. 41

కేవలము వయసుడిగిన ముదుసలి, రోగగ్రస్తుడు మాత్రమే శ్రీహరిని భజింప

సుస్థఃకర్తుం నశక్నోతి యాం మూఢో హరిభావనాం ।
జరీరోగీచ తాం కుర్యాత్ కథం యోగీంద్ర దుష్కరామ్ ॥ 44

జరీరోగీ కరిష్యేహం శ్రేయస్త్వద్యేచ్ఛయాచరన్ ।
ఆశాస్త్యైతా విమూఢానాం పంథానః స్యురధోగతేః ॥ 45

గురుణాంచ ప్రియం కార్యం నప్రియం హితనాశనం ।
తస్మాద్విష్ణుం త్యజేత్యేతన్నకరోహ్యహితం హియత్ ॥ 46

ఇత్యుక్త్వా మంత్రిణస్సర్వే చక్రుధుర్దైత్యయాజకాః ।
ఊచుశ్చాశు హతోఽస్యద్య కృత్యయా పావకోత్థయా ॥ 47

-వలయునని మీయభిప్రాయము. నిజముగనిది దురాశయే. ఏలన, మరణము అకస్మాత్తుగనే (అవ్యవధానముగనే) కల్గునుకదా!

సాధారణముగ భగవచ్చింతనము, రోగాదిపీడలను పొందిన వారికి, వయసుడిగి, ఇతరకృత్యములజేయు సామర్థ్యము లోపించిన వారికిమాత్రమేనని కొందరు భావించుట కలదు. కాని, అట్టి సమయమేర్పడినను, మరణమెప్పుడు ఎట్లుపొంచియున్నదో ఎవ్వనికి తెలియదుకనుక, బాధలు కల్గినప్పుడు లేదా ముదుసలితనమున భగవచ్చింతన మొనర్తునని భావించుట పేరాశయేయగును.

ప్రాణ ప్రయాణ సమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతఃస్యాత్

ప్రాణము పోవు సమయమున కంఠము కఫముచేనడ్డుపడి పిత్తప్రకోపము కలిగి శరీరము జర్జరితమైనప్పుడు ఇక హరిస్మరణమునకవకాశమే లేదుకదా! కనుకస్వస్థచిత్తతా దశయుందే భగవచ్చింతనము చేయవలయునని తాత్పర్యము. 42

దుర్లభమైన నరజన్మమును పొందియు మూఢుడుగువాడు దురాశచే శ్రీహరిని అర్చింపక తాడిచెట్టునుండి క్రిందకు పడినట్లు అధఃపతితుడగుచున్నాడు. 43

ఇంద్రియములు వశమునన్నప్పుడు చేయలేని శ్రీహరి చింతనమును మూర్ఖజనుడు ముదుసలితనమునుపొంది, రోగగ్రస్థుడై సాక్షాత్తు యోగీంద్రులకు కూడ సాధ్యముకాని దానిని ఎట్లు చేయగలడు? 44

సచ సంభ్రమతః ప్రాహ ప్రహ్లాదో బ్రాహ్మణ ప్రియః ।
అస్థానే నహి మంత్రాణాం క్షయః కార్యోద్విజోత్తమాః ॥ 48

సంతిహ్యన్యే వధోపాయాః కృత్యం నాస్త్యత్ర కృత్యయా ।
అప్యాయు ష్మాన్న వధ్యోఽన్యైః కృత్యయా చాపితత్సమమ్ ॥ 49

కాలాత్మనా హతానేవ హన్తికృత్యాది న స్వతః ।
తస్మాత్ కృత్యాలయాగ్నిర్వా సామాన్యవధసాధనే ॥ 50

యద్వ్యర్థితా మద్ధననే భవతాంకారణం వినా ।
తద్విశస్త్రైః ఘ్నతా న్యైర్వా, స్వాభిచారో నతత్రహి ॥ 51

ఈనాడు విశృంఖలముగా సంచరించి ముదుసలితనమున రోగగ్రస్తుడై శ్రేయస్సునాచరింతుమని భావించు మూఢులైన వారికి, ఈ దురాశలే వారి అధోగతి మార్గములగుచున్నవి. 45

పెద్దలకు (తలిదండ్రులు గురువులు మున్నగు వారికి) ప్రియమును కల్గింపవలసినదే! కాని హితమున నశింప జేయునట్టి ప్రియమును మాత్రము కల్గింపరాదు. కనుక విష్ణువును పరిత్యజింపుమన్న పెద్దలమాటను ఆచరింపజాలను. అది హితము కాదు కదా! 46

ఈ విధముగ ప్రహ్లాదునిచే చెప్పబడినవారగు మంత్రులును రాక్షస పురోహితులును క్రోధమును పొందిరి. వెంటనే 'ఇదిగో ఈనాడే అభిచార హోమాగ్నినుండి పుట్టిన 'కృత్యాశక్తి'చే చత్తువు నీవు' అని పల్కిరి. 47

ఈ మాటనువిని తొట్రుపడి (పెద్దల యందలిగౌరవముతో) బ్రాహ్మణ ప్రియుడగు ప్రహ్లాదుడు 'ఓ బ్రాహ్మణోత్తములారా! మంత్రములను అసందర్భముగ అనుచితముగ ప్రయోగించి వాటిశక్తికి నాశనమును కల్గించుట యుక్తమ్ముకాదు! అని పలికినాడు. 48

వధనొనర్చుటకు అనేకములైన ఇతరోపాయములుండగా ఈ విషయమున 'కృత్యాశక్తి' యొక్క ఆవశ్యకత ఎంతమాత్రములేదు. ఆయుష్మంతుడైనవాడు ఇతరములైన ఉపాయములచే చంపబడనప్పుడు కృత్యావిషయమున కూడ అదిసమానమే. (అనగా కృత్యచేతకూడ చంపబడజాలడని యభిప్రాయము). 49

క్రోధగ్రస్త వివేకాస్తే తచ్ఛ్రుత్వా మంత్ర గర్వితాః ।
పావకాద సృజన్ కృత్యాం జ్వాలా రచిత విగ్రహామ్ । 52

సా తన్మంత్ర బలాధ్మాతా వవృధేచ జగర్జచ ।
బ్రహ్మాండముక్షి పంతీవ పాతయంతీవ తారకాః । 53

తస్యాః సటానాం భ్రమణాజ్జాత భీత్యా ధ్రువం దిశః ।
దూరాద పసృతా స్తస్మాన్నామ్నానన్తా స్తతోఽభవన్ । 54

సా శూలం భ్రామయామాస జ్వాలాభీమం వియత్తలే ।
శంకితా యేనపప్రచ్ఛుః దేవా వృద్ధాన్ యుగావధిమ్ । 55

కాలస్వభావముచే వంచిపంబడినవారినే కృత్య మున్నగునవి చంపుచున్నవితప్ప, స్వతంత్రముగకాదు. కనుక కృత్యయైనను, ప్రళయాగ్నియైనను వధించుటకు సాధారణములైన సాధనములేకాని విశేషమేమియులేదు. 50

ఎట్టి కారణము లేకయే, నన్నుచంప వలయుననియే మీ కోరికయైనచో ఇతర శస్త్రములచే నన్ను చంపుడు. అబిచార ప్రయోగము మాత్రమీ విషయమున వలదు. 51

క్రోధముచే వివేకనాశనము నొందినయాబ్రాహ్మణులు, మంత్రవేత్తలమను నహంకారముచే వివశులై ప్రహ్లాదుని మాటవిని 'అగ్ని జ్వాలలచే కల్పింపబడిన ఆకృతిగల కృత్యయను ఒక అభిచారిక శక్తిని అగ్నినుండి సృజించిరి. 52

అంతనా 'కృత్యాశక్తి' పురోహితుల మంత్రబలముచే పరిపుష్టినొందినదై దేహమునుపెంచి గర్జించెను. గర్జనముచే నాకృత్య బ్రహ్మాండమును పైకి విసరివేయు చుండెనా? నక్షత్రముల నేలకు, రాల్చుచుండెనా? యనునట్లుండెను. 53

ఆ కృత్యాశక్తి యొక్క జడల భ్రమణములవలన కల్గిన భయముచే దిక్కులు దూరముగతొలగి పారిపోయి యుండనోపును. కనుకనే వాటికి అనంతములను పేరు కల్గినది. 54

ఆశక్తి యాకాశమున అగ్నిజ్వాలలచే భయంకరమగు తనశూలమును, వేగముగ త్రిప్పినది, దానిని చూచి శంకాగ్రస్థులైన దేవతలు 'ఇది ప్రళయకాలమా?' అని పెద్దలను ప్రశ్నించిరి. 55

యత్ర యత్రన్యధాత్ పాదౌ సాథజ్వాలామయీ భువి
తత్ర తత్ర ప్రజజ్వాల వహ్నిః సంక్రామిత శ్చిరమ్ । 56

తావత్ పురజనా స్సర్వే హాహేతి పరిచుక్రుశుః ।
తాందృష్ట్వా దైత్యరాజంచ తత్వ్యస్తః శరణం యయుః । 57

జపద్భిరేవ తైర్విప్రైరథ కృత్యా ప్రదర్శితా ।
తం ధ్యాన నిష్ఠ ప్రహ్లాదం శూలేనా భిజఘాన సా । 58

తచ్చ జ్వాలామయం శూలం శ్రీశభక్తి రసాంబుధిమ్ ।
తం ప్రాప్యైవ శశామాశు జలరాశిమివోల్ముకమ్ । 59

జ్వాలామయ దేహముగల యాశక్తి యెచ్చటెచ్చట భూమిపైతన పాదముల నుంచినదో అచ్చటచ్చట అగ్ని సంక్రమింప జేయబడినదై చాలసేపు ప్రజ్జ్వరిల్లినది. 56

ఆ భయంకరమగు కృత్యాశక్తినిచూచి పురజనులందరు భీతితో హాహాకారముల నొనర్చుచు ఆక్రోశించినవారై రాక్షసరాజగు నాహిరణ్యకశిపుని శరణుజొచ్చిరి.57

జపమొనర్చుచున్న యా బ్రాహ్మణులచే 'కృత్యాశక్తి' ప్రదర్శింపబడినది. అది ధ్యాననిమగ్నుడగు ప్రహ్లాదుని శూలముతో మొత్తినది. 58

నీటిలో బడిన కొరవివలె శ్రీహరి భక్తిరససాగరుడైన ప్రహ్లాదుని దరిజేరినంతనే మండుచున్న ఆ శూలము ఒక్కసారిగ చల్లబడినది. 59

మంటలో పడవేయబడిన కొరవికనుపింపనట్లు, ప్రకాశించుచున్న, అగ్నివంటి వాడును, వైష్ణవతేజస్సుచే దరిజేర రానివాడును అయిన ఆ ప్రహ్లాదుని సమీపించి ఆ శూలమాతని తేజస్సులో లీనమై కనుపింపదాయెను. 60

విష్ణుతేజోమయుడగు నా ప్రహ్లాదుని యందు ప్రయోగింపబడిన తేజోమయమగు శూలము పరమాత్మచైతన్య మందులయించిన జీవచైతన్యమువలె వేరుగ కనుపట్టుదాయెను. ఈ రెండవ వాక్యము యొక్క అభిప్రాయమిది. శ్రీకృష్ణస్వరూపమగు పరబ్రహ్మము సహస్రకిరణుని వంటిది. సహస్ర కిరణునినుండి ప్రసరించిన తేజః పరమాణువు వంటివాడు జీవుడు. అనగా పరమాత్మయు, జీవుడు ఇరువురును తేజోరూపులే. అఖండ మహాతేజోరాశిలో చేరిన తేజః పరమాణువు తాను స్వయముగ

దైత్యారితేజో దుర్ధర్షం తం ప్రదీప్తమివానలమ్ ।
ప్రాప్యశూలం నదదృశే వహ్నౌ క్షిప్తమివోల్మ్కకమ్ । 60

క్షిప్తం తేజోమయం శూలం విష్ణుతేజోమయే మునౌ ।
పృథఙ్ నదదృశే జీవో బ్రహ్మణీవ గతోలయమ్ । 61

సర్వభుగ్ ద్విజవత్తస్మిన్ ధ్యానహీన జపౌఘవత్ ।
నిర్వీర్యమభవచ్ఛూల మవ్రతాధీత వేదవత్ । 62

నోపాసర్పత్తతః కృత్యాప్రహ్లాదం దుఃసహాప్యలమ్ ।
వివేక జ్ఞాన సంపన్నం పురుషం ప్రకృతి ర్యథా ॥ 63

తస్మిన్ మోఘీకృతే శూలే నిష్ప్రపంతం నిశమ్యసా ।
ప్రత్యధావద్ద్విజానేవ శిలాసంఘట్టితాశ్మవత్ ॥ 64

వేరైయున్నను వేరుగ తెలియదు. అట్లే పరమాత్మ చైతన్యమున చేరియున్న జీవచైతన్యము వేరుగనున్నను వేరుగ తెలియరాదని తాత్పర్యము. ఈ దశలో జీవాత్మ పరమాత్మలకు గలభేదము గానిఅభేదముగాని ,చింతింప నలవికానిది. అనగా నచింత్యమని భావము. 61

భక్ష్యా భక్ష్య వివేకము లేక ( ఇది తినవచ్చును ఇది తినరాదు అను వివేచనములేక) ప్రతిపదార్థమును భుజించు బ్రాహ్మణుని యందును, ధ్యానహీనునియందును 'జపము' (మంత్రజపము) నిర్వీర్యమైనట్లే, నియమరహితుడైన వాడధ్యయనము చేసిన వేదమువలె నిర్వీర్యమై శూలమాప్రహ్లాదుని యందు ప్రవర్తింపజాలదయ్యెను. 62

దుర్భరమైన యా కృత్యాశక్తి ప్రహ్లాదుని దరిజేరలేదు. ఎట్లన, ఆత్మానాత్మ వివేకము కల్గిన జీవుని ప్రకృతి వశపరచుకొన జాలదుకదా!

ఎవ్వడు దేహము కంటె భిన్నమైన యాత్మకలదని యెరిగి, దేహమందు తాదాత్మ్యబుద్ధిని విడచునో అట్టి వివేకసంపన్నుడైనవానిని త్రిగుణాత్మకమగు, ప్రకృతి వశపరచుకొనజాలనట్లే ప్రహ్లాదుని యా 'కృత్య' వశపరచుకొన జాలదయ్యెనని తాత్పర్యము. 63

కఠినశిలపై విసరబడిన మట్టిబెడ్డ దానినేమియు చేయజాలక తానే ముక్కలైనట్లు

ఆలిలింగేచ తాన్ క్రోధాత్ అస్థాన క్రోధకారిణః ।
ద్రుతం జ్వాలామయీకృత్యా హీనదక్షిణ యజ్ఞవత్ ॥ 65

అథదుర్జ్ఞానినోవిప్రా హన్యమానాః స్వకృత్యయా ।
శిరాంసి, హస్తాన్, వస్త్రాణి విధున్వంతః ప్రచుక్రుశుః ॥ 66

త్రాతుమర్హసినో బాల! కౌశలం తవ విద్యతే ।
మహాసిం భ్రామయన్ బాలశ్ఛిద్యతేఽ కుశలః స్వయమ్ ॥ 67

ప్రహ్లాదోఽథ హతాత్ఛ్రుత్వా ద్విజాక్రందం కృపాకులః ।
నిరీక్ష్య దహ్యమానాన్ తాన్ సంభ్రాన్తో వ్యథితోఽభవత్ ॥ 68

సమేనే పరదుఃఖంతత్ స్వకమేవ దయానిధిః ।
మనోధర్మం యథాశోకం దేహీ సుఖమయః స్వయమ్ ॥ 69

జీర్ణమై విసరినవానిపై బడినయట్లు ప్రహ్లాదునియందు ప్రయోగింపబడిన శూలము నిష్ఫలముకాగా ఆతడే పాపరహితుడని యెరిగిన 'కృత్యాశక్తి' తనను ప్రయోగించిన బ్రాహ్మణులపైబడి వెంటతరిమెను. 64

యజ్ఞ నిర్వహణమైనప్పుడు దానిని నిర్వహించిన వేదపండితులకు ఈయబడు పారితోషికమే దక్షిణ, అది లేనిచో, యజ్ఞము నిష్ఫలమేయగును. అది యజమానునకే హానిని కల్గించును. అట్లే దక్షిణావిహీనమగు యజ్ఞమువలె నిష్ఫలమైన కృత్యాశక్తి ప్రహ్లాదుని పట్ల యసందర్భక్రోధమును ప్రదర్శించిన పురోహితులపైబడి వారిని చుట్టుముట్టెను. 65

పిమ్మట, పరాపకారకారకమై దుష్టమైన మంత్రవిజ్ఞానముకల యావిప్రులు తాముసృజించిన కృత్యచేతనే కొట్టబడుచున్నవారై శిరస్సులను, చేతులను, వస్త్రములను విదలించుచు ఆక్రోశించిరి. 66

నాయనా! మమ్ములను నీవే రక్షింప సమర్థుడువు రక్షింపుము. బాలుడు పెద్దకత్తిని బట్టి త్రిప్పనచో కత్తినిపట్టుకొనగల నిపుణత్వములేమిచే తానే ఆకత్తిచే ఛేదింపబడునుకదా! అట్లే నీకొరకు పుట్టింపబడిన కృత్యాశక్తిని నియమించు సామర్థ్యము లేమిచే దానిని ప్రయోగించిన మేమే దానిచే పీడింపబడినామని తాత్పర్యము. 67

నిర్జితాఖిల శోకానామేక ఏవాస్తి శోకకృత్ ।
సతాం కారుణ్య సింధూనాం యోఽ యంశోకః పరాశ్రయః ॥ 70

సర్వదుఃఖైర్మేరు గురుభిః నైవసీదన్తి సత్తమాః ।
అణునాప్యన్యదుఃఖేన భృశంక్లిశ్యన్త్యహోద్విజాః । 71

సర్వం విచార్య కుర్వన్తోఽప్యేవం నవిమృశన్త్యదః ।
సన్తో యద్దుఃఖిత త్రాణే గుణీ నిర్గుణ ఇత్యయమ్ । 72

ప్రహ్లాదోఽథ ద్విజత్రాణే యతమానో జగత్పతిం ।
తుష్టావ ప్రాంజలిర్విష్ణుం తదేక శరణోహి సః । 73

అంతటు, ప్రహ్లాదుడు హఠాత్తుగ విప్రుల యాక్రోశమును విని, వారుకృత్యాశక్తిచే దహింపబడుట చూచి తొట్రుపడి కృపచే కలతచెంది బాధపడెను. 68

మనస్సునకు సంబంధించిన స్వభావమగు శోకమును సుఖస్వభావుడగు జీవుడు తనదిగా భావించినట్లు, దయానిధియైన యా ప్రహ్లాదుడు కృత్యాశక్తివలన విప్రు లనుభవించుచున్న దుఃఖమును తాననుభవించుచున్నట్లుగనే భావించెను. 69

సమస్తశోకములను జయించిన మహానుభావులకు శోకమును కల్గించు కారణము ఒక్కటి మాత్రమే కలదు. ఏమన్నచో కారుణ్య సింధువులగు నాసజ్జనులకు ఇతరుల శోకమే శోకకారణమగును. అనగా పరదుఃఖమును సహింప జాలక, ఆదుఃఖమును తమదుఃఖముగనే భావించుట వారి నైజమని తాత్పర్యము. 70

ఓ ద్విజులారా! తమకు సంబంధించిన ఎంతటి గొప్పవగు దుఃఖములచేనైనను సజ్జనులు బాధనొందరు. కాని అణుమాత్రమైన పరదుఃఖముచేనైనను మిక్కిలి క్లేశమును పొందుటయే వారి స్వభావము కదా! 71

సమస్తమును విచారించి ఆచరించు వారైనప్పటికిని, సజ్జనులు, దుఃఖితుడైనవానిని రక్షించు విషయమున వీడు గుణవంతుడు, వీడుగుణహీనుడు అని యెంతమాత్రము విచారింపరు. 72

పిమ్మట ప్రహ్లాదుడా విప్రుల రక్షించుటయందు యత్నించు చున్నవాడై యంజలి ఘటించి జగన్నాథుడగు శ్రీమహావిష్ణువును స్తుతించెను. ఆతడు శ్రీహరిని మాత్రమే ఆశ్రయించినవాడు కదా! 73

దేవయద్యస్తి సుకృతం మమత్వత్ స్మృతి సంభవమ్ ।
తేన రక్ష జగన్నాథ! విప్రాన్ మంత్రానలార్దితాన్ ॥ 74

త్వయైవ ప్రేరితా లోకాః కుర్వతే సాధ్వ సాధువా ।
తస్మాదదోషాన్ విశ్వేశ! రక్ష విప్రానవీశ్వరాన్ ॥ 75

త్వాంహి సర్వగతం వేదా వదన్తి పరమేశ్వరమ్ ।
తేన సత్యేన రక్షాద్య విప్రాన్ మంత్రానిలార్దితాన్ ॥ 76

అథ ప్రసన్నో భగవాన్ ప్రహ్లాదేనార్థి తస్తదా!
తమేవ విప్రదేహస్థం వహ్నిం చక్రేను శీతలమ్ ॥ 77

'దేవా! నిన్ను స్మరించినందువలన కల్గిన పుణ్యమేదైన నాకున్నచో, జగన్నాథా! మంత్రాగ్ని పీడితులగు విప్రులను రక్షింపుము.' 74

'స్వామీ! విశ్వేశ్వరా! నీచే ప్రేరింపబడినవారై జనులు సాధుకర్మములనుగాని, అసాధుకర్మములనుగాని చేయుదురు. కావున, తమయంతగ తాము ప్రవర్తింపజాలని యస్వతంత్రులును, దోషరహితులునగు విప్రులను రక్షింపుము. ఇది దీని తాత్పర్యము.

నిఖిల ప్రవృత్తి జాతమును ప్రవర్తింప జేయువాడు సర్వాంతర్యామియగు పరమాత్మయే. శ్రుతి యీవిషయముననే యిట్లుచెప్పుచున్నది. ' ఏష ఏవ సాధుకర్మకారయతితం యమేభ్యోలోకేభ్య ఉన్నినీషతి, ఏషఏవ అసాధుకర్మకారయతి తం యమధోధోనినీషతి' 'ఈ భగవానుడే ఎవ్వని నుద్ధరించి పరమపదము నను గ్రహింపదలచునో వానిచే సత్కర్మము నాచరింప జేయును. ఎవ్వనిని అధోలోకముల పడద్రోయదలచునో వానిచే నీచకర్మముల చేయించును.' ( కౌషీతక్యుపనిషద్ 3-9)

మరి, సాధ్వసాధు కర్మములకు భగవానుడే ప్రేరకుడైనచో జీవులకా సాధ్వ సాధు కర్మముల వలన కల్గెడి ఫలములగు సుఖదుఃఖములేల యంటవలయును? అన్నచో, భగవానుడు సర్వచేతనులకు చిచ్ఛక్తి (జ్ఞాన శక్తి) ప్రవృత్తి శక్తులను సమానముగనే అనుగ్రహించి వాటి వినియోగమున కొంత స్వాతంత్ర్యమును కూడ అనుగ్రహించినాడని యంగీకరింప వలయును. లేనిచో ఆతడు (జీవుడు) ఇతర పదార్థములకంటె శ్రేష్ఠుడు కాజాలడు కదా! భగవదనుగృహీతములైన శక్తులను సక్రమముగా వినియోగించుకొనక మాయావిష్టుడైనవాడు పతితుడగుచున్నాడు. వివేకసంపన్నుడైన వాడుద్ధరింప బడుచున్నాడు. పతితులైనవారిని ఉద్ధరింప నెంచియే కరుణాళుడగు శ్రీహరి ఈభువిని

సర్గేఽప్యుష్ణభావోఽయం సృష్టస్తైనైవ పావకః ।
ఈశ్వరేణ తదిచ్ఛాతః తదా శీతాత్మ కోఽ భవత్ । 78

తతః శశామ దహనః కృత్యాసాచ తిరోదధే ।
జహృషుశ్చ ద్విజాస్తప్తాః సుధయేవసముక్షితాః ॥ 79

తతః ప్రహ్లాదమాశీర్భిః అభినంద్యపురోహితాః ।
దైతేయాభ్యాశ మాగత్య తస్థుర్లజ్జానతాననాః ॥ 80

సోఽపిఖిన్నోఽథ ధూర్తాగ్ర్యో దృష్ట్వా కృత్యాం తథావిధామ్ ।
మాయీ స్వంపుత్ర మానాయ్య ప్రణతం ప్రాహ హృష్టవత్ । 81

మాయయా ప్రహ్లాద సకలా వేత్సిత్వం సయువాధికః ।
యన్నిర్జితా మహాకృత్యా.పుత్ర! బ్రహ్మబలోత్థితా ॥ 82

అవతరించుచున్నాడని యెరుగవలయును. భగవంతునకు తానుదాసుడనని గుర్తింపక పోవుటయే వానిదుఃఖములకు మూలము. గుర్తెరుగుట మాయనుండి విడివడుటయే అగును. భగవత్పరతంత్రులైన ద్విజులు, తాము హిరణ్యకశిపునకు పరతంత్రులమని భావించుట వలననే వారికీపాట్లని తాత్పర్యము. 75

'సర్వనియామకుడవగు నీవు సర్వత్ర వ్యాపించియున్నావని వేదములు చెప్పు చున్నవి. కావున నీసర్వవ్యాపిత్వమును సత్యమొనర్చి మంత్రాగ్ని పీడితులగు విప్రులనేడు రక్షింపుము.' 76

అంతట ప్రహ్లాదునిచే ప్రార్థింపబడిన భగవానుడగు శ్రీహరి ప్రసన్నుడై ఆ బ్రాహ్మణుల దేహమందుగల యగ్నిని మిక్కిలి చల్లబడునట్లు చేసెను. 77

సృష్టిదశలో ఉష్ణస్వభావము కలదిగా ఆభగవానుని చేతనే సృజింప బడినయగ్ని, ఆపరమేశ్వరుని సంకల్పముచే చల్లదనము కలదిగానైనది. 78

అంతట నాయగ్నిచల్లబడెను. కృత్యాశక్తికూడ అంతర్ధానమును పొందినది. అమృతముచే నభిషిక్తులైనట్లు తప్తదేహులగు ద్విజులుసుఖానుభవము నొందిరి. 79

పిమ్మట ప్రహ్లాదుని ఆశీస్సులచే పలువిధముల కీర్తించినవారై పురోహితులు హిరణ్యకశిపునికడకు వచ్చిసిగ్గుచే వంచబడిన శిరస్సులుకలవారై నిలువబడిరి. 80

ఆసురం నో బలం శ్రేష్ఠం బలాద్ బ్రాహ్మ్యదపి స్ఫుటమ్ ।
ప్రత్యక్షమద్యతేదృష్టం యత్ కృత్యానాశితా త్వయా ॥ 83

మమాత్మజత్వమాత్రేణ తవాభూదీదృశం బలమ్ ।
సదాచారం భజస్వాతో బలీ భూయో భవిష్యసి ॥ 84

వైష్ణవాసురయోః శక్త్యోః ప్రదర్శయితుమంతరమ్ ।
మయా నియుక్తా స్త్వయ్యేతే సర్వేవిప్రాహి వైష్ణవాః ॥ 85

శస్త్ర సర్పాగ్నిదిగ్దన్తి వృషకృత్యాది భిర్నహి ।
సహజం నోబలం నశ్యేద్, బహుమన్యస్వ రాక్షసాన్ ॥ 86

ఇత్యుక్తో నికృతిజ్ఞేన ప్రహ్లాదః సస్మితం సుధీః ।
జగాద ప్రాంజలి ర్దేవం కిం మాం మోహయసి ప్రభో ! ॥ 87

ధూర్తులలో నగ్రగణ్యుడగు నాహిరణ్యకశిపుడును మిక్కిలి ఖేదమును పొందిన వాడై కృత్యాశక్తియట్లు నిర్వీర్యమగుటనుచూచి, కపటబుద్ధితో తనపుత్రుని దగ్గరకు రప్పించి, ముందర శిరసువంచి నిలుచుండిన పుత్రునితో సంతసించిన వానివలె నిట్లు పల్కెను. 81

'ఓ పుత్రుడా! ప్రహ్లాదా! యౌవనముచే నతిశయించిన వాడవగు నీవుసమస్త మాయలను ఎరుగుదువు. ఏట్లన, బ్రాహ్మణుల మంత్రమహిమచే పుట్టిన 'కృత్యాశక్తి' నీచే జయింప బడినదికదా! 82

'బ్రహ్మబలము కంటె మనఆసురబలమే స్పష్టముగ శ్రేష్ఠమైనది. ప్రబలయగు 'కృత్య' నీచేనశింప జేయబడినది కనుక నీ యాసురబలమే ప్రత్యక్షముగ చూడబడినది కదా!' 83

'నాకు కుమారుడవై పుట్టినందువలననే నీకిట్టి బలము కల్గినది. కనుక అసుర జాతికి సంబంధించిన సదాచారమునే పరిగ్రహింపుము. దాని వలననే మరల అధికబల సంపన్నుడవు కాగలవు.' 84

'వైష్ణవశక్తికిని, ఆసురశక్తికిని గల భేదమును ప్రదర్శించుటకే నాచే యీవైష్ణవ విప్రులు నీవిషయమున నియోగింపబడినారు.' 85

శస్త్రములచేతను, పాములచేతను, అగ్నిచేతను, దిగ్గజములచేతను,

మహాకుల ప్రసూతస్త్వం కింన వేత్స్యవ్యయం పరమ్ ।
బ్రూషేత్వం వైష్ణవీర్వాచో మమభావం పరీక్షతుమ్ ॥ 88

విష్ణునాభ్యబ్జసంభూతో బ్రహ్మతవ పితామహః ।
త్వం నజానాసి చేద్విష్ణుం కోజానీయాదతః పరమ్ ॥ 89

విష్ణోః ప్రభావే, దుర్ధర్షే, విశ్వాసోఽస్తిత వైవహి ।
యత్సుతప్రియ! నిఃశంకే, మయి సర్పాద్యయోజయః ॥ 90

త్వయా నియోజ్య సర్పాదీన్ విశ్వాంసంగమితోహ్యహమ్ ।
పుత్ర ప్రియత్వాత్ కృతినా, ప్రభావే దుర్జయే ప్రభోః ॥ 91

విష్ణుం త్యజేతి వదతా త్వయా హ్యుత్పాదితో గ్రహః ।
బాలోఽహం కృతినా తాత! వైష్ణవే పథి శిక్షితః ॥ 92

వృషభములచేతను, కృత్యాశక్తిచేతను మనదగు సహజసిద్ధమైన ఆసురబలము నశింపదు. కనుక, రాక్షసుల గౌరవింపుము.' 86

'ఇతరుల కపకారమొనర్చుట లెస్సగా నెరిగిన యా హిరణ్యకశిపునిచే ఈ విధముగ చెప్పబడిన ధీశాలియగు ప్రహ్లాదుడు 'తండ్రీ! నన్నేల మోహపుచ్చెదవు? అని వినమ్రశిరస్కుడై నమస్కరించుచు పలికెను.' 87

'మహాకులమున బుట్టిన నీవు అవ్యయుడగు నాపరమాత్మను తెలియజాలవా? కేవలము నా మనోభావమును పరీక్షించుటకే నీవిట్లు వైష్ణవ వాక్కుల పలుకుచున్నావు.' 88

'మహావిష్ణువుయొక్క నాభికమలమున బుట్టిన చతుర్ముఖ బ్రహ్మనీకు తాత యగును. విష్ణువును నీవెరగనిచో ఇంతకంటె విశేషముగ నెవ్వడెరుగగలడు ?'89

'పరులకు ప్రధర్షణీయముకాని విష్ణుప్రభావమున నీకేపరిపూర్ణమగు విశ్వాసమున్నది కదా! ఏలన, సుతప్రియుడవగు తండ్రీ! విష్ణువునందు విశ్వసించి నిఃసంకోచముగనున్న నాయందు ఘోర సర్పాదుల ప్రయోగించితివి. 90

'పుత్రునిపట్ల ప్రీతిగల నిపుణుడవగు నీచే, సర్పాదులు ప్రయోగింపడుటద్వారా, నేను దుర్జయమగు శ్రీహరి మహిమయందు అచంచలమగు విశ్వాసమును పొందింపబడితిని.' 91

ఇతః పరంనహిత్యక్ష్యే విష్ణోః పశ్యన్ స్మృతేః ఫలమ్ ।
పరం మోక్షస్త్వవధ్యత్వం కృత్యాదేర్నాంతరీయకమ్ ॥ 93

యథామృతార్థం యతతాం సురాణామబ్ధి మంథనే ।
పారిజాతాది కాన్యాసన్ ఫలాన్యప్రార్థితాన్యపి ॥ 94

ఏవం మోక్షైక చిత్తానాం యతతామీశ సంస్మృతౌ ।
భవన్తి సిద్ధయోదివ్యాః పుణ్యాత్ పుణ్యతరం హియత్ ॥ 95

తాభిస్తుష్యత్యల్పచిత్తో నతుష్యతి మహామతిః ।
లభతే సత్ఫలం ముక్తిం సుధాం సురపతిర్యథా ॥ 96

కించాత్రాతిప్రపంచేన? దృష్టంతాత! త్వయాప్యదః ।
యదస్మ్యధృష్యః కేనాపి విష్ణు స్మరణ రక్షితః ॥ 97

'విష్ణువును విడువుమని పల్కిన ధన్యుడవగు నీచే నాయందు అభినివేశమే పుట్టింపబడినది. బాలుడనగు నేను తండ్రీ! వైష్ణవ మార్గముగ లెస్సగ శిక్షింపబడితిని.' 92

'విష్ణు సంస్మరణమునకు గల ఫలమును చూచిన తరువాత ఇకముందు దానినెంత మాత్రము విడువను. విష్ణు స్మరణమునకు మోక్షమే సర్వోత్కృష్టఫలము. ఇక కృత్యాదులచే చంపబడకపోవుట యనునది నడుమగల సాధారణ ఫలమేతప్ప విశేషము ఎంత మాత్రము కాదు.' 93

'పాల సముద్రము నుండి యమృతమును మధించిన దేవతలకు తాముకోరకున్నను పారిజాతము, కామధేనువు మున్నగు అనర్ఘములైన ఫలములు లభించినవి కదా!' 94

'పుణ్యము కంటె మిక్కిలి పుణ్యమైన మోక్షఫలమందు మాత్రమే మనస్సుకలవారై శ్రీహరి స్మరణమున నెవ్వరు ప్రయత్న మొనర్చుచున్నారో వారికి దివ్యములైన సిద్ధులు కలుగుచున్నవి.' 95

'అల్పమతియగు వాడీసిద్ధులచేతనే పరితృప్తుడగును. ఉత్తమ మతియైన వాడు మాత్రము ఈ సిద్ధులవలన పరితుష్టిని చెందడు. దేవేంద్రుడు కేవల మమృతమును పొందినట్లు, సత్ఫలమగు ముక్తినే పొందుచున్నాడు.' 96

మహిమా త్రిజగత్కర్తురచిన్త్య ఇతినిశ్చితం ।
మనస్తదేవ జానాతి వాచాన్యద్వదసి చ్ఛలాత్ ॥ 98

తద్వాక్యస్య మహారాజ! త్వన్మనో నైవ తుష్యతి ।
నమయాత్రోత్తరందేయం తుష్టేమనసి పృచ్ఛమామ్ ॥ 99

మనస్య రూఢమూలావాక్ వాగ్మినోఽపిసశోభతే ।
లతేవచ్ఛిన్న మూలాంతం నవదన్తి మనీషిణః ॥ 100

ఆత్మాహి దైవతం పూర్వమ్ ఆత్మానా నిశ్చితం హితమ్ ।
పశ్చాద్వాచా వదేద్ధీమాన్ ఆత్మచౌరస్తతో ఽన్యథా॥ 101

'తండ్రీ! విస్తరించి చెప్పవలసినదేమున్నది ? దీనినంతటిని నీవేచూచితివి కదా! ఏలన, కేవలము శ్రీహరి సంస్మరణముచేతనే, ఇతరులకెవ్వరకు తిరస్కరింప దగనివాడనై రక్షింపబడితిని కదా!'

97

ముల్లోకములకు సృష్టికర్తయైన శ్రీహరియొక్క మహిమ చింతింప నలవికానిదనుట నిశ్చయమే. మనస్సీవిషయము నెరుగును. కానిమాటతో వేరుగ కపటముననేల పల్కుదువు?

98

ఓ మహారాజా! ఆమాటకు నీ మనస్సు తుష్టిని పొందుటలేదు. నేనిక్కడ సమాధానింపవలసిన దేమియులేదు. నీ మనస్సు పరితుష్టిని పొందినప్పుడు మాత్రమే నన్ను ప్రశ్నింపుము ?

99

మనస్సున బాగుగ కుదురుకొననిమాట ఎంతటి మాటకారికైనను అందగించదు. మూలముతెగిన లతవంటిదగు అట్టిమాటను బుద్ధిమంతు లెవ్వరును నుడువరు. '

100

ఆత్మయే మొట్టమొదటి దైవము. ఆత్మచే నిశ్చయింపబడిన హితమునే బుద్ధిశాలియగువాడు తరువాత వాక్కుచే నావిష్కరింపవలయును. అట్లుకానిచో నాతడు తనను తాను మ్రుచ్చిలినవాడేయగును.

ఇది దీని యభిప్రాయము. ప్రతివానికిని ఆత్మయనునది మొట్టమొదటిగా ప్రమాణముగ పరిగ్రహింపదగినది. విశ్వసింపదగినది. కనుకనే దైవతమని చెప్పబడినది. కనుక'ఆత్మ' దేనిని తనకు హితమును కల్గించునదని నిశ్చయించునో దానినే బుద్ధిశాలియగు

యద్వాక్యస్తేఽపరాధోఽత్రచ్ఛలమాత్సర్యయో రయమ్ ।
స్వభావో విష్ణుకృతయోః హృత్ స్థాదన్యద్యదుచ్యతే ॥ 102

త్వం విష్ణుమాయా సంవీతః ఛలమాత్సర్యవంచితః ।
విష్ణోః పరోఽస్మీతివృథా వదస్యజ్ఞానమోహితః ॥ 103

చరాచర జగద్యన్త్ర ప్రవర్తకమగోచరమ్ ।
అవిద్యాన్ధాః కథం మర్త్యాస్తాత! విష్ణుం భజన్తితమ్ ॥ 104

అనన్య మనసస్త్వేనం యేభజన్త్యనిశం బుధాః ।
తేభజన్త్యంజసా విష్ణుం భక్తజేయోహి స ప్రభుః ॥ 105

వాడు మాటలచే నావిష్కరింపవలయును. అట్లుకాక, ఆత్మచే హితముగా నిశ్చితముకాని దానిని పల్కినచో అదికేవలము పెదవులపైమాటయే అగునుగాని హార్దముకాదు. ఇట్టి పైపైమాటలను అనగా ఆత్మసమ్మతములును హితకరములు కానివియునగు మాటలను పలుకువాడు తనను తాను దొంగిలించుకొనుచున్నాడనియే భావింపవలయును. శ్రీమద్భారతమున నీ విషయమే ఈక్రింది శ్లోకమున స్పష్టపరుపబడినది. (ఆది. ప. 748 శ్లో 27)

'యోఽన్యథా సన్తమాత్మానమన్యథా ప్రతిపద్యతే ।

కింతేననకృతం పాపం చౌరేణాత్మాపహారిణా ॥'

'ఒక విధముగనున్న తనను, తాను వేరొక విధముగ భావించుకొనువాడు తనను తాను దొంగిలించు కొనుచోరుడే. అట్టివాడే పాపమొనర్చినవాడు కాడు?' అనగా ఆత్మ సమ్మతమగు నభిప్రాయమును వేరుగ కల్పించుకొనువాడు ఆత్మను దొంగిలించు కొనువాడేననియు, వాడొనర్చు ఈఆత్మాపహతి పాపమునకు ప్రతికారములేదని యభిప్రాయము. 101

'అయినను, నీదోషమేమున్నది? ఇచ్చట శ్రీహరి మాయా కల్పితములగు కపటము, మాత్సర్యము అను దోషములవలన నేర్పడిన స్వభావమే ఇది. కనుకనే హృదయమందుగల అభిప్రాయము కంటె వేరుగ పల్కుచున్నావు!' 102

'నీవు విష్ణుమాయతో పరీతుడవై కపటము మాత్సర్యము అనుదోషములచే వంచింపబడి, విష్ణువుకంటె వేరైనవాడినని అజ్ఞానమోహితుడవై వ్యర్థముగ పలుకుచున్నావు.' 103

అనిష్టమపి తే తాత! హితమేత దుదీరితమ్ ।
సర్వదైత దనహ్యం చేన్నాతో వక్ష్యామి కించన । 106

ఇతివైష్ణవ వాక్యాని హిరణ్యకశిపోర్మనః ।
దుష్టం నవివిశుః శిష్టాః పతితస్యేవ మందిరమ్ । 107

ప్రహ్లాదోక్తిపయః పానప్రవృద్ధః క్రోధ దుర్విషః ।
అవిద్యావ్యాలదష్టోఽసౌ దైత్యోభృశమతప్యత । 108

అథ క్రోధమహావేగ విస్మృతార్యాక్షన శ్రమః ।
వైష్ణవం సర్వథాఽవధ్యం హన్తుం తం క్లిశ్యతిస్మసః । 109

'అవిద్యకు వశపడి మోహాన్ధులైన నరులు సమస్త చరాచర ప్రపంచ యంత్రమును నడపించువాడును, ప్రాకృతములగు చక్షురాదీంద్రియములకు తెలియరానివాడును అయిన మహావిష్ణువును ఎట్లు సేవింపగలడు ? ' 104

'ఎవ్వరు, ఇతర దేవతలయందు మనస్సునుంచక కేవలమా శ్రీహరియందు మాత్రమే మనస్సును నిలిపి, ఆరాధించుదురో, వారే ఋజువుగ శ్రీహరిని భజించుచున్నారు. కేవల మట్టి అనన్య భజన పరులగు భక్తులచే మాత్రమే ఆదేవదేవుడు వశపరచు కొనదగి యున్నాడుకదా! 105

'తండ్రీ! నీకిది సమ్మతముకాకపోయినను మేలును కల్గించు నదికనుక చెప్పితిని. ఈ మాటనీకు ఎంతమాత్రము సహింపరానిదైనచో, ఇంతకంటె వేరుగ ఏమియు చెప్పజాలను. ' 106

ఈ విధముగ విష్ణుభక్తి పరాయణుడగు ప్రహ్లాదునిచే పలుకబడిన మాటలు, పతితజనుని గృహమున శిష్టజనులు ప్రవేశించనట్లు, హిరణ్యకశిపుని దుష్టమనస్సున ప్రవేశింపలేదు. 107

ప్రహ్లాదుని మాటలనెడి పాలత్రావి పెరిగిన క్రోధమను దుష్టవిషముతో కూడిన, అవిద్యా సర్పముచే కరువబడిన యా హిరణ్యకశిపుడు మిక్కిలి పరితాపమును పొందెను. 108

ప్రాసాదశిఖరేతిష్ఠన్ నిజాసన మహోన్నతే ।
సంభ్రమాదసుర స్తస్మాదధః పుత్రమపాతయత్ ॥ 110

స్థగితార్కపథాద్ధీరః ప్రాసాదాత్సంపతన్నధః ।
అసంభ్రమోఽవ్యయం విష్ణుం సోఽహమస్మీత్య చింతయత్ ॥ 111

సర్వోపాధి వినిర్ముక్తశ్చిదానంద మయః తదా ।
నవివేద నిజందేహం వ్యథతే సకథం? క్వవా? ॥ 112

అథసర్వత్రగో వాయుస్తంశ నైరవ తార్యయత్ ।
దధార భగవద్భక్తం స్పర్శాద్వాంఛన్ పవిత్రతామ్ ॥ 113

పిమ్మట, నాహిరణ్యకశిపుడు క్రోధముయొక్క మహావేగమువలన తరువాత పొందనున్న శ్రమమును మరచిపోయినవాడై ఎంతమాత్రము వధార్హుడుకాని యా వైష్ణవుడగు ప్రహ్లాదుని చంపుటకు మిక్కిలి క్లేశము ననుభవించెను. 109

తనయాసనము కంటె చాల ఎత్తుగానున్న భవనపు పైభాగమునుండి వేగముగ నాహిరణ్యకశిపుడు కుమారుడగు ప్రహ్లాదుని క్రిందకు పడద్రోసెను. 110

సూర్యుని మార్గము నడ్డగించుచున్న ఆమహాభవనము నుండి క్రిందకు పడుచున్న ఆప్రహ్లాదుడు తనను తాను శ్రీమన్నారాయణాత్మకునిగా భావించి అవ్యయుడగు శ్రీహరినే చింతించెను. 111

ప్రాకృతములు పరిచ్ఛిన్నములునైన ఎట్టి యుపాధులు (దేహాదులు) లేనివాడై కేవల చిదానంద స్వరూపుడగు పరమాత్మను అంతర్యామిగా కల్గిన యాప్రహ్లాదుడు తనదేహమును తానేఎరుగ జాలడయ్యెను. ఇంక ఎట్లు, ఎచ్చట నాతడు బాధచెందును?

నిరంతర శ్రీహరి చింతనా పరుడైన ప్రహ్లాదుని హృదయమున అప్రాకృత దివ్యమంగళ విగ్రహముతో కూడిన శ్రీమన్నారాయణుడు అంతర్యామియై సాక్షాత్కరించెను. అంతట నాతని మనస్సు, దేహము సర్వము శ్రీహరిమయమైనది, కనుక తనదేహమును, శ్రీహరికంటె తాను, వేరుగ తెలియజాలడయ్యెను. సర్వము శ్రీహరిమయముగా భాసించుచున్నప్పుడిక నాతనికిదేహమున పీడ ఎంతమాత్రము స్ఫురింపదయ్యెనని తాత్పర్యము. 112

తంధృతం త్రిజగద్భర్తుర్భక్తం ధన్యేన వాయునా ।
అధః శిలాతలం భిత్వా దర్తుమాగాద్వసుంధరా ॥ 114

ఉద్ధృతా ఆదివరాహేన దివ్యరూపధరా ధరా ।
తద్భక్తం సాప్రియం దైత్యం తం కరాభ్యామ ధారయత్ ॥ 115

స్థాపయిత్వాతు తం దేవీ ప్రహ్లాదం ప్రణతం మహీ ।
విష్ణుప్రియం సముత్థాప్య ప్రాహ పుణ్యాభిభాషిణీ । 116

ఇది నారదీయే హరిభక్తిసుధోదయే ప్రహ్లాదచరితే ద్వాదశోధ్యాయః ॥

అంతట సర్వత్ర వ్యాపించియున్న వాయువు ఆ బాలకుని మెల్లమెల్లగా క్రిందికి దించెను. ఆతని శరీరమును స్పృశించుటవలన తానుపవిత్రతను పొందగోరి భగవద్భక్తుడగు నాప్రహ్లాదుని తాను ధరించెను. 113

త్రిలోక భర్తయగు శ్రీహరి యొక్క భక్తుడును వాయువుచే మోయబడిన వాడును అగు ప్రహ్లాదుని ధరింపనెంచి క్రింది భాగమున శిలాతలమును ఛేదించుకొని మేదిని పైకి పొడ సూపెను. 114

ఆదివరాహముచే ఉద్ధరింపబడినదై దివ్యమగు రూపమును ధరించిన పృథివి శ్రీహరి భక్తుడగుటచే ప్రేమాస్పదుడగు నా ప్రహ్లాదుని తన కరములచే ధరించెను. 115

వినమ్రుడగు నా ప్రహ్లాదుని కుదురుగా నిలిపినదై, భూదేవి విష్ణువునకు ప్రేమాస్పదుడైన ఆదైత్యబాలకుని పైకి నిలుచుండ బెట్టి పుణ్యభాషణము నొనర్చు నదై యిట్లనెను. 116

ఇది నారదీయ పురాణాంతర్గతమగు హరిభక్తిసుధోదయమున గల

ప్రహ్లాద చరితమున పండ్రెండవ యధ్యాయము.

# త్రయోదశాధ్యాయము

**త్రయోదశాయాధ్యాయసారము :** ఈ యధ్యాయమున భాగవతోత్తముడగు ప్రహ్లాదుడు రాక్షసులచే శిలపై బడ వేయబడిన వాడయ్యును ఎట్టి గాయములు లేక యుండుటయు ఆతనికి భూదేవి దర్శనమిచ్చి ఆతనిని కీర్తించుటయు, అక్షత దేహుడైన ప్రహ్లాదుని జూచి విస్మయపడిన దైత్యులజూచి శంబరుడను మాయావి తనమాయచే ప్రహ్లాదుని పీడింపనుద్యమించుటయు, మహా మాయావియగు శ్రీహరిని హృదయమందు సేవించుచున్న ప్రహ్లాదుని శాంబరమాయలేమియు చేయజాలకపోవుటయు, తానుసృజించిన మాయలచే తానే పరాభూతుడై శంబరుడు పారిపోవుటయు, ప్రహ్లాదుడామాయల నుపశమింపజేయుటయు, తరువాత 'శోషకుడ' ను రాక్షసుని ప్రేరించగా నాతడు ప్రహ్లాదుని తనువున తనంతతానే ప్రవేశించి జీర్ణించి పోవుటయు, ఈ విషయము నెరిగి యారాక్షసుని భార్య విలపించుచు, హిరణ్యకశిపునకు నివేదించుటయు, పిమ్మట మరల గురుగృహమునకు ప్రహ్లాదుని తోడ్కొని పోవుటయు, అక్కడ దృఢములగు నాగపాశములతో బంధించి ప్రహ్లాదుని సముద్రమున పడద్రోయుడని హిరణ్యకశిపుడాజ్ఞాపించగా వారట్లేచేయ, గరుడునిచే నాగపాశ భక్షణము, సముద్రునిచే, ప్రహ్లాద రక్షణము చేయ బడు టయు, సముద్రుడు, ప్రహ్లాదుని స్తుతించి రత్నముల నిచ్చుటయు వర్ణింపబడినది.

ఈ అధ్యాయమున గూడ వెనుక అధ్యాయము నందువలెనె, నిరంతర భగవద్ధ్యాన పరాయణులై భగవానుని శరణుజొచ్చిన వారిని భౌతికములగు క్లేశములెంతమాత్రము దుఃఖకారణములు కావనియు, తనకు ప్రకృతియైన మాయనధిఃకరించిన సర్వమాయావియగు శ్రీహరిని హృదయమున భావించు వారిపట్ల లౌకిక క్షుద్రమాయలు ఎంతమాత్రము పనిచేయవని నిరూపింపబడినది. శ్రీభూమి, సాగరుడు స్వయముగ ప్రహ్లాదుని కీర్తించుట. భాగవతోత్తముల మాహాత్మ్యమునకు ప్రత్యక్షతార్కాణము. భాగవతోత్తముల మోసినందువలననే ధరిత్రీభారము సహింప దగినదగుచున్నది. మహానుభావుల దర్శన, స్పర్శన , భాషణాదులే సర్వపావన కరములని ఇక్కడ నిరూ పింపబడినది.

శ్రీ ధరణ్యువాచ -
ప్రహ్లాద! పుణ్యోఽసి వసుంధరాహమ్
ప్రోష్టక్షితుం త్వాం విధృతిచ్ఛలేన ।
స్పృష్టం కరాభ్యాంచ పవిత్రగాత్రం
బిభర్తినత్వాం ప్రభురేవ మాంచ । 1

అక్ష్ణోః ఫలం త్వాదృశ దర్శనంహి
తన్వాః ఫలం త్వాదృశ గాత్ర సంగః ।
జిహ్వాఫలం త్వాదృశ కీర్తనం హి
సుదుర్లభా భాగవతాహి లోకే । 2

ప్రక్షాల్య మానాపినదీ సహస్రైః
సదా, న, తుష్యామి పవిత్రతోయైః
భూయః కృత ఘ్నాఘ శతాశ్రయాహం
సు నిర్మితాత్వద్య తవాంగ సంగాత్ । 3

శ్రీధరణీదేవి ఇట్లు పల్కినది. ఓ ప్రహ్లాదుడా! నీవు పుణ్యాత్ముడవు. నేను భూదేవిని ఉద్ధరించుట యనువ్యాజమున నిన్నుచూచుటకై వచ్చితిని. నీ పవిత్ర శరీరమును స్పృశించితిని. ప్రభువగు శ్రీహరియే నిన్నును నన్నును ధరించుచున్నాడు. 1

నీ బోటి మహానుభావుల దర్శించుటయే యీకన్నులున్నందుకు ఫలము. నీ బోంట్ల శరీరమును స్పృశించుటయే శరీరమున్నందుకు ఫలము. నీ బోంట్ల కీర్తించుటయే నాలుక కల్గినందులకు ఫలము. నీవంటి భాగవతోత్తములు లోకమున లభింపరు కదా! 2

వేలాది నదులచే కడుగబడిన దానినైనప్పటికిని, ఆ పవిత్రనదీజలములచే, నేను పరితుష్టిని పొందను. మరల మరల కృతఘ్నుల పాపశతములచే చుట్టువారినదాననై నీ శరీరమును స్పృశించి నందుననే నేడు నిర్మలత్వమును పొందితిని. 3

పూర్వము యజ్ఞవరాహస్వరూపుడగు శ్రీమన్నారాయణుని స్పర్శచే కల్గిన

శక్తిః పురాయజ్ఞవరాహ సంగా
ద్వివ్యాప్తిమే సాచ చిరాభి భూతా ।
త్వత్ స్పర్శనాదద్య పుర్నవాభూ
ద్భర్తుం సమర్థా స్మ్యపిలోక కోటీః ॥ 4

ఏతావతా మేసఫలః శ్రమోఽస్తు
సమస్తమేత ద్భువనం దధత్యాః ।
యస్త్వాదృశా భాగవతాశ్చరన్తి ।
ద్విత్రైః పదైర్మాం సకలాం పునన్తః ॥ 5

యత్ త్వాదృశాన్ భాగవతాన్ బిభర్మి
విష్ణోస్తథార్చ్యాం, తులసీంచ పుణ్యామ్ ।
ప్రీత్యానయా మాం శిరసా బిభర్తి
సశేషరూపీ సతతం పరేశః ॥ 6

అహోకృతార్థః నితరాం నృలోకః
యస్మిన్స్థితో భాగవతోత్తమోసి ।
స్పృశన్తి పశ్యన్తి చయే భవన్తం
భవాంశ్చ యాంస్తే హరిలోక భాజః ॥ 7

నాదివ్యశక్తి, చాలకాలమునుండి మరుగున పడిపోయినది. ఈనాడు నీ స్పర్శచేనాశక్తి నూతనమై స్ఫురించుచున్నది. కనుక, నేడు కోట్లకొలది జనులను ధరింపగల సామర్థ్యము నాకు కలదు. 4

ఇంతటితో ఈ సమస్త భువనములను ధరించుచున్న నాపరిశ్రమము సఫలమగును గాక! ఏలన, నీ బోటి మహానుభావులగు భాగవతోత్తములు సంచరించుచు రెండు మూడు అడుగులతోడనే నన్ను సంపూర్ణముగ పవిత్రమొనర్చుచున్నారుకదా! 5

నేను శ్రీమన్నారాయణుని అర్చామూర్తిని పావనమగు తులసిని నీబోటి పరమ భాగవతోత్తములను భరించుచున్నాను. కనుకనే, ఈ విషయమున ప్రీతిగొన్న యా శేషరూపుడగు ననంతుడు నిరంతరము నన్ను శిరస్సుతో మోయుచున్నాడు. 6

త్వయ్యత్ర యాతే విషయోఽన్తకస్య
హ్రాసంగతో వృద్ధిమనన్తలోకః ।
త్వత్కీర్తనాలోకనధూతపాపాః
సర్వేహి లోకా హరిలోక భాజః । 8

పాపైక మిత్రం కలిరేతి చిన్తాం
వృద్ధిం భజష్యే ఽత్ర కథం స్వకాలే ।
ప్రహ్లాదనామ్నో భగవత్ప్రియస్య
పుణ్యాకథా స్థాస్యతి యావదత్ర 9

నాహం సమర్థా భగవత్ప్రియాణాం
వక్తుం గుణాన్ పద్మభువోఽప్యగణ్యాన్
భవత్ప్రభావం భగవాన్ హి వేత్తి
యథా భవన్తో భగవత్ ప్రభావమ్ । 10

పితా తవాయం బత మూర్ఖముఖ్యో
నవేత్తి తే తత్త్వ మచింత్యశక్తేః ।
యేత్వాం స్మరిష్యన్త్యమలం నతేఽపి
కైశ్చిత్ ప్రధృష్యా త్వయి కాకథాస్యాత్ । 11

భాగవతోత్తముడవగు నీవేలోకమున నుంటివో, ఆ నరలోకము మిక్కిలి ధన్యమైనది కదా! ఎవ్వరు నిన్ను స్పృశించుచు, చూచుచుందురో, నీవెవ్వరిని స్పృశించుచు, చూచుచునుందువో అట్టివారే గోలోకార్హులగుదురు కదా! 7

నీవీపుడమిపై పుట్టగనే యమునికిగల విషయము క్షయమును పొందినది. (అనగా యముని బారిపడువారు తరిగిపోయినారని తాత్పర్యము. ) అనన్తుడగు శ్రీహరియొక్కలోకము వృద్ధిచెందినది. ఏలన, నిన్ను కీర్తించుట దర్శించుట మున్నగు వాటిచే పాపములపోద్రోలిన వారగు సమస్త లోకులును శ్రీహరి లోకమును పొందుచున్నారు కదా! 8

పాపాత్ములకు మాత్రమే మిత్రుడగు కలిఇట్లు మిక్కిలి చింతింపసాగెను.

నవేత్త్యసౌ, భాగవత ప్రభావం
యదంఘ్రిజా రేణు కణాః స్మరన్తః ।
రక్షః పిశాచ గ్రహ భూతరోగాన్
వజ్రోపమాన్ దిక్షు విలాపయన్తి । 12

పితాపి తేఽఘాంబునిధిం సదాహి
ప్రవర్ధయన్ మజ్జతి నైవ తత్ర ।
త్వం హ్యస్య పాపార్ణవ బాడబాగ్ని
ర్గృహే స్థితః తచ్చ నవేత్తి దైత్యః । 13

పాపాత్మకోఽప్యేష భవత్ప్రసాదాత్
నిస్తీర్ణపాపో భవితా కృతార్థః ।
హనిష్యతే హ్యేన మనన్తరూపః
స్వయం హరిర్భాగ భవాయ భూయః । 14

'ప్రహ్లాదుడను పేరుగల భగవత్ప్రేమాస్పదుడగు భాగవతోత్తముని పుణ్యకథ ఎంతవరకీ లోకమున నుండునో అంతవరకు నేను నా కాలమున (కలికాలమున) వృద్ధి నెట్లు పొందగలను? ' అని. 9

భగవత్ప్రియులగు మీకు చెందిన అసంఖ్యాకములగు గుణముల లెక్కింప నేను సమర్థురాలను కాను. అట్లే బ్రహ్మయు సమర్థుడు కాడు. మీ ప్రభావమును భగవాను డెరుంగును. భగవత్ప్రభావమును మీరెరుంగుదురు. 10

ఊహింప నలవికాని శక్తిగల నీప్రభావమును, (తత్త్వమును) మూర్ఖశిరోమణియగు నీతండ్రి తెలియజాలడు. ఎవ్వరు అమలుడవగు నిన్నుస్మరింతురో వారును అన్యులచే తిరస్కరింప బడజాలరు. ఇక నీవిషయమున చెప్పవలసిన దేమున్నది? 11

ఆహిరణ్యకశిపుడు భగవద్భక్తుని మహిమనెరుగ జాలడు. ఆ భాగవతోత్తముని పాదముల నంటిన ధూళి కణములు గూడ ఆ భాగవతోత్తములను మహామహిమను స్మరించుచున్నవై, వజ్రములతో సమానములైన రాక్షస - పిశాచ - గ్రహ - భూత - రోగములను దిక్కులలో కలిపి జారిపోవుచున్నది.

అచేతనములగు పాదరజః కణములకుగల భాగవతమహిమస్మృతి, చేతనునకు లేకపోవుట శోచనీయమని తాత్పర్యము. 12

ప్రహ్లాద! యాస్యామి పరేశవక్షః
చిరాయమాం పారయ సంచరం స్త్వమ్
ఏతే భవత్పాతన సంభ్రమేణ
హ్యాయాన్తి దైత్యాః శతశః సమన్తాత్ । 15

ఉక్త్వేత్యలక్ష్యా ధరణీ పరైః సా
జగామదేవీ ప్రణతాచతేన ।
స్తుతా చహర్షాత్ సముదీక్షమాణా
పునః పునర్భాగవతం తమేవ । 16

అథోద్భటాదైత్య భటా దదృశుః సంభ్రమాగతాః
తిష్ఠంతం తం శిలాపృష్ఠే ప్రసన్నముఖ మక్షతమ్ । 17

నీతండ్రి, మహాపాపసముద్రము నెల్లప్పుడు వృద్ధిచెందించుచుండియు తానందులోమునుగుటలేదు. దీనికి కారణము ఈతని పాపమహార్ణవమును శోషింపజేయు బడబాగ్నివగు నీ వాతనియింటనుంటివి. కాని, దానినాదైత్యుడు ఎరుగజాలడు. 13

పాపాత్ముడగు నీ తండ్రియు నీ అనుగ్రహముచే పాపమును దాటికృతార్థుడు కాగలడు. శ్రీహరి స్వయముగ అప్రమేయమగు రూపమును ధరించి మరల పుట్టువులేకుండునట్లుగ వీనిని చంపగలడు. 14

ఓ ప్రహ్లాదుడా! సర్వేశ్వరుడగు శ్రీహరి వక్షః ప్రదేశము నాశ్రయించుదును. ఇచ్చట చాలకాలము సంచరించిన నాకు వైననన్ను తరింపజేయుము. ఇదిగో! నీవు పడుటగనిఆటోపమున నలువైపులనుండి రాక్షసులుపరివిడి వచ్చుచున్నారు. 15

పరులచే దర్శింపరానిదగు నాభూదేవి ఈవిధముగ పలికి ఆతనిచే నమస్కార పురస్సరముగ స్తుతింప బడినదై, సానందముగ భాగవతోత్తముడగు ప్రహ్లాదునే చూచుచు అంతర్హితయయ్యెను. 16

అంతటి తీవ్రస్వభావులగు నా హిరణ్యకశిపుని భటులు ఆటోపమున నచ్చటికరుదెంచి, ఒకశిలపై ఎట్టి గాయములు లేక ప్రసన్నముఖముతో కూరుచుండిన ప్రహ్లాదుని చూచిరి. 17

తేభీతాస్తస్య మాహాత్మ్యాత్ దైత్యా విస్మయ కంపితాః ।
నకించి దూచుః ప్రాసాదం శీఘ్రమారురుహుస్తతః । 18

సుస్థం శశంసుః ప్రహ్లాదం రాజ్ఞే, సోఽథ భయాకులః ।
విషణ్ణ శ్చింతయా మానశంకితాత్మపరాభవః । 19

కోఽయం పుత్రరూపేణ శత్రుః కింవాచికీర్షతి ?
కథమేనం వశీకుర్యామచింత్య మహిమాస్పదమ్ ? । 20

ఇతః పరం స్వీకృతోఽపి నాపరాధాత్ క్షమిష్యతి ।
హన్తుంచ శక్యతేనైష తదిదం కష్టమాగతమ్ । 21

ఇతి దుష్ట ధియస్తస్య చింతాం విజ్ఞాయ శంబరః ।
దుష్టాత్మా ప్రాహ! 'కిందేవ! చింతయాత్రాదిశస్వ మామ్ । 22

ఆ ప్రహ్లాదుని ప్రభావమును జూచి భయపడి ఆశ్చర్య కంపితులైన ఆదైత్యులు మారుమాటాడరైరి. వెంటనే వేగముగ భవనము నధిరోహించిరి. 18

వారు, ఎట్టి హానియులేక స్వస్థుడై కూరుచుండిన ప్రహ్లాదుని గురించి రాజునకు నివేదించిరి. ఆతడంత భయవికలుడై దీనముగ తనకు పరాభవమును శంకించినవాడై చింతింప సాగెను. 19

'ఎవ్వరీ పుత్రరూపముననున్న శత్రువు? ఏమిచేయదలచినాడు? ఊహింప నలవికాని శక్తితో కూడిన వీనినెట్లు వశపరచుకొనగలను? 20

'ఇకముందునాచే పరిగ్రహింప బడినప్పటికిని, నేనొనర్చిన అపరాధమువలన నన్ను క్షమింపడు. ఇక వీని జంపుటకా శక్తి చాలదు. అహో! క్లిష్టదశ ఏర్పడినది కదా! 21

ఈ విధముగ దురాలోచనా పరుడగు హిరణ్యకశిపుని చింతనెరిగి, దుష్టస్వభావుడగు శంబరుడనువాడు–' ఓ రాజా! చింతింపనేల? నన్నాదేశింపుము' అని పలికెను. 22

'దేవతల చంపగల్గిన నామాయాశక్తులచే ప్రహ్లాదుడెట్లు పీడింప బడునో చూడుము. సత్యమగునీతని దైవబలము అసత్యముచేతనే నశించును.' 23

మాయాభిర్మే సురఘ్నీభిః ప్రహ్లాదం పశ్య పీడితం।
దైవ మన్యబలం సత్యమసత్యే నైవ నశ్యతి । 23

సత్యై శ్శస్త్రాది భిర్నాయం హతః సత్యబాలస్త్వయమ్ ।
నచాగ్ని రగ్నినా శామ్యేద సత్యేనైవ హన్మ్యతః । 24

సత్యం బలంహి దేవా నామ సత్యం నః పరం బలమ్।
జయాయచ బలం నైజం హానిః పరబలాశ్రయః । 25

ఇత్యస్య వచనం లబ్ధ్వా ప్రహృష్టః శంబరస్య సః ।
గర్వితం గర్వితమతిర్వరాహః కర్దమం యథా ॥ 26

అథ ప్రణమ్య రాజానం తేన చాలింగితః ప్రియాత్।
వృతో మాయిక సాహస్రైః శంబరోఽవాతరత్తతః । 27

'వాస్తవములైన శస్త్రాదులచే సత్యబాలుడగు నీతడు చంపబడలేదు. అగ్ని - అగ్నిని ప్రశమింప చేయజాలదు కదా! కనుక అసత్యము చేతనే వీనిని చంపుదును.' 24

దేవతలకు సత్యమే బలము. మనకు అసత్యము అధిక బలము. మన బలమే మనకు జయమును చేకూర్చును. పరుల బలము నాశ్రయించినచో హానియే కల్గును. 25

సూకరము (పంది) బురదను పొంది యానందించినట్లు గర్వావిష్టచిత్తుడగు నాహిరణ్యకశిపుడు శంబరుని గర్వవచనమునువిని ఆనందించెను. 26

పిమ్మట రాజునకు నమస్కరించి ఆతనిచే ప్రేమపురస్సరముగా కౌగలించుకొనబడినవాడై, వేలాది మాయావులతో పరివృతుడై శంబరుడు అక్కడ నుండి ప్రహ్లాదునికడకేతెంచినాడు. 27

ఆతడు, శిలాతలముపై ఎట్టి గాయములు లేక కుదురుగ కూర్చొని యున్నవాడును, చూచువారలచే చుట్టువారి గొప్ప ఆశ్చర్యసాగరముగా కన్పట్టుచున్న ప్రహ్లాదుని చూచెను. 28

నదదర్శ మహాత్మానం శిలాయాముక్షతం స్థితమ్ ।
ప్రహ్లాదం వీక్షకజనైః వృతమాశ్చర్యసాగరమ్ ॥ 28

అథోత్సార్యజనాన్ భీమ శ్శంబరో మాయినాంపరః ।
మాయా స్ససర్జ ప్రహ్లాద వధేప్సుః సురదుర్జయాః ॥ 29

మాయాః సృజన్తం తం ప్రాహ ప్రహ్లాదః సస్మితః సుధీః ।
అహోఽతమోవికారోఽయం శంబర! త్వయివర్ధతే ॥ 30

మయి మాయాం సృజన్ దైత్యస్త్వం తావన్మాయయా జితః ।
వైష్ణవ్యా, క్రోధమాత్సర్య దర్పశిష్యోహి వీక్షసే ॥ 31

ఉక్త్వేతి మాయాపిహితం త్రిజగద్యన్త్ర మీశ్వరమ్ ।
ప్రసన్నేనైవ మనసా హృత్పద్మేసోఽస్మరద్ధరిమ్ ॥ 32

శంబరేణ తతస్సృష్టాః పేతురంగార వృష్టయః ।
సహసాశూల వజ్రాసి శక్తిచక్రాది మిశ్రితాః ॥ 33

పిమ్మట గొప్పమాయావి, భీకర స్వభావుడగు శంబరుడు ప్రహ్లాదుని వధించగోరి దేవతలకు కూడ జయింప నలవికాని మాయలను సృజించెను. 29

మాయలను సృజించుచున్న ఆశంబరుని చూచి నవ్వుచు బుద్ధిశాలియగు నా ప్రహ్లాదుడు ఓయీ! శంబరుడా! ఆహా! ఈ మోహవికారమునీలో వృద్ధిచెందు చున్నదే ! అని పలికెను. 30

'ఓయీ! నాపైప్రయోగించుటకు మాయల సృజించుచున్న దైత్యుడవగునీవు క్రోధము, మాత్సర్యము, దర్పము అనువీటిచే శాసింపబడుచున్న వాడవై, వైష్ణవమాయచే స్వచ్ఛముగ నీవేపరాజితుడవై చూచుచున్నావు. 31

ఈ విధముగ పలికి, మాయచే కప్పబడిన యీ ముల్లోకములను భ్రమింపజేయు యంత్రమగు పరమేశ్వరుడైన శ్రీహరిని తనహృదయపద్మమున - విమల చిత్తముతో ధ్యానించెను. 32

పిమ్మట శంబరునిచే సృజించబడినవై శూలములు, వజ్రములు, శక్తి చక్రము మున్నగు ఆయుధములతో కలసియున్న అగ్ని వర్షములు పైనిబడినవి. 33

ప్రహ్లాద హృదయస్థోఽథమహామాయో జనార్దనః ।
అంగార వృష్టీస్తా ఏవ శంబరోపర్యపాతయత్ ॥ 34

సశంబరః స్వసృష్టాభిః మాయాభిః స్వాయమర్దితః ।
దుద్రావ సబలః ఖిన్నో భిన్నదగ్ధతనుః శ్వసన్ ॥ 35

యతో యతో ద్రవత్యేష హతసైన్యాతికాతరః
తతస్తతో భృశం ఘోరాః పేతురంగార వృష్టయః ॥ 36

దాహార్తః శరణార్థీచ సవివేశ గృహంగృహమ్ ।
అథ దగ్ధం పురంచాపి రక్షసాం వర్షవహ్నినా ॥ 37

తేషాంచ దహ్యమానానాం శ్రుత్వా క్రందం సపుణ్యధీః ।
దయయైక్షత, తద్దృష్ట్వా సర్వేఽపి సుఖినోఽభవన్ ॥ 38

ఉత్తస్థుశ్చహతాః క్లిష్టాః సర్వే ప్రహ్లాద వీక్షితాః ।
అసురా శ్శంబరముఖాః తస్థుర్లజ్జా నతాననాః ॥ 39

ప్రహ్లాదుని హృదయమందు నివసించియున్న మహామాయావియగు జనార్దనుడు ఆనిప్పుల వర్షములను శంబరునిపైననే కురిపించెను. 34

ఆ శంబరుడు తనచే సృజింపబడిన మాయలచేతానే పీడింపబడినవాడై వ్రయ్యలై దహింపబడిన శరీరము కలవాడై నిట్టూర్పుచు బలముతో పాటు పారిపోయెను. 35

సైన్యనాశముచే భీతిల్లిన యాశంబరుడు ఏయే వైపునకు పరువెత్తెనో ఆయావైపునకు భయంకరములగు నిప్పులవర్షములు మిక్కుటముగా పడినవి.36

అగ్నిపీడచే తల్లడిల్లి శరణుకోరుచు నాశంబరుడు ప్రతిగృహమును ప్రవేశించినాడు. పిమ్మట నారాక్షసుల పట్టణమంతయు అగ్ని వర్షముచే తగులబడెను. 37

అగ్నివృష్టులచే దహింపబడుచున్నవారి ఆక్రోశమును విని పుణ్యబుద్ధియగు నాప్రహ్లాదుడు కృపతోవారిని చూచెను. ఆతని కృపాదృష్టిచేతనే అందరు సుఖమును బడసిరి. 38

శంబరం దైత్యరాజంచ శపతాం, స్తువతాన్త్విమం ।
జనానామార్తి యుక్తానాం సాస్రువాచో నిరంకుశాః ॥ 40

అథో పతతస్థే రాజానం లజ్జామూకః సశంబరః ।
రాజా చావాఙ్మఖస్తస్థౌ నిశ్వాసైవ దుర్మతిః ॥ 41

తతో హిరణ్యకశిపోః మనోఽభ్రమదితస్తతః ।
అకార్య రూపే క్రోధాన్ధో భూయోఽన్యస్మిన్న పాతయత్ ॥ 42

సహి సంశోషకం క్రూరం వాయురూపం నిశాచరమ్ ।
ప్రహ్లాదస్యవధే యోగ్యం మనసాఽచింతయత్ ఖలః ॥ 43

తావ ద్ఘోరరవా కాచి ద్రుదతీ రాక్షసీ భృశమ్ ।
ఆగత్య దైత్యరాజస్య పాదయోః పతితాఽవదత్ ॥ 44

ప్రహ్లాదునిచే దయజూపబడిన వారైపూర్వము క్లేశములబడి నశించిన యా రాక్షసులు తిరిగి బ్రతికిరి. శంబరుడు మున్నగు అసురులందరు సిగ్గుచే శిరస్సుల వంచికొని మిన్నకుండిరి. 39

శంబరుని, హిరణ్యకశిపుని నిందించుచున్నవారును, ప్రహ్లాదుని స్తుతించు చున్నవారును అయిన అగ్నివర్ష పీడితులగు జనుల కన్నీటితో కూడిన మాటలు నిరంకుశములుగా (పరుషములుగా ) నున్నవి. 40

సిగ్గుచే మూగవానివలె మాటలుడిగిన యాశంబరుడు రాజును సమీపించెను. ఇకనారాజు మాటలు లేనివాడై ఖేదముతో దుర్బుద్ధియై కేవలమునిట్టూర్చెను.41

పిమ్మట నాహిరణ్యకశిపుని మనస్సు ఇటునటు భ్రమించినది. మరల నాక్రోధాంధుడగు హిరణ్యకశిపుని అకార్యమను ( చేయరాని పనియను) బావిలోనికి త్రోసినది. 42

నీచుడగు హిరణ్యకశిపుడు, దేనినైనను శోషింప (ఎండింప) జేయునట్టి వాయురూపముగానున్న శోషకుడగు రాక్షసుని, ప్రహ్లాదుని చంపసమర్థునిగా భావించినాడు. 43

హతాస్మి దాసీ దేవస్య ప్రియా శోషకరక్షసః ।
ప్రభో ప్రహ్లాద గాత్రేషు జీర్ణోమమ పతిర్హతః ॥ 45

అనాజ్ఞప్తేఽపిదేవస్య ప్రియార్థీ శోషకోఽవిశత్ ।
ప్రహ్లాదాంగాన్న నిష్క్రీర్ణః తప్తాయః సిక్తతోయవత్ ॥ 46

నజానే త్వత్సుతతనౌ కోవాస్తే పుంగ్రహః ప్రభో !
కాలకూట కటుర్యేనగ్రస్తః సంశోషకః సుఖమ్ ॥ 47

నూనం కుమార దేహస్థః పర్వతాన్ సాగరానపి ।
గ్రహానిగీర్య జరయేత్ యేన జీర్ణస్సమేపతిః ॥ 48

హతం సంశోషకం శ్రుత్వా హతాత్మ్వాశా బలాన్వితమ్ ।
విస్మయంచ విషాదంచ దైత్యరాజోఽవిశద్భృశమ్ ॥ 49

ఇంతలో భయంకరమైన కంఠధ్వని కలిగి ఏడ్చుచున్న ఒకరాక్షసి పరువున వచ్చి, హిరణ్యకశిపుని పాదములపైని బడియిట్లనెను. 44

'అయ్యో! చచ్చితిని. ఓ రాజా! నేను, దేనినైన ఎండింపగలవాడగు శోషక రాక్షసుని, ప్రియురాలను. నాభర్త ప్రహ్లాదుని యవయవముల యందు, జీర్ణించి మడసినాడు. 45

ఓ ప్రభూ! తమచే ఆజ్ఞాపింపబడకున్నను, తమకు ప్రీతిని కల్గింపవలయునను కోరిక కలవాడై శోషకుడు ప్రహ్లాదుని దేహమున ప్రవేశించి కాలిన యినుముపైబడిన నీటివలె తానేశోషించి తిరిగిరాడాయెను. 46

ఓ ప్రభూ! నీకుమారుని దేహముననే పురుషగ్రహము ప్రవేశించి యున్నదో తెలియదు. కాలకూటవిషమువలె మ్రింగనలవిగాని శోషకుడుగూడ సుఖముగ మ్రింగబడినాడు. 47

నిక్కముగ నీకుమారుని దేహమునగల యా'గ్రహము' పర్వతములను, సముద్రములనుగూడ మ్రింగిజీర్ణించు కొనగలదు. ఏలన, నాభర్తగూడ దానిచే జీర్ణించు కొనబడినాడు. కదా! 48

అంకురావస్థ ఏవాశు హృతే కృత్యే మనోగతే ।
తాం సాంత్వయిత్వా ప్రాహేదంత్వతి భీతో నిశాచరః ॥ 50

యాతు యాతు గురోర్గేహం ప్రహ్లాదః స్వకులానలః ।
అథదైత్యైర్ద్రుతం నీతో గురుగేహే అవసత్ సుధీః ॥ 51

విసృజ్య మంత్రిణః సోఽథ, శ్వసన్ రాజాఽవిశద్ గృహమ్ ।
నచ పుత్ర వధే చింతాం జహౌ స్వవధ కారిణీమ్ ॥ 52

దైత్య భృత్యై రథాభ్యేత్య ప్రార్థితో నయశాలిభిః ।
భజాత్మజం మహావీర్య మితితాన్ సోఽభ్య భర్త్సయత్ ॥ 53

ప్రహ్లాదని పీడింపగలనను ఆశతోడను, బలముతోడను, కూడిన వాడగు ఆ సంశోషకుడను రాక్షసుడు, మరణించినాడని విని హిరణ్యకశిపుడు ఆశ్చర్యమును దుఃఖమును పొందినవాడై భయావిష్టుడాయెను. 49

తనహృదయమున సంకల్పరూపమున గల ప్రయత్నము అంకురావస్థలోనే హరింపబడగా, శోషకుని భార్యను ఊరడించినవాడై మిక్కిలి భీతిల్లిన హిరణ్యకశిపు డిట్లనెను. 50

'తన వంశమునకు చిచ్చుగానేర్పడిన ప్రహ్లాదుడు గురుగృహమునకే పోవునుగాక!' యన్న హిరణ్యకశిపుని మాటలనుబట్టి బుద్ధిశాలియగు ప్రహ్లాదుడు రాక్షసులచే త్వరగా తోడ్కొని పోబడినవాడై గురుగృహముననే యుండెను. 51

అంతనా హిరణ్యకశిపుడు నిట్టూర్చుచు, మంత్రుల విడచి తనగృహమున ప్రవేశించెను. తనమరణమునకు కారణమైన పుత్రవధను గురించిన ఆలోచనను ఆతడు విడువలేదు. 52

పిమ్మట నీతిశాలురగు దైత్యసేవకులు దరిచేరి – 'రాజా! మహావీరుడగు పుత్రుని ఆదరించి పరిగ్రహింపుము.' అని ప్రార్థింపగా, వారిని హిరణ్యకశిపుడు భయపెట్టెను. 53

మరణము దాపురించిన ఆమూఢుడగు హిరణ్యకశిపుడు ఒకప్రయత్నమును

ఆసన్న మరణో మూర్ఖః కృత్యమేకం విమృగ్యసః ।
అకృత్యమేవ దేవారీన్ ఆహూయేత్యాదిశద్రహః ॥ 54

అవ్యక్తపాయాం ప్రహ్లాదం ప్రసుప్తం దుష్టముల్బణైః ।
నాగపాశైర్భృశం బద్ధ్వా మధ్యే ప్రక్షిపతాంబుధేః ॥ 55

తదాజ్ఞాం శిరసాదాయ దదృశుః తముపేత్యతే ।
హరిప్రియం సమాధిస్థం ప్రబుద్ధం సుప్తవత్ స్థితమ్ ॥ 56

అన్తః ప్రకాశసుభగాం ప్రబలాంధ్యకరీం బహిః ।
చిత్రాం సోఽభినవాం నిద్రామన్వభూద్ జ్ఞానలోచనః ॥ 57

అన్వేషించి ప్రహ్లాదునిపట్ల ద్రోహమును చేయదలచి రాక్షసుల నాహ్వానించి రహస్యముగా నిట్లాదేశించెను. 54

'ఈరాత్రి నిదురించుచున్న దుష్టుడగు ప్రహ్లాదునిలావైన నాగపాశములతో కట్టి వెంటనే సముద్రపునడుమ పడద్రోయుడు' అని - ఆదేశించెను. 55

ఆ హిరణ్యకశిపుని యాజ్ఞను శిరసావహించి ప్రహ్లాదుని కడకేతెంచి ఆతనిని చూచిరి. అప్పుడా శ్రీహరి ప్రియుడగు ప్రహ్లాదుడు సమాధినిష్ఠుడై మేల్కొని యుండియు నిదురించిన వానివలె కన్పట్టెను.

సమాధినిష్ఠుడైన యోగి ధ్యానదశలో బాహ్యేంద్రియములను లోనికి నిగ్రహించి నిదురించిన వానివలె కనుపించిననూ వాస్తవమునకాతడు తానుధ్యానించు పరమాత్మ యందు లగ్నమైన మనస్సుకలవాడై ప్రబుద్ధుడుగనే యుండును. లోకవిలక్షణమైన ఇట్టియోగియొక్క స్థితినే శ్రీగీత -

యానిశాసర్వ భూతానాం తస్యాంజాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతో మునేః ॥

అని నొడివినది. ఈ దశనే తరువాత శ్లోకమున గూడ వివరించుచున్నాడు. 56

లోపల వెలుగుచే సుందరమైనదియు, బాహ్యముగ అత్యధికమగు నంధకారమును కల్గించునదియునగు విచిత్రమైన నిద్రను అజ్ఞానవిలోచనుడగు ప్రహ్లాదుడు అనుభవించెను. ఇచ్చట బాహ్య విషయములనుండి పూర్తిగా విరమించి,

శయానస్య మునేస్తస్య యావదంతర్వ్యవర్ధతే ।
ప్రబోధస్తావదత్యర్థం బహిర్నిద్రాతివిస్తృతా । 58

సంభిన్నరాగలోభాది మహాబంధం క్షపాచరాః ।
బబంధుస్తం మహాత్మానం ఫల్గుభిః సర్పరజ్జుభిః । 59

గరుడధ్వజ భక్తంతం బద్ధ్వాహిభిర బుద్ధయః ।
జలశాయి ప్రియం నీత్వా జలరాశౌ నిచిక్షిపుః । 60

బలినస్తేఽచలాన్ దైత్యాస్తస్యోపరి నిధాయచ ।
శశంసుస్తత్ ప్రియం రాజ్ఞే, దృష్టస్తాన్ సోఽప్యపూజయత్ । 61

ప్రహ్లాదంచాబ్ధి మధ్యస్థం తమేవాగ్ని మివస్థితమ్ ।
జ్వలన్తం తేజసా విష్ణోర్గ్రాహో దూరాద్భియాఽత్యజన్ । 62

ఆతని యింద్రియములన్నియు మనస్సుతోపాటుగ అంతర్ముఖములైనవని తాత్పర్యము. 57

మౌనమును వహించి శయనించిన (సమాధిస్థుడైన) ఆప్రహ్లాదునిలోపల ఎంతగా మెలకువ (జ్ఞానదీప్తి) వృద్ధి చెందుచున్నదో - అంతగా బాహ్యముగ మిక్కిలి నిద్ర ఆతని నావహించినది. 58

రాగము - లోభము మున్నగు మహాబంధములను త్రెంచుకున్నయా మహానుభావుడగు ప్రహ్లాదుని రాక్షసులు బలహీనములగు సర్పములను త్రాళ్లతో కట్టివెచిరి. రాగాది బంధముల త్రెంచుకున్నవానిని బాహ్యబంధనములేమి చేయ జాలవని తాత్పర్యము. 59

గరుడధ్వజుడగు మహావిష్ణువునకు భక్తుడైన యా ప్రహ్లాదుని బుద్ధిహీనులగు రాక్షసులు పాములతో కట్టి., జలశాయియగు శ్రీహరికి ప్రియుడైన యాతనిని, తోడ్కొనివెళ్లి సముద్రమున పడవేసిరి. 60

బలవంతులగు నారాక్షసులు, ప్రహ్లాదునిపై పెద్దపెద్దశైలముల నుంచి ఈ ప్రియవిషయమును రాజునకు నివేదించిరి. వాడును వారిని సత్కరించెను. 61

సచాభిన్న చిదానంద సింధుమగ్నః సమాహితః ।
నవేద బద్ధమాత్మానం లవణాంబుధి మధ్యగమ్ ॥ 63

అథబ్రహ్మామృతాంబోధిమగ్నేతస్మిన్ మహామునౌ ।
యయౌక్షోభం దితీయాబ్ధి సంశ్లేషా దివసాగరః ॥ 64

శైలాన్ కేశానివోద్ధూయ ప్రహ్లాదమథ వీచయః ।
నిన్యుస్తీరం భవాంభోధే ర్గురూక్తయ ఇవాంబుధేః ॥ 65

ధ్యానేన విష్ణు భూతం తం భగవాన్ వరుణాలయః ।
విన్యస్యతీరే రత్నాని గృహీత్వా ద్రష్టు మాయయౌ ॥ 66

తావద్భగవతాదిష్టః ప్రహృష్టః పన్నగాశనః ।
తద్బంధనాహీన భ్యేత్య, భక్షయిత్వా పునర్యయౌ ॥ 67

ఆసముద్రమునడుమ వైష్ణవ తేజస్సుతో మిగుల ప్రజ్జ్వరిల్లుచున్న ప్రహ్లాదుని చెంతకు జలజంతువులు భీతితోదరిజేరక, యాతనినిదూరముగా విడచివైచినవి. 62

అభిన్నమగు జ్ఞానానంద మహావార్ధిలో సమాధిస్థుడై మునిగియున్న ఆ ప్రహ్లాదుడు తానుకట్టబడి సముద్ర మధ్యముననున్నట్లు తెలియజాలడయ్యెను. 63

పిమ్మట నామహామునియగు ప్రహ్లాదుడు పరబ్రహ్మాస్వాదరూపమగు అమృత సాగరమున నిమగ్నుడుకాగా, వేరొకసముద్రమువచ్చి చేరినందువల్లనో యన్నట్లు ఆసముద్రము క్షోభపడినది. 64

ప్రహ్లాదుని పై రాక్షసులచే నుంచబడిన పర్వతములను కేశములచెదర గొట్టినట్లు దూరముగా నెగురగొట్టి - ఆచార్యసూక్తులు శిష్యుని సంసార సాగరమును దాటించినట్లు, సముద్రతరంగములా ప్రహ్లాదుని సముద్రతీరమునకుచేర్చినవి. 65

ధ్యానవశమున విష్ణుమయత్వమును పొందిన ప్రహ్లాదుని దర్శించుటకై సముద్రుడు రత్నముల తోడ్కొని సముద్ర తీరమున కేతెంచెను. 66

ఇంతలో భగవానునిచే ఆదేశింపబడిన వాడై సానందముగ నచ్చటికేతెంచిన

అథావభాషే ప్రహ్లాదం గంభీరధ్వని రర్ణవః ।
ప్రణమ్య దివ్యరూపశ్చ సమాధిస్థం హరిప్రియమ్ । 68

ప్రహ్లాద! భగవద్భక్త! పశ్యత్వమర్ణవోఽస్మ్యహం ।
చక్షుర్భ్యా మథ మాందృష్ట్వా పారయార్థిన మాగతమ్ ॥ 69

అహో! త్వయోదితేనైత ద్రక్షసాం మలినం కులమ్ ।
చంద్రేనేవాంబరం, చిత్తం జ్ఞానేనైవా మలీకృతమ్ । 70

ఇత్యంబుధేర్గిరం శ్రుత్వా మహాత్మా సమహాత్మనః ।
ఉదీక్ష్య సహసాదేవం నత్వా ప్రాహ సురాత్మజః ॥ 71

కదాగతం భగవతా? తమథాంబుధిరబ్రవీత్ ।
యోగిన్! అజ్ఞాత వృత్తి స్త్వమపరాధం తవాసురైః । 72

గరుడుడు ప్రహ్లాదునకు బంధనములుగా నేర్పరపబడిన పాములను భక్షించి మరల తిరిగివెడలి పోయెను. 67

అంతట దివ్యరూపధారియగు సముద్రుడు గంభీరధ్వనియుక్తుడై శ్రీహరి ప్రియుడగు ప్రహ్లాదునికి ప్రణమిల్లి సమాధినిష్ఠుడగు నాతనితోనిట్లు భాషించెను. 68

భగవద్భక్తుడైన ఓ ప్రహ్లాదా! నన్నుచూడుము. నేను సముద్రుడను. కన్నులతో అర్థినై నీదరిచేరిన నన్ను తరింపజేయుము. 69

ఆశ్చర్యము ! చంద్రబింబముచే ఆకాశము ప్రకాశింప జేయబడినట్లును, జ్ఞానముచే మనస్సు నిర్మల మైనట్లును, నీవుపుట్టుటచే, మలినమైన రాక్షసవంశము నిర్మలముగా చేయబడినది. 70

ఈ విధముగా మహాత్ముడగు సముద్రుని మాటను విన్న మహాత్ముడగు ప్రహ్లాదుడు, ఆ సముద్రుని వెంటనే పరికించి, నమస్కరించి యిట్లు పలికెను. 71

'భగవంతుడగు మీరెప్పుడు వచ్చినారు?' అన్న ప్రహ్లాదుని మాటకు సముద్రుడిట్లు బదులిచ్చెను. 'ఓ యోగీ! బాహ్యవిషయముల నీవెరుగవు. నీ పట్ల రాక్షసులు అపరాధము జేసిరి.' 72

బద్ధస్త్వమహిభిర్దైత్త్యైర్మయిక్షిప్తోఽద్యవైష్ణవ !
అథాంగారం నిగీర్యైవ ప్రణీతప్తోఽస్మ్యహం భృశమ్ ॥ 73

తతస్తూర్ణమపాం తీరే న్యస్తస్త్వం ఫణినశ్చతాన్ ।
ఇదానీ మేవ గరుడో భక్షయిత్వా పునర్యయౌ ॥ 74

మహాత్మన్! అనుగృహ్ణీష్వ త్వం మాం సత్సంగ మార్థినం ।
గృహాణేమాని రత్నాని పూజ్యస్త్వం మే హరిర్యథా ॥ 75

అభ్యర్చ్యయిత్వా గోవిందం తదీయాన్నా ర్చయంతి యే
నతేవిష్ణోః ప్రసాదస్య భాజనం దాంభికా జనాః ॥ 76

యద్యప్యే తైర్నతేకృత్యం రత్నైర్దాస్యామ్యథాప్యహం ।
దీపంనివేదయన్నేవ భాస్కరాయాపి భక్తితః ॥ 77

'నీవు పాములచే కట్టబడిన వాడవై రాక్షసులచే నాయందు పడవేయ బడితివి. ఓ వైష్ణవోత్తమా! పిమ్మట అగ్నిని లోన దిగమ్రింగి నేను బాగుగతపించితిని.' 73

'తరువాత వెంటనే సముద్రపుటొడ్డున నీవుంచబడితివి. ఆపాముల నిప్పుడే భక్షించి గరుడుడు తిరిగివెడలి పోయినాడు ?' 74

ఓ మహానుభావా! సజ్జన సమాగమమును కోరివచ్చిననన్ను అనుగ్రహింపుము. ఈరత్నములను స్వీకరింపుము. శ్రీహరి యెట్లో అట్లే నీవును నాకు పూజ్యుడవు.' 75

'శ్రీహరిని అర్చించి, శ్రీహరి భక్తులగు భాగవతోత్తముల నర్చింపనివారు, విష్ణ్వనుగ్రహమునకు పాత్రులు కాజాలరు. వారు కేవలము దంభాచారపరులే అగుదురు.'

శ్రీహరి సేవనము కంటెను శ్రీహరి భక్తులసేవ బహుగుణమై భగవత్ప్రీతి కరమని తాత్పర్యము. లోకమున తామెంతో నియమనిష్ఠలు కలవారమని భావించుకొని దైవతార్చన పరులుగా నున్నవారు సహితము, అవివేకముచే తదీయారాధనమును కించపరచుచున్నారు, అట్టివారిని శ్రీహరి యెంతమాత్రము క్షమింపడు. పరమ

నిరస్యరాక్షసత్వంత్వం విష్ణురేవేతి పూజ్యసే ।
జగద్వంద్యోఽపి జాతిర్హి వైష్ణవాన్ నైవదూషయేత్ ॥ 78

త్వమాపత్స్వతి ఘోరాసు విష్ణునైవ హి రక్షితః ।
త్వాదృశా నిర్మలాత్మానో నసన్తి బహవోఽర్కవత్ ॥ 79

బహునా కిం? కృతార్థోఽస్మి యత్తిష్ఠామి త్వయాసహ ।
ఆలపామి క్షణమపి నేక్షేహ్యేత త్వలో పమామ్ ॥ 80

ఇత్యబ్ధి నాస్తుతః శ్రీశ మాహాత్మ్యవచనైః స్వయమ్ ।
యయౌ లజ్జాం, ప్రహర్షంచ, ప్రహ్లాదో భగవత్ప్రియః ॥ 81

భాగవతోత్తముడగు అంబరీషునిపట్ల దుర్వాసోముని చేసినయపరాధమును, చివరకు అంబరీషుడేతప్ప బ్రహ్మరుద్రాదులు, శ్రీవిష్ణువు కూడ క్షమింప జాలకపోయిరి. తన తల్లియగు శచీదేవిని వ్యాజముగా చేసికొని శ్రీ చైతన్య మహాప్రభువు వైష్ణవా పరాధమును మాన్పినగాథ ఎల్లరెరిగినదే. భాగవతోత్తముడగుమునిని ఉదాసీన బుద్ధితో చూచినందువలననే ఇంద్రద్యుమ్నుడను ద్రావిడరాజు ఏనుగుగా పుట్టి మకరిగ్రస్తుడు కావలసివచ్చెను. కావున భాగవతాపచారమును పరిత్యజించుటే భగవదను గ్రహకారణమని తాత్పర్యము. 76

'వాస్తవమునకు ఈ రత్నములచే నీకింతమాత్రము ప్రయోజనములేదు. అయినను సమర్పించుచున్నాను. నిత్యప్రకాశ శీలుడగు సూర్యునకు గూడ భక్తితో దీపమును నివేదింతురు కదా!' 77

రాక్షస భావమును విడచి, నీవు సాక్షాత్తు విష్ణువుగనే పూజింప బడుచున్నావు. నిఖిల జగత్తులకు నమస్కార్యుడవైయున్నావు. జాతియన్నది వైష్ణవులకు దోషము నాపాదింప జాలదు కదా! వైష్ణవునియందు జాతిని జూచుట మహాపరాధమని తాత్పర్యము. 78

'అతి ఘోరములగు ఆపదలలో సహితము నీవు శ్రీహరిచే రక్షింపబడితివి కదా! అట్టి నిర్మల స్వభావులగు మహానుభావులు సూర్యునివలె దుర్లభులే కదా!' 79

ప్రతిగృహ్య సరత్నాని వత్సలః ప్రాహ వారిధిమ్ ।
మహాత్మన్ సుతరాం ధన్యః శేతే త్వయిహి సప్రభుః ॥ 82

కల్పాంతేఽపి జగత్ సర్వం గ్రసిత్వా సజగన్మయః ।
త్వయ్యేవైకార్ణవీ భూతే శేతే కిల మహామునిః ॥ 83

లోచనాభ్యాం జగన్నాథం ద్రష్టు మిచ్ఛామి వారిధే ।
త్వం పశ్యసి సదా ధన్యః తత్రోపాయం వదస్వమే ॥ 84

ఉక్త్వేతి పాదావనతం తూర్ణముత్థాప్య సాగరః ।
ప్రహ్లాదం ప్రాహయోగీంద్రం త్వం పశ్యసి సదాహృది ॥ 85

'వేయిమాటలేల? నీదగ్గర నుండుటచేతను, నీతో క్షణమైన మాటాడుట చేతను కృతార్థుడనైతిని. ఇట్టి ఫలమునకు సరియగు వేరుదానిని నేనుచూడను 80

ఈవిధముగ శ్రీహరి మాహాత్మ్య పరములగు వచనములచే స్వయముగ సముద్రునిచే స్తుతింపబడినవాడై భగవత్ప్రియుడగు ప్రహ్లాదుడు, సిగ్గను, ఆనందమును పొందెను. 81

అంత ప్రహ్లాదుడు ఆరత్నముల గ్రహించి ప్రీతుడై సముద్రునితో పల్కెను. 'ఓ మహాత్మా! నీ వెంతో ధన్యుడవు. ఆ భగవానుడు స్వయముగ నీజలములపైననే శయనించు చున్నాడుకదా! 82

'కల్పము ముగిసిన తరువాత సమస్త లోకమును మ్రింగి జగన్మయుడు మహామునియునగు శ్రీమహావిష్ణువు, కేవల మహాజలరాశిగా నేర్పడిన నీయందే నిదురించుచున్నాడు కదా!' (నాల్గుయుగములకు కల్పమనిపేరు.) 83

ఓ సముద్రుడా! ఈకన్నులతో ఆ జగన్నాథుడగు శ్రీహరిని దర్శింపగోరుచున్నాను. నీవు నిరంతరము దర్శించుచున్నావు. ఎంత ధన్యుడవో కదా! అట్లు దర్శించుటకు ఉపాయమెట్టిదియో నాకును తెల్పుము. 84

ఈ విధముగా పల్కి పాదములపైబడిన ప్రహ్లాదుని వేగమే పైకిలేవనెత్తి, సముద్రుడు యోగీంద్రుడగు ప్రహ్లాదునితో పల్కెను. 'నీవు సర్వదాహృదయముననే

ద్రష్టుమిచ్ఛస్యథాక్షిభ్యాం స్తుహి తం భక్తవత్సలమ్ ।
ఉక్త్వేతి సింధుః ప్రహ్లాదమామన్త్ర్య సజలేఽవిశత్ ॥ 86

గతే నదీంద్రే స్థిత్వైకో హరిం ప్రహ్లాద దైత్యజః ।
భక్త్యాస్తౌదితి మన్వానస్తద్దర్శనమసంభవమ్ ॥ 87

ఇతి శ్రీ నారదీయే హరిభక్తి సుధోదయే ప్రహ్లాద చరితే త్రయోదశోధ్యాయః ।

భక్తవత్సలుడగు శ్రీహరిని దర్శించుచున్నావు. ఇక కన్నులతో దర్శింపగోరుదువేని ఆదేవదేవుని స్తుతింతుము. అని పలికి ప్రహ్లాదుని వీడ్కొలిపి, సముద్రుడు నీటిలో ప్రవేశించెను. 85,86

సముద్రుడు వెడలిపోయిన తరువాత ఒంటరిగా నున్నవాడై ప్రహ్లాదుడు అసంభవమగు శ్రీహరి దర్శనమును కోరుచున్నవాడై భక్తితో స్తుతించెను. 87

ఇది శ్రీనారదీయ పురాణాంతర్గతమగు హరిభక్తిసుధోదయమునగల ప్రహ్లాదచరితమున త్రయోదశాధ్యాయము.

# చతుర్దశాధ్యాయము

హరిభక్తిసుధోదయమునగల ఇతర యధ్యాయము కంటె భక్తలక్షణాదులు, ఉపాసనా విధానమును సూచించు శ్లోకములతో కూడిన యీ యధ్యాయము విశిష్టమైనది. భగవద్దర్శన భాగ్యము నొందిన ప్రహ్లాదుని యనుభవమిందు లెస్సగా వర్ణింపబడినది. 1 నుండి 5 వరకుగల శ్లోకములు ప్రహ్లాదుని హృదయ పరిపాకమును, సమున్నతమగు ననుభవస్థితిని ప్రదర్శించుచున్నవి. విశేషించి మొదటిమూడు శ్లోకములలో యోగోపాసనాప్రక్రియ సంగ్రహింపబడినది.

భగవద్దర్శనమును పొందిన భక్తునకు తద్దర్శనము కంటె వేరుకాంక్షింపదగినదేమియు నుండదు. సాక్షాత్కరించి వరముల కోరికొమ్మన్న శ్రీహరికి ప్రహ్లాదుడు చెప్పిన సమాధానము వాస్తవమగు భక్తలక్షణము నుద్దేశించుచున్నది. భగవద్దాస్యదూరమైన మోక్షముకూడ భక్తునకు నిరపేక్షితమే. భక్తియే కామధేనువు. అదియే సర్వపురుషార్థప్రదయని ప్రహ్లాదుని నిష్కర్ష. అందువలననతడు ఇతరముల కోరడు. స్థిరమైన భక్తినే అనుగ్రహింపుమని వేడును. 45 నుండి 54 వరకు భక్తివైశిష్ట్యము లెస్సగా ప్రతిపాదింపబడినది.

చివరి రెండు శ్లోకములలో భక్తజనపారవశ్యము వర్ణింపబడినది.

ఈ యధ్యాయమున సూర్యోదయ వర్ణనాపరములగు శ్లోకములు 62 నుండి 67 వరకు ఆధ్యాత్మిక పరిమళముల వెదజల్లు కవితావైజయన్తియని చెప్పవచ్చును.

ప్రహ్లాద ఉవాచ –
జ్యోత్స్నా శుభ్రైః శశిభిరచలైః చింత్యతే యోగిభిర్యో
విద్యుద్వర్ణః ప్రణత తనుభిః న్యాసపూతైః యథోక్తమ్ ।
ఉద్దీప్యాన్తర్ హృదయ కమలే యస్త్రి శక్తి ప్రబుద్ధే
సూర్యేన్ద్వగ్ని త్విడుపరి హరిం ద్రష్టుమిచ్ఛామ్యహోతమ్ ॥ 1

ప్రహ్లాదుడు పలికెను. విశుద్ధవిజ్ఞాన చంద్రికలచే నొప్పారువారును, స్థిరచిత్తులును, సమస్తమును పరమాత్మకు ఆయత్తముచేసి పవిత్రములై నిరంతరము నమనశీలము లైన దేహములు కలవారును, అయిన యోగిచంద్రులచే ధ్యానింపబడువాడై మెరుపుతీగవలె భాసించుచు చిచ్ఛక్తి, జీవశక్తి – అచిచ్ఛక్తియను మూడుశక్తుల ప్రతిబోధముకాగా హృదయ కమలమందు సూర్య – చంద్ర – వహ్నుల కాంతులనధఃకరిచి ప్రకాశించువాడును అగు శ్రీహరిని దర్శింప దలచుచున్నాను.

ఈశ్లోకమున యోగులు చంద్రబింబమువలె ప్రకాశించు వారని చెప్పబడినది. చంద్రజోత్స్నలు స్వచ్ఛములైనట్లు యోగుల జ్ఞానదీప్తులునుస్వచ్ఛములని యభిప్రాయము. యోగకళచే తమహృదయముల వికసింపజేసి విద్యుద్వర్ణునిగా పరమాత్మయగు శ్రీహరిని దర్శింతురు. వారిదేహములు 'న్యాసపూతములు' న్యాసమనగా సర్వకర్మఫలములను భగవదాయత్తము చేయుట. దానివలన కర్మ సంగవిరహితులై విశుద్ధవిజ్ఞానముచే వారుభాసించుచున్నారని తాత్పర్యము. లేదా న్యాసమనగా ధ్యానదశయందు చేసెడి అంగన్యాస కరన్యాసాదికము. దీనివలన దేహము పవిత్రమగును. నిరంతర భగవద్ధ్యానముచే దేహములు వినమ్రములై యుండును. ఇట్టి యోగుల హృదయములందే భగవానుడు తనశక్తులతో ప్రకాశించును. శ్రీభగవానుడు భాగవతైకా దశస్కంధమున యోగీయోపాసనాప్రకారము నీక్రింది విధముగా పేర్కొనివాడు

సమ ఆసన ఆసీనస్సమకాయో యథాసుఖమ్ ।
హస్తా వుత్సంగ ఆధాయస్వనాసాగ్రకృతేక్షణః ।
ప్రాణస్య శోధయేన్మార్గం పూర – కుంభక – రేచకైః
విపర్యయేణాపి శనైః అభ్యసే న్నిర్జితేంద్రియః ।
హృద్యవచ్ఛిన్న మోంకారం ఘణ్టానాదం బిసోర్ణవత్ ।

**వేదాన్తవాక్య శతమారుత సంప్రవృద్ధ**
**వైరాగ్య వహ్ని శిఖయా పరితాప్య చిత్తమ్**
**సంశోధయన్తి యదవేక్షణ యోగ్యతాయై**
**ధీరాః సదైవ, సకథం మమ గోచరః స్యాత్ ।** 4

వెనుక చెప్పబడిన శ్రీభాగవత ప్రక్రియననుసరించియు, ఈక్రింది విష్ణుపురాణము న చెప్పబడినట్లును,

శబ్దాదిష్వనురక్తాని నిగృహ్యాక్షాణి యోగవిత్ ।
కుర్యాచ్చిత్తాను కారిణి ప్రత్యాహార పరాయణః ॥
వశ్యతా పరమాతేన జాయతేఽతి చలాత్మనామ్ ।
ఇంద్రియాణా మవశ్యైస్తైనయోగీ యోగసాధకః ॥
ప్రాణాయామేన పవనే, ప్రత్యాహారేణ చేంద్రియే ।
వశీకృతే తతఃకుర్యాత్ స్థితం చేతః శుభాశ్రయే ॥

(విష్ణు పురాణము. 6-7-43, 44, 45)

శబ్దాదివిషయముల యందు ఆసక్తములైన ఇంద్రియములను లోనికి యుప సంహరించి మనస్సుననుకరించి యుండునట్లు చేయుట ప్రత్యాహారము. మనస్సును నిగ్రహించినప్పుడు ఇంద్రియములుకూడ నిగ్రహింపబడును. ఇక ప్రాణాపానాది పంచ వాయువులను ప్రాణాయామ ప్రక్రియచే వశపరచు కొనవలయును. ఇట్లు ఇంద్రి యములను, ప్రాణములను నిగ్రహించిన యోగియే తత్త్వదర్శనము చేయగల్గును.

యమములనగా అహింస, సత్యము, అస్తేయము బ్రహ్మచర్యము, అపరిగ్రహము అను ఆరు. నియమమములనగా, శౌచము, సంతోషము, తపస్సు. స్వాధ్యాయము., ఈశ్వర ప్రణిధానము అనునైదు, వీటి వివరములు పాతంజల యోగదర్శనములోని సాధనపాదమున గల 30, 32 సూత్రములలో , చూడనగును. 3

వందలాది యుపనిషద్వాక్యములనెడి వాయువుచే వృద్ధిచెందిన వైరాగ్యమనెడు అగ్నియొక్క జ్వాలచే మనస్సును బాగుగ తపింపజేసి ధీరులైనవారు ఏ పరమాత్మను దర్శించుటకుతగిన యోగ్యతను కల్గించుటకై శోధించుచున్నారో, అట్టి పరమాత్మ నాకెట్లు సాక్షాత్కరించునో కదా!

మాత్సర్య రోషస్మయ లోభమోహ
మదాభిధైర్యత్ సుదృఢైర్ద్విషద్భిః ।
ఉపర్యుపర్యావరణైః సుబద్ధ
మంధం మనోమేక్వ? హరిః క్వ వాహమ్ । 5

ఈ మనస్సు అనునది సహజముగా లక్కవలె కఠినమైనది. దానిని బాగుగా తపింప జేసినప్పుడు కరిగి భగవద్దర్శన యోగ్యతను పొందును. ఈ విషయమే ఇట్లు చెప్పబడినది.

చిత్తద్రవ్యం జతువత్ స్వభావాత్ కఠినాత్మకమ్ ।

తాపకైర్విషయైః యోగొద్రవత్వం ప్రతిపద్యతే ।

అని. ఈ చిత్తము లౌకికి దుఃఖాది దశయందు మాత్రమేకాక, భగవద్గుణ శ్రవణాది దశయందుకూడ ద్రవించును. ఈవిధముగా ద్రవించిన చిత్తము భగవదాకారముగా పరిణమించుటేభక్తి యని వ్యవహరింపబడును.

ద్రుతస్య భగవద్ధర్మాద్ధారావా హికతాంగతా ।

సర్వేశే మనసోవృత్తిర్భక్తిరిత్య భిధీయతే ॥ ( భక్తిరసాయనము)

ఆత్మావా అరే ద్రష్టవ్య శ్శ్రోతవ్యోమన్తవ్యో నిదిధ్యాసి తవ్యః ' ఇత్యాదిగా చెప్పబడిన వేదాన్త వాక్యశ్రవణమువలన మనస్సుద్రవించి, విషయపరాఙ్ముఖమై వైరాగ్య సంపన్నమగును. అప్పుడు భగవత్ సాక్షాత్కారయోగ్య మగునని తాత్పర్యము 4

మాత్సర్యము, రోగము, గర్వము, లోభము, మోహము, మదము మున్నగు పేరులుగల బలవత్తరములైన అంతశ్శత్రువులుపైని ఆవరించి యుండగా, ఈ యావరణములచే బంధింపబడి తత్త్వజ్ఞానశూన్యమై అంధకారమునపడియున్న నామనస్సెక్కడ? శ్రీహరి యెక్కడ? నేనెక్కడ?

అరిషడ్వర్గముచే బంధింపబడిన మనస్సు తత్త్వదర్శనము చేయజాలదని తాత్పర్యము. 5

బ్రహ్మమున్నగు దేవ ప్రముఖులు తమకు భయములుకల్గినప్పుడు చిత్తప్రశాన్తిని కోరువారై క్షీరసాగర సమీపమునకుచేరి స్తోత్రముల చేసిన వారై ఏ పరమాత్మను మిక్కిలి శ్రమతో (విశేషప్రయత్నముతో) దర్శించుచున్నారో, ఆ శ్రీహరిని

తంస్వప్నమేవాథ సమన్యమానః
స్వప్నేపి పశ్యామి హరిం కృతార్థః ।
ఇతి ప్రహర్షార్ణవ మగ్నచిత్తః
ఆనంద మూర్ఛాం సపునశ్చభేజే ॥ 12

తతః క్షితావేవ నివేశ్య నాథః
కృత్వా తమంకే సుజనైక బంధుః ।
శనైర్వి ధున్వన్ కరపల్లవేన
స్పృశన్ముహు ర్మాతృవదా లిలింగ ॥ 13

తతశ్చిరేణ ప్రహ్లాద స్తన్ముఖోన్మీ లితేక్షణః
ఆలులోకే జగన్నాథం విస్మయాని మిషశ్చరమ్ ॥ 14

స్నిగ్ధోజ్జ్వలముఖం' వత్స! మాభైః సుస్థోభవే' తిచ
సాన్త్వ యన్తం గిరాత్మానం సుధామాధుర్య ధారయా ॥ 15

కలలో గూడ శ్రీహరిని దర్శించుచున్నాను. కృతార్థుడనైతిని. ' అని ఆనందసాగరమున మునిగిన మనస్సుగలవాడై ఆనంద నిమిత్తముగ (పట్టరాని యానందము నిమిత్తముగ ) మరల మూర్ఛను పొందెను. 12

పిమ్మట భూమిపైననే ప్రహ్లాదునుంచి, సుజనులకు మాత్రమే బంధువులోక నాథుడునైన శ్రీహరి, వానిని తొడపైకూర్చుండ బెట్టుకొని మెల్లిగా తన కరపల్లవముచే నిమురుచు శరీరము నంతటిని మాటిమాటికి స్పృశించుచు, తల్లివలె కౌగలించు కొనెను.

ఇచ్చట భక్తులపట్ల భగవానునకుగల యవ్యాజ ( పితృతిశయము స్పష్టపరుపబడినది. 13

అంతట ప్రహ్లాదుడు భగవన్ముఖమున చూడ్కులనిగిడ్చి, ఆశ్చర్యముతో రెప్పపాటును మరచి చాలకాలము జగన్నాథుడగు శ్రీహరిని వీక్షించెను. 14

అమృతపు జాలువలె తీయనైన వాక్కులతో, 'నాయనా! భయపడకుము.

కృష్ణాంగ స్పర్శ సౌరభ్య స్వరూపవ చనామృతైః ।
హృతేక్షణో౽ంగ ! నోలేభే ఆత్మసంభావ నామసౌ । 16

పానాయతి మనోభృంగే శ్రీశ వక్త్రాబ్జసంగిని ।
అతిలుబ్ధే నవేదాసౌ కో౽హం, క్వాస్మి, కదేతివా । 17

క్షణమున్మీల్యతం దృష్ట్వా నేత్ర హర్షాకులే క్షణం ।
ఆమీల్య పునరున్మీల్య భక్తః కామప్యగాద్దశామ్ । 18

క్షణమావిరభూద్ బోధః, క్షణం హర్షాత్ తిరో౽భవత్ ।
గోవిందం పశ్యతస్తస్య సాభ్రవ్యోమేందువద్ బభౌ । 19

అచిన్తయత్ క్షణం చైవం స తం పశ్యన్ జగత్సృజం ।
మనసావాచా పృధివ్యగ్నీ, ఘ్రాణేనాస్యాంబరానిలౌ । 20

చక్షుషో౽స్య రవిర్ద్యౌశ్చ శ్రోత్రేణాస్య దిశఃశశీ ।
మనసాస్యాంబువరుణౌ సృష్టౌ సో౽యం విభూతిమాన్ । 21

చిత్తసౌఖ్యమును పొందుము.' అని యూరడించుచున్న ముగ్ధమోహన వదనముగల స్వామిని వీక్షించెను. 15

శ్రీకృష్ణుని శరీర స్పర్శ, పరిమళము, ఆకృతి, వచనపీయూషము అనువీటిచే నాకృష్టదృష్టియై అహో! తనను గుర్తించుటయే తాను మరచినాడు. 16

శ్రీహరి వదనసరోజ సంసక్తమై మిక్కిలి లోభముచే నాతని చిత్తమధుకరము అమృతపానమొనర్చు చుండగా, నేనెవ్వడను? ఎక్కడ నున్నాను? ఎప్పుడున్నాను? అనియేమియు నాతడెరుగ జాలడాయెను. 17

ఒక్కక్షణ కాలము ఆనందవ్యాకులములైన దృక్కులను తెరచి శ్రీహరిని చూచి, క్షణమమొగిడ్చి, మరల తెరచి భక్తశిఖామణియగు ప్రహ్లాదుడు ఏదియో అనిర్వాచ్యమైన యానందదశను అనుభవించెను. 18

శ్రీహరిని దర్శించుచున్న యాప్రహ్లాదునకు ఒక్కక్షణము తెలివి కల్గెను, మరుక్షణమున యానందాతిరేకముచే తెలివి తప్పెను. ఈ విధముగ నాతని

అర్థః సర్వోపనిషదాం సోఽయం సోఽయం మహాప్రభుః ।
ఇత్యాది చింతయంశ్చా భూద్ధర్షాత్ పరవశః పునః ॥ 22

తతిశ్చారాత్ సంసభావ్య ధీరః శ్రీశాంక శాయినమ్ ।
ఆత్మానం సహసోత్తస్థౌ సద్యః సభయ సంభ్రమః ॥ 23

ప్రణామాయ పపాతోర్వ్యాం, ప్రసీదేతి వదన్ ముహుః ।
సంభ్రమాత్ సబహుజ్ఞోఽపి నాల్పాం పూజోక్తి మస్మరత్ ॥ 24

తతశ్చ భయహస్తేన గదాశంఖారి పద్మభృత్ ।
గృహీత్వో త్థాపయామాస భుజైః స్పర్శసుఖైఃక్షితేః ॥ 25

"ప్రతిబోధము" మబ్బులతో కూడిన యాకాశమున దోబూచులాడు చంద్రబింబము వలె నాయెను. 19

నిఖిల జగత్ స్రష్టయగు నాపరమాత్మను వీక్షించి క్షణకాలమిట్లు ధ్యానించెను. " ఈ మహానుభావుని వాక్కుచే భూమి, వహ్నులును, ముక్కుచే ఆకాశవాయువులును, మనస్సుచే, జలవరుణులును, సృజింపబడినవి. అట్టి విభూతి సంపన్నుడీయన' .

భగవానుని శరీరమునుండి పంచభూతములు, ఇతర సృష్టిజరిగిన విధానము పురుష సూక్తాదులలోను అనేక పురాణములలోను వేరువేరుగ కన్పట్టుచున్నది. దీనిని గూడ ప్రస్తుతమున గమనింపవలయును. 20,21

సమస్తములగు నుపనిషత్తులచే ప్రతిపాదింపదగు తత్త్వము ఈతడే! ఆతడేయీ మహాప్రభువు! ఇత్యాదిగ భావించుచున్నవాడై., మాటిమాటికి ఆనంద పరవశుడాయెను. 22

పిమ్మట, చాలకాలము తరువాత ధీరుడగు నాప్రహ్లాదుడు తనును తాను శ్రీహరి యొడిలో శయనించిన వానిగా భావించి భయము తొట్రుపాటు పెనగొనగా వెంటనే పైకిలేచెను. 23

మాటిమాటకి ప్రసన్నుడవు కమ్మనుచు, ఆతడు ప్రణమిల్లుటకై భూమిపై పడెను. ఎన్నియో యెరిగిన వాడైనను, తొట్రుపాటుచే పూజాసముచితమగుమాటను ఇసుమంతయైనను స్మరింపజాలడయ్యెను. 24

కరాబ్జ స్పర్శనాహ్లాద గళదస్త్రం సవేపథుమ్ ।
భూయోఽథాహ్లాదయత్ స్వామీ, తంజాగాదేతి సాన్త్వయన్ ॥ 26

సభయం సంభ్రమం వత్స! మద్గౌర వకృతం త్యజ ।
నైష్మప్రియోమే భక్తేషు, స్వాధీన ప్రణయో భవ ॥ 27

అపిమేపూర్ణ కామస్య నవం నవమిదం ప్రియమ్ ।
నిఃశంకం ప్రణయాద్ భక్తోయన్మాం పశ్యతి భాషతే ॥ 28

నిత్యముక్తోఽపి బద్ధోఽస్మి భక్తేన స్నేహరజ్జుభిః ।
అజితోఽపి జితోఽహం తైరవశోఽపి వశీకృతః ॥ 29

అటుపిమ్మట శంఖచక్రగదాపద్మధారియగు నా శ్రీహరి తన యభయహస్తముతో వానిని పట్టుకొని, స్పర్శచే సుఖకరములగు తనచేతులతో పుడిమి పై నుండి లేవనెత్తెను. 25

తనకరకమలముల స్పర్శనముచే కల్గిన ఆనందమున కన్నులు నీటిని జాలువార వణుకుచున్న యాప్రహ్లాదుని మరల యానందింప జేయుచు, 'స్వామి' యాతనిని యూరడించుచు ఇట్లు పల్కెను. 26

'నాయనా! నా పట్లగల గౌరవమువలన కల్గిన భయసహితమగు నీ సంభ్రమమును విడచి పుచ్చుము. నాభక్తుల యందిది నాకు ప్రీతికరముకాదు. స్వాయత్తమైన ప్రీత్యతి శయము కలవాడవు కమ్ము.' (చనువుతో దగ్గరకు రమ్మని తాత్పర్యము) 27

పూర్ణకాముడనైన (నెరవేరిన కోర్కులుగలవాడనైన) నాకుగూడ నాభక్తుడు ప్రీత్యతిశయముతో నన్నుచూచుట, మాట్లాడుట అనునవియే ఎప్పటి కప్పుడు ప్రీతిని గొల్పును. 28

నేను ఈ సాంసారిక బంధమెంతమాత్రములేని నిత్యముక్తుడను. అయినను నాభక్తునిచే ప్రీతియను త్రాళ్లతో కట్టబడితిని. నేను సర్వమును జయించి 'అజితుడను' పేరుబడసితిని. కాని నాభక్తులచే జయింపబడితిని. నేనెవ్వరికి వశపడను. కాని నాభక్తులచే వశపరచుకొనబడితిని.'

ఈశ్లోకమున భగవానుని భక్తపరతంత్రత స్పష్టపరుపబడినది. నిత్యముక్తుడు,

త్యక్తబంధు సుహృత్ స్నేహా మయియః కురుతేరతిమ్ ।
ఏకస్తస్యాస్మి, సచమే, నహ్యన్యోస్త్యావయోః సుహృత్ ॥ 30

నిత్యస్య పూర్ణకామస్య జన్మాని వివిధానిమే ।
భక్త సర్వేష్ట దానాయ, తస్మాత్ కింతే ప్రియంవద! ॥ 31

అథవ్యజిజ్ఞపద్ విష్ణుం ప్రహ్లాదః ప్రాంజలిర్నమన్ ।
అలౌల్యముత్పలదృశా పశ్యన్నేవ చ తన్ముఖమ్ ॥ 32

అజితుడు, అవశుడు అయిన పరమాత్మసహితము భక్తుని యవ్యాజభక్తికి బద్ధుడు, జితుడు, వశీకృతుడగు చున్నాడన్నచో భక్తి వైశిష్ట్యము అసాధారణమని యభిప్రాయము. 29

బాంధవ్యము, మిత్రస్నేహము మున్నగు లౌకిక బంధముల నన్నింటిని విడచినవాడను. (కాని) నాయందెవ్వడు ప్రీతినుంచునో వానికి నేనొక్కడనే! నాకును వాడొక్కడే! మాయిరువురకు వేరొక మిత్రుడెవ్వడులేడు.

పరమాత్మకు భక్తునకుగల స్నేహసంబధము సర్వలౌకిక బంధములకును అతీతము అనన్య సామాన్యమునని తాత్పర్యము. కావుననే పరమాత్మకును జీవునకునవ విధములైన సంబంధములున్నవని పెద్దలు చెప్పుదురు. అవియేవనగా -

1. పితృపుత్ర సంబంధము
2. రక్ష్యరక్షక సంబంధము
3. శేషశేషి సంబంధము
4. భర్తృ భార్యా సంబంధము
5. జ్ఞాతృజ్ఞేయ సంబంధము
6. స్వస్వామి సంబంధము
7. ఆధారాధేయ సంబంధము
8. శరీరాత్మ సంబంధము
9. భోక్తృ భోగ్య సంబంధము

నాథాన్యవరయాచ్ఞాయాః కాలోనైష ప్రసీదమే ।
త్వద్దర్శనా మృతాహ్లాదే హ్యన్తరాత్మా నతృప్యతి ।       33

త్వద్దర్శనామృతా తృప్తమన్యద్ వాంఛేత్ ప్రియంయది ।
చేతః తదస్తి చేల్లోకే తర్హ్యాలోచ్యార్థయే ప్రభో ।       34

బ్రహ్మాది దేవదుర్లక్ష్యం త్వామేవం పశ్యతః ప్రభుమ్ ।
తృప్తిం నేష్యతి మేచిత్తం, కల్పాయుతశతైరపి ।       35

నిత్యుడు (జన్మరహితుడు) పూర్ణకాముడు (తనకొరకైన కోరిక లేమియులేనివాడు) అయిననాకు భక్తజనుల సమస్తాభీష్టముల దీర్చుటకే అనేక జన్మములు కావున నీకేమిప్రియమో చెప్పుము?

ఉపనిషత్తులు భగవానునని నిత్యునిగను, పూర్ణకామునిగను ఉద్ఘోషించుచున్నవి. ఆయన నిత్యుడు అనగా కర్మకృతమైన దేహసంబంధరూపమగు జననమరణ చక్రమున తగుల్కొననివాడు. పూర్ణకాముడు. తనకెట్టికామములు లేనివాడు లేదా నెరవేరిని సమస్తకామములు కలవాడు. కాని ఆయన తనను ఆశ్రయించివారి కోరికల దీర్చుటకై పుట్టుచుండును.

" నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానామ్; 'ఏకో బహూనాం యో విదధాతి కామాన్ ' నిత్యులలో నిత్యుడు, చేతనులలో చేతనుడునైతానొక్కడే అందరి కోర్కుల దీర్చుచుండును' అని శ్రుతి వచనము."       31

అంతట ప్రహ్లాదుడు నమస్కరించుచున్నవాడై, ఎట్టి చిత్తలౌల్యము లేక (లోభమెంత మాత్రములేకయే) కలువ కన్నులతో శ్రీహరి ముఖమును దర్శించుచు ఇట్లు విజ్ఞాపనము జేసెను.       32

"ఓస్వామీ! వరముల యాచించుట కిది సమయము కాదు. ప్రసన్నుడవుకమ్ము. నిన్నుదర్శించుట యనెడి యమృతయును చూరగొనుటవలన కల్గిన యానందమున నామనస్సు పరితృప్తి నందుటలేదు."       33

"స్వామీ! నిన్నుదర్శించుట యనెడి యమృతము గ్రోలితృప్తి నొందుట కంటె వేరగు ప్రియమును నామనస్సు కోరినచో, అట్టిదీ లోకమున నున్నచో, అప్పుడాలోచించి కోరగలవాడను."       34

త్వత్ సాక్షాత్కరణాహ్లాద విశుద్ధాబ్ధిస్థితస్యమే ।
సుఖాని గోష్పదాయన్తే బ్రాహ్మాణ్యపి జగద్గురో ॥ 36

కృత్యం తవాప్య నీహాస్య సంభవేదాశ్రితేష్టద ।
నైవమేకృత కృత్యస్య దృష్ట్వాతాత! కరోమి కిమ్ ॥ 37

తతః స్మిత సుధాపూరైః పూరయన్ స్వప్రియం ప్రియః ।
యోజయిన్ మోక్షలక్ష్మ్యాచ తంజగాద జగత్పతిః ॥ 38

స్వామీ! చతుర్ముఖ బ్రహ్మాదులకు కూడ వీక్షింపనలకాని నిన్ను దర్శించుచున్ననాకు అయుతశత కల్పములంతటి కాలమైనను మనః పరితృప్తి కలుగుటలేదు.

కల్పమనగా నాలుగు యుగములు, అయుతమనగా పదివేలు. ఇట్టినూరు అయుతముల ప్రమాణముగల కల్పములంతటి కాలమునగూడ భగవద్దర్శన పరితృప్తి తీరదని తాత్పర్యము. 35

ఓ జగద్గురూ! నిన్ను దర్శించి నందువలన కల్గిన మహానందమను శుద్ధసాగరమున మునిగియున్ననాకు, బ్రాహ్మసుఖములు సహితము (అనగా జ్ఞానులకు, యోగులకు కల్గిన బ్రహ్మానుభవ సుఖములు, అనగా మోక్షాదులు సహితము) గోష్పదముల వలె (ఆవుగిట్టచే నాక్రమింపబడు స్వల్పప్రదేశములవలె) అగుచున్నవి.

భగవద్దర్శన జన్యమగు మహాహ్లాదముముందు మోక్షాదులు కూడ అత్యల్పములుగా గోచరించు చున్నవని తాత్పర్యము. సముద్రముముందు ఆవుగిట్టచే నేర్పడిన చిన్న ప్రదేశములోని జలమెట్టిదో, భగవత్ సాక్షాత్కారము ముందు బ్రాహ్మ సుఖములును అల్పములే ననియభిప్రాయము. 36

తండ్రీ! ఆశ్రితులకోర్కుల దీర్చువాడా! ఎట్టికోరికలులేని నీకు చేయదగు కృత్యమేమియులేదు. అట్లేనిన్ను దర్శించి కృతకృత్యుడనైన (ధన్యుడనైన) నాకును చేయదగిన దేమున్నది? 37

అటుపిమ్మట, తన చిరునగవులనెడి యమృతపుజాలులచే తనకు ప్రేమాస్పదుడగు ప్రహ్లాదుని తనిపి, మోక్షలక్ష్మిచే నాతని ననుగ్రహించి, ప్రహ్లాదప్రియుడు, నిఖిల భువన రక్షకుడునైన శ్రీహరి వానితో నిట్లు పల్కినాడు. 38

సత్యమ్, మద్దర్శనాదన్యత్ ననైవాస్తిహితే ప్రియః ।
అత ఏవహి సంప్రీతి స్త్వయిమేఽతీవ వర్ధతే ॥ 39

అపితే కృతకృత్యస్య, మత్ప్రియం కృత్యమస్తిహి ।
కించిచ్చ దాతుమిష్టంమే, మత్ప్రియార్థం వృణుష్వతత్ ॥ 40

ప్రహ్లాదోఽథాభ్యధాద్ధీమాన్ దేవ! జన్మాయుతేష్వపి ।
దాసస్తవాహం భూయాసం, గరుత్మానివ భక్తిమాన్ ॥ 41

నిజమే! నన్నుదర్శించుట కంటె వేరుగ నీకు ప్రీతిని గొల్పునదేదియులేదు. కనుకనే నీయందు నాకత్యంతము ప్రీతివృద్ధి చెందుచున్నది. 39

నీవు కృతకృత్యుడువే (ధన్యుడవు) అయిన నప్పటికిని నాకు ప్రియమైన కృత్యమునునీవు నన్ను చేయవలసియేయున్నది. నీకేదియో ఒకటి యీయవలయునని నా యభిమతము. నాకు ప్రీతి కల్గుటకై దానిని కోరికొమ్ము. 40

పిమ్మట బుద్ధిశాలియగు ప్రహ్లాదుడు - 'దేవా! పదివేల జన్మములలోనైనను నీకుదాసుడనై యుండునట్లును, గరుడునివలె భక్తిగలిగి యుండునట్లును అనుగ్రహింపుము.' అని పలికెను.

ఈ శ్లోకమున ప్రహ్లాదుడు భగవానుని తనకు దాసత్వము ననుగ్రహింపుమని ప్రార్థించుచున్నాడు. ఎవ్వనికైనను భగవత్కైంకర్యమునకు మించిన కోరదగిన యంశము వేరొండులేదు. మోక్షము కంటెను భగవద్దాస్యము, భగవత్సేవయే నిరంతరము కావలయునని కోరుభక్తులే శ్రేష్ఠతములని శ్రీభాగవతముకూడ నొడువుచున్నది -

నైకాత్మతాం మే స్పృహయన్తి కేచిత్ మత్పాద సేవాభిరతే మదీహాః ।
యేఽన్యోన్యతో భాగవతాః ప్రసజ్య సభాజయన్తోమమ పౌరుషాణి ।

(శ్రీ భాగ. 3-25-34)

'నాయందే సమాయత్తములైన చేష్టలుకలవారై కొందరు నాసేవయందే ఆసక్తి కలవారైనా సాయుజ్యమునుకూడ కోరరు. వారు ఒకరితో నొకరి కలసి నాపౌరుషమునే ప్రశంసించుచు కీర్తించుచుందురు ! 41

అథాహనాథః ప్రహ్లాదం సంకటం ఖల్విదంకృతమ్ ।
అహంతదాత్మదానేప్సుః త్వంతు భృత్యత్వమిచ్ఛసి ॥ 42

నోత్సహేతే పృథగ్భావం, తేహ్యన్యే భృత్యతోచితాః ।
అస్తువా తదహం జానే, తావదేవ యథేచ్ఛసి ॥ 43

మద్భక్తిస్తు నయాచ్యాతే, సిద్ధైవాస్తిచ సాస్థిరా ।
వరానన్యాంశ్చ వరయ ధీమన్! దైత్యేశ్వరాత్మజ ॥ 44

ఇతిబ్రువాణం సప్రాహ సఖేదం పరమేశ్వరమ్ ।
త్వయేదానీం భవద్భక్తిర్దత్తాతత్ కిం వృథా ప్రభో ॥ 45

అటుపిమ్మట జగన్నాథుడగు శ్రీహరి ప్రహ్లాదునితో నిట్లు పలికెను. 'నాయనా! చాల సంకటమును కల్గించితివి. నేను నన్నేనీకు స్వాయత్తపరుప నిచ్ఛగించుచున్నాను. కాని, నీవు దాసత్వమును కోరుచున్నావు.' 42

నీ కంటె వేరుతనమును నేనుకోరను. దాసత్వమునకు అర్హులైనవారు వేరుగ కలరు. అయినను అట్లే కానిమ్ము. నీ వెట్లు కోరుచుంటివో అట్లే (అంతే) కల్గునుగాక! 43

'బుద్ధిశాలియగు ఓ దైత్యరాజకుమారా! నాపట్ల భక్తిని నీవు యాచింప నక్కరలేదు. ఏలన, అదినీకు స్థిరముగా పూర్వమే సిద్ధించియున్నది. (కావున) ఇతరములైన వరములను కోరుము.' 44

ఇట్లు పలకుచున్న పరమేశ్వరుడగు శ్రీహరి నుద్దేశించి, ఖేదముతో ప్రహ్లాదుడిట్లు పల్కెను. 'ప్రభూ! నీచేనిప్పుడే నీభక్తి యనుగ్రహింపబడినది. ఇక వ్యర్థముగ వేరువరముల కోరనేల? ' 45

ఓ స్వామీ! సకల కామముల సాధించగల్గిన కామధేనువగు 'భక్తి' నాకను గ్రహింప బడినప్పుడు వేరుగనేదేని ఈయవలయునని యేల తలచుచుంటివి. ఒకవేళ నీ భక్తిని నా కనుగ్రహింపనిచో ఇతరములైన వరములవలన నాకేమి ప్రయోజనము?
46

సాకామధేనుర్దత్తాచేత్ కస్మాదన్యత్ ప్రదిత్ససి ।
అథసైవ దత్తాచేత్ కింమేనాథ! వరైః వరైః ॥ 46

భూయోఽపి యాచేదేవేశ! భక్తిమేవత్వయి స్థిరామ్ ।
యామోక్షాన్త చతుర్వర్గ ఫలదా సర్వదా లతా ॥ 47

కాంక్షే పరం భవద్భక్తి మితోర్వాఙ్నాస్మి భక్తిమాన్ ।
మహాభయేభ్యో ముక్తిశ్చేత్ తావతా సాకి మీడ్యతే ॥ 48

హాస్యానాదర మాయాభిరపి భక్తిః కృతాత్వయి ।
నృణాందదాతీంద్రపదం, సాత్త్వికీ సాకిమీడ్యతే ॥ 49

దేవేశా! మరల నీయందు స్థిరమైన భక్తి నాకనుగ్రహింపుమని యాచించుచున్నాను. అదియే (ఆ భక్తియే) ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థఫలముల ననుగ్రహించు కల్పలతకదా! ఇచ్చట భక్తియే సర్వపురుషార్థప్రదమని ప్రహ్లాదుడు వక్కాణించు చున్నాడు. 47

స్వామీ! ఇంతకుముందు నేను నీయెడ పరిపూర్ణభక్తి కలవాడనుకాను. కావుననే నీ యుత్కృష్టభక్తిని కోరుచున్నాను. కేవలము సాంసారికములగు మహాభయముల నుండిముక్తియైనచో, అది (ఆముక్తి) గొప్పగాకీర్తింప బడవలసినదేమున్నది? 48

నీపట్ల హాస్యముగాగాని, అనాదరబుద్ధితోకాని, మాయతో (కపటముతోగాని) భక్తినుంచినచో, అట్టిహరిభక్తి కూడ సాక్షాత్తుగ ఇంద్రపదవిచే యనుగ్రహించును. ఇక ఈ భక్తి సాత్త్వికమైనచో దానిని కీర్తింప కుండుటెట్లు.

భక్తి, సాత్త్వికి, రాజసీ, తామసియని మూడువిధములుగా నుండును. సాత్త్విక శ్రద్ధతోకూడి సత్త్వగుణ సంపన్నులైనవారు చేయుభక్తి సాత్త్వికభక్తి. దుఃఖముతో ఎంతమాత్రము కలసియుండని కేవలసుఖహేతువైన దేవయాగ విషయముగు శ్రద్ధ సాత్త్వికశ్రద్ధ. ఇట్టి శ్రద్ధకలవారు దేవతలనే పూజింతురు. ఎవ్వరు ఆయుస్సును, బలమును, ఆరోగ్యమును, సుఖమును, ప్రీతిని వృద్ధి చెందించు నట్టిదియు, పరిణామసుఖ వివర్ధకము మధురరసోపేతము, చూచుటకుద్వేగమును కల్గింపరానిదియు, భగవన్నివేదితమై సత్త్వసంపన్నమైన యాహారమును భుజింతురో వారు సాత్త్వికులు. అట్టివారి యుపాసనమే సాత్త్వికభక్తి.

మజ్జతాం భవఘోరాబ్ధౌ రజ్జురుత్తారిణీ నృణామ్ ।
త్వత్ప్రేరితా యంస్పృశతి భక్తిర్యాతి, స, తేపదమ్ ॥ 50

గూఢం మాయా తమశ్ఛన్నం బ్రహ్మానంద మహానిధిమ్ ।
దిదృక్షతాం సతాం నాథ! త్వద్భక్తిః సిద్ధిదీపికా ॥ 51

ప్రశామ్య భవశర్వర్యాం జ్ఞానదీపం తమోజుషాం ।
త్వద్భక్తిః స్వపతాం పుంసాం ప్రబోధిన్యార్య దీపవత్ ॥ 52

ఇక కటువు, ఆమ్లలవణ మిశ్రితము, తీక్ష్ణము, తీవ్రము, దుఃఖపరిణామ కారియగు ఆహారమును తినువారు రాజసులు. వీరు యక్షరాక్షసాదుల పూజింతురు. వీరి శ్రద్ధదుఃఖ సంభిన్నమై అల్పసుఖకరము. ఇక చిరకాలావస్థితము, రసవిహీనము, దుర్గంధయుక్తము, పర్యుషితము, అయిన భోజనమును దినుచు, ఉగ్రతపస్సును, ఇంద్రియ క్లేశకరములగు యుగాదులజేసి భూతప్రేతాదుల జంతుబలులతో ప్రీతి గొల్పువారు తామసభక్తులు.

వీరిముప్వురిలోను ఫలాకాంక్ష యెంతమాత్రములేక, శాస్త్ర విధిననుసరించి కేవల కర్తవ్యబుద్ధితో భగవదారాధనముగా యజనము చేయువారి భక్తియే సాత్త్వికము.

ఫలమును కోరి దంభాహంకారాదులతో యేయజనము (దేవపూజనము) చేయబడునో అది రాజసభక్తి సమన్వితము. విధిరహితమై, శ్రద్ధావిహీనముగ చేయబడు దేవపూజనము తామసభక్తిసమన్వితము. ఈ మూడిటిలో సాత్త్వికభక్తియే సర్వోపాదేయమై సర్వోత్తమైనది. శ్రీగీతలోని (17వయధ్యాయమును చూడుడు) ఇట్టి సాత్త్వికభక్తియే చతుర్విధ పురుషార్థ ప్రదమని తాత్పర్యము. 49

ఘోరమగు నీ సంసార సాగరమున మునుగు వారిని బైటకు లాగునట్టి త్రాడునీ భక్తి. అదినీచేప్రేరింపబడి యెవ్వనినితాకునో వాడువైష్ణవ పదమునుపొందును.50

స్వామీ! మాయయనెడు చీకటిచే కప్పబడిపైకి అగుపడక గూఢముగానున్న బ్రహ్మానందమను మహానిధిని ఎవ్వరు చూడదలతురో, అట్టిసజ్జనులకు ఈభక్తియే సిద్ధిని కల్గించునట్టి కరదీపము. అనగా భక్తిచేతనే సర్వానుభవ దుర్లభమగు బ్రహ్మానందము సులభమని తాత్పర్యము. 51

తమ తమ జ్ఞానదీపముల నార్పి వైచి, యజ్ఞానపు చీకట్లలో సంసారపు రాత్రియందు నిదురించుచున్న జనులకు నీభక్తియే సూర్యకాంతివలె ప్రతిబోధమును కల్గించుచున్నది. 52

సేయం భూః సకలేష్టానామనిష్టానాం జ్వలచ్ఛిఖా ।
మోక్షశ్రియః ప్రియసఖీ, నసిద్ధ్యే త్త్వయ్యదాతరి । 53

ప్రసీద సాస్తు మేనాథ! త్వద్భక్తి స్సాత్త్వికీ స్థిరా ।
యయా, త్వాంస్తౌమి, హృష్యామి నృత్యామి త్వత్పురఃసదా ।54

అథాతితుష్టో భగవాన్ ప్రియమాహ ప్రియంవదః ।
వత్స! యద్యదభీష్టం తే తత్తదస్తు సుఖీభవ ॥ 55

ఈ ఈభక్తియే సమస్తకామనల నీడేర్చుటకు నెలవు. అనిష్టముల దహించునగ్ని శిఖ. మోక్షలక్ష్మికి ప్రేమాస్పదయగు నెచ్చెలి. అట్టి ఈభక్తి, నీచేనను గ్రహింపబడనిచో సిద్ధింపదు.

భగవానుడే తానే స్వయముగ తనభక్తి ననుగ్రహించినప్పుడు అది సఫలమగునని తాత్పర్యము. భగవ దనుగ్రహములేనిదే భక్తికూడ కుదురుకొనదని యభిప్రాయము. 53

స్వామీ! అట్టి సాత్త్విక భక్తినేస్థిరముగ నాకనుగ్రహింపుము. ప్రసన్నుడవుకమ్ము. నీవనుగ్రహించిన ఆ భక్తిచేతనే నిన్ను స్తుతింతును. ఆనందింతును. నీయెదుట నర్తింతును.

ఇంతవరకు 45వ శ్లోకమునుండి 54వ శ్లోకమువరకు భగవదనుగ్రహలభ్యమగు భక్తినిగురించి ప్రహ్లాదుడు విశేషముగా కీర్తించినాడు. కనుకనే శ్రీభాగవతమున, శ్రీభగవానుడు ఉద్ధవునితో నిట్లుభక్తి వైశిష్ట్యమునుట్టంకించినాడు.

నసాధయతి మాంధర్మో, నసాంఖ్యం యోగ ఉద్ధవ!
నస్వాధ్యాయస్త పస్త్యాగో యథాభక్తిర్మమోర్జితా ।
భక్త్యాహమే కయాగ్రాహ్యః శ్రద్ధయాత్మా ప్రియఃసతాం ।
భక్తిః పునాతి మన్నిష్ఠా శ్వపాకానపి సంభవాత్ ।
వాగ్గద్గదా ద్రవతేయస్య చిత్తం
హసత్య భీక్ష్ణ రుదతి క్వచిచ్చ
విలజ్జ ఉద్గాయతి నృత్యతేచ
మద్భక్తియుక్తో భువనం పునాతి ।

అంతర్హితే మయ్యత్ర మాభిదస్త్వం మహామతే ।
త్వచ్చిత్తా న్నోపయాస్యామి క్షీరాబ్ధేరివ స్వప్రియాత్ ॥ 56

భక్తానాం, హృదయంశాన్తం సశ్రియోమే ప్రియంగృహమ్ ।
వసామి తత్ర శోభైవ, వైకుంఠాబ్ధ్యాది వస్తునా ॥ 57

రక్షోభయేభ్యః సర్వేభ్యః భక్తానాం యత్తనూరహం ।
రక్షామి, తత్తదర్థంనో కిన్ను మన్మందిరం యతః ॥ 58

పునర్ద్విత్రైః దినైః త్వంమాం ద్రష్టా దుష్టవధోద్యతం ।
అపూర్వావిష్కృతాకారం నృసింహం పాపభీషణమ్ ॥ 59

ఓ ఉద్ధవా! నన్నేధర్మము సాధింపజాలదు. సాంఖ్యము, యోగము, (అనగాజ్ఞాన కర్మములు రెండును) సాధింపజాలవు. వేదాధ్యయనముగాని, తపస్సుగాని,. త్యాగముగాని, నాపట్లగలదృఢభక్తివలెనన్ను సాధింపజాలవు. సజ్జనులకు ప్రేమాస్పదుడగు ఆత్మనైననేను కేవలము శ్రద్ధాన్వితమగు భక్తిచే మాత్రమే స్వాధీన పరచు కొనబడుదును. నాయందుగల భక్తి శ్వపాచకునిగూడ జాత్యాది దోషములనుండి విముక్తునిజేయును. గద్గద స్వరముతో నెవ్వని మనస్సు ద్రవించునో, ఎప్పుడు నవ్వుచు, ఒక్కొకచో నేడ్చుచు, సిగ్గువిడచి బిగ్గరగా పాడుచు, నర్తించుచు నెవ్వడు నాభక్తితో కూడియుండునో వాడే యీ సమస్తలోకమును పవిత్రీకరించును. ( శ్రీభాగ. 11-13- 20, 21, 24). 54

పిమ్మట మిక్కిలి పరితుష్టి చెంది ప్రియభాషణుడగు పరమాత్మ - కుమారా! నీకేమియిష్టమున్నదో అది యట్లే యగునుగాక! సుఖముగ నుండుము! ' అని ప్రియముగ పల్కెను. 55

'నేను అంతర్హితుడనైన తరువాత ఓ బుద్ధిశాలీ! నీ వెట్టి ఖేదమును పొందవలదు. ప్రియమైన పాల సముద్రమును వీడనట్లే నీమనస్సును నే నెప్పుడును విడచివెళ్లను. 56

నాభక్తుల ప్రశాన్తహృదయమే లక్ష్మితో కూడిననాప్రియ నివాసము. అక్కడనే నివసింతును. ఇక వైకంఠము క్షీరాబ్ధి మున్నగునవి కేవల శోభాహేతువులు మాత్రమే

'ప్రశాన్తములగు భక్తహృదయముల కంటె శ్రీవైకుంఠ క్షీరాబ్ధ్యాదులు ఉత్కృష్ట స్థానములు కావని తాత్పర్యము. 57

ఉక్త్వేత్యథ ప్రణమతః పశ్యతశ్చాతి లాలసమ్ ।
అతుష్టస్యేవ తస్యేశో, మాయయాన్తర్దధేహరిః ॥ 60

తతో హహాద దృష్ట్వాతం, సంభ్రాన్తో భక్తవత్సలమ్ ।
హాహేత్య శుష్కతః ప్రోచ్య బబంధ స చిరాద్ధృతిమ్ ॥ 61

అథేశాశ్లేష పుణ్యాంగ ప్రహ్లాద స్పర్శనేక్షణే ।
వాంఛన్నివోత్మనో భాస్వాన్ ఆరురోహోదయాచలమ్ ॥ 62

జాతమాత్రైవ విమలా భానుదీప్తి స్సమంతతః ।
హరిభక్తిరివాఘౌఘం వ్యధునోత్ సర్వతోనృణామ్ ॥ 63

సమస్తములైన రాక్షస భయములనుండి నాభక్తుల తనువులనేనురక్షించుట కేవలము వాటికొరకు కాదు. ఏమన, అవి నానివాసస్థానములు కనుకనే వాటిని రక్షింతును.' 58

మరల రెండుమూడు దినములలో అపూర్వముగా ప్రకటించినట్టిదియు, పాపాత్ములకు హృదయ విదారకమును అయిన నృసింహరూపముతో దుష్టవధ యందుద్యమించిన నన్నుచూతువు గాక!' 59

పిమ్మట ఈ విధముగా, పలికి, తనను అతి ప్రీతితో దర్శించుచు, నమస్కరించి పరితుష్టిజెందని యా ప్రహ్లాదుని వద్దనుండి సర్వేశ్వరుడగు శ్రీహరి మాయతో నంతర్ధానము నొందెను. 60

అటు తరువాత, ఒక్కసారిగ నగుపింపక మాయమైన భక్తవత్సలుడగు శ్రీహరి నుద్దేశించి 'అయ్యో! అయ్యో! అనిపలకుచు తొట్రుపడి కన్నుల వెంట నీరుగార్చుచు, ఎట్టకేలకు ప్రహ్లాదుడు ధైర్యమును వహించెను. 61

అనంతరము, సర్వేశ్వరుడగు శ్రీమన్నారాయణుని శరీర స్పర్శచే పవిత్రమగు దేహముగల యాప్రహ్లాదుని స్పృశింప, దర్శింప కోరికగలవాడో యన్నట్లు ఉద్యత్ కిరణుడై భాస్కరుడు ఉదయాచలముపై నావిర్భవించెను. 62

పుట్టినతోడనే వినిర్మలమగు నాసూర్యదీధితి, యెల్లయెడల, వ్యాపించినదై, శ్రీహరి భక్తివలె సర్వత్ర నరుల పాపరాశుల పటాపంచలు జేసినది. 63

అర్కాగస్త్యేన నిఃశేషం పీతేధ్వాన్తాబుధౌ స్ఫుటం ।
తీర్థసజ్జనరత్నాని తత్రతత్ర చకాశిరే ॥ 64

ముమోద పూషణం పశ్యన్ చక్రాహ్వస్తమసః క్షయే ।
యోగీవ పరమాత్మానం నిర్మలం చిరకాంక్షితమ్ ॥ 65

దృశ్యోజలాశయే ష్వేకోనానార్కః ప్రతి బింబిత ః ।
అనన్య ఏవక్షేత్రేషు క్షేత్రీవాతద్గుణో బభౌ ॥ 66

పద్మైస్సద్భిరివోద్బుద్ధి మాసాద్యార్కద్యుతిం శుభామ్ ।
కథామివ హరే, స్స్పష్టం నీలాబ్జైస్తా మసైరివ ॥ 67

సూర్యుడను అగస్త్యమునిచే చీకటియను మహాసముద్రము పూర్తిగా త్రాగివేయబడగా తీర్థములవలె పవిత్రులైన సజ్జనులనెడు రత్నములు అచ్చటచ్చట ప్రకాశించినవి. 64

చాలకాలమునుండి దర్శింపవలయునని క్లిష్టతపమొనర్చుచున్న యోగి నిర్మలుడగు పరమాత్మను దర్శించి యానందించినట్లు, చీకట్లు తొలగగనే, సూర్యుని దర్శించి చక్రవాకము మిక్కిలి సంతసించెను. 65

తత్తత్కర్మము ననుసరించి, ఒకే జీవుడు వేరువేరు దేహములలో ప్రవేశించినను, దేహధర్మములైన పరిణామముల నెంతమాత్రము పొందక ప్రకాశించురీతిగా, ఆయాయి భిన్నభిన్న జలాశయములలో ప్రతిబింబించి అనేకములుగా కన్పట్టుచున్న సూర్యబింబము, ప్రతిబింబస్థాన కృతములైన దోషము లెంతమాత్రము అంటక ఒక్కటిగనే యొప్పుచున్నది.

ఇచ్చట సూర్యబింబ దృష్టాంతముచే ఒక్కడే జీవుడు కర్మకృతములగు విభిన్నోపాధుల సంబంధము పొందినప్పటికిని తత్తదుపాధికృతములగు దోషగుణములా జీవునకంటవనియు, నిరంతరమాతడు ఒక్కడే, జ్ఞానానంద స్వరూపుడేనని చెప్పబడినది. ఇచ్చట క్షేత్రియనగా జీవుడని మాత్రమేగాక పరమాత్మయని గూడ చెప్పవచ్చును. సర్వదేహాంతర్యామిగ ఆపరమాత్మ వేరువేరుగ కన్పట్టుచున్నప్పటికిని, ఆయాయి దేహసంబంధములగు జీవధర్మములంటక స్వరూపముతోనే నిరంతరము ఒక్కడుగనే ప్రకాశించు చుండునని గూడ వ్యక్తపరుపబడినది.

శ్రూయమాణే చపరితః ప్రతిబుద్ధ జనస్వనే ।
ఉత్థాయాబ్ధి తటాద్ధీమాన్ ప్రహ్లాదః స్వపురం యయౌ ॥ 68

అథదితిజ సుతః చిరం ప్రహృష్టః
స్మృతివశతః పరితస్త మేవ పశ్యన్ ।
హరినిహిత మతిఃస్థలంశ్చ హృష్యన్
గురుగృహ ముత్పులకః శనైరవాప ॥ 69

అహమాత్మాగుడాకేశ! సర్వభూతా శయస్థితః ।

'ఓ ! నిగ్రహితేంద్రియడవగు అర్జునా! సర్వభూతముల హృదయములందున్న ఆత్మనునేనే' ( శ్రీగీత - 10 -20)

'సర్వస్యచాహం హృదిసన్నివిష్టః' అందరి హృదయములలో నున్నవాడనునేనే!

'ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి' ఓ అర్జునా! ఈశ్వరుడు సర్వప్రాణుల హృదయముల నధిష్ఠించి యుండును'

ఇత్యాది గీతావచనముల బట్టి పరమాత్మ సర్వదేహుల యందంతరాత్మ గనుక నిట్లు గూడ భావింపవచ్చును. 66

శుభప్రదమగు శ్రీహరికథను విని ప్రతిబోధమును పొందిన సజ్జనులవలె, సూర్యకాంతిసోకి పద్మములు వికసించినవి. తామసగుణ ప్రచురులగు నరులవలె కలవలు మొగిడ్చినవి. ఇక్కడ పోలికచే నిరంతరము సత్త్వసంపన్నులైన మహానుభావులు శ్రీహరిగుణ కథాశ్రవణమొనర్చి ఆనంద వికసిత హృదయములై ప్రతిబోధమును పొందగా, తమోగుణా విష్టులగు వారుమాత్రము హరికథా దూరులై నిదురించు చుందురని స్పష్టపరుపబడినది. 67

నిద్దురనుండి మేల్కాంచిన జనుల కోలాహలము నలువైపుల వినిపించుచుండగా, సముద్రతటమునుండి లేచి, ధీశాలియగు ప్రహ్లాదుడు తనపట్టణమునకరిగెను. 68

క్షణం స పశ్యన్నివ విష్ణుమగ్రే
హృష్యన్ జయేత్యుచ్చతరం ముదోక్త్వా ।
అథానిరీక్ష్యార్తమనా భవంశ్చ
ముహుస్తదానీం విచచార భక్తః ॥ 70

ఇతి నారదీయే హరిభక్తి సుధోదయే ప్రహ్లాదచరితే చతుర్దశాధ్యాయః ॥

పిమ్మట రాక్షసకుమారుడగు ప్రహ్లాదుడు చాలకాలము ఆనందమున మునిగి తేలుచు స్మరణవశమున నంతట శ్రీహరినే దర్శించుచు, శ్రీహరియందే బుద్ధిని కుదురుకొల్పినవాడై తొట్రుపడుచు, ఆనంద పరవశుడగుచు, పులకాంచిత దేహుడై మెల్లగా తండ్రి యింటికిచేరెను.

నిరంతర భగవన్మూర్తి ధ్యానముచే భక్తుని హృదయమానందముతో నుప్పొంగి అంతట భగవానునే దర్శించుచు, తనువును మరచి పులకాంచిత శరీరుడగుట యాతని భక్తి స్వచ్ఛతకు నిదర్శనమని యెరుగవలయును . దీనినే మరికొంతముందు శ్లోకమున వివరించుచున్నాడు. 69

భక్తునకు కల్గెడి భగవదను భవము అనన్యసామాన్యము. ప్రహ్లాదుడు ఒక్కక్షణము ఎదురుగా శ్రీహరి దర్శించుచున్న యనుభూతిని పొందుచున్నాడు. బిగ్గరగా, సానందముగ 'జయ! జయ!' అని పల్కుచున్నాడు. చూపులు లక్ష్యశూన్యములా యనునట్లున్నవి. మనస్సు ఆర్తితో నిండినది. ఇట్లు అసాధారణము భక్తమాత్ర సహజమునైన ప్రవృత్తిగలవాడై ప్రహ్లాదుడిటునటు తిరిగెను.

ఇది పరాకాష్ఠచెందిన భక్త్యావేశ స్థితికి నిదర్శనము. 70

ఇది శ్రీ నారదీయ పురాణాంతర్గతమగు 'హరిభక్తిసుధోదయము' నందు

ప్రహ్లాదచరితమున పదునాల్గవ యధ్యాయము.

# పంచదశాధ్యాయః

**పంచదశాధ్యాయసారము :-** ఈ అధ్యాయము నృసింహావిర్భావ ఘట్టముతో కూడినదగుచే దీనికి 'నృసింహప్రాదుర్భావ' మనియే పేరు.

ప్రహ్లాదుని యనన్య భక్తికి ద్రవించి భగవానుడు దుష్టనిగ్రహణవ్యాజమున శిష్టరక్షణార్థమై నృసింహరూపమున నావిర్భవించినాడు. శ్రీభాగవతాదులలో నృసింహావిర్భావము వేరుగనున్నది. తన భక్తుని మాటను సత్య మొనర్చుటకును, తన సర్వగతత్వమును నిరూపించు కొనుటకును, భగవానుడు ప్రహ్లాదవచనానుసారముగ స్తంభముననావిర్భవించి నట్లున్నది.

సతం విధాతుం నిజభృత్య భాషితం
వ్యాప్తించ భూతేష్వఖిలేషుచాత్మనః ।
అదృశ్యతాత్యద్భుత రూపముద్వహం
స్తంభే సభాయాం నమృగం -నమానుషమ్॥

ఇక విష్ణు పురాణమున హిరణ్య కశిపుని చంపెననియేగాని స్తంభప్రస్తావనలేదు. ప్రస్తుతగ్రంథమునగూడ, హిరణ్యకశిపుడు ప్రహ్లాదునితో వాదించుచుండగా భవనము వెలుపలి పెద్దకోహలమైనట్లును, ఏమనియాశ్చర్యముతో చూడబోగా, అద్భుతమగు నరసింహరూపము కన్పట్టినట్లును అధ్యాయము చివర చెప్పబడినది. హిరణ్యకశిపునకా రూపముతనను సంహరింపవచ్చిన శ్రీహరి కపట రూపముగా గోచరింపగా, అనన్య భక్తుడగు ప్రహ్లాదునకు విశ్వరూపదర్శనమైనది. నృసింహమహాదేహమున సమస్త చరాచర విశ్వము గోచరించినది. ఇట్లు గోచరించుట శ్రీహరి కృపచేతనని చెప్పబడినది.ఇది ఇచ్చటగల విశేషము. 45,46,47,48,49 శ్లోకములీయద్భుత రూపమును దర్శింప జేయుచున్నవి.

3వ శ్లోకమునుండి 11వ శ్లోకమువరకు ప్రహ్లాదుని వైరాగ్య సంపత్తిని దర్శింప జేయు భగవత్ స్తవమున్నది. ఇది సర్వులు మననమొనర్పదగినది.

శ్రీ నారద ఉవాచ –

తతః ప్రభృతి సోత్కంఠో హృష్టః శ్రీశకృతాంతరః।
అలౌకికశ్చచారాసౌ జడవల్లోక జాడ్యకృత్ ॥ 1

ద్రావయన్ దురితాన్యుచ్చైరాహ్వయన్ మంగళాని సః
నృత్యన్ననన్తనామాని తత్రతత్రేతి గాయతి ॥ 2

శ్రీ గోవింద! ముకుంద! కేశవ! హరే! శ్రీవల్లభ! శ్రీనిధే!
శ్రీవైకుంఠ! సుకంఠ! కుంఠితఖల! స్వామిన్నకుంఠోదయ।
శుద్ధధ్యేయ! విధూత ధూర్త! ధవల శ్రీ! మాధవాధోక్షజ !
శ్రద్ధాలబ్ధ! విధేహి నస్త్వయి ధియం ధీరాం, ధరిత్రీధర! 3

శ్రీనారద మహర్షి పలికెను.

అప్పటి నుండి మిక్కిలి యుద్విగ్నచిత్తుడై ఆనందపరవశుడగుచు శ్రియః పతియగు శ్రీమన్నారాయణునియందుంచబడిన హృదయము కలవాడై లోక జాడ్యమును హరించువాడైనను ఆ ప్రహ్లాదుడు అప్రాకృతమగు అనుభవముతో జడునివలె సంచరించెను. 1

లెస్సగా పాపముల పోద్రోలుచు, శుభముల నాహ్వానించుచు, నర్తన మొనరించుచు ఈవిధముగా నచ్చటచ్చట శ్రీహరికిగల యనన్త నామముల గానమొనర్చుచున్నాడు. (ఎట్లన్నచో) 2

శ్రీగోవింద! ముకుందా! కేశవా! హరీ! శ్రీప్రియా! లక్ష్మినివాసా! వైకుంఠనిలయా! సుందరకంఠా! దుర్జనుల నణగత్రొక్కెడివాడా! స్వామీ! అప్రతిహతమగు ఉదయము కలవాడా! విశుద్ధస్వభావులగు భక్తులచే ధ్యానింపదగువాడా! దుర్జనులప్రోదోలువాడా! శుభ్రశరీరా! మాధవా! అధోక్షజా! (నిగ్రహింపబడిన ఇంద్రియములు కలవాడా!) కేవల శ్రద్ధచే మాత్రమే లభించువాడా! భూభరణదక్షా! నీయందు మాబుద్ధి స్థిరముగ కుదురుకొని యుండునట్లను గ్రహింపుము. 3

శ్రీపద్మనాభ! మధుసూధన! వాసుదేవ!
వైకుంఠనాథ! జగదీశ! జగన్నివాస!
నాగారివాహన ! చతుర్భుజ! చక్రపాణే !
లక్ష్మీనివాస! సతతం మమదేహిదాస్యమ్ । 4

అచ్యుత! గుణాచ్యుత! కలేశ! సకలేశ!
శ్రీధర! ధరాధర ! విబుద్ధజనబుద్ధ !
ఆవరణవారణ! సునీలఘననీల।
శ్రీకర! గుణాకర! సుభద్ర! బలభద్ర! 5

కర్ణసుఖవర్ణణ! సుఖార్ణవ। మురారే !
స్వర్ణరుచిరాంబర! సుపర్ణరథ! విష్ణో!
అర్ణవనికేతన! భవార్ణవభవం నో
జీర్ణయ భయం గుణగణార్ణవ! నమస్తే ॥ 6

ఓ కమలనాభా! మధుసూదనా! వాసుదేవా! ఓ వైకుంఠపతీ! లోకాధీశా! సకలజగన్నివాసా! గరుడవాహనా! చతుర్భుజా! చక్రాయుధధారీ! శ్రీనిలయా! నిరంతరము నాకు నీదాస్యమునే అనుగ్రహింపుము తండ్రీ! 4

హే! అచ్యుతా! సకలకళ్యాణగుణపూర్ణా! (గుణములనుండి తొలగిపోనివాడా!) రామకృష్ణాద్యనేకావతార కారీ! సకల నియామకా! శ్రీధరా! భూధరణచణా! జ్ఞానిజనవిజ్ఞేయా! మాయావరణమును నివారించువాడా! నల్లని మేఘమువలె నీలవర్ణఛ్ఛాయకలవాడా! లక్ష్మీకారకా! సకలగుణాకరా!మంగళకరా! బలరామా! 5

కర్ణరసాయనమైన మనోహరలీలా కథామృతమును వర్షించువాడా!(ఆనందసాగరా! మురారీ! బంగారు వన్నెగల పీతాంబరమును ధరించినవాడా ! గరుడవాహనా! సర్వవ్యాపకుడవైన స్వామీ! సంసార మహాసాగర జన్యమైన మా భయమును నశింపజేయుము. నీకివే ప్రణతులు. 6

ఈ విధముగా శ్రీహరి గుణగణముల గానమొనర్చుచు, శ్రీహరి లభింపనందున కలిగిన గాఢమగు దుఃఖముతో కన్నీరుగార్చుచు, బొంగురు వోయిన కంఠస్వరము

గాయన్నితి తదప్రాప్తి గాఢదుఃఖాశ్రు గద్గదః ।
వివృత్య రౌత్యథోభక్తః సంవృతో విస్మృతైర్జనైః ॥ 7

నరకే పతతః పురుషస్య విభో ।
భవతశ్చరణం శరణం తరణమ్
భవవైతరణీ పతితం కరుణం
విరుతం కిమనన్త నపశ్యసి మామ్ ॥ 8

త్వయ్యేవ భక్తిం జనయంస్త్వమేవ
మాముద్ధరాస్మాత్ కృపయా భవాబ్ధేః ।
క్లిష్టం కృపాలో! నదయాస్తి తేచేత్
తర్హీశ! హా! కర్మవశో హతోస్మి ॥ 9

కలవాడై, ఒడలు మరచియున్న జనులతో చుట్టువారియుండి బిగ్గరగా నా ప్రహ్లాదుడు రోదించుచున్నాడు.

భగవద్భక్తునకు ఏక్షణమున భగవద్విరహము కలిగిన ఆక్షణమే దుర్భరముగా నుండి దుఃఖ కారణమగును గాన, ఇతః పూర్వమే భగవత్ సాక్షాత్కారమైనను, మరుక్షణమునుండి కలిగిన భగవద్విరహమాతనికి దుర్భరముగా నుండునని ప్రహ్లాదుని యవస్థ సూచించుచున్నది. 7

ఘోరమగు నరకమున బడుచున్నవానికి, ఓ విభవా, నీచరణమే శరణము. అదియే తరణోపాయము. ఓ అనన్తా! ఈ సంసారమనెడు దుర్భర వైతరిణీనదిలోబడి దీనముగా నేడ్చుచున్న నన్నేలజూడవు? 8

ఓ దయానిధీ! నీయందు అచంచలమగుభక్తిని, నీవేయనుగ్రహించి దయతో నీ సంసార మహాసాగరమునుండి నన్నుద్ధరింపుము. నీ దయలేకున్నచో చాల కష్టము తండ్రీ! అట్లైనచో అయ్యో! కర్మమునకు వశపడి నశించితిని కదా! 9

ఓ విభూ! నాథా! కామము, క్రోధము, లోభము, మోహము, మదము మాత్సర్యము

కామక్రోధమదాద్య మిత్ర నివహప్రోత్సాహి తైరున్మదైః
అశ్రాన్తైః కుటిలైశ్చ తైరతిబలైః దుర్నిగ్రహైర్దూరగైః
నాథైకాదశభిర్భృతేంద్రియఖలైః కర్మార్జ్యతే రాశిశో
భోక్తైకోఽస్మి దయా నచేత్తవ విభో! యాయాం తదన్తంకదా! 10

మానో మూర్ధ్ని శిలాయతే, గరళవజ్జ్వాలాయతేఽన్తర్ నృణాం
మాత్సర్యం, భ్రమతాంధ్యృశౌపిదధతి క్రోధాభిధారేణవః ।
కాన్తారే భవనామ్ని లోభకలిలే యష్టిం మనోజోవటుః
బుద్ధ్యాఖ్యాం హరతీతి ముక్తిసరణిర్దుర్గే సుదూరా బత । 11

అను నారు బలవత్తర శత్రువులచే ప్రోత్సహింపబడి, మదించి, అలసట లేక కుటిలతతో వర్తించుచు, ప్రబలములై, నిగ్రహించుటకు కూడ అందనంతదూరము వెడలిన యీపదకొండు దుష్టేంద్రియములచే పాపరాశి అనంతముగ ప్రోగుజేసి కొనబడుచున్నది. కాని ఇన్ని ఇంద్రియములచే ప్రోగుచేయబడిన పాపరాశియొక్క ఫలమునునుభవించువాడను నేనొక్కడనే స్వామీ! నీదయలేనిచో ఈ యపార పాపరాశి నాకెప్పటికి తీరును?

పూర్వశ్లోకమున కర్మవశముననే ప్రాణికి కల్గెడు సంసార క్లేశము మహాసాగరమై దాటరానిదైయుండుననియు, అది శ్రీహరికృపచే సిద్ధించిన భక్తివలననే తొలగునని చెప్పబడినది. ఈ శ్లోకమున పాపకర్మము నార్జించుటకు పదకొండు ఇంద్రియములేకారణమని చెప్పుచున్నాడు. ఈ ఇంద్రియములలో ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు మనస్సుచే ప్రేరింపబడి కర్మమునాచరించుచున్నవై పాపరాశిని పెంచుచుండును. ఈ ఇంద్రియములకు బలమును చేకూర్చి ప్రోత్సహించునవి కామక్రోధాదియరిషడ్వర్గము. ఇట్లు పెరిగిపోయిన అపార పాపరాశిని జీవుడొక్కడే అనుభవింపవలయును. అది బహుజన్మములలోననుభవించిననూ తీరునదికాదు. కావున పాపరాశిని నశింపజేసికొనవలయునన్నచో శ్రీహరి కృపయే కావలయును. 10

అయ్యో! ఈదురభిమానము నెత్తిపై పెద్దరాయివలెనున్నది. ఈ మానవుల హృదయమున మాత్సర్యము విషమువలె ప్రజ్వరిల్లుచున్నది. భ్రాన్తినిచెందిన వారి కన్నులను క్రోధమనెడు దుమ్ము క్రమ్ముచున్నది. లోభసమాకులమై క్లిష్టమైన సంసారమను మహారణ్యమున, చేయూతగానున్న బుద్ధియను చేతికర్రను మన్మథుడను

శ్రుత్వేత్యద్భుత వైరాగ్యా జ్జనాస్తస్యోజ్జ్వలాగిరః ।
అశ్రూణి ముముచుః కేచిత్ వీక్షకా వ్యనమంశ్చతమ్ ॥ 12

లీలయాన్యే, పరేహాస్యాద్, భక్త్యాకేచిచ్చ, విస్మయాత్।
జనాస్తం సంఘశోఽపశ్యన్ సర్వథావిహితైనసః ॥ 13

తతః పునస్సగోవింద కీర్తనానంద నిర్భరః ।
నృత్యన్ గాయన్ సబభ్రామ జనేష్వేత్యస్పృహః సదా ॥ 14

ధున్వన్ జనేఘాన్ అచరత్ సయోగీ నిర్మలః స్వయం।
కిమర్కశ్చరతి స్వార్థం? కింతు లోకతమో భిదా ॥ 15

తుంటరి దొంగిలించుచున్నాడు. ఇక ముక్తి మార్గము చాలదూరముననున్నది. కదా! నెత్తిపైనున్న బరువైన రాయి ప్రాణిని క్రుంగదీయునట్లు దురభిమానము మానవునిలో గొనుచున్నది. రూప-విద్యా-ధన-కుల నిమిత్తముగ మానవులకు కల్గెడి యభిమానము మిక్కిలి చెడ్డది. తనయందు లేని గొప్పతనమునాపాదించు కొనుటతోపాటు రూపవిద్యాదులుగల యితరుల పట్ల ఈర్ష్యాసూయలు కలిగించునది కూడ యీ మానమే. పరుల గొప్పతనమును సహింపని, వారిపట్ల నిష్కారణద్వేషము క్రోధము పెనగొని దుమ్మువలె కన్నులగప్పివైచును. ఇదేయదనని మన్మథుడువారి బుద్ధిని భ్రష్టమొనర్చును. ఇక నీ సంసారమహారణ్యమున చేయూతయైన కర్రగూడలేకదిక్కుతోచక అలమటించు వారికి మోక్షమార్గము దూరమైపోయి అందరానిదేయగును. కావున కామమూలమగు మానము, తన్మూలమగు మాత్సర్యము, దాని వలన కలుగు క్రోధము; ఇవియన్నియు మానవ పతన కారణములై వారిని మోక్ష మార్గము నుండి దూరము చేయును కనుక, వాటిని ప్రయత్న పూర్వకముగ విడువవలయునని తాత్పర్యము. 11

ఈ విధముగా నాశ్చర్యకరమగు వైరాగ్యము సంపత్తిని పురస్కరించుకొని ప్రహ్లాదుడు పలికిన యుజ్జ్వలములగు మాటలువిని, చూపరులగు జనులు కొందరు కన్నీటిని విడచిరి. కొందరు ప్రహ్లాదునకు నమస్కరించిరి. 12

సర్వాత్మనా పాపకర్ములగు నా జనులలో కొందరు విలాసముగాను (వినోదముగాను) కొందరు పరిహాసముగాను, మరికొందరు భక్తిచేతను, కొందరాశ్చర్యముతోడను గుంపులుగా జేరి ప్రహ్లాదునిచూచిరి. 13

అథాగతం తం ప్రహ్లాదం దృష్ట్వా దైత్యాః సు విస్మితాః
శశంసుర్దైత్యపతయే, యైః క్షిప్తః సమహార్ణవే ॥ 16

సుస్థం సమాగతం శ్రుత్వా దైత్యరాడ్ విస్మయాకులః ।
'ఆనీయతాం స' ఇత్యాహ, క్రోశన్ మృత్యువశేస్థితః॥ 17

అథాసురైర్ద్రుతానీతః సమాసీనం సదివ్యదృక్ ।
ఆసన్నమృత్యుం దైత్యేంద్రందదర్శాత్యూర్జితశ్రియమ్॥ 18

గత్వాస్తమాయుర్జలధేః వపుస్తస్యావతారణే।
కృతోద్యోగం యవనికా మాత్రాన్తర్ధిం యమేక్షణే ॥ 19

నీలాంశు మిశ్రమాణిక్య ద్యుతిచ్ఛన్నం విభూషణం।
సధూమాగ్ని శిఖావ్యాప్త మివాసన్న చితాస్థితమ్ ॥ 20

పిమ్మట, మరల గోవింద నామ సంకీర్తనామ సంకీర్తనమువలన కల్గిన ఆనందముచే నిండిన హృదయముకలవాడై నర్తించుచు, పాడుచు, ఇట్లే సమస్త కామనలవీడి నిరంతరము యొడలు తెలియని వాడై యాతడు జనులలో తిరుగాడెను. 14

లోకుల పాపముల విదల్చుచు, నిర్మలాంతః కరణుడై నిగృహీతేంద్రియుడగు నా ప్రహ్లాదుడు తనంతతానుగనే తిరుగాడెను. సూర్యుడు స్వార్థమునకై తిరుగునా? కేవలము లోకమునావరించిన చీకట్లు ఛేధించుటకే కదా! 15

తరువాత, తిరిగివచ్చిన యా ప్రహ్లాదుని చూచి, అచ్చెరువు నందినవారై, పూర్వము ప్రహ్లాదుని సముద్రన బడవైచిన రాక్షసులు, దైత్యాధిపతికి వానిరాక నెరిగించిరి. 16

ఎట్టి శరీర దోషములేక తిరిగివచ్చిన ప్రహ్లాదుని గురించివిని ఆశ్చర్యచకితుడైన యా హరిణ్యకశిపుడు, మృత్యువునకువశపడినవాడై యాక్రోశించుచు 'వానినిటుతెండు' అని పలికెను. 17

పిమ్మటదానవులచే త్వరగా తీసికొని రాబడినవాడగు ప్రహ్లాదుడు దివ్యదృష్టితో పరికించి సింహాసనమున కూరుచుండి విపులైశ్వర్య సంపన్నుడైన యా దానవ పతిని మృత్యువుచే కబళింపబడనున్నవానిగా దర్శించెను.

మలినాంగద్యుతి ధ్వాన్తచ్ఛాదితా భరణచ్ఛవిం ।
విష్ణునిందాజ మూర్తాఘగ్రస్యమాన శ్రియమ్‌యథా ॥ 21

దంష్ట్రోత్కటైర్ఘోర ఘనైః ఘనచ్ఛ విభిరుల్బణైః ।
కుమార్గ దర్శిభిర్దైత్యై ర్యమదూతైరివావృతమ్ ॥ 22

దవస్పృష్ట వనాంతస్థ కింశుకాభం సురారిణమ్ ।
అజ్ఞాత సద్యోనాశం తందృష్ట్వా ఖిన్నోహ్యమోఘదృక్ ॥ 23

దూరాత్ ప్రణమ్యపితరం, ప్రాంజలిస్తం దృశార్పితే ।
పీఠే నివిష్టస్తంక్రుద్ధం, సదృష్ట్వాకసీదవాఙ్ముఖః॥ 24

అథాహోకారణక్రుద్ధః ఖలరాడ్ భర్త్సయన్ సుతం ।
భగవత్ప్రియమత్యుచ్చైర్మృత్యు మేవాహ్వ యన్నివ ॥ 25

ఈ శ్లోకమున 'ఆసన్నమృత్యుమ్' అత్యూర్జితశ్రియమ్' అనుటచే హిరణ్యకశిపుడు అతివిశాలము అనన్య లభ్యమునైన యపారసంపద కలవాడనియు, అయినను ఆసంపద వానిని బ్రతికించజాలదనియు-ఎంతటియైశ్వర్య సంపన్నుడైనను తనవద్దగల సంపదతో భృత్యవర్గమును భోగములను సంపాదింప గల్గునేమోగాని ఆసన్నమైన మృత్యువును తప్పించు కొనలేడని సూచింపబడినది. 18

(ఈ యైదు శ్లోకములు ఒకే సమన్వయము కలవి )

ఆసన్న మృత్యువై సింహాసనమున గూరుచుండిన తండ్రిని దివ్య దృష్టితో చూచి ప్రహ్లాదుడు మిక్కిలి ఖిన్నుడయ్యెను. ప్రహ్లాదుని కంటికగుపించిన హిరణ్యకశిపుడు-ఆయుర్దాయమను మహాసముద్రపు చివరభాగమునకు తన శరీరము దాటింపనుద్యమించి నట్లున్నాడు. కేవలము యమధర్మమునకు, నడుమతెర అడ్డుగానున్నట్లనిపించినది. నల్లని దేహకాంతిచే సంమిశ్రితమైన మాణిక్యకాంతిచే కప్పబడినవాడై బాగుగ నలంకరించుకొన్న దేహముతో, పొగతో చుట్టువారిన యగ్నిశిఖలతో గప్పబడిన చితిపై కూర్చున్నవానివలె కన్పట్టుచున్నాడు. మలినమైన శరీరకాంతి యనెడు చీకటిచే కప్పబడిన యాభరణద్యుతికల్గినవాడై. విష్ణువును నిందించుట వలన కల్గిన పాపరాశిచే కబళింపబడనున్న శ్రీకలిగియున్నాడు.పై కగుపించుచున్న పెద్ద పెద్ద కోరలు గలిగి, భయంకర జీమూతములవలె నల్లనిదేహచ్ఛాయ కలిగి బలిసినవారును, కుమార్గము

రే! మూఢ! శ్రుణు! మద్వాక్యమేకమేవాన్తికం ధ్రువమ్ ।
ఇతోఽన్యచ్చ నవక్ష్యామి, శ్రద్ధాంకురు యథేచ్ఛసి ॥ 26

ఉక్త్వేతి ద్రుతమాకృష్య చంద్రహాసాసి ముత్తమం
సంభ్రమాద్వీక్షితస్సర్వైః చాలయన్నాహ, తం పునః ॥
భవిష్యసి ద్విధావాద్య హరింత్యక్ష్యసివా వద! ॥ 27

ఇత్యుక్త వచనే మూర్ఖే హ్యత్యుద్గేజ్వలతి క్రుధా।
'హతో హతో హా! ప్రహ్లాద' ఇత్యాసీ ద్రక్షసాం స్వనః । 28

కేచిత్ ప్రహర్షం, సదయం కేచిత్, కేచిత్ సవిస్మయం ।
కిం వక్ష్యతీత్యపశ్యంస్తముద్గ్రీవా నిమిషాసురాః ॥ 29

చూపించుచు యమదూతలవలెనున్న భృత్యులచే చుట్టవారియున్నాడు. దావాగ్నినలలచే చుట్టు వారికి యడవిలోగల మోదుగవలె నెర్రగా నున్నవాడును, తనకాసన్నమైన మృత్యువునెంతమాత్రము తెలియజాలకయున్న హిరణ్యకశిపుని ప్రహ్లాదుడుచూచెను. 19,20,21,22,23,

దూరమునుండియే, తండ్రికి నమస్కరించి, అంజలిఘటించినవాడై, కనుసైగచే చూపబడిన యాసనమున కూర్చుండబెట్టబడిన వాడగు ప్రహ్లాదుడు, క్రోధావేశపూర్ణుడగు హిరణ్యకశిపుని జూచి శిరమును వెనుకకు ద్రిప్పుకొనెను. 24

పిమ్మట, నిష్కారణముగా కోపగించిన వాడై కుమారుని భయపెట్టుచు, ఖల చక్రవర్తియగు హిరణ్యకశిపుడు మృత్యువు నాహ్వానించుచున్నట్లు బిగ్గరగా భగవత్ప్రియుడగు ప్రహ్లాదునితో పలికెను. 25

ఓరీ! మూర్ఖుడా! నేపలికెడి యొక్కమాటనే దగ్గరగా వినుము. నిశ్చయముగా నింతకంటె నేనేమియు వేరుగా చెప్పను. శ్రద్ధనుంచుము. ఇక నీ యిష్టమే! 26

ఈ విధముగా పలికి, వెంటనే చంద్రహాసమను శ్రేష్ఠమగు కత్తిని లాగి, తొట్రుపాటుతో నందరిచే చూడబడినవాడై మరల ప్రహ్లాదునితో-'రెండుగానేడు వ్రయ్యలగుదువా? లేక హరినివిడతువా? చెప్పుము' అని పలికెను. 27

అథాశంకిత ధీర్యావద్విష్ణుం నత్వా వివక్షతి ।
శుశ్రువే సంభ్రమస్తావద్ బహిః కోకప్యతి భైరవః॥ 30
అభూత పూర్వో హాహేతిక్రోశతాం భయ ఘర్ఘరం ।
రక్షస్సమాకులరవో వహ్న్యుత్పాత ఇవా భవత్ । 31

హమాతస్తాత పుత్రేతిక్రోశతాం, రుదతాం భృశం ।
మహాస్వనేన బ్రహ్మాండం భిత్త్వేవాస్ఫోటితా దిశః । 32

బహిస్తదద్భుతం శ్రుత్వారాజా ససచివో హఠాత్
ససంభ్రమః కిం కిమతి బ్రువన్ పాసి వినిర్యయౌ । 33

మూర్ఖుడగు హిరణ్యకశిపుడు కత్తినిపైకెత్తి క్రోధముతో మండిపడుచునిట్లు పలుకగా 'హా! హా! ప్రహ్లాదుడు మడసినాడు' అని రాక్షసుల కోలాహలధ్వని మింటి కెగసినది. 28

కొందరానందముతోను,మరికొందరు దయతోను, కొందరాశ్చర్యముతోను-'ఏమిపలుకగలడో కదా! ' యనిమెడలు పైకెత్తి, రెప్పపాటు లేకుండగ నారాక్షసులు చూచిరి. 29

అనన్తరము, ఎంతమాత్రము సందేహగ్రస్తముగాని బుద్ధిగలవాడై ప్రహ్లాదుడు, విష్ణువునకు నమస్కరించి పలుక దలచినంతనే, వెలుపల ఏదియో భయంకరమైన కోలాహము వినిపించినది. 30

ఇతః పూర్వమెన్నడు ఎరుగనిదియు, 'హాహా' యని యాక్రందించుచున్న రాక్షసుల భయసమాకులధ్వని, గొప్పయగ్న్యుపద్రవము వలె యుద్భవించెను.31

'హాతల్లీ' హా తండ్రీ, హా పుత్రుడా' యని యక్రోశించుచు దుఃఖించు చున్న రాక్షసుల మహాధ్వనిచే బ్రహ్మాండము బద్దలై దిక్కులన్నియుబ్రద్దలైనవి. 32

భవనము వెలుపల ఆశ్చర్యకరమగు నాధ్వనినివిని, మంత్రులతోపాటుగ హిరణ్యకశిపుడు హఠాత్తుగా తొట్రువడుచు 'ఏమి ఏమి' యని పల్కుచు ఖడ్గహస్తుడై చూడవచ్చినాడు. 33

అథాయాన్తం దదర్శారాద్ఘోరం కాలానల ప్రభమ్ ।
కథంచిల్ల క్షితాకారం నృసింహం సోఽప్యపూర్వవత్ । 34

మత్వాలయాగ్నిమేవార్వాక్, కోఽపిప్రాణీత్యతః పరం
చిరాన్నృసింహం తత్తేజః ప్లుష్ట సద్మావిదత్ సతమ్ । 35

సటాధూనన కల్పాన్త మరుద్భ్రామిత భాస్కరమ్ ।
ఊరువాత సముత్ఖాత సర్వోపవన పర్వతమ్ । 36

పాదన్యాసచలత్ క్షోణీ భగ్నహర్మ్య గృహావలిమ్ ।
జ్వాలాపటల మత్యుగ్రం సృజన్తం దిక్షువీక్షితైః 37

పిమ్మట, దూరమునుండియే, ప్రళయాగ్ని సమానకాన్తి కలిగి వచ్చుచు, భయంకరము అపూర్వమునై ఎట్లో అతిప్రయత్నమున దర్శింపబడిన యాకృతిగల నృసింహమూర్తిని హిరణ్యకశిపుడు వీక్షించినాడు. 34

మొదట ప్రళయాగ్నియేనని భావించి, తరువాత ఏదియో భయంకరసత్త్వమనియు, చాలకాలముతరువాత ఎట్టకేలకు ఆహిరణ్యకశపుడు, భవనమును మండిచుచున్న యా తేజస్సును నృసింహునిగా తెలిసికొనెను. 35

జడలను ఇటునటు విదల్చుటచే పుట్టిన ప్రళయకాలవాయువుచే భ్రమింప జేయబడిన (గిర్రునత్రిప్పబడిన) సూర్యబింబముకలవాడును, తొడల కదలికచే పుట్టిన మహావాతముచే పెరికి వేయబడిన సమస్తారణ్య పర్వతములు కలవాడును, పాదముల చలనముచే కంపించిన పృధివిపై త్రెళ్లిపడిన మహాభవన-గృహసముదాయములు కలవాడును, తన చూడ్కులచేతనే దిక్కులయందు అగ్నిజ్వాలావళుల సృజించుచున్న వాడును అత్యుగ్రరూపుడునైన నృసింహుని వీక్షించెను. 36,37

'ఆహా!' ఎవ్వరి మహాసత్త్వము. ఎక్కడను చూడనిది వినదియైన రూపమును ధరించినది. ఈ యాకారముయొక్క సగము సింహమై కన్పట్టుచున్నది. వేరొక సగము భయంకరమగు మానుషరూపము. ఇట్టి మహాసత్త్వము (గొప్పబలముగల ప్రాణి) పూర్వము ఎచ్చటను ఉన్నట్లు తెలియదు. ఒకవేళ దేవర్షియగు నారదునిచే చెప్పబడిన యా హరియే ఇట్లు వచ్చినాడాయేమి? ససైన్యముగ నన్ను జంపుటకై దేవతలచే ప్రార్థించబడి మాయావియగు నా విష్ణువు (కైటభుని జంపినవాడు) నిక్కముగా నీతడే

అహెూ! కోఽయంమహాసత్త్వోఽ దృష్టో శ్రుతరూప ధృక్।
అస్యార్ధం సింహమాభాతి, మానుషంచార్ధముద్భటమ్॥ 38

కథంచైతన్మహాసత్త్వం పురానాకలితం క్వచిత్।
యద్వా దేవర్షిణా ఖ్యాత ఆగతః కిం హరిః కిల ?॥ 39

త్రిదశైః ప్రార్థితోఽహన్తుం సబలం మాం సమాయికః।
కైటభారి ర్భవే దేవ ధ్రువం చక్రాదిలాంఛితః॥ 40

అస్త్వేనం నృమృగం హత్వా హన్మిదేవాన శేషతః।
ఇత్యేవం చిన్తయన్ యావత్ సాక్షాత్తం తీర్థదర్శనమ్॥ 41

అయియుండవచ్చును. ఏలన ఈతడు శంఖచక్రాది చిహ్నములతో కూడియున్నాడు కదా! కానిమ్ము. ఈ నరమృగమును చంపి, దేవతలగూడ నిశ్శేషముగా సంహరించెదను'. అని భావించుచు ఎంతవరకు పవిత్ర దర్శనుడగు నా నరహరిని వీక్షించినాడో అంతవరకాతడు చేసిన విష్ణునిందా జన్యము వైష్ణవ ద్రోహ జన్యమునగు పాపముతప్ప, మిగిలిన సర్వవిధ పాపము పటాపంచలై పోయినది. సమస్త జన్మలలో తాను సంపాదించిన భ్రూణహత్యాది జన్యమైన నిఖిలపాపము తృటిలో నశించిపోయెను.

ఇచ్చట హిరణ్యకశిపుడు మహాపాపియైనను, విష్ణుదర్శనముచే ఆతడు చేసినపాపము లన్నియు నశించినవని చెప్పుచు, 'విష్ణునిందాజన్యములు, వైష్ణవద్రోహజన్యములునైన పాపములు తప్ప' యని యనుటచే, విష్ణునిందా జన్యమగు పాపము, వైష్ణవద్రోహజన్యమగు పాపము మిక్కిలి బలవత్తరములని స్పష్టపరుపబడినది. విశేషించి తనను నిందించిన వారిని గూడ భగవానుడు క్షమించునేమో గాని తనవారిని అనగా భాగవతోత్తములగు వైష్ణవులపట్ల ద్రోహబుద్ధితో ప్రవర్తించి పీడించినందు వలన కల్గిన పాపమునెంత మాత్రము సహింపజాలడని కూడ స్పష్ట పరుపబడినది.

శ్రీమద్భాగవత దశమస్కంధగతమగు నంబరీషోపాఖ్యానము భాగవతాపరాధమును భగవానుడుకూడ సహింపడని లెస్సగా నిరూపించుచున్నది.

సాధవో హృదయం మహ్యం, సాధూనాంహృదయంత్వహమ్।
మదన్యంతేనజానన్తి నాహంతేభ్యో మనాగపి॥
అతోహ్యాత్మాభిచారస్తే యతస్తం యాతువైభవాన్।
సాధుషు ప్రహితం తేజః ప్రహర్తుః కురుతేఽశివమ్॥

వీక్ష్యతం తావదస్యాంహః సర్వం క్వాపినిరాకృతమ్ ।
విష్ణునిందాకృతం హిత్వా వైష్ణవద్రోహజం తథా ॥ 42

అథా సురపతిర్వీరో ధనుర్జగ్రాహ నిష్ఠురమ్ ।
తేనప్రోత్సాహితాః కేచిత్ భటాస్తస్థుశ్చసాయుధాః ॥ 43

ప్రహ్లాదోऽపి తదాదృష్ట్వాజజ్ఞౌతం పరమేశ్వరమ్ ।
పూర్వోక్తం తద్వచః శ్రుత్వా ప్రణనామ ససంభ్రమః ॥ 44

భాగవతోత్తముడైన యంబరీషుని పట్ల అపచారమొనర్చి వైష్ణవ సుదర్శన చక్రపుబారినిబడిన దుర్వాసోముని నుద్దేశించి, శ్రీహరి-'సాధువులు నాహృదయము,సాధువుల హృదయమునేనే. నాకంటెవారేమియు నెరుగరు. వారికంటే నేనును ఏమియు నెరుగను. నీవెవరి పట్ల దోషమొనర్చితివో అచ్చటికే వెడలుము. సాధువులపట్ల ప్రదర్శించిన బలము, ప్రయోక్తకే యశుభమును కల్గించును' అని చెప్పి- భాగవతాపరాధ జన్యమగు దోషము చివరికా భాగవతోత్తముని యనుగ్రహముచే తొలగునని నిష్కర్షించినాడు. 38,39,40,41,42

పిమ్మట, దానవపతియు వీరుడునగు హిరణ్యకశిపుడు కఠోరమగు వింటిని పరిగ్రహించెను. ఆతనిచే ప్రోత్సహింపబడిన వారై, కొందరు భటులు సాయుధులై నిలువబడిరి.

ప్రహ్లాదుడు కూడ అప్పుడా నృసింహాకృతినిజూచి పరమేశ్వరుడేనని గ్రహించెను. వెనుక 'నృసింహ' రూపముతో మరల వత్తునని భగవనుడు పల్కిన మాటను( చూ.అ.14 శ్లో-59) జ్ఞప్తికి తెచ్చుకొని తొట్రుపాటుతో నమస్కరించెను.

భగవత్ప్రియుడగు ప్రహ్లాదుడు నృశింహుని యవయవములలో సముద్రములతోను కొండలతోను,ద్వీపములతోను, దేవదానవ మానవ సంఘములతో కూడిన లోకములను దర్శించెను.

బ్రహ్మాండముపైకి చొచ్చుకొనివెళ్లిన యా నృసింహుని శిరస్సున బ్రహ్మాండపుపై భాగమున్నది. కన్నులలో ప్రళయభయంకరులగు సూర్యాగ్నులుండిరి. ముఖ బిలమున పాతాళమున్నది. ఆయన నోటిలోగల కోరలలో శేషుడుమున్నగు భయంకర మహాసర్ప సంతతి కలదు. భుజమను మహాస్కంధమున బ్రహ్మ-పరమేశ్వరుడు వీరిరువురుకలరు.

సదదర్శ నృసింహస్య గాత్రేషు భగవత్ప్రియః।
లోకాన్సాబ్ధిగిరి ద్వీపాన్ ససురాసుర మానవాన్॥ 45

శిరస్యజాండోపరి భాగముగ్రౌ
లయార్కా వహ్ని ప్రతిలోచనస్థౌ।
పాతాల మస్యాస్యబిలేచ తస్య
దంష్ట్రేషు శేషాది కరాళ వంశమ్॥ 46

ఆ భుజమహాస్కంధవృశాఖలెనిమిది పైనను (ఎనిమిది కొమ్మలపైనను) అష్టదిక్పాలకులుండిరి. నృసింహుని శరీరమునగల రోమములలో నడవులు అస్థికలలో సమస్త పర్వత సముదాయములు, చర్మమున భేదింపరానిదగు 'మాయ' , సర్వ శరీరగతమగు తేజస్సున అనన్తమగు వైష్ణవ తేజస్సు కలవు. ఇట్లు ఇతరుల కెవ్వరికి దర్శింపనలవిగాని అద్భుత నృసింహరూపమును, శ్రీహరిప్రియుడగుటచే ప్రహ్లాదుడు దర్శింపగల్గెను. ఇట్టిరూపమును కృపాళువగు శ్రీహరియే దర్శింపజేసినాడు. తనభక్తుల విషయమున భగవంతుడు గూఢముగా నుండజాలడు కదా!

యుద్ధరంగమున పార్థుని వైక్లబ్యమును బాపుటకై భగవానుడు తన విశ్వరూపమును జూపి-

సుదుర్దర్శ మిదంరూపం దృష్టవానసియన్మమ।
దేవాఅప్యస్యరూపస్య నిత్యం దర్శనకాంక్షిణః॥

'ఓపార్థా! అత్యంతము దర్శింపనలవి కానియే నారూపమును నీవిప్పుడు దర్శించితివో, అద్దానిని దర్శింప నిరంతరము దేవతలు గూడ తహ తహపడుదురు' అనిచెప్పి, ఇట్టిరూపమును దర్శించుటకు అర్జుననకుగల యోగ్యతయేమో చెప్పినాడు.

నాహంవేదైర్నతపసా నదానేన నచేజ్యయా।
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥
భక్త్యాత్వనన్యయాశక్య అహమేవం విధోర్జున।

భుజద్రుమస్కంధగతౌ విధీశౌ
తదష్టశాఖాసు దిశామధీశాన్ ।
హృద్వ్యంబరం, విస్తృతమంబరేఽస్య
విద్యుద్విలాసం, భువమంఘ్రి పద్మే । 47

దేహద్రవే వారినిధీన్, వనాని
రోమస్వథాస్థిష్వఖిలాద్రి సంఘాన్ ।
మాయామభేద్యం త్వచి సర్వగాత్రే
తేజస్యనన్తం నిమేవ తేజః ॥ 48

ఇత్థం దదర్శాద్భుత సింహతత్త్వ
మనన్య దృశ్యం సహరిప్రియత్వాత్ ।
ప్రదర్శితంతేన దయాబ్ధినైవ
భక్తేషు దేవో నహిగూఢమాస్తే । 49

జ్ఞాతుంద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప॥

"నేను వేదములచేగాని, తపస్సుచేగాని, దానముచేగాని, యాగముచేగాని నీవుచూచిన విధముగ దర్శించుటకు వీలుగాను. కేవలము అనన్యమగు భక్తిచే మాత్రమే ఈ విధముగ దర్శించుటకు, తెలిసికొనుటకు, వాస్తవముగ ప్రవేశించుటకును వీలగుదును.' అని యనన్య భక్తియే భగవత్తత్త్వదర్శనోపాయముగా వక్కాణించినాడు. దీనినే ప్రస్తుతమున చివరి శ్లోకముచే "భక్తేషు దేవోనహిగూఢ ఆస్తే" ఇత్యాదిగా నుద్ఘాటించినాడు.

ఇది నాదీయ పురణాంతర్గమగు హరిభక్తి సుధోదయమున గల ప్రహ్లాద చరితమందలి నృసింహప్రాదుర్భావమగు పదునెదువయధ్యాయము.

# షోడశాధ్యాయము

**షోడశాధ్యాయసారము :** ఈయధ్యాయమున నృసింహరూపుడైన శ్రీమన్నారాయణునకు దానవేంద్రుడగు హిరణ్యకశిపునకును జరిగిన ఘోరయుద్ధము, రాక్షసహననము, దేవస్తుతులు ప్రధానాంశములు. దుర్నిరీక్ష్యమగు శ్రీహరి యోజస్సునకు దానవవీరులు కకావికలై పారిపోయిరి. నృసింహుని భయంకరాట్టహాసమునకు భయపడిన రాక్షసభటుల చేతులనుండి ఆయుధములు త్రెళ్ళిపడినవి. ఒకవైపున నరత్వము, ఊర్ధ్వభాగమున సింహత్వముతో కూడిన యాయద్భుతమూర్తి మహాశ్చర్యమును కలిగించినది. నృసింహుని విజృంభణమునకు వెరగుపడియు అమర్షతో నాహిరణ్యకశిపుడు చంద్రహాస మహాఖడ్గమునుగెకొని అడ్డుపడబోగా, ప్రహ్లాదుడు నివారించి నృసింహుని శరణుజొచ్చుమని ప్రార్థించినాడు. అడ్డుపడిన ప్రహ్లాదుని సంహరింప నుద్యమించిన హిరణ్యకశిపునిపై తటాలున పడి నరహరి వానినావలకు అవలీలగా విసరివెచినాడు. మరల లేచితనపై బడుచున్న వానిని తనతొడపై ఫరుండబెట్టుకొని, స్వామి తనవాడిగోళ్ళచే వాడిహృదయమును వ్రయ్యలు చేసినాడు. విష్ణునిందాకృతమైన దోషముకూడ శ్రీహరిస్పర్శతో పటాపంచలై పోయినది. ఇంతటి ద్వేషభావముకల యాదానవపతికి నిరంతర శ్రీహరి స్మృతియున్నది కనుకనే ఇతర దుర్లభమైన యుత్తమగతిని పొందగలిగినాడు. దేవదుందుభులు మ్రోగినవి. ఆకసమునుండి పుష్పవృష్టి కురిసినది. దేవగంధర్వముని ప్రముఖులు నృసింహుని ప్రసన్నుని చేసికొన స్తుతించిరి. క్రోధావేశవివశుడైన యా అద్భుతమూర్తిని ప్రశమింప చేయుటకై ప్రహ్లాదుని దరిచేర్చిరి. స్వామి, తన క్రోధము నుపసంహరించి తన భక్తుని వాత్సల్యముతో దరిచేర్చు కొనినాడు. ఈ సన్నివేశము భగవానుని భక్తప్రీతికి నిదర్శనము. 42వ శ్లోకమునుండి 46వ శ్లోకమువరకు దండకముతోపాటు దేవస్తుతి కలదు. స్వామి, ఈ విధముగ దైత్యహననముజేసి ప్రహ్లాదుని రాజ్యప్రతిష్ఠితునిజేసి అంతర్హితుడాయెను.

హిరణ్యకశిపునకును, తదాశ్రితులగు దానవులకును కల్గిన ముక్తికి మహర్షు లాశ్చర్యమునొంది, వారిని బహుథాప్రశంసించిరి.

ఇట్టిపరమ పావనమగు ప్రహ్లాదచరితము శ్రీనృసింహ విజృంభణమును విన్నవారికి, ఆపదలు ఆమడల దూరమున నుండునని ఫలశ్రుతి.

రోగ గ్రహాద్యాది తమాంసి దూరే
నృసింహతేజః స్మరతామనన్తమ్' అని దీని సారము.

శ్రీ నారద ఉవాచ -
అథాసురేంద్రస్త ద్దూరాద్ అసహ్యో జనమాశుగైః
అచ్ఛాదయ ద్వర్ధమానం పలాలైరివ పావకమ్ ॥ 1

వీరాశ్చ రథనాగాశ్వాన్ ఆరుహ్యార్బుద కోటిశః ।
యోజనాత్ పరితోవవ్రుః దురాసదమధర్షణమ్॥ 2

వ్యథితాక్షాస్తు తంద్రుష్ట్వా మీలయన్తోఽక్షిణీ ముహుః ।
భటాస్తద్దర్శనే క్లిష్టాస్తస్థుర్దూరే బతాహవాత్॥ 3

అథాసంఖ్యాన్ హరి ర్వీక్ష్య యుయుత్సూన్ దూరతోఽసురాన్॥
సాట్టహాసం జహాసోచ్చైః లయాశని సమస్వనః ॥ 4

అథాయుధాని హస్తేభ్యో వాహనేభ్యస్తదా భటాః ।
వాహనానిచ సంత్రాసాత్ సమంపేతుర్హఠాద్ భువి । 5

శ్రీ నారదుడిట్లు పలికెను. అంతనా దానవేంద్రుడు విజృంభించుచున్న వహ్నిని సమిధలతో కప్పినట్లు, సహింపరాని మహాబలముతో కూడియాన్నృసింహుని బాణములతో గప్పెను. 1

కోట్లకొలదివీరులు, రథములపైనను, ఏనుగులపైనను, అశ్వములపైనను అధిరోహించి యోజనప్రమాణముగల ప్రదేశము చుట్టుచేరి, సమీపింప రానిదియు, అభిభవింప రానిదియునగు నాన్నృసింహ తేజస్సును కప్పివేసిరి. 2

అహెూ! ఆ నృసింహునిజూచి పీడితములైన యవయవములు కలవారైకన్ను మాటిమాటికి మూసికొనుచు, ఆయాకృతిని దర్శించుటలో క్లేశపడుచున్నవారై, భటులు యుద్ధమునుండి దూరముగా తొలగి నిలుచుండిపోయిరి. 3

పిమ్మట యుద్ధసన్నద్ధులై దూరముగా నిలుచుండిన అసంఖ్యాకులగు రాక్షసభటుల జూచి యాన్నృసింహుడు ప్రళయకాలపు పిడుగువంటి భయంకరధ్వనితో అట్టహాసముగా నవ్వెను. 4

అంతట భటుల చేతులనుండి ఆయుధములును ప్రాణభీతితో రథములనుండి భటులు, అట్లే వాహనములును, కలిసికట్టుగ హఠాత్తుగ నేలపైబడినవి. 5

క్షణాత్ తత్ పతితం సైన్య మశ్మవర్షైర్వనం యథా।
నా చేష్టన్త పునర్వీరాః కేచిదేవోత్థితా శ్చిరాత్॥ 6

తేహ్యద్భుత నృసింహస్య వహ్నీక్షణ కటాక్షితాః ।
నిర్భస్మితాః క్షణాదిత్థం నిఃశేషం తదభూద్బలమ్ ॥ 7

నృకేసరి కటాక్షోత్థ వహ్నిస్తస్యైవ పశ్యతః ।
హిరణ్య కశిపోర్వైరాన్ దదాహ ప్రసభం పురమ్ ॥ 8

సచైకతో నరం పశ్యన్ ఏకతః సింహమద్భుతమ్ ।
వీరో బ్రాహ్మ బలాధ్మాతో నాబిభేదిషువర్షకృత్ । 9

శస్త్రాణి దైవతాస్త్రాణి సర్వదేవమయం ప్రతి ।
నరకేసరిణం ప్రాప్య నాక్రామస్త్యైవ తానితమ్ ॥ 10

యథాపలాల కాండాని ప్రతియాన్తి మహానిలే ।
ప్రాప్తాన్య ప్యన్యతోయాన్తి మహాస్త్రాణి తథేశ్వరే ॥ 11

ఒక్కక్షణమున రాళ్ళవానచే వనము కూలినట్లు సైన్యమంతయు నేలకూలినది. వీరులు చేష్టలుడిగి పడిరి. కొందరు మాత్రమే చాలకాలము తరువాత తెలివిగలిగి లేచిరి. 6

ఆ రాక్షసవీరులు ఆశ్చర్యకరరూపముగల నృసింహుని కంటి నిప్పుల బడినవారై క్షణమున భస్మీభూతులైరి. ఈవిధముగ రాక్షసబలమంతయు పూర్తిగా నశించిపోయినది. 7

ఆనృసింహుని కటాక్షములనుండి పుట్టినయగ్ని, ఆహిరణ్యకశిపుని పట్లగల వైరమును పురస్కరించుకుని, ఆతడు చూచుచుండగనే నగరమునంతటిని దహించివేసినది. 8

ఆవీరుడగు హిరణ్యకశిపుడు ఒకవంక నరరూపమును, మరియొకవంక ఆశ్చర్యకరమగు సింహమును దర్శించుచు బ్రహ్మవలన లభించిన వరబలముచే బలిసినవాడై బాణములవర్షించుచు ఎంతమాత్రము భయపడలేదు. 9

హిరణ్యకశిపునిచే ప్రయోగింపబడిన శస్త్రములు, దేవతాస్త్రములు సర్వదేవత్మకుడైన యానరసింహుని సమీపించినను ఎంతమాత్రము ఆక్రమింపజాలకపోయినవి. 10

చంద్రహాసం మహాక్రోధాదాదాయాసిం మహాసురమ్ ।
అజేయం ప్రతిధావన్తం ప్రహ్లాదః ప్రణతోఽభ్యధాత్ । 12

నామంస్థాః ప్రతి యోద్ధారం దైత్యేశ! సకలేశ్వరమ్ ।
ఇచ్ఛయైవాఖిలాధార స్త్రైలోక్యం సంహరత్యయమ్ । 13

యచ్ఛక్త్యైవార్య! చేష్టన్తే నోన్మేషేఽపి స్వతోజనాః ।
శక్తాస్తం త్రిజగత్త్రాణం కథం ప్రతియుయుత్ససి । 14

ప్రసాదయాశు సర్వేశం, త్యజాసింత్వం మహామతే ।
రక్షత్యేవ దయాసారో వత్సలః శరణాగతాన్ ॥ 15

ఇతివిజ్ఞాప్యమానం తం ముమూర్షుర్మరణే సుతం ।
మూర్ఖో వైద్యమివాధావద్ధన్తుం ఖడ్గీపురః క్రుధా ॥ 16

తావత్ క్షణాత్ సమభ్యేత్యాత్మజ పుత్ర వధోద్యతం ।
గృహీత్వా క్షిప్తవాన్ దేవో యథా పర్ణం భ్రమానిలః ॥ 17

గడ్డిపోచలు సుడిగాలికి కొట్టుకుపోయినట్లు నృసింహదేవుని దరిచేరిన గొప్పగొప్ప యస్త్రములు కూడ మరలిపోవుచున్నవి. 11

పట్టరానిక్రోధముతో చంద్రహాసమను మహాఖడ్గమును ధరించి జయింపరాని నృసింహునివైపు పరువెత్తుచున్న హిరణ్యకశిపునకు నమస్కరించి ప్రహ్లాదు డిట్లుపలికెను. 12

'ఓదైత్యాధిపతీ! సకలేశ్వరుడగు నృహరిని సామాన్యుడగు ప్రతివీరునిగా భావింపవలదు. సర్వాధారుడగు ఈయన, తన సంకల్ప మాత్రముచేతనే ముల్లోకముల సంహరించును. 13

ఆర్యా! తమంతతాముగ, కనురెప్పపాటునుగూడ జరుపజాలని జనులు, ఏపరమాత్మ శక్తిచేతనే ప్రవర్తించుచున్నారో, అట్టి త్రిలోకరక్షకుడగు శ్రీహరిని ఎదుర్కొనిఎట్లు యుద్ధమొనర్ప దలచుచున్నావు ? 14

వెంటనే సర్వేశ్వరుడగు శ్రీహరిని ప్రసన్నుని జేసికొనుము. ఓ మహామతీ! ఖడ్గమును విడువుము. దయాసాగరుడగు స్వామి, వాత్సల్య భరితుడై తప్పక రక్షించును.' 15

ఆపతన్తం తమాదాయ శాయయిత్వాంక ఈశ్వరః ।
అసుస్థస్యాస్య హృదయే నిచఖాన నఖావళీః ॥ 18

విష్ణుతత్ప్రియ నిందోత్థం యదఘోఽఽప్యస్య శేషితమ్ ।
తత్తీర్థ స్యాంగ సంస్పర్శాత్ సద్యః సర్వం నిరాకృతమ్ ॥ 19

తదా భయంకరం దృష్ట్వా నరసింహస్య వైముఖం ।
ఆక్రందం సచాకారోచ్చైః! ద్విజ! మాతేతి దానవః ॥ 20

ప్రహ్లాదస్తు తదాప్రాహ 'తాత! కింత్వం నలజ్జసే ।
వరిష్ఠే మరణే ప్రాప్తే యస్త్వం క్లీబం ప్రభాషసే ॥' 21

ఈ విధముగ, మరణమును కోరువాడగు హిరణ్యాకశిపుడు, మరణ మాసన్నమైనపుడు మూర్ఖుడగురోగి వైద్యుని చంపనుంకించినట్లు, ఖడ్గమునుబట్టి క్రోధముతో ముందున కురికెను. 16

ఇంతలోనే, ఒక్కత్రుటిలో తనకన్న కుమారుని చంప నుద్యమించిన హిరణ్యకశిపుని సమీపించి, నరహరియాతని సుడిగాలి ఎండుటాకును ఎగురగొట్టినట్లు పట్టుకొని దూరముగా విసరివేసినాడు. 17

తన తొడపై పరుండబెట్టి పరమేశ్వరుడగు నరహరి అస్వస్థమగు నాతని హృదయమున (క్రోధాదులచే కలుషితమైన యాతని హృదయమున) తన గోళ్లను బలముగా నాటెను. 18

శ్రీహరిని, ఆతనికి ప్రియుడగు ప్రహ్లాదుని నిందించి నందువలనే పాపము మిగిలియుండెనో, తీర్థమువలె పరమ పవిత్రుడగు నరహరియొక్క దేహమును స్పృశించుటవలన పూర్తిగావెంటనే నశించెను. పూర్వము, నృహరి దర్శనమువలన హిరణ్యకశిపుని పాపములన్నియు నశించినవనియు విష్ణునిందాజన్యము, విష్ణుభక్త నిందాజన్యమగు పాపము మాత్రము తొలగక యుండెనని చెప్పబడినది. ఇట్లు మిగిలియున్న పాపముకూడ శ్రీహర్యంగసంస్పర్శముచేతను, నృహరిచే శిక్షింపబడుటచేతను పూర్తిగా నశించినదని తాత్పర్యము. 19

అప్పుడా హిరణ్యకశిపుడు భయంకరమగు నరహరి ముఖమును జూచి 'అమ్మా!' యని బిగ్గరగా నాక్రందనముచేసెను. 20

ప్రహ్లాదుడిట్లు పలికెను. తండ్రీ! శ్రేష్ఠమగు మరణము ప్రాప్తించినపుడు గూడ అసమర్థునివలె పలుకుచున్న నీవేల నిగ్గిలవు? 21

మాతస్తాతేతి మాబ్రూహి, మరణే సముపస్థితే ।
వద! గోవింద గోవింద గోవిందేతి పునః పునః ॥ 22

శ్రీ నారద ఉవాచ -
హరేర్నామావళిం శ్రుత్వా మరణే సముపస్థితే ।
సనిర్మలాశయో దైత్యః పశ్యన్ సాక్షాద్ధరేర్ముఖమ్ ॥ 23

నఖాలీభిన్న హృదయః కృతార్థో విజహౌవసూన్ ।
ఆజన్మ విష్ణుస్మరణం రోషాదప్యస్తి తస్యహి ॥ 24

సాక్షాన్నృసింహ స్మరణం దుర్లభం ప్రాపతత్ఫలం ।
తతో దదార , కరజైః సతద్దేహ మితస్తతః ॥ 25

'మరణ మాసన్నమైనపుడు, 'అమ్మా' 'నాన్నా' అని పిలువకుము. గోవిందా! గోవిందా! గోవిందా! అని మాటిమాటికి పలుకుము.' 22

నారదుడిట్లు పలికెను. శ్రీహరి యొక్క నామావళిని విని మరణమాసన్నమైనపుడు నిర్మలమగు మనస్సు గలవాడై సాక్షాత్తుగ శ్రీహరి వదనమును చూచుచున్నవాడగు హిరణ్యకశిపుడు, నరహరి నఖములచే చీల్చబడిన హృదయము కలవాడై, కృతార్థుడై ప్రాణములవిడచెను. జన్మప్రభృతి యా హిరణ్యకశిపునకు రోషనిమిత్తముగగూడ విష్ణుస్మృతియున్నదికదా! సాక్షాత్తుగ దుర్లభమగు నరసింహ స్మరణమును తత్ఫలమును పొందినాడు. కావుననే తనగోళ్ళచే వాని శరీరమును ఇటునటు తునకలుగ చీల్చివేసెను.

అంత్యకాలమున నెవ్విధముగనైన శ్రీహరినామము స్మరించుట ఉత్తమగతికి హేతువని పురాణములు నుడువుచున్నవి. శ్రీగీత-

అంతకాలేచ మామేవ స్మరన్ముక్త్వా కలేవరమ్,

యఃప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ।

యం యం వాపిస్మరన్ భావం త్యజత్యన్తే కలేవరమ్,

తంతమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః ॥ (8-5/6)

'మరణ సమయమున నన్నే స్మరించుచు శరీరమును విడచి ఎవ్వడు ప్రయాణించుచున్నాడో వాడు నాస్వరూపమును పొందును. సంశయములేదు. ఏయే భావమును స్మరించుచు శరీరమును విడచునో వాడాయా భావమునకు తగినట్లుగనే

క్రుద్ధః కథంను సహతే స్వస్మర్తుర్ దేహ బంధనం ।
అంత్రాళీముచ్చకర్షాశు సుదీర్ఘామతి రాగిణీమ్ ॥
తృష్ణా మివ తనోర్భూయః సబంధా మాప్త సన్మృతిః । 26

స్వరూపమును పొందుచున్నాడు' అని దీనిని బట్టిచివరి సమయమున భగవదను స్మరణమున్నవాడు భగవత్స్వరూపమును పొందునని స్పష్టమగుచున్నది. మరి, చివరిసమయమున, భగవత్స్మరణము కలుగునని నియమము లేదుకదా! భాగవతోత్తముడగు జడభరతుడు సహితము, తాను ప్రేమతో పెంచిన జింకపై మనసుంచి, తుదిగడియలలో దానినే స్మరించుటచే మృగజన్మము నెత్తినాడని శ్రీభాగవతము తెలియచేయుచున్నది. కనుక, ఎల్లిరకు చివరి గడియలలో భగవత్స్మరణమే కలుగునను నియమములేదు కదా! కనుకనే భగవానుడు, సర్వకాల సర్వావస్థలయందును భగవంతునియందే (తనయందే మనస్సునుంచి స్మరించు చుండుమని ప్రార్థన కుపదేశించినాడు –

తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మరయుధ్యచ ।

మయ్యర్పిత మనోబుద్ధిః మామేవైష్యస్య సంశయమ్ ॥

'కావున సర్వకాలములందును అనగా ప్రహ్లాదునివలె, ఏపని చేయుచున్నను భగవదనుస్మరణము విడువక చేయవలయునని యభిప్రాయము. ఇట్టి స్మరణము వైర నిమిత్తమైనను ఫలమును తప్పక ఈయగలదు. కంసుడిట్టి వైరానుస్మృతి చేతనే కృష్ణునిచేతిలో మడిసి, చివరిసమయమున శంఖచక్రాద్యాయుధధారియగు శ్రీహరి స్మృతిచే, తత్సారూప్యమునే పొందెనని శ్రీభాగవతము నుడువుచున్నది.

సనిత్యదోద్విగ్నధియా తమీశ్వరం పిబన్నదన్వా, విచరన్ స్వపన్ శ్వసన్ ।

దదర్శ చక్రాయుధ మగ్రతో యతః తదేవ రూపం దురవాప మాప ॥

(10-24-40)

కంసుడెల్లప్పుడు ఉద్విగ్నమగు మనస్సుతో నాపరమేశ్వరునే, త్రావుచు, తినుచు, నడచుచు, నిద్రించుచు, ఊర్చుచు, చక్రాయుధ విశిష్టరూపముతో దర్శించినాడు కనుకనే, దుర్లభమగు నా భగవద్రూపమునే (మరణించి) పొందినాడు. దీనిని దృష్టియందిడుకొనియే నారదుడు–

తస్మాద్వైరాను బంధేన, నిర్వైరేణ భయేనవా ।

స్నేహాత్ కామేనవా యుంజ్యాత్ కథంచిన్నేక్షతే పృథక్ ॥

ఇతి, హత్వా మహాకాయో మహాకాయం నృకేసరీ।
రాక్షసస్యాంత్ర మాలాంగో భూయోఽభూద్భీషణా కృతిః॥ 27

యథావైరాను బంధేన మర్త్యస్తన్మయతా మియాత్

నతథా భక్తియోగేన త్వితిమే నిశ్చితా మతిః ॥

'కావున వైరానుబంధముచే గాని, వైరములేకయే గాని, భయముచేగాని, స్నేహ, కామములచేగానే ఎట్టైనను భగవంతునియందు మనస్సు నుంచవలయును. వైరానుబంధముచే నరుడు భగవదాత్మకత్వమును పొందినట్లు భక్తియోగముచేకూడ సాధ్యముకాదని నానిశ్చితాభిప్రాయము'- అని,

'గోప్యః కామాత్, భయాత్ కంసః, ద్వేషాత్ చైద్యాదయోనృపాః ,

సంబంధాద్వృష్ణయః, స్నేహాద్యూయం, భక్త్యా వయం నృప ॥'

కామదృష్టితో గోపికలు, భయమువలన కంసుడు, ద్వేషమువలన శిశుపాలాదినృపులు, బాంధవ్యమువలన యాదవులు, స్నేహమువలన మీరు(ధర్మరాజాదులు) భక్తిచే మేము - (నారదాదులు) భగవత్స్వరూపమును పొందగలమని నారదుడు ధర్మరాజుతో పలికెను.

వైరానుబంధముచేతనే భగవత్ సాధర్మ్యమును పొందగల్గినపుడు, అనుకూల భావముతో, అవ్యాజప్రీతితో భగవానుని స్మరించువారిగురించి వేరుగా చెప్పవలసిన దేముండును? 23,24,25

క్రోధముచే వివశుడైన భగవానుడు తనను స్మరించినవాని దేహబంధనము నెట్లు సహించును? కనుకనే, ఆతని తనువునుండి యెర్రగ రక్తసిక్తమైన పొడవైన ప్రేవుల మాలలను మూలములతో పాటుగ తృష్ణను (లోభబుద్ధిని) పెరికివేసినట్లు వెలుపలికి బలముగ పట్టిలాగెను. ఈవిధముగ నాహిరణ్యకశిపుడు 'సన్మృతి' ని పొందెను ('సత్' శబ్దవాచ్యుడగు పరమాత్మనుండి మృతి పొందెననియు, ఉత్తమమైన ఇతరులకు దుర్లభమైన సమృతిని పొందెననియు అభిప్రాయము.) 26

ఈ విధముగ మహాకాయుడగు నరహరి, మహాకాయుడగు హిరణ్యకశిపుని జంపి, ఆరాక్షసుని ప్రేవులను మాలలుగా ధరించి మిక్కిలి భయంకరమగు నాకారము కలవాడాయెను. 27

ప్రహ్లాదం సానుగం హిత్వా భస్మితే రక్షసాం బలే ।
హృష్టా అపి సురాః సింహంనోపేయుర్భీషణాకృతిమ్ ॥ 28

అథశాంతేషు దైత్యేషు నాశోత్పాతేషు దేవతాః ।
కృత్వా గ్రతో బ్రహ్మశివౌ శనైః స్తోతుం సమాయయుః ॥ 29

తావత్ సదుందుబిధ్వం పుష్పవర్షం భియాసురాః ।
నోత్సాహ లక్షణం చక్రురప్రసాద్య మహాహరిమ్ ॥ 30

సర్వే త్రైలోక్యనేతారో దివ్యసింహం సురాదయః ।
దూరాత్ ప్రాంజల యస్తస్థుర్నమన్తో యుద్ధ భైరవమ్ ॥ 31

తేప్రసాదయితుం దేవం జ్వలన్తం సర్వతోముఖం ।
ప్రహ్లాద మాగమ్యశనైరూచు రేవం ప్రసాదయ ॥ 32

అనుచరులతో పాటుగ ప్రహ్లాదునివిడచి, సమస్త రాక్షససైన్యము భస్మమొనరింపబడగా, ఆనందించియు దేవత లానృసింహుని భీషణాకారమును దరిజేరరైరి: 28

పిమ్మట, ఉత్పాతములవలె నాశనకారకులగు రాక్షసులందరు హతులుకాగా, దేవతలు బ్రహ్మను, శివుని ముందుంచుకొని మెల్లగా స్తుతించుటకై నరహరిని సమీపించిరి. 29

భయంకర నరహరి రూపుడగు నా శ్రీహరిని ప్రసన్నుని చేసికొనకయే దుందుభి ధ్వానముతో పాటుగ పుష్పవృష్టిని కురిపించుటకు దేవతలు భీతితో సిద్ధపడరైరి. 30

ముల్లోకములకు నాయకులైన దేవాదులెల్లరు యుద్ధభీషణుడగు నరహరిని దరిచేరలేక దూరముగానే నమస్కరించుచు నిలుచుండిరి. 31

నలువైపుల ప్రసరింపచేయబడి, నిప్పులు చిమ్ముచున్న వదనముగల నృసింహుని ప్రసన్నుని జేసికొనుటకై వారుప్రహ్లాదుని దరిచేరి, మెల్లగా- దేవుని ప్రసన్నుని చేయుము' అని పలికిరి. 32

'ఓసజ్జనుడా! మమ్ము అనుగ్రహింపుము. నీవే శ్రీహరికి ప్రియుడవు. స్వామి యీ ముల్లోకముల కభయమిచ్చునట్లు చేయుము. 33

అనుగృహ్ణీష్వనః సాధో త్వంహి నాథస్య వల్లభః ।
త్రైలోక్యస్యా భయం దద్యాద్ యథాస్వామీ తథాకురు ॥ 33

దర్శయాస్మాన్ మహాభాగ! ప్రసన్నం పరమేశ్వరమ్ ।
యద్వశే సర్వలోకోహి త్వాదృక్ భక్తవశో హ్యయమ్ ॥ 34

ఇత్యర్థితః సవిబుధైః భగవద్గత మానసః ।
శనైరుపససారేశం ప్రసీదేతి వదన్నమన్ ॥ 35

ప్రవద్ధర్షా ప్రుదత్సార్షః సపపాతాశు దండవత్ ।
యోగీంద్ర గుహ్య యోర్భక్త్యా హరేః శ్రీపాద పద్మయోః ॥ 36

తతః ప్రసన్నో భగవాన్ భక్తే శ్రీపాదశాయిని ।
రక్షఃశరీరం క్రోధంచ సమం తత్యాజ వత్సలః ॥ 37

ఓమహానుభావా! ప్రసన్నుడైనయా పరమేశ్వరునకు మమ్ముల చూపుము. ఏపరమాత్మకీ సమస్తము లోబడియున్నదో, ఆతడు నీబోటి భక్తులకు వశవర్తి కదా! 34

ఈవిధముగ దేవతలచే ప్రార్థింపబడినవాడై, భగవంతునియందే లగ్నమైన మనస్సుగలవాడగు ప్రహ్లాదుడు -స్వామీ! ప్రసన్నుడవుకమ్ము' అనిపలుకుచు నమస్కరించుచు భగవానుని సమీపమునకు వెడలెను. 35

జాలువారుచున్న యానందాశ్రువులతో అర్ఘ్యమునిచ్చినవాడై యాప్రహ్లాదుడు యోగీశ్వరులకుగూడ (మహాయోగులకు సహితము) సులభములు కానివగు విష్ణు శ్రీపాద కమలములయందు, భక్తితో దండమువలె వెంటనే సాష్టాంగ ప్రణామమొనర్చెను. 36

పిమ్మట, తన శ్రీపాదములయందు ప్రణమిల్లి పడియున్న తనభక్తుని యందు ప్రసన్నుడైన భగవానుడు భక్తవత్సలుడై హిరణ్యకశిపుని శరీరమును తనక్రోధమును ఒక్కసారిగ విడచివైచెను. 37

పైకి లేపి యాప్రహ్లాదు నూరడించి, ఆతనిచే ప్రక్కన చూపించబడి దూరముగా నిలుచుండియున్న దేవతను అమృతముచేనార్ద్రములైన చూపులతో చూచెను. 38

ఉత్థాప్యాశ్వాస్య తం భక్తం పార్శ్వతః తత్ ప్రదర్శితాన్ ।
సురాన్ భువి సుదూరస్థాన్ ఆలులోకే సుధార్ద్రదృక్ ॥ 38

తతో జయజయే త్యుచ్చైః స్తువతాం నమతాం సమం ।
తద్దయాదృష్టి దృష్టానాం సానందః సంభ్రమోఽభవత్ ॥ 39

యత్ పాద సమ్మార్జన లాలసాయాః ।
లక్ష్మ్యాః కటాక్షాంచల మాత్ర దృష్టాః ।
తృప్యన్తి దేవాః సతతం కృతార్థాః
తేనైవ సాక్షాత్ కిము చారు దృష్టాః । 40

తం తుష్టువుస్తేఽభ్యుపగమ్య భక్త్యా
ప్రసీద, శాంతిం ప్రదిశ, త్రిలోక్యాః ।
దృష్టం మహౌజస్తవ రూప మీదృక్ ।
శక్తా వయం నేశ! విభో! విభూమ్నః ॥ 41

అంతట, నరహరి కృపాదృష్టిచే చూడబడినవారై జయజయ ధ్వానములతో బిగ్గరగ స్తోత్ర మొనర్చుచున్న దేవతలకు ఒక్కసారిగ ఆనంద సంభ్రమములు కల్గినవి.
39

యే భగవానుని పాదముల తుడుచుట యందు నిరంతరాసక్తయగు ఇందిరారమణి అలవోకగ కటాక్షవీక్షణముల బరపినంత మాత్రముననే పరితుష్టినొంది కృతార్థులైనట్లు భావించెడి దేవతలు, (నృసింహుని సన్నిధిలో) సాక్షాత్తుగ అందముగ చూడబడినప్పుడు వారి కృతార్థతనేమని చెప్పవచ్చును.

పూర్వము అతిదుర్లభములైన శ్రీ సతిదృక్కులు నేడువారికి సులభములై మిగుల మనఃప్రీతిని గొల్పినవని తాత్పర్యము. లక్ష్మీదర్శనములే వారిపైమెండు ప్రసరించుటచే భగవద్దివ్య విగ్రహదర్శన యోగ్యతవారికి సంప్రాప్త మై నదనియు, లక్ష్మీ కటాక్షమును పొందినవాడు సకల సౌభాగ్యములకు నెలవగుననియు సూచింపబడుచున్నది.
40

హే ! సర్వేశ్వరా ! విభూ! (సర్వవ్యాపకుడా !) ప్రసన్నుడవుకమ్ము. ముల్లోకములకు ప్రశాన్తినిమ్ము. మహాతేజ స్సంపన్నమగు నీయీరూపము దర్శింపబడినది. నీయీమహా మహిమను దర్శింపమేము సమర్థులము గాము.' అని దేవతలు నరహరినిదరిజేరి భక్తితో స్తుతించిరి.
41

త్వత్తేజసా క్రాన్త మనన్త తేజః
తేజస్వినోరప్యనలోష్ణ భానోః ।
పృథఙ్ నభాత్యంబుధి గీర్ణవాపీ
తోయోపమం కాత్ర కథేతరేషామ్ । 42

ఇత్యర్థి తస్త్రైః క్షణతో వరేణ్య
తేజో జగద్వ్యాపి తదేవ తీక్ష్ణమ్ ।
నవామలార్ద్రామృత చంద్రికాభ
మాహ్లాదనం సర్వ మయశ్చకార ॥ 43

'స్వామి! నీ మహాతేజస్సుచే ఆక్రమింపబడిన తేజశ్శాలురగు వహ్నిసూర్యుల యనన్తతేజస్సుగూడ, మహాసముద్రమున మునిగిపోయిన దిగుడుబావి నీటివలె వేరుగ తెలియుట లేదన్నచో, ఇకఇతర తేజస్సుల విషయము చెప్పనేల ?

శ్రీగీతలో భగవానుని విశ్వరూపమున వర్ణించుపట్టున

'దివిసూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా ।

యదిభాః సదృశీ సాస్యాత్ భాసస్త స్య మహాత్మనః ॥'

అనిచెప్పబడినది. అనగా ఆకాశమున వేయి సూర్యులొక్కసారిగా ఉదయించి నప్పుడెంతటి మహాతేజస్సు అలముకొనునో అట్టి తేజస్సునకు సమానము కావచ్చునని చెప్పబడినది. వాస్తవమునకిది ప్రమాణము (కొలత) కాదు. 'తస్య భాసా సర్వమిదం విభాతి' అనియుపనిషత్తు సర్వవస్తువులకు వికాసము ననుగ్రహించునది పరమాత్మ తేజస్సుని స్పష్టపరచుచున్నది. 42

సర్వాత్మకుడగు నానరహరి, దేవతలచే నీవిధముగ ప్రార్థింపబడినవాడై శ్రేష్ఠతమము సర్వజగద్ వ్యాపకమునైన తన తీవ్రతేజమును నూతనము, నిర్మలము, ఆర్ద్రములయిన అమృతమయజ్యోత్స్నతో (చల్లని వెన్నెలతో) సమానముగా హృదయ పరితోషకముగ చేసెను. అప్రసహ్యమగు తనదివ్యమహాతేజమును పసంహరించెనని తాత్పర్యము. 43

తతోఽతిహృష్టాః పునరేవదేవం
ప్రతుష్టువు ర్దేవగణాః తదేత్థమ్ ।
సిద్ధాశ్చ నాగా, మునయశ్చ నమ్రా
హృద్యైస్త మాద్యైర్ని రవద్య గద్యైః ॥ 44

పిమ్మట, దేవతాగణములు, సిద్ధులు, నాగులు, మునులు, అత్యానందముతో వినమ్రశరీరులై, హృదయంగమములు, ఆద్యములు, దోషరహితములునైన 'గద్య' ములతో నిట్లు స్తుతించిరి. ఇకముందు, దేవతలొనర్చిన 'దండక' రూపమగు స్తవనము ఇతరులచే నెవ్వరిచే చేయబడని దగుటచే ఆద్యము. 44

భక్తి మాత్రప్రతీత! నమస్తే! నమస్తే! అఖలమునిజన
విరహవిహిత వితతస్తవన! కదనకరఖర చపల రచిత భయవధ!
బలవదసుర ప్రతికృత వివిధ పరిభవ! భయ చకిత నిజపదచలిత
నిఖిల మఖ సుఖ విరహకృశతర జలజభవముఖ సకల సురనికరకారుణ్యా
విష్కృతదివ్య శ్రీ నృసింహావతార! స్ఫురితోగ్రతర ధ్వని
భిన్నాంబరతారా
నికర! నిజమరణ కరణ రభస చలిత రణదక్ష సురగణపటుపటహ
వికటరవ పరిగత చటుల భటరణిత పరిభవ కర, ధరణి ధరకులిశ
ఘనఘట్టనోద్భూత ధ్వాన్త కారి శీత్కారనిర్జిత ఘనగర్జిత !

భక్తికి మాత్రమే గోచరించినవాడా! నీకనేక ప్రణామములు. స్వామీ! నీ విరహమును సహింపలేమిచే ఋషిబృందములు విస్తారముగ నీస్తవనము నొనర్చుచున్నవి. నీవు యుద్ధమొనరించుచున్న తీవ్రస్వభావుడు చపలుడునగు వానిని భయంకరముగ చంపితివి. బలవంతులగు రాక్షసులపట్ల ప్రతికారముగ వివిధ పరాభవముల నొనర్చినావు. భయముచే తమతమనెలవుల దప్పినవారును యజ్ఞహవిర్గ్రహణ రూపమగుసుఖములేమిచే చిక్కిపోయిన చతుర్ముఖ బ్రహ్మమున్నగు సమస్తదేవతలపట్లగల కృపచే దివ్యమగు నృసింహవతారము నావిష్కరించినావు. దుముకుటచే నేర్పడిన మహాధ్వనిచే నాకాశమును తారకావళిని వ్రయ్యలొనర్చినావు. స్వమరణకారణముగు భయంకరయుద్ధము నకైవడివడిగ కదలిన యుద్ధచతురులగు దేవతల బృందములభేరీ భాంకరముల ప్రౌఢవికటధ్వనిచే చుట్టువారిన తీవ్రస్వభావులగు భటుల ఘోషణముల నధఃకరించు చున్నదియు,

వజ్రపుదెబ్బలచే పైకెగసిన పర్వతములపై చిమ్మచీకట్ల క్రమ్మువర్షామేఘ గర్జనమును జయించి నదియునైన శీత్కారధ్వనిచే నొప్పుచున్నావు.

**ఊర్జిత విటంకగర్జిత! సద్గుణగణోర్జిత నృష్టఖల తర్జిత! యోగిసుజనార్జిత! సర్వమలవర్జిత! భక్తజన నిర్జిత! లక్ష్మీ ఘనకుచ నికట విలుంఠన విలగ్న కుంకుమ పంక శంకాకర బహులతరుణారుణ మణిని కరాను రంజిత! విజితశశాంక పూర్ణమండల! వృత్త స్థూల ధవలము క్తామణిఘటిత దివ్యమహోహార! లలిత దివ్య విహర! విహిత దితిజ ప్రహార! లీలాకృత జగద్ వ్యవహార! దివ్యమహోహార! లలిత దివ్యవిహార! విహితదితిజప్రహార! లీలాకృత జగద్వ్యవహార! సంసృతిదుఃఖ సముద్రాపహార! విహితదనుజ సంహార! యుగాంత భువనాపహార! అశేష ప్రాణిగణ ఫహిత సుకృత దుష్కృత సుదీర్ఘ దండభ్రామిత బృహత్ కాల చక్రభ్రమణ కృతలబ్ధ ప్రారంభ! స్థావరగమాత్మక సకలజ గజ్జాల ధారణ సమర్థ! బ్రహ్మాండ నామధేయ మహాభాండ కరణ ప్రవీణ కుంభకార ! నిరస్త సర్వవికార! విచిత్ర వివిధ ప్రకార త్రిభువన పురప్రాకార! అని నిరూపిత నిజాకార!**

స్వామీ! నీవు శ్రేష్ఠములైన గుణసమూహములచే దుర్జనులకు భీతిని కల్గించినవాడవు! (ధ్యానదశలో) యోగిజనులచే సంపాదింపబడినవాడవు. సమస్తదోష విరహితుడవు. భక్తజనులచే జయింప బడినవాడవు. (భక్తికి మాత్రమే పరమాత్మలొంగునని తాత్పర్యము ). స్వామీ! మిక్కలి ప్రౌఢారుణిమగల రత్నసము దాయములచే ననురంజితమైన దేహము కలవాడవు. ఈరత్నారుణిమను చూచినవారికి- ఇది శ్రీరమావక్షఃస్థల సన్నిధాన సమ్మర్దమువలన తగుల్కొనిన ఎర్రని కుంకుమ పంకమేమోనను సంశయము పొటమరించుచున్నది. నీవు నీవదనకాంతిచే పూర్ణ చంద్ర మండలమును జయించితివి. గుండ్రని పెద్దముత్తెములతో పొదువబడిన దివ్యమహా ముక్తాహారమును ధరించుచున్నావు. విలాసయుతమై దివ్యమైన నివాసభవనము కల్గియున్నావు. రాక్షసుల పీచమణచినావు. లీలగా నిఖిల జగద్వ్యవహార మొనర్చుచున్నావు. సంసారదుఃఖమను మహాసముద్రమును తొలగించువాడవు. రాక్షసహనన మొనర్చినవాడవు. ప్రళయకాలమున సకల భువనములు లయింప జేయువాడవు. అసంఖ్యాకములగు ప్రాణి సముదాయములచే నొనర్పబడిన పుణ్యపాపములనెడు పొడవైన కర్రచే విపుల కాలచక్రమును త్రిప్పియీసమస్త సృష్టినారంభించు చున్నావు. (ప్రాణుల పుణ్యపాపములను బట్టియే యీ సృష్టికలుగుచున్నది. అనగా ప్రాణులొనర్చిన పుణ్యకర్మలను బట్టి సుఖమనుభవించుట

సముచితములైన దేహాదులను, పాపకర్మములను బట్టి అనుభవింపదగు నరకాదిలోకములను, యతనాశరీరాదులను, భగవానుడు సృష్టిచేయుచున్నాడు తప్ప, ఇట్టి విషమసృష్టి నొనర్చుటలో భగవానునకెట్టి ప్రయోజనము లేదని తాత్పర్యము) స్థావరములు (కదలిక లేనివి), జంగములు (కదిలిక కలవి), అయిన అనేక వస్తువులతో కూడిన సమస్త జగత్తును ధరింపగల నైపుణ్యము కలిగియున్నావు. ఈ బ్రహ్మాండమను నదియొక పెద్దభాండము (కుండ) కాగా, అట్టి మహాభాండమునిర్మించు కుశలకుంభ కారుడవు నీవే ! ఇట్టి పరిణామ జగత్తును సృజించినను, నీకు స్వయముగ వృద్ధిక్షయాది భావవికారములేవియు లేశమాత్రమైననంటవు. అత్యాశ్చర్య కరమగు నీ త్రిభువనమను పట్టణమును రక్షించు నప్రధృష్యమైన మహాప్రాకారము నీవే కదా స్వామీ! ఇట్టిదని ప్రాకృతధర్మములతో నిరూపింపరాని యప్రాకృతమగు నాకారము నీకున్నది.

**నియమిత భిక్షాలబ్ధ – గతరస – పరిమిత – భోజ్య మాత్రసంతోష! బలవిజితమద మదన! నిద్రాది దోష – ధన – స్నేహ – లోభ – లౌల్యాది – దృఢబంధన – చ్ఛేదన లబ్ధసౌఖ్య! సతత కృత యోగాభ్యాస నిర్మలాంతఃకరణ యోగీంద్ర కృత సన్నిధాన! సకల ప్రధాన! త్రిజగన్నిధాన! క్షుభిత ప్రధాన! స్వశుభాభిధాన! మాయాఽపిధాన!**

స్వామీ! నియమబద్ధముగా భిక్షనొనర్చుట ద్వారాలభించినదియు రసవిహీనమ్మునైన ఆహారమును పరిమితముగ స్వీకరించి యంత మాత్రముననే పరితుష్టి నొందుచున్నావు. (భగవానుడు యతిజనోచిత భోజన వ్యవస్థవాశ్రయించిన వాడగుటచే తాను యతిప్రవరుడనని లోకమునకు దర్శింప జేయుచున్నాడు.) బలముచే మదనుని మదమును గూడ నణచిన వాడవు. నిద్రమున్నగు దోషములను, ధనము – జనము – స్నేహము – లోభము – విషయాసక్తి – మొదలగు ధృఢము లైన సాంసారిక బంధనముల ఛేదించుట వలన కల్గిన సౌఖ్యమునను భవించు చున్నావు. (సాంసారిక బంధమువలన కల్గెడి ప్రాకృత సుఖ దుఃఖముల స్పర్శయెంత మాత్రము లేనివాడు గనుక, నిత్య సుఖ స్వభావుడని తాత్పర్యము), నిరంతరము యోగాభ్యాసమొనర్చుట వలన మలిన విదూరమైన చిత్తముగల యోగివర్యుల సాన్నిధ్యము కలిగియున్నావు. సమస్తమును నడిపించునట్టి ప్రధానతత్వమునీవే. ముల్లోకములకు ఏకైక నిధివి కూడ నీవే!

ప్రధానమని వ్యవహరింపబడు ప్రకృతి తత్త్వమునకు వివిధ విచిత్ర పరిణామమును కల్గించు వాడవు నీవే. మంగళ ప్రదమగు స్వీయ నామధేయము కలవాడవు. మాయ చే నెంత మాత్రము కప్పబడనివాడవు.

మదవికసదసురభట ముకుట వదన విహారనయన!
విచలదసివితత భుజ! వికచకచ! ఘనపలల నవరుధిర
క్రమకల్పిత పుల్లకమల మీనచంచల తరంగ మహాజలూక
శైవాలజాల దుస్తర పంక జలనివహ కలిత మహాసురపృతనా
కమలినీ విలోడన కేళిప్రియ వనమత్త వారణ! శిష్టజన
భావన! దుష్టజనవారణ! శిశుజనతారణ! దైత్యవిదారణ !
నిత్యసువిచారణ! సృష్టసుఖచారణ! సిద్ధబలకారణ! ముక్త
జనధారణ! దుష్టాసురనివారణ! దుష్టనిబర్హణ!

స్వామీ! మదముచేవిజృంభించిన రాక్షసభటుల కిరీటములందును, వారి వదనములందును విలాసముగ బరపిన చూడ్కులు కలవాడా ! భయంకరముగ కంపించుచున్న ఖడ్గముచేనొప్పారు దీర్ఘమైన భుజము కలవాడవు ! (మూపులపై) విస్తరించిన కేశపాశము కలవాడవు. చిక్కనిమాంసముతోడను క్రొంగ్రొత్త నెత్తుటితోడను కల్పింపబడిన వికసితకమలములు, చేపలు, చంచలములైన తరంగములు, పెద్ద పెద్ద నీటిపాములు, నాచులగుంపులు, వీటియన్నిటి చేతను దాటరాని బురదతో కూడిన జలసమూహములుగల రాక్షససైన్యమను పద్మినీషండములను పెరికివేయుటయందు ప్రీతిగల మత్తవిపిన కుంజరము నీవే స్వామీ! నీవు సదాచార సంపన్నులగు వారల సంభావింతువు (గౌరవింతువు) దుష్టులను నివారింతువు. అప్రగల్భులగు బాలకుల క్లేశముల నుండి రక్షింతువు. దైత్యుల చీల్చి చెండాడుదువు. నిరంతరము శుభప్రదమగు చింతనకలవాడవు. లోకులెట్టి భీతిలేకుండగ సంచరించునట్లొనర్చినవాడవు. సిద్ధజనులకు బలమును కల్గించినవాడవు. ముక్తజనుల దరిజేర్చుకొని కాపాడువాడవు. దుష్టరాక్షసుల నివారించువాడవు. దుర్మార్గుల చంపువాడవు.

ఆతపప్రబోధిత –సుజాతానామయ పద్మవనోత్తంభిత
జ్వాలాసహస్ర స్వైరరశ్మి జ్వాలాపహ! శశిభాస్కరాగ్ని
భావితాన్యభయంకర భాస్వన్నయన! సదానిర్గుణ నిరంజన!
సదా అమోఘీకృత భక్తవాంఛ! సుదూరోత్సారిత వాంఛ !
ధాతృవిహిత ప్రక్షాలన! విచిత పాప స్వర్ధునీధార!
సకలలోకాధార! నిరాధార! సితతరసుదర్శనధారోత్కృత్త
కైటభాద్యసురగణ (కంఠ) నాలోచ్ఛల ద్రుధిరధార!

స్తువన్త ఇతి గోవింద మానందాశ్రు-పరిప్లుతాః।
అవ్యక్త వాచస్తే నత్వా, ప్రాపురిష్ట వరాన్ హరేః॥ 46

వెచ్చని కిరణకాంతిచే వికసింప జేయబడిన సుందరకమల సముదాయములందు ప్రకటములగు వేయి దీప్తులతో కూడిన భాస్కరప్రభల నధిఃకరించిన వాడవు. చంద్ర-సూర్యవహ్నులుగా భావింపబడినవియుశత్రు భయంకరములునగు నేత్రములతో నొప్పువాడవు. స్వామీ! నిరంతరము హేయగుణరహితుడవు. దోషస్పర్శ యెంతమాత్రము లేనివాడవు. ఎల్లప్పుడు భక్తజనుల కోరికల నప్రతిహతముగ నెరవేర్చువాడవు. విషయవాంఛల దూరముగ వెడలనడచిన వాడవు. బ్రహ్మచే కడుగబడిన పాదము కలవాడవు. పాపముల పటాపంచలు జేయుసురగంగాఝురిగలవాడవు. నిఖిల లోకముకు ఆధారమైనవాడవు. స్వయముగ ఇతరములైన వాటిపై ఆధారపడనివాడవు. (భగవానుడు సర్వధారుడయ్యును, ఆయనను నిలబెట్టునట్టి యాధారవస్తువేదియు లేదని తాత్పర్యము. ఎట్టి ఆధారాపేక్ష ఎంతమాత్రములేని వాడని భావము.) మిక్కిలి నల్లని యంచు గల సుదర్శన చక్రముచే కైటభాది దైత్యుల కంఠనాలముల ఖండించి రక్తమునెగయ జేసిన వాడవు.

భువనసంమోహకామ! సతత సంపాదితస్వజనకామ!
సదాసంపూర్ణకామ! సంహత విపక్షోక్షేపణ సంస్థా
పనాది విహిత సకల భువనక్షేమ! సురమనుజనివహ
నుతచరణ! నిజవిహిత పథతతి నివారిత దురితనివహ!
భయరహిత బలవదసురగణ దమనపరిచితతర!
ధృతరథచరణ! సురవరమునిజనవినుత! వివిధ
సుచరణ! విబుధధన! విబుధజననికరశరణ!
సద్వశీకృతాంజన! దోషభంజన!

స్వామీ! నీవు ఈ భువనముల నన్నిటిని మోహింపజేయు మన్మధుడవే! (సాక్షాన్మన్మథ మన్మథః - సాక్షాత్తుగ మన్మధుని మనస్సును కూడకలచి వేయగల సౌందర్యము కలవాడని తాత్పర్యము). నిరంతరము తనను ఆశ్రయించిన ప్రపన్నుల కామనల నీడేర్చువాడవు. నీవు ఎల్లప్పుడు పూర్ణకాముడవే! (పూర్ణకాముడనగా కోరదగిన కామము లెంతమాత్రము లేనివాడని త్పార్యము.) సంఘముగానేకమైన శత్రు పక్షమును దూరముగ తొలగించుట భువనముల స్థిరపరచుట మున్నగు విధముగ లోకక్షేమమును కల్గించుచున్నావు. దేవతలచేతను మానవులచేతను స్తుతింపబడిన

పశ్యత్సు దేవేషు తతోఽతి హర్షాత్
ప్రహ్లాదమీశోఽభిషిషేచ రాజ్యే ।
తదాజ్ఞయా పూర్వవదేవ చక్రే
వహ్నిః సుదగ్ధం ససభం పురాగ్ర్యమ్ ॥ 47

పాదములు కలవాడవు. తనచే కల్పింపబడిన మార్గములద్వారా పాపప్రవృత్తుల పోద్రోలినవాడవు. భయములేనివారును బలవంతులునగు రాక్షసులసముదాయముల నణచుటయందు మిక్కిలి పరిచయము కలవాడవు. స్వామీ! రథచక్రమును దాల్చినవాడవు. (భీష్మునినుండి పార్థుని గాపాడుటకై తనప్రతిజ్ఞను గూడవిడచి రథచక్రమును పట్టినవాడు కనుకనే శ్రీభాగవతము భీష్మస్తుతిలో -

స్వనిగమమపహాయ మత్ప్రతిజ్ఞామ్ , ఋతమధికర్తు మవప్లుతోరథస్థః ।
ధృతరథ చరణోఽభ్యయాత్ చలద్గుః హరిరివ హన్తుమిభం గతోత్తరీయః ॥
(శ్రీభాగ -1-9-38) ఇత్యాదిగ కీర్తింపబడినాడు)

సత్పురుషుల వశపరచుకొనుటలో దివ్యాంజనమైనవాడవు. (పరవశీకరణమునకై సిద్ధాంజనమును సంపాదించుట యోగాచరణము) దేవశ్రేష్ఠులగు నింద్రాదుల చేతను, ఋషిపుంగవులచేతను స్తుతింపబడినవాడవు. అనేక ప్రకారములగు నుత్తమాచరణములు కలవాడవు. బుధులకు ఏకైకధనమైనవాడవు. (విబుధులనగా విద్వాంసులు, దేవతలు) విద్వజ్జన బృందములకు దిక్కైన వాడవు. సమస్తదోషముల తొలగించు వాడవు.

భవ విశ్వనాటకకార! అంఘ్రిజన్వః సింధుధార!
మధ్వసృక్ ప్లుతచక్రధార! జనితకామ! విగతకామ!
దుర్వృత్త సమనిఖననక్షమ! సతత ప్రతీత! త్రిగుణ
వ్యతీత! ప్రణత వత్సల! నమస్తే! నమస్తే ! నమస్తే!

సాంసారిక సమస్త ప్రపంచ మహానాటక నిదర్శకుడవునీవే స్వామీ! నీ పాదముల నుండి స్వర్ధుని యావిర్భవించినది. మధువుచేతను రక్తముచేతను తడిసిన చక్రపుటంచు కలవాడవు. (దీనియభిప్రాయమిది. స్వామికి చేతిలో ధరింపబడిన చక్రాయుధముతోపాటు, విశ్వంభరాభరణ సామర్థ్యమును సూచించు శంఖచక్ర చిహ్నములు పాదములందు కూడకలవు. చేతిలోని చక్రాయుధము దుష్టులరక్తధారలచే తడుపబడగా, స్వామియొక్క పాదములందలి చక్రచిహ్నములు పూజార్థమై దేవబృందాదులచే వేయబడిన పుష్పములందలి మకరందముచే తడిసినవి. ఈ విధముగ మధు - అసృక్ప్లుత చక్రధారుడు, అనగా తేనెతోడను, రక్తములోడను తడిన చక్రముల ధరించిన వాడని తాత్పర్యము) సౌందర్యముచే లోకులకు కామమును పుట్టించుచున్నాడవు.

దేవాది భ్యోఽథః నాథ ప్రవర వరచయం దైత్యసూనోశ్చ దత్వా
కృత్వాశాన్తిం త్రిలోక్యాః స్వకృత నిధనతో రక్షసాంచాపి శాన్తిమ్ ॥
స్వర్వాద్యేషు ధ్వనత్సు ప్రవికచ సుమనో వర్షముక్షూన్మదేషు
ప్రీతైస్తైఃస్తూయమానః ప్రథిత పృథుగుణోఽన్తర్దధేదివ్యసింహః॥48

తతస్తముద్దిశ్య జనాః సురాద్యాః
ప్రణమ్య హృష్టాః పులకాశ్రుపూతాః ।
తత్కర్మచిత్రం కథయన్త ఐశమ్
భక్త్యా స్మరన్తః స్వపదాని జగ్ముః ॥ 49

కాని, నీ కెట్టి కామములును లేవు. దుష్టప్రవృత్తిగల వారినందరిని సమానముగ పెరికి వేయుటలో సమర్థుడవు. ధ్యాతృజనుల హృదయములందు నిరంతరము స్ఫురించువాడవు. సత్త్వము, రజస్సు, తమస్సులను మూడుప్రాకృత గుణములకు అతీతుడవు. శరణాగతవత్సలుడవు. అట్టి ఓ స్వామీ! నీకు ప్రణతులు! నీకు ప్రణతులు! నీకుప్రణతులు! 45

శ్రీ నారదుడిట్లు పలికెను. ఈ విధముగా గోవిందుని స్తుతించుచున్నవారై ఆనందాశ్రువులతో నిండిన కన్నులు గలవారగు దేవతలు, ఆనందముచే అస్పష్టమైన మాటలుకలవారై శ్రీహరికి నమస్కరించి, తమకభిమతములగు వరములను పొందిరి. 46

దేవతలు సానందముగ చూచుచుండగ, శ్రీహరి ప్రహ్లాదుని రాజ్యమున నభిషేకించెను. భగవదనుజ్ఞచే నగ్ని వెనుకటి వలెనే పట్టణాగ్రమునగల హిరణ్యకశిపు భవనమును సభతోపాటుగ బాగుగ దహించెను. 47

పిమ్మట దేవతలు మున్నగు ప్రపన్నులకును, ప్రహ్లాదునకును సర్వోత్తమములగు వరములనిచ్చి, ముల్లోకములకు చిత్తప్రశాన్తి ననుగ్రహించి, తానుసంహరించుటద్వారా రాక్షసులకుగూడ ప్రశమనమును కలుగజేసి, దేవదుందుభులు మ్రోయుచుండగ, ఉన్మత్తములగు మేఘములు లెస్సగ వికసించిన పూలను గురిపించుచుండగా మిక్కిలి ప్రీతిని నొందిన దేవాదులచే స్తుతింప బడుచున్నవాడై, నిఖిల జగద్విశ్రుతములగు కల్యాణగుణ బృందములుగల యాదివ్యనరహరి అంతర్ధానమును పొందినాడు.

దుష్ట నిగ్రహణము, ఆశ్రితావనము ఇష్టప్రదానము, భగవదవతారపరమలక్ష్యములని ఇచ్చట సూచింపబడినది. 48

మహర్షయస్తత్ర సమాగతాయే
తే చిత్ర సింహం నతథా శశంసుః ।
యథా మునీంద్ర స్పృహణీయ మృత్యూన్
దైత్యా న్నృసింహా దసతః కృతార్థాన్ ॥ 50

తేహోచురద్ధా! బత! లోకవాదాః ।
పంథా యథేచ్ఛం బలినాం సదేతి ।
క్లేశాస్తు సర్వే వశినాం యదేతే
భవాబ్ధి ముక్త్యై క్వమృతిః పరేశాత్ ॥ 51

పిమ్మట దేవతలు మున్నగువారు నరహరినుద్దేశించి మోకరిల్లిన వారై, ఆనందముచే పులకాంచిన దేహము, అశ్రుపరిపూర్ణములగు కన్నులు కలిగి ఆశ్చర్యకరమగు నా నరహరి కృత్యమునే పరస్పరము చెప్పికొనుచు, భక్తితో స్మరించుచు తమతమ నెలవులకు చనిరి. 49

అచ్చటి కేతెంచియున్న మహర్షులు నృసింహునివలన నభిలషణీయమగు మృత్యువును పొంది కృతార్థులైన యసజ్జనులగు దైత్యుల నెంతగా ప్రశంసించిరో, అంతగా నావిచిత్ర సింహమును గూడ ప్రశంసింపరైరి.

భగవదనుగ్రహమును పొందు నుపాయములలో సాక్షాత్తుగ భగవంతుని చేతిలో మడయుటకూడ చాలప్రశస్తమైనది. దానివలన పూర్వసంచితమగు కర్మము నిశ్శేషముగ హరింపబడునని వైరభక్తి ప్రశంసా సందర్భమున కంసాది నిదర్శనమును చూపుచు నిరూపింపబడినది ( చూ. 21వ శ్లో). 50

ఆ ఋషులిట్లనిరి. 'అహో! ఆశ్చర్యము! బలవంతుల మార్గము ఎల్లప్పుడు స్వేచ్ఛా ప్రచురమై యుండును. ఇక క్లేశములన్నియు ఇంద్రియముల నిగ్రహించిన భక్తులకే, అనిలోక వాదములు. కాని భక్తులకు కల్గిన యీ క్లేశములు వారిని సంసార సాగరమును దాటించుటకే కదా! ఆహా! సాక్షాత్తు శ్రీహరి వలన మృతివచ్చుట లభించును? 51

'మనము బహువిధవ్రతముల నిర్వహించినవారము, ఉత్తమ చరిత్రము కలవార మయ్యును భగవదనుగ్రహమునకు బాహ్యులమే అయితిమి. మరి, యీ దైత్యులు విష్ణుయోగమును పొందినారు. ఈ రాక్షసేంద్రుని చేతను, వేలాది భృత్యవర్గము చేతను, ఈ భవనాదులచేతను పూర్వము శ్రీహరి యర్చింపబడి యేయున్నాడు.

శ్రీహర్యర్చనములేనిదే తద్దర్శనాది భాగ్యము రాక్షసాదులకు కలుగదని

వయం ప్రవ్రతాఢ్యా ఉత సచ్చరిత్రా
బహిః స్థితా విష్ణుయుజశ్చ దైత్యాః ।
మన్యేఽసురేంద్రేణ సహస్ర భృత్యైః
హర్మ్యాది భిశ్చార్చిత ఏవ పూర్వమ్ ॥ 52

తథాపి భక్త్యా భగవన్ ! యదేతే
ప్రహ్లాద తశ్చాప్యధికం కృతార్థాః ।
మృతిస్తు తేషామితి సంస్తువన్తో
మిథోవదన్తో నృహరిం స్తువంతః ॥ 53

యయుశ్చ తీర్థాని తథాశ్రమాంశ్చ
దృష్ట్వా తథాపూర్వ మఖేంధ నాగ్నిమ్ ।
దైత్యేంద్ర పుత్రోఽపి తదాజ్ఞయైవ
రాజ్యం పురం విష్ణుమయః శశాస ॥ 54

తాత్పర్యము.

52

ఓ మునీంద్రా! ఏ కారణముగ వీరందరా (భగవానుని చేతిలో మడసిన రాక్షసులందరు) (వైరమూలమగు) భక్తిచే ప్రహ్లాదుని కంటె కూడ విశేషముగ కృతార్థతను చెందిరో, అందువలననే వారికి ప్రశస్తమైన మరణము కలిగినది. అని మరణమును స్తుతించుచు పరస్పరము భాషించుచున్నవారును, నరహరి నుపశ్లోకించుచున్న వారును అయి (తమతమ నెలవులకుచనిరని తరువాత శ్లోకముతో అన్వయము). 53

అంతనా మహర్షులు తీర్థములను, ఆశ్రమములను, అపూర్వమగు తేజస్సుతో, ప్రకాశించుచున్న యాగాగ్నిని దర్శించి వెడలిపోయిరి. విష్ణుమయుడైన యా ప్రహ్లాదుడు శ్రీహరి యాజ్ఞననుసరించియే పురమును, రాజ్యమును శాసించినాడు.

'అపూర్వ మఖేంధనాగ్నిమ్' అనుటచే ఇతః పూర్వము హిరణ్యకశిపు పాలనలో ఋషిజనపీడచే నణగారిన వైదిక కలాపము, రాక్షసహరణా నంతరము మరల అపూర్వమగు దీప్తితో కూడిన వహ్నికలదై యొప్పారినదనియు, అట్టియప్రతిహతదీప్తిని ఋషులు దర్శించినారని యభిప్రాయము.

54

శ్రీహరి పాదమను సర్వోత్తమ రాజ్యమును పొందుటయందు తప్ప, ఆ ప్రహ్లాదుని మనస్సు క్షుద్రమగు రాజ్యవైభవమందు 'తృష్ణ' (కోరిక) కలది కాదు. ఈ సమస్త జగత్తును విష్ణుమయముగా దర్శించుచు మహానుభావులచే కీర్తింపబడిన గుణగణములు కలిగి, పృధివిపై కలికి భీతిపుట్టించు కీర్తిని స్థిరపరచి, ఈ లోకమును పూతమొనర్చి దైవనిశ్చితమగు సమయ మాసన్నము కాగా శ్రీహరి సన్నిధిని చేరినాడు.

నహ్యస్య చిత్తం లఘురాజ్య తృష్ణం
హిత్వాచ్యుతాం ప్రుయ్యుత్తమ భక్తిరాజ్యమ్ ।
పశ్యన్ జగద్విష్ణుమయం మహాత్మా
మహాత్మభిర్గీత గుణః పృథివ్యామ్ ।
కీర్తిం కలేర్భీతి కరీం విధాయ
కాలే హరిం ప్రాప సపూతలోకః ॥ 55

శ్రీ నారద ఉవాచ –
ఈదృక్ ప్రభావో దనుజేంద్ర సూనుః
మయా భవద్భ్యః కథితో ద్విజాగ్ర్యాః ।
కథాహి యస్యేశ పదాశ్రయాఢ్యా
పునాతి గంగేవ సదా త్రిలోకీమ్ ॥ 56

ఆపత్సు సర్వాస్వపి తం స్మరన్తః
ప్రహ్లాద మీశేన నతాః స్పృశేయుః ।
జనాన్ కదాచి న్నను తత్ప్రియత్వాత్
విష్ణోః సదా సన్నిహితే కుతస్తాః ॥ 57

ఇంతటితో ప్రహ్లాదచరితము పరిసమాప్త మొనరింపబడినది. ప్రహ్లాదుని రాజ్యశాసనాది వృత్తాంతము వామన పురాణాదులలో వితతముగనున్నది. 55

ఓద్విజులారా! శ్రీహరి పదము నాశ్రయించుటచే సుసంపన్నమైన యే మహానుభావుని 'కథ ' గంగవలె ముల్లోకముల పరిపూతమొనర్చుచున్నదో, అట్టి ప్రహ్లాదుడు ఇతః పూర్వము చెప్పబడిన మహాప్రభావము కలవాడై మీ కొరకు నాచే వివరింపబడినాడు. 56

ఎల్ల యాపదలందును పరమ భాగవతోత్తముడగు నాప్రహ్లాదుని స్మరించు చున్నవారై, శ్రీహరికి ప్రియులగుటచే జనులనెప్పుడును ఆపదలు స్పృశింప కుండునుగాక! విష్ణువునకు సన్నిహితుడైన వానియందాపదలెట్లు ప్రవర్తింతును?

ఈ శ్లోకము ప్రహ్లాదచరిత శ్రవణమువలన కల్గిన ఫలమును నిర్దేశించుచున్నది కావున, 'ఫలశ్రుతి'. ఎవ్వరీ శ్రీహరి ప్రియుడగు ప్రహ్లాదుని చరితమును స్వయముగ గ్రంథాధ్యయనముచే గాని, పెద్దలవలన వినిగాని స్మరింతురో వారును శ్రీహరికి ప్రేమాస్పదులగుదురు. కావున ఆపదలెంత మాత్రము, ఎప్పుడును వారిని దరిజేరవు. ఎవ్వరు నిరంతర స్మరణముచే శ్రీహరికి సన్నిహితులో వారును ఎప్పుడును ఆపదల పొందరు. లౌకికములగు నాపదల బడిన వారీగాథను విన్నంతనే ఆపదలగడచి సుఖముల బడయుదురని తాత్పర్యము. 57

శ్రుత్వా నృసింహాన్మరణం సురారేః ।
ప్రాప్నోతి విష్ణోః స్మరణం నరోఽన్తే
రోగ గ్రహాధ్యాది తమాంసి దూరే
నృసింహ తేజః స్మరతామనన్తమ్ । 58

సుమధురాం జగతామపి సేవితాం
ముదితహంసకులాం ధవళా మిమామ్ ।
త్యజతి విష్ణు పదాశ్రయ వందితా
మిహ కథాం కృతధీర్ద్వ్య నదీంచ కః ॥ 59

ఇతి శ్రీనారదీయే హరిభక్తి సుధోదయే ప్రహ్లాదచరితే షోడశోఽధ్యాయః ।

నృసింహుని వలన రాక్షసేంద్రుడగు హిరణ్యకశిపుడు మరణించిన వృత్తాంతమును విన్నమానవుడు అన్త్యకాలమున విష్ణుస్మరణమును పొందును. అనన్తమైన నృసింహ తేజస్సును స్మరించిన వానికి రోగములు, గ్రహపీడలు, మనోవ్యథలు మున్నగు చీకట్లు (క్లేశములు) చాలదూరమున నుండును. అనగా దరిచేరవని తాత్పర్యము. 58

తియ్యనిది ఎల్లలోకములకు సేవింపదగినది (ఎల్లలోకములచే సేవింపబడినది) ఆనందితములగు హంసబృందములు కలది, తెల్లనిది, విష్ణుపదమగు నాకాశము నాశ్రయించినదగుటచే నమస్కరింప దగినదియునైన సురగంగను శ్రీహరికథను స్థిరబుద్ధియైన వాడెవ్వడు విడచి పెట్టును?

ఈ శ్లోకమున సురగంగకు వేయబడిన విశేషణములు 'కథ' కు కూడ అన్వయింప వలయును. శ్రీహరి కథ ఎట్టిది ? 'సుమధురా, అనగా తియ్యనిది. అనగా వీనుల విందొనర్చునది. సకల జగత్తులచే సేవింపబడినది. 'ముదిత హంసకులామ్ ' యోగివరులకు నిరంతర హర్షమును కల్గించునది. 'ధవలామ్' అనగా తెల్లనిది. అనగా ఎట్టి దోషములు లేనిది. విష్ణు పదాశ్రయామ్' విష్ణు ప్రతిపాదకములగు పదములతో అనగా నామములతో కూడినది. అందువలననే వందనీయము. ఇట్టి శ్రీహరి కథ నెవ్వడు విడచును? వివేకియైనవాడెవ్వడు విడువడని తాత్పర్యము.

ఇది శ్రీనారద పురాణాంతర్గతమగు హరిభక్తి సుధోదయమునగల

ప్రహ్లాదచరితమునందలి పదునారవయధ్యాయము.

# సప్తదశోఽధ్యాయః

**పదునేడవయధ్యాయసారము:** నారదమహర్షి శౌనకాదిమహర్షులకు ప్రహ్లాద చరితమును వినిపించినాడు. హర్షాశ్రుపులకాంచిత దేహులై ఋషులాకథను సావధానముగవినినారు. క్రోధావేశముచేతనే అయినను తనను ఎడబాయని నిరంతర శ్రీహరిస్మృతిచే హిరణ్యకశిపుడు శ్రీహరిచే చంపబడి ముక్తుడగుట వారికాశ్చర్యమును కలుగజేసినది. దైత్యేంద్రుని బహుధా కీర్తించినారు. ఆనగరమున నుండిన, రాక్షసులందరు పరమభాగవతోత్తములై యుందురనియు, హిరణ్యకశిపుడు, వాని భృత్యవర్గము, చివరకు ఆపురమునగల యచేతనములగు భవనములు సహితము పూర్వము శ్రీహరిసమర్చనమునొనర్చి యుండ వలయు -ననియు లేనిచో, వారికి అంత్యకాలమున భగవద్దర్శన మహాభాగ్యమబ్బెడిది కాదనియు భావించినారు. అంత్యకాలమున హరిస్మృతి ఎవ్వరికోగాని అందరకు సాధ్యము కాదనియు, దురాచారపరులైన యారాక్షసుల కిట్టి భాగ్యముకలుగుటకేమి కారణమని నారదమహర్షిని శౌనకాదులు ప్రశ్నించిరి. వారి హృదయము నెరిగిన వాడగు శ్రీహరిధ్యాన సుసంస్కృత చిత్తుడునగు, మహర్షి, 'ససదా కోపతః సాధున్..... అనియారంభించి (17) ' ఇతిదైత్యేశ్వరం క్రోధ.... ' (22) శ్లోకమువరకును – ' నిరంతర శ్రీహరి భావన' ఆహిరణ్యకశిపునకెట్లు కలిగినదో విశదపరచినాడు. ఆతని క్రోధమే ఆతనిని సద్గురువువలె శ్రీహరిస్మరణమున ప్రేరించుచున్నదని పేర్కొనినాడు. పాముల కోరలనుండి తీసిన విషము ప్రాణహారియే అయినను ఔషధముగ నొక్కొకప్పుడు ప్రాణసంరక్షకమైనట్లు, క్రోధము స్వాత్మనాశన కారణమే అయినను, అది ఒక్కొక్కప్పుడు నిరంతర భగవదనుస్మృతికి కారణమై మోక్షహేతువగునని తెల్పినాడు. శ్రీహరిస్మృతి మోక్ష కారణమగుట వస్తుస్వభావము. ఆ స్మృతి ఏ నిమిత్తముగ నేర్పడినదైనను కావచ్చును. చీకట్ల పోద్రోలుట సూర్యునకును. శైత్యమును తొలగజేయుట అగ్నికిని ఎంతటి సహజలక్షణమో, పాపములపోద్రోలి, ముక్తి నిచ్చుట హరిస్మృతికి సహజలక్షణమని పేర్కొనినాడు. వేలాది జన్మలపొంది కర్మపరిపాకవశమున ఈ కర్మభూమిపై మానవునిగ పుట్టినవాడు తన జన్మమును వ్యర్థపుచ్చరాదని– ' అనంతయోనింవ్రజతః కర్మభూమౌమనుష్యతా। భవేత్కదాచిజ్జీవస్య, లబ్ధ్వాతాం కోవృథావసేత్' అని ప్రతి బోధించినాడు. ప్రహ్లాదచరిత విశిష్టతను ఖ్యాపనమొనర్చు నదీయధ్యాయము, సదుపదేశ మధురము.

ఇతి ప్రహ్లాద చరితం నైమిషీయా మహర్షాయః
నిశమ్య హర్షాద్దేవర్షిం ప్రోచుర్భాగవతోత్తమ్ ॥ 1

శ్రీ శౌనకాదయ ఊచుః—
అహెూ! మర్త్యాఅపి స్వామిన్! త్వత్ప్రసాదాద్వయంసుధాం।
పిబామో దుర్లభాం ధన్యా ఇచ్ఛయేశకథా భిధామ్ । 2

యద్వాదోషః సుధాసామ్యం కథాయాం వదతాం హరేః
యథామరత్వం నిత్యం స్యాన్నహి, మన్వన్తరావధి ॥ 3

ఈ విధముగ ప్రహ్లాద చరితమును, నైమిశారణ్యమునగల మహర్షులెల్లరు విని, సానందముగభాగవతోత్తముడగు నారదునితో పలికిరి. 1

ఆహా! స్వామీ! నీయనుగ్రహమువలననే దుర్లభమగు శ్రీహరి కథామృతమును మర్త్యులమగు మేముకూడ స్వేచ్ఛగా త్రావుచున్నవారమై ధన్యులముకదా!

మర్త్యులనగా మరణరూపమగు వికారముకలవారు. దేవతలు అమృతపానముచే అమరులైనట్లు, మరణశీలురగు మానవులు గూడ శ్రీహరికథామృతమును గ్రోలి మరణమును జయింపగలరని తాత్పర్యము. వాస్తవమునకు దేవత్వమున్నంతవరకే అమృతమును గ్రోలుట. పుణ్యకర్మమున్నంతవరకే స్వర్గమున దేవత్వముండుట. పుణ్యము క్షీణించగనే మరల మర్త్యత్వము తప్పదు. కనుకనే 'క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి' పుణ్యము నశింపగనే మర్త్యలోకమును ప్రవేశింతురు అని శాస్త్రము. ఇక శ్రీహరి కథామృతమును గ్రోలినవారికి తుచ్ఛము, కర్మఫలరూపమునగు దేవత్వము కాక సాక్షాత్తు అపునర్భవ రూపమగు శాశ్వత పరమపదప్రాప్తియేయగును. గనుక, ఈ యమృతమును మర్త్యమాత్రుడు తప్పకగ్రోలవలయునని హృదయాభిప్రాయము. ఈ యభిప్రాయమునే ముందు ముందు శ్లోకములలో వ్యక్తపరచుచున్నాడు. 2

శ్రీహరి కథకు అమృతముతో పోలిక చెప్పుటయు దోషమే యగును. ఏలన- అమృతమును ద్రావినందువలన కల్గిన యమరత్వము నిత్యము కాదు! అది కేవలము ఆమన్వన్తరము ముగియునంతవరకే కదా!

కర్మ సంబంధమువలననే జీవునకు దేహప్రాప్తి. కర్మతారతమ్యమును బట్టి దేహము, జాత్యాది నిమిత్తమగు ఉత్కృష్టతనుపొందుచున్నది. క్రిమికీటాదిదేహము మొదలు హిరణ్యగర్భ (బ్రహ్మ) దేహమువరకు వివిధ తారతమ్యముతో కూడిన దేహములన్నియు పుణ్యపాపాదికర్మవలన కలిగినవే కనుక స్వర్గసుఖమునమభవించు

బ్రహ్మ సూనో! సురాగ్ర్యస్త్వం సుధావార్తా పరాఙ్ముఖః ।
పిబసీశకథాం నిత్యం సుధాయాః స్ఫుటమంతరమ్ ॥ 4

తతోఽన్యత్ సర్వతపసాం ఫలం కాంక్షామహే వయమ్ ।
త్యక్త్వాన్యేషాం సంగమం త్వత్సంగమోఽభ్యుదయావహః ॥ 5

అహో! భాగవతం క్షేత్రం వద్దైత్య పతేః పురం ।
తత్రస్థా యోగిదుష్ప్రాపం సర్వేప్రాపుర్హరిం యతః ॥ 6

దేవదేహములు కూడ కర్మనిమిత్తములే. కనుక ఈ దేహములన్నియు సావధికములు. అనగా కొంత కాలము తరువాత నశించునవే. ఇట్లే దేవదేహము, తన్నిమిత్తమగు దేవత్వధర్మముకూడ సావధికమే. అనగా ఈమన్వన్తరము ముగియగనే నశించునదే. కావున దేవదేహమునుపొంది, స్వర్గమున త్రావిన యమృతమువలన సిద్ధించిన అమరత్వము ఆమన్వన్తరముముగియగనే ముగియునదే కనుక, ఈ సావధికమగు (సమయపరిమితిగల) అమరత్వమునిచ్చు అమృతముకంటె, శాశ్వతమగునమరత్వమును అనగా మోక్షమునను గ్రహించు శ్రీహరి కథారసమును సాధారణమగు నమృతముతో పోల్చుట దోషావహమని తాత్పర్యము. 3

బ్రహ్మపుత్రుడవైన ఓ నారదమహర్షీ! దేవతలు త్రావునట్టి యమృతముకంటె స్పష్టమగు భేదముగల 'ఈశకథామృతము' ను నిరంతరమాస్వాదించుచున్న నీవు, సాధారణమగు అమృతముపట్ల పరాఙ్ముఖుడవై దేవతలందరిలోనే అగ్రగణ్యుడవై యున్నావు. 4

కావున ఆయమృతముకంటె వేరైనఫలమే మాతపస్సులకు కావలయునని మేము అభిలషించుచున్నాము. 5

ఆహా! నిజముగ నీరాక్షసేంద్రునినగరము భాగవత క్షేత్రమే కదా! ఏలన- యోగులచే పొందనలవికానివాడగు పరమాత్మ శ్రీహరిని యానగరవాసులందరు పొందినారుకదా! 6

ఓనారదమునీంద్రా! వేలాది మందిలో ఎవ్వడో ఒక్కడు అన్త్యకాలమున శ్రీహరిని స్మరింపగల్గునో లేదో? కాని ఆ నగరమునగల వారందరు సాక్షాత్తుగ శ్రీహరిని ప్రత్యక్షముగ దర్శించుచున్నవారై దేహముల విడచిరి కదా! 7

మరణోన్ముఖులైనవారి చెవులలో త్వరలో కూడిన 'ఈశుని స్మరింపుము,

మునివర్య! సహస్రేషు కశ్చిచ్ఛక్నోతి వానవా?
యఃస్మర్తుమన్తే, తం సాక్షాత్ పశ్యన్త్యన్తే తనూర్జహః। 7

ముమూర్షతాం యః శ్రవణే సత్వైరెరుపదిశ్యతే।
స్మర స్మరేశ మిత్యాద్యైస్తంతేఽగ్రే దదృశుర్మృతౌ। 8

ధ్రువంతే దైత్యవేశేన స్థితాః భాగవతోత్తమాః
విజ్ఞాయతేహి మరణే జనానాం సారఫల్గుతా। 9

స్మరింపుము ఇత్యాది వచనముల ద్వారా ఏ పరమాత్మ సన్నిహిత బంధువులచే నుపదేశింప బడుచున్నాడో, అట్టి పరమాత్మను మరణకాలమున నెదురుగ దర్శింపగల్గిరి. 8

నిక్కముగ నరహరి కెదురొడ్డి నిలువబడి మరణించిన దైత్యులు, ఆవేషమునగల భాగవతోత్తములే సుమా! జనులకుగల బలము యొక్క నిస్సారత, అస్థిరత మరణకాలమున మాత్రము లెస్సగ తెలియగలదుకదా? 9

ఈలోకమున దురాచార పరులైన దైత్యులచే నేమి (సత్కర్మము) చేయబడినది? స్వామీ! ఇది స్వల్పమగు పుణ్యమునకు ఫలముకాదు. సర్వజ్ఞుడవగు నీవు దీనిని మాకెరింగింపుము.

ఇంతవరకు శౌకాదులు అన్త్యకాలమున భగవత్స్మరణము దుర్లభమనియు, అదిఎంతటి మహాపుణ్యమునొనర్చిన వారికో తప్ప సాధ్యముకాదనియు, వాస్తవమునకు చివరికాలమున భగవత్స్మృతి వేలాది మందిలో ఒక్కరికూడ సులభముకాదనియు, ఎట్టిపుణ్యమునుచేయని యా రాక్షసులు చివరిగడియలో భగవత్ స్మరణమునేగాక దర్శనమును గూడపొందగలుగుట బహుజన్మసంచిత మహాపుణ్య ఫలమేననియు, నిజముగవారందరు రాక్షసరూపమున నున్న పరమభాగవతోత్తములే అయి యుందురనియు, ఆశ్చర్యముతోభావించి వీరిట్టి మహాభాగ్యమును పొందుటకు గల కారణమును వివరింపుమని మరల నారదుని ప్రార్థించుచున్నారు.

లౌకికమగుననుభవమును బట్టి చూచినప్పుడు కూడ సర్వథా బహిర్ముఖములైన యింద్రియములతో, బహువిధకువాసనావాసితములైన చిత్తములతో, బాహ్యవిషయచింతనా సంకులములైన మర్త్యజీవనములందు అన్త్యకాలభగవత్స్మృతి దుర్లభమని వేరుగ చెప్పనక్కరలేదు. మరణమాసన్నమైనపుడు 'భగవంతునిస్మరింపుమని' ఆప్తులచే

ఇహ తావవద్దురాచారై స్తైఃస్వామిన్! కింకృతంపురా।
నహ్యే.తదల్ప పుణ్యస్య ఫలం, సర్వజ్ఞ తద్వద ॥ 10

భక్తానాం తద్వచః శ్రుత్వా, హృష్టరోమాఽథ సన్మునిః ।
స్మృతేశాద్భుత మాహాత్మ్యం ప్రాహ హర్షాశ్రు గద్గదః॥ 11

శ్రూయతాం దేవ దేవస్య మహిమాహ్యద్భుతం ప్రభోః ।
సత్త్రాప్యర్థ్యా భూద్గతిర్యేన రక్షసాం సర్వ సద్రుహామ్ ॥ 12

నుపదేశింపబడియు, ఆతురసన్యాసమునిప్పింపబడియు, నరుడు, సహజసంస్కారమును విడువలేడు. 'అంత్యకాలమున జగత్‌కారణమును స్మరింపుమ ' ని బంధువులు చెప్పగా, నొకతర్కపండితుడు 'పీలవః పీలవః పీలవః'పరమాణువులే జగత్కారణమని యనినాడనిపెద్దలు చెప్పుదురు. సంస్కారమంతటిబలవత్తరమైనది. ప్రహ్లాదునకు వలె బాల్యముననే, మాతృగర్భముననే అట్టియుత్తమ సంస్కారమును పొందు భాగ్యము సామాన్యజనులకసాధ్యము. మరి, రాక్షసులు,ప్రత్యక్షముగదురాచారపరులుగా కన్పట్టుచుండగ వారికిట్టి మహాభాగ్యమెట్లుకల్గినదని ఋషులసంశయము. దానికి నారదుని ప్రతి సమాధానము ముందు శ్లోకములలో వితతమొనర్పబడినది. 10

పిమ్మట నాభక్తుల మాటలువిని ఆనందముచేపులకించిన దేహము కలవాడగు నాముని సత్తముడు పరమేశ్వరుని మాహాత్మ్యమును స్మరించి ఆనందాశ్రువులచే రుద్ధమైన కంఠముకలవాడై పలికెను. 11

ప్రభువు, దేవ దేవుడునైన శ్రీహరికి చెందిన యద్భుత మహిమమును వినుడు. సత్పురుషులనెల్లర పీడించునట్టి రాక్షసులకు సహితము సజ్జన ప్రార్థనీయమగు సర్వోత్తమగతి శ్రీహరి నిమిత్తముగ కల్గినది కదా! 12

ఓ ద్విజులారా! ఆ రాక్షసులు కృతకృత్యులగుటకు వారు పూర్వముచేసిన కఠోరతపమో, మంత్రజపమో, యోగమో, లేక యాగమో కారణముకాదు. మరియేమన్నచో నిరంతర శ్రీహరిస్మృతియే. 13

ఇట్టి శ్రీహరిస్మృతి కలుగుటకు వేదాన్తవాక్యవిచారణమో, పెద్దలయుపదేశమువలన కలిగిన వివేకమో, లేక శాస్త్రాధ్యయనమువలన కలిగిన జ్ఞానమో నిమిత్తముకాదు. కేవలము మాత్సర్యము (పరులగొప్పతనమును సహింపలేక పోవుట) రోషము అనునవియే నిమిత్తములు! ఆహా! శ్రీహరిస్మరణమాహాత్మ్య మాశ్చర్య కరము కదా! 14

**భో విప్రాస్తత్ కృతార్థత్వే న పూర్వోగ్ర తపో జపః।**
**యోగో, యాగోఽథవాహేతుః, కిన్తు నిత్యం హరిస్మృతిః॥ 13**

**సాచ జిజ్ఞాసయా సార్థం, మత్యా, జ్ఞానేన వానహి।**
**కింతు మాత్సర్యరోషాభ్యాం, మహిమాహో! హరిస్మృతేః॥ 14**

**సహి జన్మప్రభృత్యేవ హరింద్వేష్టిమహాసురః।**
**దివానిశం తం స్మరతి తతఏవాతి మత్సరీ॥ 15**

ఆదైత్యేంద్రుడు పుట్టినది మొదలు శ్రీహరిని ద్వేషించుచున్నాడు. పవలు రాత్రి (ఎల్లప్పుడు, శ్రీహరిని స్మరించుచున్నాడు. ఈ నిరంతర శత్రుస్మరణమువలననే) తనశత్రువైన శ్రీహరిపట్ల మాత్సర్యమును పెంచుకొనినాడు. 15

దురభిమాని, మాత్సర్యముకలవాడు అయినవ్యక్తి ద్వేషమువలన తన శత్రువుల నెల్లప్పుడు స్మరించుచుండును. ఇంతటి గాఢముగా ప్రియజనుడు తనకు ప్రేమాస్పదుడైన వానిని గూడ స్మరింపడు. ఏలన, లోకులు అమర్షదోషమే అధికముగ కలవారుకదా! 16

ఆ హిరణ్యకశిపుడు కోపముచే శ్రీహరినాశ్రయించినవారిని శ్రీహరియందుగల ద్వేషబుద్ధితో బాధించుచుండును. శ్రీహరియే సమస్త యజ్ఞపరిపాలకుడని భావించి యజ్ఞముల గూడ పాడుజేయుచుండును. 17

దేవతలనందరని విష్ణుమయులుగను, శ్రీహరిని గురుతుచేయువారనియు భావించి క్రోధవశమున వారలద్వేషించును. ఇక వేదవాక్కులు శ్రీహరి యాజ్ఞలేనని స్మరించి వాటిని దూషించుచుండును.

దేవతలనెల్ల యాపదలనుండి రక్షించువాడు శ్రీహరియేగనుక, ఏ దేవతను చూచినను వెంటనే శ్రీహరి స్మృతిలో మెదలును. కనుక దేవతలను జూచినపుడు వారు శ్రీహరిని గురుతుచేయుదురని తలచి క్రోధముతో వారలద్వేషించును. ఇక వేదములు 'యస్య నిఃశ్వ సితం వేదాః' అని చెప్పినట్లు శ్రీహరి నిఃశ్వాసములే కనుక నవి శ్రీహరి నిదేశములేననిస్మరించి నిందించు చుండునని తాత్పర్యము. వేదనింద, వేదప్రతిపాద్యుడగు భగవాను నాశ్రయించిన వారిని ద్వేషించుట నాస్తికతాబుద్ధికి నిదర్శనము. 18

భుజించుచు, పానీయములత్రావుచు, ప్రమదలనను భవించుచు, తాంబూలాదుల సేవించుచు, నిరంతరము, శ్రీహరిని స్మరించి, ఆ శ్రీహరి కిట్టి సుఖమెక్కడిది? అని

మానీ, మత్సరవాన్, శత్రూన్ (ద్వేషాత్) స్మరతి సర్వదా ।
నైవం ప్రియం ప్రియో యస్మాదమర్షబహులా జనాః ।7 16

స సదా కోపతఃసాధూన్ హరి బుద్ధ్యా తదాశ్రయాన్ ।
బాధతే సర్వయజ్ఞాంశ్చ, తంమత్వాఽఖిల యజ్ఞపమ్ ॥ 17

దేవాన్ విష్ణుమయాన్ మత్వా ద్వేష్టి, దూషయతి శ్రుతీః ।
తజ్జ్ఞాపికాఇతి క్రోధాత్, తస్స్వాజ్ఞాఇతి స్మరన్ ॥ 18

అశ్నన్ పిబన్ భజన్ కాంతాస్తాంబూలాదీన్వదన్ సదా ।
స్మరతీశం సుఖం త్వీదృక్ కుతస్మేస్యేతి మత్సరీ ॥ 19

స్వప్నేఽపి బద్ధవైరత్వాత్ చక్రిణం యుద్ధ నిర్జితమ్ ।
ద్రావయన్నివ తం పశ్యన్ మోదతేఽధిక్షిపన్నివ ॥ 20

మాత్సర్యమును వహించును. 19

కలలోకూడ దృఢమైన శత్రుత్వభావనకలవాడగుటచే శ్రీహరిని యుద్ధమున జయించినట్లును, దూరముగ వెడలగొట్టుచున్నట్లును, తీవ్రముగ నధిక్షేపించుచున్నట్లును చూచుచున్నవాడై ఆనందించును. 20

సర్వపాపవినాశకుడగు శ్రీహరి కథలను, పవిత్రములగు నామములను తనతో స్వేచ్ఛగావ్యవహరించు భృత్యులతో నెల్లప్పుడు పరిహాసార్థమై వినుచు, ప్రస్తావించుచు నుండును. 21

ఈ విధముగా హిరణ్యకశిపుని, ఆతని క్రోధమే ఎల్లప్పుడును సద్గురువువలె సర్వ కర్మములయందును శ్రీగోవిందస్మరణమున ప్రేరించుచున్నది.

సద్గురువు తన్నాశ్రయించినవారికి శ్రీగోవిందమంత్రమునుపదేశించి నిరంతరము సర్వకాల సర్వావస్థలయందును దానినే మననము చేయుచు శ్రీగోవిందుని స్మరింపుమని ప్రేరించుచుండును. ఇట్లే హిరణ్యకశిపుని క్రోధముగూడ శ్రీ గోవింద స్మరణము, ఆతనిని ప్రేరించినదని తాత్పర్యము. 22

ఈ శ్రీహరిస్మృతి-క్రోధముచే చేయబడినదైనప్పటికిని, భృత్యులతో పాటుగ, ఆదైత్యుని సద్గతికి చేర్చినది. ఓ విప్రులారా! ఇట్టి హరి స్మృతి మాహాత్మ్యమును వర్ణించుట దుష్కరముకదా! 23

శ్రుణోతి వక్తిచ సదా హేస్యార్థమఘభిత్కథాః ।
పుణ్యాని విష్ణునామాని భృత్యైః స్వేచ్ఛానుగైః సదా ॥ 21

ఇత్థిదైత్యేశ్వరం క్రోధః సర్వకృత్యేషు సర్వదా ।
సంచోదయతి గోవిందస్మరణే సద్గురుర్యథా ॥ 22

సైషా హరిస్మృతిర్దైత్యం క్రోధాదపి కృతాసతీ ।
అవయత్ సద్గతిం విప్రాః సానుగం కింనువర్ణ్యతే ॥ 23

సోఽయందశాననోభూత్వా చైద్యో భూత్వా చ మత్సరీ ।
హతౌ రాఘవకృష్ణాభ్యాం ముక్తోఽతో నజనిష్యతే ॥ 24

ఇత్థం క్రోధోఽస్య మోక్షాయ జాతః కృష్ణాశ్రయోద్విజాః ।
నను కామోఽపి గోపీనాం సుచిత్రచారితోహ్యజః ॥ 25

ఈ హిరణ్యకశిపుడే తనకు సంబంధించిన ఇతర జన్మములలో రావణుడుగా పుట్టి శ్రీరామునిచేతను, శిశుపాలునిగా పుట్టి శ్రీకృష్ణునిచేతిలోను మడసినాడు. కావున ముక్తుడైమరి ఇక జనింపడు. 24

ఆ విధముగ నా హిరణ్యకశిపునికి శ్రీహరిపట్లగల క్రోధమే ఆతనిమోక్షమునకు కారణమైనది. ఓ ద్విజులారా! గోపికల కామముకూడనిట్టిదియే గదా! అజుడగునా శ్రీహరియిట్టి యాశ్చర్యకరమగు చరితముకలవాడుకదా! (16వఅధ్యా. 25 వ శ్లోకము వివరణం చూడవలయును) 25

కామము, క్రోధము అనునవి జనులయధః పతనమునకు విశేషకారణము. కాని అవియే శ్రీహరినాశ్రయించి యున్నప్పుడు గోపికలకు, రాక్షసులకు ముక్తిహేతువులైనవి. 26

పాముకోరలనుండి యమృతమును, దొంగలనుండి యుత్తమ ద్రవ్యమును పొందుటయెంత అసంభావ్యమో, కామరోషములనుండి మోక్షమును పొందుటయు అట్టిదే. కానివారట్లు పొందగలుగుట మిక్కిలి ఆశ్చర్యకరము. 27

అయినను ఇక్కడ నాశ్చర్యమేమున్నది? ముక్తిలో శ్రీహరిస్మృతియే కారణము. ఈ హరిస్మృతి కామనినిమిత్తముగా గాని, ద్వేషమువలనగాని, నిర్వికారుడగు నీశుని ప్రేరణచేగాని ఎట్లైనను కలుగవచ్చును. 28

కామక్రోధావధః పాతే జనానాం కారణం పరమ్ ।
తావేవేశాశ్రయా వాస్తాం ముక్త్యై గోపీసురద్విషామ్ ॥ 26

సుధామివాహిదంష్ట్రాభ్యాం చోరేభ్య ఇవ సద్ధనం ।
మోక్షంతే స్మర రోషాభ్యామ్ అలభన్త మహాద్భుతమ్ ॥ 27

యద్వాకిమద్భుతం ముక్తేః కారణం హి హరిస్మృతిః ।
ప్రధానం సాస్మరద్వేషా ద్భృత్తుర్వా స్త్వపి కారిణః ॥ 28

ద్విషన్నప్యౌషధం పీత్వా రోగీ యద్వత్ సుఖీ భవేత్ ।
కథమప్యవ్యయంస్మృత్వా సంసారీ ముచ్యతే తథా ॥ 29

నిధిస్థానం ఖనన్ ద్వేషాత్ మృదర్థం వాప్నుయాన్నిధిమ్ ।
అజ్ఞః కామాచ్చ రోషాచ్చ స్మృత్వేశం మోక్షభాగ్భవేత్ ॥ 30

ద్వేషించుచునే ఔషధమును త్రాగినప్పుడు రోగి ఎట్లుగస్వస్థతను పొందుచున్నాడో అట్లే, ఏదో విధముగ నవ్యయుడైన(నాశరహితుడైన) శ్రీహరిస్మరించి సంసారబంధమునగల మానవుడు ముక్తినిపొందుచున్నాడు. 29

ద్వేషమువలనగాని,మట్టికొరకుగానినిధిగల ప్రదేశమును త్రవ్వినవాడు నిధిని పొందినట్లుగ, అవివేకి యైనవాడు కామవశమున, రోషమువల్లను శ్రీహరిని స్మరించి ముక్తిని పొందును. 30

రోషావిష్టునిచేగాని, ప్రమత్తుడైరవానిచే (చిత్తచాంచల్యముకలవానిచేగాని) మీదపడవేయబడిన నిప్పు ఒడినికాల్చినట్లు,ఏదోవిధముగ హృదయమున నిలుపబడిన భగవానుడు సర్వ పాపమును దహించును. 31

తెలివితక్కువవాడు, చావగోరి, అజ్ఞాతచే నమృతమును విషమని భావించి త్రావినను వజ్రమువలె దృఢశరీరుడైనట్లుగనే, కల్మషచిత్తుడైన జనుడుగూడ శ్రీహరిని స్మరించినచో ముక్తిని తప్పకపొందవలసినదే కదా! 32

శ్రీహరిస్మరణము మోక్షమును కల్గించుట యనునది దాని స్వభావసిద్ధమగు లక్షణము. సూర్యుడు చీకట్లు పారద్రోలుట, నిప్పు చలిని పోగొట్టుట యెట్లో ఇదియు నట్టిదే. 'స్వభావోదురతి క్రమః ' ఏవస్తువునకేది స్వభావసిద్ధమగులక్షణమో అది ఎప్పుడునుతొలగిపోదు. సూర్యుడుదయించగనే చీకట్లు తొలగు, నిప్పుల వేడిమిచే

రుష్టేన వా ప్రమత్తేన క్షిప్తోఽ గ్నిః కక్షమాదహేత్।
కథమప్యర్పితో విష్ణుర్ద్వేవం సర్వకిల్బిషమ్॥ 31

యథాఙ్గో వజ్రకాయః స్యాద్వ్యధార్థ్యపి సుధాంపిబన్।
ఏవంచా శుద్ధభావోఽ పి ముచ్యేతైవ హరింస్మరన్॥ 32

వస్తు స్వభావ ఏవైష, యన్మోక్షాయ హరిస్మృతిః
పూషేవ ధ్వాన్తనాశాయ, శీత నాశాయ చానలః। 33

తథాలీలాధృతవపుః సర్వేశో భక్తవత్సలః।
నిఘ్నన్ మోక్షయతి ద్వేష్టృన్, భక్తాంస్త్విష్టవరందదత్॥ 34

అద్వైత యోగాదపిచ భక్తియోగః ప్రశస్యతే।
ఘోరేభ్యో మోక్ష విఘ్నేభ్యో భక్తాన్పాతి హ్యజః స్వయమ్। 35

చలిదూరమగుట ఆయాయివస్తువుల స్వభావము. ఇట్లే మోక్షమునుకల్గించుట శ్రీహరిస్మృతికి సహజసిద్ధమగు లక్షణము. ఈ స్మృతికి కారణమేమైనను కావచ్చును. అవ్యాజప్రేమ కావచ్చును. నిర్హేతుక ద్వేషము కావచ్చును. శ్రీహరిస్మృతి ఫలము మాత్రము సమానమేనని తాత్పర్యము. 33

ఇట్లే లీలగా వివిధదేహముల ధరించిన వాడును, భక్త వత్సలుడునగు, సర్వేశ్వరుడు తననే ద్వేషించినవారిని చంపియు, తనను సేవించిన వారికి అఖిలహితములు వరములనిచ్చియు, విముక్తుల జేయుచున్నాడు. 34

'అహంబ్రహ్మాస్మి' 'పరబ్రహ్మమునునేనే' అను అద్వైతభావనతో కూడిన ఉపాసనముకంటె సేవ్యసేవక భావనతోకూడిన భక్తియోగమే ప్రశస్తమైనది. ఏలన, తనను సేవించిన భక్తులను ఘోరములైన విఘ్నములనుండి స్వయముగ నజుడైన శ్రీహరి రక్షించుచున్నాడు.

'పరబ్రహ్మము నేనే ' అను భావనతో కూడిన యుపాసము అద్వైత యోగమని సామాన్య భావము. ఈయోగమున ఉపాస్యదైవముకంటె ఉపాసకుడు వేరుగలేడు. కావున సేవ్య సేవకభావము, రక్ష్యరక్షకభావము మున్నగు సంబంధముల కవకాశములేదు. ఇక భక్తి యోగమున భజింపబడు దైవము, భజించు భక్తుడు అను భేదముండును. తియ్యని పండుతినువాడు, పండుకంటె తాను వేరుగనుండి పండును తిని యాస్వాదించి నప్పుడున్న రసానుభవము, తాను స్వయముగ పండే

ఈ దృశం కరుణాసింధుం సర్వథా శ్రితరక్షకమ్ ।
నాశ్రయేత్ కోఽత్ర సంసారీ పాపమాత్మద్రుహంవినా । 36

జనస్త్వావదయం దుఃస్థః సదా–తాపత్రయార్దితః
నచాన్యచ్ఛరణంయేన నిర్భయో నావ్యయం భజేత్ । 37

బహు యోజనసాహస్రం సర్వదార్కః క్షణాద్వ్రజన్ ।
తద్వేగాత్ క్షపయత్యాయుర్జనానాం, సుస్థితిఃకథమ్ । 38

ఆర్తే, ప్రమత్తే, సుప్తేవా క్షీణేవా నిష్క్రియేజనే ।
క్షణం విలంబతేనైవ హ్రాసయన్నాయురుష్ణగుః । 39

అయినప్పుడుండదు కదా! కనుక రసస్వరూపుడగు భగవానునాస్వాదించుననుభవమునకు అద్వైతయోగమున వీలులేదనియు, భక్తియోగముననది కలదనియు, కనుక అద్వైతయోగముకంటె భక్తి యోగమే ప్రశస్తమనియు తాత్పర్యము. ఈ యోగము నాశ్రయించిన భక్తులకు కల్గెడి విఘ్నములెంతటి ఘోరములైనవైనప్పటికిని, అజుడగు శ్రీహరి స్వయముగ నశింపజేయుట విశేషము. కనక అన్ని యోగములకంటెను భక్తియోగము మిన్నయని యభిప్రాయము. 35

ఇట్టి కళ్యాణగుణములుకల కృపాసాగరుని, ఆశ్రిత వత్సలుని శ్రీహరి నాశ్రయింపక యుండు సంసారియెవ్వడుండును? కేవలము పాపాత్ముడు, ఆత్మద్రోహియు నగు వాడు తప్ప మరియెవ్వడట్లుండడు. 36

దుఃఖస్థితిలోనుండి నిరంతరము తాపత్రయపీడుతుడైన జనుడు దేనివలన నిర్భయుడై అవ్యయుడగు శ్రీహరిని భజింపకుండునో, అట్టి ఆశ్రయమేదియులేదు కదా! శ్రీహరికంటె వేరైన శరణముండి లోకుల భీతిని పోద్రోలినచో, శ్రీహరిని సేవింపక, దానినే సేవింపవచ్చును, కాని అట్టి శరణమేదియులేదు. కనుక నిర్భీతికై శ్రీహరినే ఆశ్రయింపవలయునని తాత్పర్యము. 37

అనేకవేల యోజనముల దూరమును నిరంతరము ఒక్కక్షణమున ప్రయాణించుచున్న సూర్యుడు, తన గమనవేగముచే లోకులయాయుర్దాయమును హరించుచున్నాడు. ఇట్టి యెడ 'సుస్థితి' (సుఖస్థితి)ఎట్లుకలుగును.?

ఎంత వేగముగా సూర్య గమనము జరుగునో అంత వేగముగా కాలము గడచును గావున, మానవుని ఆయుఃప్రమాణము క్షణక్షణము క్షీణించుచున్నదని తాత్పర్యము.38

భ్రామ్యమాణః సదాజీవః కాలచక్రేణ వేగినా ।
స్పృశన్ యోనిసహస్రాణి ద్విపాత్త్వే కశ్చిరం వసేత్ ॥ 40

కించాద్యశ్వః పరశ్వోవా మృత్యుర్నేతి విదుః ప్రజాః ।
ధ్రువాశ్చ నారకాః క్లేశాః కథంస్వాస్థ్య మహో! బత! ॥ 41

తస్మాద్యావజ్జనో జీవేత్ తావదాశ్వాశు కేశవం ।
అర్చయేత్ క్లేశ సంఘఘ్నం దివారాత్రౌ, చలాస్థితిః ॥ 42

అనంతయోనింవ్రజతః కర్మభూమౌ మనుష్యతా ।
భవేత్కదాచిజ్జీవస్య లబ్ధ్వాతాం కోవృథావసేత్ ॥ 43

జనుడు ఆర్తుడైనప్పుడు, అనవధానతతోనున్నప్పుడు, నిదురించున్నప్పుడు, క్షీణతాదశను పొందినప్పుడు, ఎట్టి క్రియయు లేక యున్నప్పుడు వాని ఆయుర్దాయమును హరించుచున్నవాడగు భాస్కరుడు ఒక్కక్షణముకూడ ఆలస్యమును చేయడు. 39

ఎల్లప్పుడు జీవుడు అతివేగముగ పరువెత్తుచున్న కాలచక్రముచే గిర్రున త్రిప్పబడుచున్నవాడై వేలాది యోనులసంబంధముచే పుట్టుచు ద్విపాత్త్వమును (రెండు పాదములుగల నరత్వమును) పొందుచు చిరకాల మెవ్వడుండగలడు?

బహుయోని సంబంధము, నరత్వము దుర్భరములు కనుక వివేకియైన వాడే జన్మ చక్రము నుండి బయలు వడుటకు తప్పక యత్నింప వలయునని తాత్పర్యము. 40

మరియునేడో,రేపో,మరుసటిరోజుననో మృత్యువు తప్పదని ప్రజలెరుగజాలరు. కాని, నరకక్లేశములు తప్పవు. అయ్యయ్యో! ఇక నెక్కడి స్వాస్థ్యము? 41

కావున మానవుడు బ్రతికియున్నంతవరకు శీఘ్రముగ సర్వక్లేశవినాశకుడగు శ్రీహరిని రాత్రింబవళ్ళు సమారాధింప వలయును. ఏలన మానవుని యునికి చంచలమైనది కదా! 42

అసంఖ్యాకములగు జన్మముల పొందుచున్న జీవునకు ఈకర్మ భూమియందు మానవజన్మము ఎప్పుడో ఒకప్పుడు మాత్రమే కలుగును. అట్టి యరుదైన మానవత్వమునుపొంది, ఆ మానవజీవనము వ్యర్థముగ నెవ్వడు గడపివేయును.

వివేకియైనవాడు కర్మ ప్రధానమగు నీ భరత భూమిపై బహుజన్మానంతరము పుట్టి, తనకు పురాకృతి పుణ్యవిశేషమువలన కల్గిన మానవజన్మమును సార్థకపర

అహో బిభేమి తాన్స్మృత్వా యేఽత్ర లబ్ధ్వాపి విప్రతాం
సుదుర్లభాం సాహసికా రమన్తే ఽనాదరాద్ వృథా ‖ 44

వ్యాధివ్యాఘ్రే, భవారణ్యే, మృత్యు సింహభయే, వినా ।
రక్షాన్వేషం నవైకస్య కంక్రీడావసరో ద్విజాః ‖ 45

వివసన్ బహు కోటరే పుమాన్
విషమైర్వ్యాధి మహోహి భిస్సహ ।
తనువేశ్మని నిర్భయః కథం ?
రమతేఽ నాశ్రిత తార్ క్ష్య వాహనః ‖ 46

చుకొనవలయునేగాని, వ్యర్థపుచ్చరాదని తాత్పర్యము. ఇతర ప్రాణులెన్నియున్నప్పటికిని మానవజన్మ ఇతర విలక్షణమనియు, శ్రేయఃప్రాప్తికై మానవులు మాత్రమే యత్నింపగలరనియు, వారిలో కూడ ముముక్షువులు చాల అరుదనియు, వారిలోనను వేలలో ఒక్కడు మాత్రమే ముక్తినొందు ననియు, ముక్తులలోగూడ ఒక్కడే నారాయణ పరాయణుడనియు శ్రీభాగవతము ఈ క్రిందిశ్లోకములలో స్పష్టపరచుచున్నది.

రజోభిస్సమసంఖ్యాతాః పార్థివై రిహజంతవః ।
తేషాం యేకేచనేహన్తే శ్రేయోవైమనుజాదయః ‖
ప్రాయో ముముక్షవస్తేషాం కేచనైవ ద్విజోత్తమ ।
ముముక్షూణాం సహస్రేషు కశ్చిన్ముచ్యేత సిద్ధ్యతి ‖
ముక్తానామపి సిద్ధానాం నారాయణ పరాయణః ।
సుదుర్లభః ప్రశాంతాత్మా కోటిష్వపి మహామునే ‖ శ్రీ.భా. 6/14/3,4,5,)

దుర్లభమైన మానవజన్మమునెత్తిన వారిలో నారాయణ పరాయణుడైన నరుడు సుదుర్లభుడని తాత్పర్యము. నారాయణ పరాయణత్వమును పొందుటయే మానవ జన్మమునకు సార్థకతా సంపాదకమనియభిప్రాయము. 43

ఆహా! సుదుర్లభమగు విప్రత్వమునీ పృథివిపై పొంది కూడ, తమ జీవితమందాదర మెంతములేని వారై వ్యర్థముగ విషయ సుఖములందురమించుచున్నారు. నిజముగ వారు సాహసికులే సుమా! 44

ఓ ద్విజులారా! వ్యాధులను పెద్దపులులతో కూడినదియు. మృత్యువను సింహపుభయము కలదియునైన సంసార మహారణ్యమున ప్రాణరక్షణమును గురించిన

తద్భూరి విఘ్న మతి దుర్లభ మాయురత్ర
లబ్ధ్వా జనోఽమృత మివామృతతాం భజేత ।
బుద్ధ్యానుభూయ విభుభావనయాచ, నైత
న్నిద్రాది రుక్ స్మరమదాది శునాం విభోజ్యమ్ ॥ 47

యా త్వరా సురరూపేణ రాహోః ప్రపిబతః సుధామ్ ।
విప్రాః! శంకిత విఘ్నానాం సాస్తువో భజతాం హరిమ్ ॥ 48

మనసా సంస్మరేద్విష్ణుం, దోర్భ్యాం కుర్యాత్తదర్చనమ్ ।
శ్రోత్రాభ్యాంతత్కథాం శృణ్వన్, వచోభిః తద్యశో గృణన్ ॥ 49

ప్రయత్నము లేకుండగ, స్వేచ్ఛగవిహరించు నవకాశమెవ్వనికుండును? 45

ఈ పురుషుడు(జీవుడు), అనేకములైన రంధ్రములతో కూడిన శరీరమను నింటిలో వ్యాధులను క్రూర మహాసర్పములతో కలిసి గరుత్మంతునాశ్రయింపక నిర్భయముగా నెట్లు నివాససుఖమనుభవింపగల్గును?

ఈ శరీరమే ఒక గృహము. దానికి అనేక బిలములున్నవి. (నవరంధ్రమున్నవి) ఈ శరీరమునగల బిలములలో వ్యాధులను మహాసర్పములు స్వేచ్ఛగ సంచరించుచున్నవి. ఇట్టియింటిలో నిర్భయముగా నివాసముండుట యెట్లు? కాని గారుడమంత్రమునుపాసించిన వాడు పాములనడుమనివసింపగల్గును. ఇట్లే నిరంతరము శ్రీహరినామమమును జపించు వాడును, శ్రీహరి రూపమును మనస్సున నిరంతరము భావించువాడును, ఈ బహుల రంధ్రయుతమగు దేహమున నెన్నివ్యాధిసర్పములున్నను నిర్భయముగా నుండగలుగునని తాత్పర్యము. 46

కావున, విఘ్నబహుళము, అమృతమువలె అతిదుర్లభము, అయిన ఆయుర్దాయము నిచ్చట పొందిన నరుడు, పరమేశ్వరుని యందుగల చింతనతో కూడిన బుద్ధితో లెస్సగ ననుభవించి యమృతత్వమును పొందవలయును. ఈయాయుర్దాయము. నిద్ర, రోగము, మన్మథుడు, మదము మున్నగు శునకములకు భోజ్యము కారాదు. 47

ఓ విప్రులారా! దేవరూపమును ధరించి యమృతమును త్రాగుచున్న రాహువున కెట్టి తొందరతనముకలదో విఘ్నములు కలుగునను శంకకలిగి, హరిని భజించుచున్న మీకును అట్టితొందరతనము కలుగునుగాక! 48

మనస్సుతో విష్ణువును స్మరింపవలయును. బాహువులతో శ్రీహరి

నేత్రాభ్యాం తత్ప్రియాన్ పశ్యన్, పద్భ్యాం తత్ క్షేత్రమావ్రజన్ ।
ఇత్థం భజేత్ సదాధీమాన్ సర్వతః సర్వతో ముఖమ్ ॥ 50

యాన్యహోనిగతానీశస్మృత్యా తత్ర సజీవతి ।
పుంసస్తతోఽన్యథా యాని తత్రాపూర్వాశ్వశశ్వసః ॥ 51

మశకా మక్షికాః కాకా జీవన్త్య న్యేఽపి కోటిశః ।
భుక్తి మేహన కామాధ్యా స్తథైవ 'అవైష్ణవా' జనాః ॥ 52

సమారాధనమునొనర్పవలయును. చెవులతో శ్రీహరి కథను వినుచు, వాక్కులతో శ్రీమన్నారాయణుని కీర్తించుచు, కన్నులతో శ్రీహరికి ప్రియులైన భాగవతోత్తముల దర్శించుచు, పాదములతో హరిమందిరమున కరుగుచు, ఈ విధముగ నెల్లప్పుడు సర్వాంతర్యామియై సర్వమును సాక్షిగా దర్శించు శ్రీహరిని బుద్ధిశాలియగు నరుడు సర్వవిధముల సేవింపవలయును.

శ్రీమద్భాగవత మీవిషయమునే ఇట్లు నుడువుచున్నది(10-10-39)

'వాణీ గుణానుకథనే, శ్రవణం కథాయాం
హస్తౌచ కర్మసు మనస్తవ పాదయోర్నః
స్మృత్యాం శిరస్తవ నివాస జగత్ప్రణామే
దృష్టిస్సతాం దర్శనేఽస్తు భవత్తనూనామ్ ॥ యమలార్జున భంజనానంతరము శాపవిముక్తులైన గంధర్వులు నలకూబర మణిగ్రీవులిట్లు స్తుతించుచున్నారు. 'స్వామీ! మావాక్కు నీ కళ్యాణగుణములనుడువుటయందును. మాశ్రవణేంద్రియములు నీకథా శ్రవణమందును, మాకరములు నీ పరిచర్యా కర్మములందును,మా మనస్సు నిరంతర పాదసంస్మరణమందును, మాశిరస్సు నీకు నివాసస్థానమైన యీజగత్తునకు ప్రణమిల్లుటయందును, మా దృష్టి నీ శరీరములైన సజ్జనుల దర్శనమందును నిరంతరము ప్రవర్తించునుగాక' అని. ఇదియే ప్రాణికోటి నిత్యము కోరదగియున్నది. మూలశ్లోకమునగల ' సర్వతోముఖమ్ ' అను పదము

'సర్వతః పాణి పాదంతత్ సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥
ఇత్యాది శ్వేతాశ్వరోపనిషత్(3-16) వచనమును స్ఫురింపజేయుచున్నది. 50

సంస్మృత్య, యోజనశతాంతరితోఽపి మర్త్యః
సద్యోజహాత్యఘచయానితి యోద్యునద్యాః।
కీర్తిస్త్రయీ విశదితా బత సా యదంఘ్రి
స్పర్శాత్ తమీశమనిశం స్మరతోరుగాథమ్ ॥ 53

యోగాయతీశమనిశం భువిభక్త ఉచ్చైః
సద్రాక్ సమస్తజనపాప భిదేఽలమేకః।
దీపేష్వసత్స్వపి నను ప్రతిగేహమంతర్
ధ్వాన్తం కిమత్ర విలసత్యఖిలే ద్యునాథే। 54

స్వామీ! ఏ జనుని దినములు భగవదనుధ్యానముతో (స్మృతితో) గడచినవో వాడే. బ్రతుకుచున్నాడు. ఎవ్వని కట్లుగాక ఇతరథాగడచుచున్నవో వాడు ఉచ్ఛ్వాస నిఃశ్వాసముల నొనర్చుచున్న యొక అపూర్వ శవమే యగును.

భగవత్స్మృతిలేని వాని బ్రతుకు మరణప్రాయమేనని తాత్పర్యము. 51

కోట్లకొలది ఈగలు, దోమలు, కాకులు మరియు నితరములగుప్రాణులు కేవలము తినుచు,క్షుద్రకామసుఖములకై వెంపరలాడుచు బ్రతుకుచున్నవి. విష్ణుస్మృతిలేని మానవులుగూడ ఇట్టి కీటాదులవలె వ్యర్థజీవనముకలవారే యగుదురు. 52

ఎవ్వడు నిరంతరము శ్రీహరిని స్మరించునో, అట్టివాడు గంగకు వందయోజనముల దూరముగా నున్నప్పటికిని తన పాపరాశులనన్నింటిని వెంటనే నశింపజేసికొనుచున్నాడు. ఏ పరమాత్మకు చెందిన పాదముల స్పృశించినందువలన కలిగిన కీర్తి త్రయీవిద్యవలె స్వచ్ఛతమమై యుండునో అట్టి విపుల లీలాగాథలుగల భగవానుని నిరంతరము స్మరింపుడు.

గంగాది పావన నదీప్లావనము మానవులకు పాపనాశకమగుచున్నది. నిజమే, కాని ఎక్కడో దూరముననున్న గంగానదికై ప్రయత్నింపనక్కరలేకయే శ్రీహరి సంస్మరణ మాత్రమున మానవుడు పవిత్రుడుగుచున్నాడు. బహువిధలీలాగాథలు గల శ్రీహరి పాదపరిచరణమే మర్త్యునకు అమరత్వమునిచ్చియాతని కీర్తిని విశదతమమొనర్చును. కావున నిరంతర శ్రీహరి కథాస్మరణమే మానవునకు శరణమని తాత్పర్యము. 53

ఈ పుడమిపై ఏ భక్తుడు నిరంతరము శ్రీహరి కళ్యాణగుణగణముల బిగ్గరగా పాడుచుండునో, ఆతడొక్కడే వెంటనే సమస్తలోకుల పాపముల పటాపంచలుజేయు సమర్థుడు. ప్రతిగృహమునకు ఎన్ని దీపములులేకున్నప్పటికిని ,చీకట్లు భాస్కరుడుండగా

సదర్శాన స్పర్శాన పూజనైః కృతీ
తమాంసి విష్ణు ప్రతిమేవ వైష్ణవః।
ధన్యాన్ వసత్యత్ర జనస్యయద్వత్
స్వార్థం పరం లోకహితాయ దీపవత్। 55

ఇతి శ్రీనారదీయే హరిభక్తిసుధోదయే ప్రహ్లాదచరితం
నామసప్తదశోఽధ్యాయః।

విజృంభింపజాలునా ?

శ్రీభాగవతైకాదశమున భగవానునకు ఉద్ధవునకు కలిగిన సంవాదమున భగవానుడట్లు తెలిపినాడు. (11-14-24)

వాగ్గద్గదా ద్రవతే యస్యచిత్తం
హసత్యభీక్ష్ణం రుదతి క్వచిచ్చ।
విలజ్జ ఉద్గాయతి నృత్యతేచ
మద్భక్తి యుక్తో భువనం పునాతి॥

'ఏ భక్తుని వాక్కు భక్తి పారవశ్యముచే గద్గదమై యుండునో, ఎవ్వని మనస్సు సత్త్వసంపన్న మగుటచే ద్రవించునో, ఎవ్వడెల్లప్పుడు భగవత్కథాను భావనముచే పిచ్చివానివలె నేడ్చుచు, ఒక్కొకయెడ సిగ్గువిడచి బిగ్గరగా పాడుచు, నర్తన మొనర్చుచుండునో అట్టి భక్తి పరవశుడైన నాభక్తుడే సమస్త భువనమును ప్రవిత్రీకరించుచున్నాడు.' అని, 54

పరమవైష్ణవుడును, ధన్యుడునగు, ఆ ప్రహ్లాదుడు 'విష్ణుప్రతిమ' వలె(అర్చామూర్తివలె) అర్చనము, స్పర్శనము, పూజనము మున్నగు క్రియలద్వారా లోకుల హృదయ కుహరములందలి యజ్ఞానపు చీకట్లును పోద్రోలువాడై ఈలోకముననే నివసించినాడు. ప్రదీపమున కువలె ఆతనికి లోకహితమే 'పరమస్వార్థము'తప్పవేరులేదు. 55

ఇంతటితో ప్రహ్లాద చరితము ముగిసినది.

" ఇది శ్రీ నారదీయ పురాణాంతర్గతమగు 'హరిభక్తి సుధోదయమున' ప్రహ్లాదచరితమను పదునేడవయధ్యాయము. "

# అష్టాదశాధ్యాయము

**అష్టాదశాధ్యాయసారము :** ఈ యధ్యాయమున వైష్ణవుని యొక్కయు, అశ్వత్థతులసీ వృక్షముల యొక్కయు మాహాత్మ్యము లెస్సగ వర్ణింపబడినది. నారదునివలన భాగవతగాథలవిని తనివిదీరని శౌనకాదులు, మరల నారదుని ప్రార్థించి, తమహరి గుణశ్రవణలాలసతను ఆవిష్కరించినారు. నారదుడందుల కానందించి, మార్కండేయ ఋషికిని పరాశరునకు జరిగిన సంవాదమును వైష్ణవ మాహాత్మ్యకథన పరముగా నిరూపించెను. ఒకప్పుడు వశిష్ఠాదిఋషులు గంగానదీపులినములపైసమావేశమై రి. అచ్చటకు చిరంజీవియగు మార్కండేయమహర్షి విచ్చేసినాడు. తనతాతయగు వశిష్ఠుని తొడపై కూరుచుండిన యేడేండ్లవయసువాడగు పరాశరుని జూచి ప్రణమిల్లినాడు. దీనికి, ఆసభలోని ఋషులందరు ఆశ్చర్యము నొందినారు. పిన్నవాడగు పరాశరుడు తొట్రుపడుచు ప్రతినమస్కరించి, 'స్వామీ! ఏడేండ్ల వయస్సుగలనన్ను, చిరంజీవివగు నీవిట్లు నమస్కరించుట యుక్తమా? ' అని సంశయమును వెలిబుచ్చినాడు. దీనికి మార్కండేయుడిచ్చిన ప్రతి సమాధానము, సర్వథా భావింపదగియున్నది.

యావన్తోహి క్షణాజాతా హరిస్మృత్యైవ దేహినామ్ ।

ఏకీకృత్యైవ తానేవ గణనం కార్యమాయుషః ॥

మానవుల జీవితమున, శ్రీహరిస్మృతితో నెన్ని క్షణములు గడచినవో వాటినే పరిగణించి మానవజీవితపు ప్రమాణమును లెక్కింప వలయును. ప్రతి ప్రాణికి వ్యర్థకార్య కలాపములతో మూడువంతులకు పైని, కాలము వ్యయమగుచున్నది. భగవత్స్మృతికి వినియోగించెడి సమయము కొందరికి చాలకొలది భాగమేకాగా, మరికొందరికి వాస్తవమున కిట్టి క్షణములే ఉండవు. అట్టివారు ఉచ్ఛ్వాసనిఃశ్వాసముల నెరవేర్చుచున్నంత మాత్రమున బ్రతుకుచున్నట్లు ఎంత మాత్రముకాదని నిష్కర్షించినాడు.

సర్వశ్రేయః కారణమగు శ్రీహరిసేవను విడచి, దేహపోషణ మాత్రమునకే బ్రతుకువాడు, నిజముగ బ్రతుకుచున్నాడని చెప్పజాలమని నుడివినాడు. ఈదృష్టితో చూచినప్పుడు పిన్నవాడైన పరాశరుడే సార్థకజీవనుడు, వయస్సుచే పెద్దవాడునని యోద్ఘోషించినాడు. విష్ణుస్మరణ శీలుడగు వైష్ణవుని సాధారణ మానవునిగా పరిగణించుట, అశ్వత్థవృక్షమును, తులసిని సాధారణ వృక్షములుగా పరిగణించుట దోషమని నిరూపించుటకై వైష్ణవాశ్వత్థ తులసీ మాహాత్మ్యమునావిష్కరించు గాథను పేర్కొనినాడు.

అథశౌనకముఖ్యాస్తే విబుధర్షిం మహర్షయః ।
హర్షాద్భూయః ప్రణమ్యోచుః పుణ్యశ్రవణ లాలసాః ॥ 1

శ్రీ శౌనకాదయ ఊచుః –
సర్వం రుచికరం వస్తు తర్పయత్యేవ సేవకమ్ ।
ఇదం త్వీశయశో భూయస్తర్పయత్యేవ హర్షవత్ ॥ 2

భవతా కథ్యమానేఽస్మిన్ ఆనందాబ్ధౌ స్థితా వయం ।
కథావసానే ష్వాశంక్య బిభీమో విరతిం ప్రతి ॥ 3

అశ్వత్థస్య తులస్యాశ్చ మాహాత్మ్యం సూచితం పురా ।
త్వయైవ, తద్వద స్వామిన్! భూయో భాగవతీః కథాః ॥ 4

స్వాపేక్ష్యం తద్వచఃశ్రుత్వా సురర్షిరతి నిర్వృతః ।
స్వయం బిభేతిహ్యాశంక్య శ్రోతృతృప్తిం హరిప్రియః ॥ 5

పిమ్మట శౌనకుడు మున్నగు మహర్షులు సానందముగ దేవర్షియగు నారదునకు ప్రణమిల్లి, పవిత్ర కథాశ్రవణమునగల విశేషాసక్తిచే మరల పలికిరి. 1

సర్వమధురమగు వస్తువు చవిగొనువానికి ప్రీతిని తప్పక పుట్టించును. ఈ శ్రీహరి యశస్సు ఆనందబంధురమై మరల తప్పక తృప్తిని కలిగించును. 2

ఓ మహర్షీ! నీచేచెప్పబడుచుండగా నానంద సముద్రమున మునిగియున్న మేము, శ్రీహరికథ పరిసమాప్తము కాగానే, ఇక మాయీయానందాను భవమునకు విశ్రాన్తి కలుగునేమో అని భయపడుచున్నాను. 3

అశ్వత్థ తరువునకును, తులసికిని చెందిన మహామహిమను ఇదివరకు నీవు సూచించియున్నావు. కనుక, ఓ స్వామీ! మరల భగవల్లీలా పరములగు గాథల వివరింపుము. 4

తనకేది యభిలషితమో ఆమాటనే ఋషులనుండివిని మిక్కిలి పరితుష్టచిత్తుడైన నారదమహర్షి ఇట్లుపలికెను. 'శ్రోతలకు శ్రీహరి గాథల విన్నప్పుడు ఇక చాలునని సంతృప్తి కలుగునని సంశయించి, శ్రీహరి ప్రియుడగు వక్తకూడ భయపడును.

శ్రీహరి కథాశ్రవణమున శ్రోతలకుగాని, వక్తకుగాని పరితృప్తి యెంతమాత్రము తగదని తాత్పర్యము. అట్లుగాక శ్రోతయు, వక్తయు విసువుచెంది తృప్తులైనచో, వారు

సతానాహోథ, యావద్వః శుశ్రూషాత్ర ప్రవర్తతే ।
స్వామిప్రసాదస్తావన్మే వర్ధతే నూన మిష్టదః ॥ 6

వివక్షూన్ శ్రోతుకామాంశ్చ విష్వక్సేన యశశ్శుభమ్ ।
అన్వేష్టుమేవ త్రైలోక్యం సతతం పర్యటామ్యహమ్ ॥ 7

ద్విజాః సర్వేఽప్యతో భ్రాజన్ మంజుకేశికథామృతం ।
పిబామోఽనారతం , క్లాన్తం మాజీవామో వృథాక్షణమ్ ॥ 8

యావత్ స్మరామో విశ్వేశం వయం విప్రాః కథాచ్ఛలాత్ ।
తావద్ ధన్యాస్మ జీవేమ, నాన్యదా, కిం విరమ్యతే ॥ 9

అశ్వత్థస్యతులస్యాశ్చ వైష్ణవానాంచ సర్వవిత్ ।
మహర్షిః ప్రాహమాహాత్మ్యం మునిభ్యోఽర్వాఙ్మ్య కండుజః ॥ 10

వాస్తవమగు భక్తిశ్రద్ధలు కలవారుకారని యభిప్రాయము. 5

మరియు నారదుడాపిమ్మట, నిట్లుపల్కెను. ఎంతవరకు భాగవతోత్తములగు మీశుశ్రూషయుండునో అంతవరకే నాకు ఇష్టప్రదమగు శ్రీహర్యనుగ్రహము వృద్ధి నొందుచుండును. 6

విష్వక్సేనశుభయశమును చెప్పదలచినవారిని , వినగోరువారిని వెదకుటకే నిరంతరము నేను మల్లోకముల తిరుగాడుచుందును. 7

కావున, ఓ విప్రులారా! నిరంతరము మనోహరముగ నొప్పారు కేశసంపదగల శ్రీహరికి చెందిన గాథామృతమును నిరంతరము త్రాగుచున్నాము. గ్లానిచెంది యొక్క క్షణమైనను వ్యర్థముగ బ్రతుకజాలము. శ్రీహరి గాథామృతముగ్రోలని క్షణము మరణ సమానమని తాత్పర్యము. 8

ఓ ద్విజులారా! ఎంతవరకు సర్వేశ్వరుడగు శ్రీమన్నారాయణుని కథల వ్యాజమున స్మరించుచుందుమో అంతవరకే కృతకృత్యులమై బ్రతుకుచున్నాము. ఇతర సమయములందు కాదు. ఇంకనిట్టి శ్రీహరిగాథా శ్రవణము నుండి విరమించుట యెట్లు?

శ్రీహరిస్మరణ మెంతకాలము జరుగునో అంతకాలమే వాస్తవమగు జీవితమనియు, అదిలేని క్షణము మరణ ప్రాయమనియు పూర్వము చెప్పినదానిని నిష్కర్షచేసినాడు.

పురా వశిష్ఠ ముఖ్యానామ్ ఋషీణామభత్ సదః
గంగాయాః పులినే(శ్రేయో నృణాం జిజ్ఞాసతాం సతామ్‌॥ 11

కిం శ్రేయః? కింప్రియంవిష్ణోః? సఫలంకోఽత్ర జీవతి?।
కోఽర్చితః సర్వదోషఘ్నః? ఇతి వాదాస్తదాభవన్॥ 12

తావన్మృకండు జోఽభ్యాయాత్ సప్తకల్పస్థితో మునిః॥
సర్వ సంశయభిద్ దృష్టః తైఃపూజిత ఉపావిశత్ । 13

తేషాం శుశ్రూషితం జ్ఞాత్వా సర్వజ్ఞః స,తతో, మునిః ।
ఆలోక్య పరితోఽపశ్య ద్వశిష్ఠాంకే పరాశరమ్ ॥ 14

ఉపేతం సప్తవర్షీయం ధన్యం ప్రకృతి వైష్ణవం ।
క్షణార్ధమపి యచ్చిత్తం నవిస్మరతి కేశవమ్ । 15

ముందుముందు, 19 నుండి 23వ శ్లోకమువరకు దీనినే విస్తరించుచున్నాడు. 9

అశ్వత్థ వృక్షమునకును, తులసికిని, విష్ణ్వారాధనా పరులగు భాగవతోత్తములకును చెందినమహిమనుగూర్చి సర్వవేత్తయగు మార్కండేయమహర్షి పేర్కొనినాడు.10

పూర్వము సర్వమానవుల శ్రేయస్సుగురించి పర్యాలోచించుచున్న మహాను భావులగు వశిష్ఠుడు మున్నగు మహర్షుల సమావేశము గంగా నదీ పులినములందు (ఇసుకతిన్నెలపై ) జరిగినది. 11

ఈ సర్వ మానవకోటికి ఏది శ్రేయోదాయకము? విష్ణువునకు ప్రీతిని గొల్పునదేది? వాస్తవముగ నెవ్వడు సార్థకజీవనుడు? సర్వదోష విరహితుడగు నెవ్వడారాధింప బడినాడు? అనివివిధ వాదములప్పుడు జరిగినవి. 12

ఇంతలోనేడు కల్పములవరకు చిరంజీవిగ నుండువాడగు మార్కండేయముని, సర్వసంశయముల పోద్రోలువాడై కన్పట్టెను. ఋషులచే నాతడు పూజింపబడినవాడై ఆసనమున కూరుచుండెను. 13

పిమ్మట, ఆఋషులొనర్చిన శుశ్రూష నెరిగి సర్వజ్ఞుడగు నామార్కండేయముని అంతట పరికించి, వశిష్ఠుని తొడపై కూరుచుండిన పరాశరుని చూచెను. 14

సమీపమున కూరుచుండినవాడును ఏడుసంవత్సరమయుల వయస్సుకలవాడును, సహజవైష్ణవుడును, ఒక్కక్షణపు సగముకూడ శ్రీహరిస్మృతినెడ బాయనిమనస్సు

తంద్రృష్ట్వా సహసోత్థాయ సభాం విస్మాపయన్మునిః ।
మునీనాం బోధనార్థాయ ప్రణనామ పరాశరమ్ ॥ 16

శక్తి సూను మథోభీతం ప్రీత్యాశు ప్రణతం మునిమ్ ।
ఉత్థాప్యాహ - నభీః కార్యా, వంద్యోఽసి వయసాధికః 17

గణ్యతా మాయురిత్యుక్తః సప్రాహోహూ విడంబనా ।
క్వమునిః సప్తకల్పాయుః క్వాహం సప్తాబ్దికః శిశుః ॥ 18

మార్కండేయోఽథవిహసన్ ప్రాహమధ్యే తపస్వినామ్ ।
ఆయుషో గణనం నైవం బ్రహ్మన్ ! తచ్ఛృణు తత్త్వతః ॥ 19

యావన్తోహి క్షణా జాతా హరిస్మృత్యైవ దేహినామ్
ఏకీకృత్యైవ తానేవ గణనం కార్య మాయుషః 20

కలవాడును (కనుకనే) ధన్యజీవుడగు పరాశరునిచూచి, తటాలును నిలుచుండి మార్కండేయముని, ఆసభలో కలవారినందరిని ఆశ్చర్యపరచుచు, ఆమునులకు ఉపదేశించు నుద్దేశ్యముతో పరాశరునకు నమస్కరించినాడు. 15,16

మార్కండేయమహర్షి తనకు నమస్కరించిన వెంటనే తనకంటె పెద్దయగు మహర్షి తనకు ప్రణమిల్లుట తనకుభీతిని కల్గింపగా శీఘ్రమే ప్రతినమస్కార మొనర్చిన పరాశరుని ప్రీతితో పైకి లేపి ఇట్లుపలికెను. నాయనా! భయపడకుము. వయస్సుచే అధికుడవైన నీవునాచే నమస్కరింప దగియున్నావు. నీయాయుర్దాయమును లెక్కింపుము.' అనిపలుకగా ఆపరాశరుడు 'ఆహా! ఎంతటి ఆత్మవంచన! ఏడు కల్పముల ఆయుర్దాయముకల మార్కండేయముని యెక్కడ? ఏడు సంవత్సరముల వయస్సుగల నేనెక్కడ? అనిపలికెను. 17,18

మార్కండేయుడు పరాశరుని మాటలకునవ్వుచు, తాపసుల నడుమనిట్లు పలికెను. 'ఓ! తపస్వీ! ఆయుర్దాయపరిగణనము నిట్లు చేయరాదు. వాస్తవము నెరిగించెద, వినుము. 19

'ప్రాణులకు శ్రీహరిస్మరణముచే నెన్నిక్షణములు గడచినచో వాటిని నొక్కటిగా చేసి ఆయుర్దాయమును లెక్కింప వలయును.' 20

సర్వం తుషం సముద్ధృత్య ధాన్యరాశిర్హి మీయతే ।
త్యక్త్వా వంధ్య క్షణానేవం బుధైరాయుశ్చ గణ్యతే ॥ 21

ఏవం యోజీవతి చిరం నవంద్యో వయసాధకః ।
తదాయుషి విభో! తావత్ క్షణార్ధమపి నాఫలమ్ ॥ 22

అస్మాకమలసానాన్తు మహత్యాయుషి శోధితే ।
సఫలం భగవత్ స్మృత్యా భవేన్నోవాబ్ద పంచకమ్ ॥ 23

యదాయుః శ్రేయసే తద్ధి మానుష్యం జీవితం విదుః ।
మనుష్యతాఽన్యథా కస్మాత్, అన్యప్రాషిణ్వ ధర్మిణః ॥ 24

భోజన–మేహన–మైథున–నిద్రాః । క్రోధన–శోచన–మోహన–లీలాః ।
జన్తుషుకేషు నసన్తి నవస్తు శ్రీశ పదార్చనయాధిక ఉక్తః ॥ 25

పొల్లునంతటిని తీసివేసి ధాన్యరాశి లెక్కింపబడుచున్నది. అట్లే నిష్ఫలములైన క్షణములనువిడచి విద్వాంసులచే నాయుదార్దాయము లెక్కింప బడుచున్నది. '21

' ఓ విభూ! ఈ విధముగ నెవ్వడు చాలకాలము బ్రతుకుచున్నాడో ఆతడే వయస్సుచే వృద్ధుడు (పెద్దవాడు) నమస్కరింపదగినవాడు. ఆతని యాయుర్దాయమున ఒక్కక్షణములోని సగముకూడ వ్యర్థముకాదు, ' 22

'అలసులమైన మాబోంట్ల సుదీర్ఘమగు నాయుర్దాయము శోధింపగా (పరి గణనము చేయగా) భగవదనుస్మృతిచే సాఫల్యము నందిన యైదుసంవత్సరముల కాలముండ వచ్చును. లేదా లేకపోవచ్చును! ' 23

' ఏయాయుర్దాయము శ్రేయస్సంపాదకమై యుండునో, అదియే మానవజీవితమని పెద్దలెరుగుదురు. లేనిచో, ఇతర ప్రాణుల కంటె దర్మవిదూరమైన వారికి (అధార్మికముగ ప్రవర్తించు వారికి) మానవత్వము ఎట్లుసంభవము?' 24

అన్నముదినుట, కామక్రీడలు సల్పుట జతగూడుట నిద్రించుట, క్రోధపడుట, దుఃఖించుట, మోహించుట, మున్నగు చేష్టలన్నియు ప్రాణులలో వేటికిలేవు? (అన్నిటికి కలవని తాత్పర్యము) ఇదియేదియు వస్తుతత్త్వము కాదు. శ్రీహరి పాదముల నారాధించుటచేతనే నరుడు గొప్పవాడుగ చెప్పబడినాడు.

సమస్త శ్రేయసాం మూలం హిత్వోరుక్రమ సేవనమ్ ।
వర్తమానం నరం వక్తుం జీవతీతి నశక్నుమః । 26

దారుకిం నచలత్యంగ ? కింన శ్వసితి భస్త్రికా ?
కిం స్విద్ వీణా నవదతి? సజీవత్వం నతావతా ॥ 27

బాలో భాగవతః శ్రేష్ఠోవృథోచ్చైశ్చిర జీవ్యపి ।
నేతరోఽభ్యేతి తులసీం సుమహానపి వృక్షకః ॥ 28

సర్వప్రాణులకును 'ఆహారనిద్రాభయమైథునాని సమానమేత్ పశుభిర్నరాణామ్' అన్నట్లు అన్నపాన కామప్రవృత్తి నిద్రాదిచర్యలలో వ్యవహారము సమానమే. కాని, భగవదనుగృహీతమగు బుద్ధితో తత్త్వ వివేచనము జేసి తత్త్వమగు శ్రీహరి నర్చించుట వలననే సర్వప్రాణి కోటిలోను నరునకు అధిక్యమేర్పడినది. శ్రీహరి సమారాధనమును విస్మరించినప్పుడు ఈనరునకుగల నరత్వము, పశుపక్ష్యాది వైలక్షణ్యము శూన్యమై ఆనరుడు పశుప్రాయుడగునని తాత్పర్యము. 25

సమస్త శ్రేయస్సులకు (అభ్యుదయములకు) మూలమైన ఉరుక్రమపాద సేవను విడచియున్న నరుని, బ్రతుకుచున్నాడని చెప్పుటచాలకష్టము. అనగా శ్రీహరిసేవ లేనివాడు ఉచ్ఛ్వాసము లొనర్చుచున్నను బ్రతుకుచున్నట్లు లెక్కకాదని తాత్పర్యము. ఈ యధ్యాయములోని 20వ శ్లోకమున శ్రీహరి స్మరణముగల క్షణముల లెక్కించియే నరుని యాయుర్దాయమును పరిగిణింపవలయునని చెప్పబడినది.

ఉరుః = గొప్పదైన క్రమః = పాద ప్రసారము యస్యసః = ఎవ్వనికి కలదో ఆతడు, ఉరుక్రముడు. 'ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధేపదమ్' ఇత్యాది శ్రుతిని బట్టి ముల్లోకముల మూడుపాదములతో నాక్రమించిన శ్రీమన్నారాయణుని పాదక్రమణమును బట్టియాతనికి 'ఉరుక్రము' డనిపేరు. 26

కొయ్య కదల్పబడి కదలదా? తోలుతిత్తి గాలిని విడచుటలేదా? ఇంత మాత్రమున నవి సజీవములగునా?

సాధారణముగ జీవము కలదను వ్యవహారమునకు కదలిక, గాలిని పీల్చుట (లేదావదలుట) పలుకుటయను మూడు క్రియలు ప్రయోజకములని లౌకికబుద్ధితో పేర్కొన వచ్చును. కాని ఈమూడు క్రియలు అచేతనములగు వస్తువులకు కూడకలవు.

పారిజాతస్రజం హిత్వా యాం బిభర్తి ముదాహరిః

విష్ణు ప్రియా సా తులసీ, కథం వీరుత్సు గణ్యతే।
శ్రూయతాంచ పురావృత్తం తులసీ గౌరవాశ్రయమ్ । 29

కర్షకోభూత్ ద్విజః కశ్చిత్ మూర్ఖోఽనాదృత సత్క్రియః ।
సకదాచిత్స పలాలార్థీ భక్త పర్యుషితాశనః । 30

దాత్రం రజ్జుం సమాదాయ వినిర్యాతః స్వమందిరాత్ । 31

ప్రాణములేని కొయ్యనెవ్వరైన కదిపిన కదులును. తోలుతిత్తిగాలితో నింపబడినప్పుడు గాలినిపీల్చుట, విడచుట చేయుచున్నది. వీణ - తీగలు మీటగానే మ్రోయుచున్నది. ఈ క్రియలే జీవత్వ ప్రయోజకములైనచో ఈవస్తువులన్నియు జీవముకలవేనని వ్యవహరింప వలసివచ్చును. ఇట్లే పైనిపేర్కొనిన మూడుక్రియలును ప్రాణి యొనర్చును. బుద్ధిమంతుడగు మనుష్యుడును చేయును. కాని యింతమాత్రముచే వానికి జీవత్వ వ్యవహారము గౌణముగనుండి యుండవచ్చునుగాని, శ్రీహరి సేవా తత్పరత, శ్రీహరి స్మృతులచేతనే వానికిజీవత్వ వ్యవహారము సార్థకము, ముఖ్యము నని తాత్పర్యము. 27

భాగవతోత్తముడైన పరాశరుడు (నిరంతర శ్రీహరిస్మృతిచే) చిరంజీవియైనను వ్యర్థముగ బాలుడనిపిలువబడుచున్నాడు. కాని, ఆతనినెవ్వడు దరిజేరలేడు. (ఆతనితో నెవ్వడు సమానుడు కాడని తాత్పర్యము) ఎంతటి పెద్దచెట్టైనను చిన్నదగు తులసి మొక్కను సరిపోలునా? 28

సాక్షాత్తుగ పారిజాతమాలనుగూడ విడచి శ్రీహరి దేనినానందముగ ధరించు చున్నాడో - విష్ణువునకు ప్రేమాస్పదయైన ఆతులసి సాధారణలతలలో నెట్లు పరిగణింపదగును? తులసీ మాహాత్మ్యమును గురించిన పూర్వచరితము వినదగి యున్నది. 29

కృషికర్మనిరతుడైన (వ్యవసాయదారుడైన) బ్రాహ్మణుడొక్కడు, మూర్ఖుడు, సదాచారములపట్ల నాదర భావమెంతమాత్రము లేనివాడుకలడు. వాడు ఒకప్పుడు గడ్డిని కోసికొని రావలెనను కోరికకలవాడై, చలిదియన్నమునుతిని, గునపము, త్రాడు తీసికొని తనయింటి నుండి బయల్వెడలెను. 30,31

ప్రాతర్గత్వాటవీం భూరియవసంహోర్త్యర్జయద్ బలీ।
భ్రమన్నథన శాకార్థీ, దదర్శ తులసీవనమ్ ॥ 32

పుణ్యం హరిన్మణి శ్యామం కోమలత్వాన్మనోరమమ్।
సోఽచిన్తయత్ సస్పృహోఽథయది భక్ష్యా భవేదియమ్ ॥ 33

నృణాం గవాంవా తులసీ తర్హిధన్యో హరామ్యహమ్।
తథాప్యల్పాం గృహీత్వేమాం దాస్యామ్యద్య తదర్థినే ॥ 34

అస్మత్ పార్శ్వ గృహస్థాయ, కిమర్థం వా సహీచ్ఛతి ॥ 35

అథాస్మిన్నంతరే తస్య దైవాత్ పూర్ణాయుషోఽన్తికమ్।
ఆగమ్య సర్పమిత్యూచురదృశ్యా యమకింకరాః ॥ 36

ఉదయకాలమున నడవికివెడలి, శరీరదార్ఢ్యముగల యాతడు చాలయవసమును (గడ్డిని) సంపాదించెను. పిమ్మట శాకముకొరకై ప్రయత్నించుచు నాతడు తులసీ వనమును చూచెను. 32

పవిత్రమైనదియు, మరకతమణులవలె పచ్చగనున్నట్టిదియు, కోమలమై మనోహరమైనదియునగు నాతులసీవనమును జూచి, మిక్కిలి ప్రీతితో నిట్లు మనస్సున భావించెను. 'ఒకవేళ యీపచ్చని తులసి నరులకుగాని, ఆవులకుగాని తినుటకు యోగ్యమైయుండినచో, ప్రయత్నసాఫల్యమునొంది దీనిని కొనిపోయి యుండెడివాడను. అయినప్పటికిని స్వల్పముగ దీనిని గొంపోయి ఈతులసిని కోరు వాడగు మాపొరుగింటివానికి దీనినినిత్తును. ఆతడు దీనినేల కోరునోకదా! 33,34,35

ఇంతలో, దైవవశమున పరిపూర్ణమైన (ముగిసిన) ఆయుర్దాయముగల యాద్విజకృషకుని వద్దకు అదృశ్యరూపమున, యమకింకరులువచ్చి అచ్చటనే యున్న నల్లత్రాచుతో నిట్లు పలికిరి – ' ఓసర్పమా! వీనిని వెంటనే కాటువేయుము. ఈ బ్రాహ్మణాధముడు నీవంతు. ఎంతలో నీతడు తులసిని స్పృశింపడో అంతలోనే వీనినికాటువేయుము. తులసిని స్పృశించినచో నీతడు చంపనలవికాడు.' అని. 37

ఈ విధముగ వేగమే యమకింకరులచే బోధింపబడి అటువైపునకు వచ్చుచున్న కృష్ణసర్పమును (నల్లత్రాచును) ఎరుగని వాడైనను, దైవయోగమున ముందు తులసిని

'దష్టేన మాశు కృష్ణాహే! త్వద్యోగోఽయం ద్విజాధమః ।
నస్పృశేత్తులసీం యావత్, అసాధ్యోఽతః పరంహినః ॥ 37

ఇత్యాశు బోధితం సర్పమాయన్తం సోఽవిదన్నపి ।
జగ్రాహ తులసీం పూర్వం మనాగ్ దైవవశాద్విజః ॥ 38

తతః కుతశ్చిదాగత్య. విష్ణోశ్చక్రం సుదర్శనమ్ ।
అదృశ్యమేవ తం యాన్తం సర్వతోఽరక్షదన్వగాత్ ॥ 39

అథాశ్వహిః పురాగత్వా తృణ భారాన్తరేఽవిశత్ ।
హన్తుంతం తులసీత్యాగే, యామాశ్చారాత్త మన్వయుః ॥ 40

తృణభారం దృఢం బద్ధ్వా తతో జిగమిషుర్వనాత్ ।
ద్విజోఽప్యజ్ఞాతతద్వృత్తః పలాలం సాహిముద్వహన్ ॥
గృహమాగాత్జ్వలచ్చక్ర భీతైర్దూరాద్భృతో భటైః ॥ 41

స్పృశించినాడు. 38

పిమ్మట నెచ్చటి నుండియోవచ్చిన శ్రీమహావిష్ణువునకు చెందిన దివ్యాయుధమగు సుదర్శన చక్రము'! కంటికగుపించ కుండగనే నడుచుచున్న యాద్విజుని, అన్నివైపులనుండి రక్షించుచు అనుసరించెను. 39

అంతట నాసర్పము, ముందుగా వెడలి గడ్డిమోపులోపలి భాగమున ప్రవేశించెను. తులసిని విడచిన వెంటనే చంపవలెనని యుద్యమించి యమభటులు దూరముగానుండి యనుసరించిరి. 40

పిమ్మట, గడ్డిమోపును గట్టిగాకట్టి తులసీవనమునుండి బయల్వెడల దలచిన ద్విజుడు, గడ్డిమోపులో నల్లత్రాచు దూరినదని యెరుగనివాడై., పాముతో పాటుగ గడ్డిమోపును మోయుచున్నవాడై గృహమునకు వచ్చెను. ప్రజ్వరిల్లుచున్న చక్రమును జూచిభయపడినవారగు యమభటులచే దూరముగా నుండియే పట్టుకొనబడినాడు. 41

అంతట నెవ్వని కొరకే తులసి తేబడినదో ఆకృష్ణార్చకుడు, ఆశ్చర్య కరమగు నా సన్నివేశమును గృహద్వారమున దివ్యదృష్టితో చూచినవాడై యచ్చెరు వొందెను.

తదాశ్చర్య మథోదృష్ట్వా గృహద్వారే సదివ్యదృక్ ।
కృష్ణార్చకో యదర్థంసా తులసీ, విస్మితోఽభవత్ ॥ 42

కౌతుకాత్ పృచ్ఛతే తస్మై ప్రణమ్యాథ యమానుగాః ।
ఆగతం తస్య చక్రేణ రక్షాంచోచుః స్మ కారణమ్ ॥ 43

త్యక్తభారం తతో విప్రం త్యజన్తం తులసీమపి ।
సర్పదష్టం మృతం పశ్చాన్నయామో , యమ మందిరమ్ ॥ 44

తతోఽస్య దయయా విప్రో రక్షోపాయ మచిన్తయత్ ।
అజ్ఞానీవాఽథ సమునిః ప్రియం ప్రాహోన్త కానుగాన్ ॥ 45

భో బ్రూతాస్య మహాత్మానో! రక్షోపాయం కృపాలవః ।
నహ్యేనం తులసీ త్యాగే చక్రం రక్షే ద్విజం ధ్రువమ్ ॥ 46

అట్లేతెంచి, యాబ్రాహ్మణుని విషయమును కుతూహలముగా ప్రశ్నించిన యాకృష్ణ భక్తునకు యమభటులు శ్రీహరి ప్రేరితమగు సుదర్శనచక్రము వలన గలిగిన రక్షణమును, దానికిగల కారణమును పేర్కొనిరి. 43

'తలపైగల గడ్డిమోపునుదించి, తులసిని విడచిన యాబ్రాహ్మడు, పాముచే కరువబడి మృతి చెందగనే తరువాత యమాలయమునకు గొంపోయెదము' అని కూడ పలికిరి.' 44

అటుపిమ్మట, ఋషికల్పుడును వేదాధ్యయమన సంపన్నుడును అయిన ఆకష్ణార్చకుడగు బ్రాహ్మణుడు, పాముచేకాటు పొందనున్న యా రెండవ బ్రాహ్మణు నెట్లైన రక్షింపవలెనని యాలోచించెను. ఏమియు నెరుగనివానివలె యమదూతల నుద్దేశించి ప్రియముగ నిట్లుపలికెను. 45

'ఓమహానుభావులారా! దయగలవారై యీ బ్రాహ్మణుని పరిరక్షణమునకు తగిన ఉపాయమును చెప్పుడు. తులసినివిడచినచో ఈ బ్రాహ్మణుని విష్ణుచక్రమెంత మాత్రము రక్షింపదు. ఉత్తములగుమీచే నాపట్లగల ప్రీతిచే నీతనికి సర్పభయమున్నదని చెప్పబడినదికదా! నా కొరకు తులసినిదెచ్చిన యీ బ్రాహ్మణుని రక్షింపుడు. మీకు మ్రొక్కుచున్నాను. అని ప్రార్థించెను. 46,47

ఉక్తం భవద్భి రక్షుద్రైర్మత్ ప్రీత్యాస్య త్వహేర్భయం ।
మదర్థానీత తులసీం రక్షత్వైనం నతోఽస్మవః । 47

అథోచుః ప్రేతరాడ్ దూతాః కిమస్మద్దయయా విభో ।
త్వద్ గౌరవాత్ పాలయామో వయం కాలస్య కింకరాః । 48

ఇతోఽర్ధయామాత్ ప్రాగస్య పూర్ణమాయుః మృతిస్త్వహేః ।
త్వయార్చ్యస్తులసీలుబ్ధః సర్వగోరక్షతి త్వముమ్ । 49

నిత్యం సన్నిహితో విష్ణుః సస్పృహస్తులసీవనే ।
అపిమేపత్ర మాత్రైకం కశ్చిద్ధన్యోఽర్పయిష్యతి । 50

యదిస్థిత్వైవ తత్రాయం శ్రీశాయ దలమర్పయేద్ ।
తర్హిచక్రం తదైవాస్మాన్ భస్మీకుర్యాన్న సంశయః । 51

పిమ్మట నాయమదూతలు ఇట్లు పలికిరి. ' ఓవిభూ! మాదయచేనేమి ప్రయోజనము? యమకింకరులమైనమేము నీపట్లగల గౌరవమును బట్టియే రక్షించుచుందుము ఇప్పటినుండి యర్ధరాత్రికి పూర్వము ఈతని యాయువు పూర్తియైనది. సర్పమువలన మరణము నిశ్చయింపబడినది. నీచేనర్చింపబడువాడును తులసీదళములయందు లోభము (విశేషాసక్తి) కలవాడును సర్వవ్యాపియైయున్న శ్రీహరి ఈతనిని రక్షించును.' 48,49

'నిరంతరము నాకెవ్వడైన ధన్యుడు ఒక్కతులసీ పత్రము నర్పింపగలడా యని శ్రీమహావిష్ణువు తులసీవనమున విశేషసమాసక్తుడై యుండును. ఒకవేళ నెవ్వడైన తులసీవనమున నుండి శ్రీహరికొక్కతులసీదళము నర్పించినచో నప్పుడే సుదర్శన చక్రము మమ్ములభస్మీపటల మొనర్చును. సంశయము లేదు.' 50,51

'పుణ్యమొనర్చినవాడుగాని, పాపశీలిగాని తులసీదళముతో శ్రీహరి నెవ్వడర్చించునో వానియవసానకాలమున మేమాతనిని తోడ్కొనిపోవ సమర్థులముకాము. ఆతడు విష్ణుదూతలచే గొంపోవబడును. ' 52

ఏకారణమువలననో మేమెరుగముగాని, తులసికి శ్రీహరి మిక్కిలి ప్రియుడు.

సుకృతీ దుష్కృతీవాపి తులస్యాయోఽర్చయే ద్ధరిమ్ ।
తస్యాస్తేహి వయం నేశాః విష్ణుదూతైః సనీయతే ॥ 52

కస్మాదితి నజానీమః తులస్యాహిప్రియో హరిః ।
గచ్ఛన్తం తులసీహస్తం రక్షన్నేవానుగచ్ఛతి ॥ 53

యద్యేవమస్సర్వదా రక్ష్యస్త్వయా తర్హి సకృత్ కృతా ।
దీయతాం తులసీ పూజా విప్రస్యాయుః ప్రవృద్ధయే ॥ 54

ఇత్యుక్తోఽథతథాకృత్వాసోఽరక్షత్తం ద్విజం ముదా ।
యామ్యా యథాగతం జగ్మః తయోః సర్పశ్చ, పశ్యతోః ॥ 55

బోధయిత్వాఽథతం మూర్ఖం సహతేనైవ వైష్ణవః ।
సగత్వా వైష్ణవం తీర్థం తులస్యా చార్చయ ద్ధరిమ్ ॥ 56

తులసినిచేత బట్టుకొని వెళ్లువానిని రక్షించుచు శ్రీహరి యనుసరించును.' 53

'ఒకవేళ నీతడు, ఎల్లప్పుడు రక్షింపదియున్నచో ఒక్కసారి నీవొనర్చిన తులసీపూజ నీతని యాయుర్దాయము వృద్ధినొందుటకై యర్పింపుము. 54

ఈ విధముగ యమభటులచే చెప్పబడినవాడగు నాశ్రీకృష్ణ సేవానిరతుడగు విప్రుడు వారుచెప్పినట్లుగ తానొనర్చిన తులసీపూజ నొక్కదానిని విప్రునకర్పించి సానందముగ వానిని రక్షించెను. ఆవిప్రులిరువురు చూచుచుండగనే, యమభటులు మరలిపోయిరి. సర్పముకూడ వచ్చినత్రోవనే తొలగిపోయినది. 55

పిమ్మట మూర్ఖుడగు నావిప్రునకు తులసీ మాహాత్మ్యమును ప్రతిబోధించి వానితో పాటుగనే ఆ వైష్ణవుడు వైష్ణవతీర్థమును దర్శించి, తులసితో శ్రీహరి నర్చించెను. 56

ఆ తులసీ ప్రియుడగు శ్రీహరి నర్చించి ఆ వైష్ణవులిరువురును అచ్చోటనే ఉత్తమసిద్ధిని పొందిరి. మరియీ విషయమున నాశ్చర్యమేమున్నది. విష్ణుచక్రాదుల విషయమునుగూడ వాటికిగల సామర్థ్యమున చిత్రమేమున్నది. వాటికిగల సామర్థ్యము సహజసిద్ధమే కనుక ఆశ్చర్యపడవలసిన దేమియులేదని తాత్పర్యము. 57

అర్చిత్వా తం పరాం సిద్ధి మాగతౌ తత్ర వైష్ణవౌ ।
కించాత్ర చిత్రం సామర్థ్యం విష్ణుచక్రాది వస్తునః ॥ 57

అహో! కింవైష్ణవో మర్త్యః కింవాశ్వత్థోఽపి వృక్షకః ?
కింవాతృణం సాతులసీ! తస్మాత్ సర్వాధికో భవాన్ ॥ 58

అశ్వత్థస్యతు కోబ్రూయాత్ తరుసామ్యం పరాశర !
యోఽర్చితః సర్వదోషఘ్నః సాక్షాద్విష్ణు ర్జగద్ధితః ॥ 59

దురితాని ప్రణశ్యన్తి నృణా మశ్వత్థసేవినామ్ ।
దృష్టః స్పృష్టః వృతో ధ్యాతః కీర్తితః సంహరత్యఘమ్ ॥ 60

అశ్వమేధ సహస్రోత్థం పశ్యామి ఫలమన్తవత్ ।
నైవ విష్ణుమయాశ్వత్థ సంరక్షారోపణోద్భవమ్ ॥ 61

ఆహా! విష్ణుసమారాధన శీలుడగువాడు మర్త్యుడగునా? (మరణ శీలుడగునా?) (కాడని తాత్పర్యము) అశ్వత్థవృక్షము కూడ సాధారణవృక్షమగునా? (కాదని భావము) తులసి సామాన్యమగు గడ్డిమొక్కయగునా? (కాదని తాత్పర్యము) కనుక, శ్రీహరి సేవాతత్పరుడవగు నీవు అందరికంటె నధికుడవుకదా! 58

ఓ పరాశరా! (ఇక) అశ్వత్థవృక్షమునకు ఇతర వృక్షసామ్యమునెవ్వడు చెప్పును? ఆయశ్వత్థవృక్షము సాక్షాత్తుగ విష్ణుస్వరూపమై లోకహిత మొనర్చునదై యర్చించినంతనే సమస్త విఘ్నముల నివారించును. 59

అశ్వత్థతరువును సేవించువారి పాపములన్నియు, నశించుచున్నవి. ఈ యశ్వత్థతరువు దర్శింపబడియు, స్పృశింపబడియు, వినబడియు, ధ్యానింపబడియు, కీర్తింపబడియు పాపమును నశింప జేయుచున్నది. 60

వేయి యశ్వమేధ యాగముల నొనర్చినందువలన కల్గిన ఫలముకూడ నశించునదిగనే చూచుచున్నారు. కాని, విష్ణుమయమగు నశ్వత్థవృక్షమును రక్షించుట, నాటుట, అనువీటివలన గల్గిన ఫలము ఎంతమాత్రము నశింపదు. 61

విశ్వాత్మకుడగు శ్రీవిష్ణుని స్వరూపముగలయే యశ్వత్థవృక్షపు నీడ కేవలము

యస్య విశ్వాత్మ నశ్ఛాయా భానుతాపం నకేవలమ్ ।
సేవ్యమానాన్నృణాం హన్తి తాపత్రయమపి స్ఫుటమ్ ॥ 62

సకృత్ ప్రదక్షిణీకృత్య బోధివృక్షం నరోఽశ్నుతే ।
భూప్రదక్షిణజం పుణ్యం ధరాధర మయోహినః ॥ 63

ద్రుమేశమర్చ్య యేద్యస్తు గంధమాల్యాది భిర్నరః ।
భక్తైర్విష్ణు స్వరూపః స విష్ణులోకే తథార్చ్యతే ॥ 64

యస్తు తోషయితుం వాంఛేత్, త్రైలోక్యం త్వేక పూజయా।
నపూజయేద్బుధోఽశ్వత్థం జగన్మయ మయోహినః ॥ 65

అథగుహ్య తమం వక్ష్యే భక్తాయ భవతే ద్విజ ।
మందవారే ద్విజోమౌనీ ప్రాతరుత్థాయ భక్తిమాన్ ॥ 66

సూర్యతాపనమునేగాక, నరులచే సేవింపబడినదై, వారికిగల తాపత్రయము గూడ స్పష్టముగ నశింపజేయుచున్నదో, అట్టి యశ్వత్థవృక్షము నొక్కసారి ప్రదక్షిణము చేసి నంతనే నరుడు, భూమినంతటిని ప్రదక్షిణము జేసిన ఫలమును పొందును. ఏలన, అది భూమిని ధరించిన శ్రీమహావిష్ణువేకదా! 62,63

ఎవ్వడు గంధము, పుష్పమాల మున్నగు పూజాద్రవ్యములలో వృక్షశ్రేష్ఠమగు నశ్వత్థము నర్చించునో ఆనరుడు శ్రీహరి భక్తులతో, పాటుగ, విష్ణుసారూప్యమును పొందివైష్ణవ లోకమున (వైకుంఠమున) విష్ణువువలె పూజింపబడును. 64

ఒకేయొక పూజచేనెవ్వడు ముల్లోకముల పరితుష్టిని సంపాదింప నెంచునో అట్టి వివేకి, అశ్వత్థవృక్షమును పూజింపవలయును. ఆయశ్వత్థవృక్షము సర్వ జగన్మయుడగు శ్రీహరి స్వరూపమేకదా! 65

ఓ ద్విజుడా! భక్తుడవగు నీకు పరమ రహస్యము నెరిగింతును. శనివాసరమున, ద్విజుడు మౌనవ్రతియై, ప్రాతః శకాలమునలేచి, భక్తికలవాడై, పవిత్రమగు తీర్థమున స్నానముచేసి, శుచియై, నున్నని యశ్వత్థవృక్షమును జేరి, పురుష సూక్తవిధానముచేగాని, ప్రణవము (ఓంకారము)చేగాని సర్వోపచారములజేసి, పూజించి పిమ్మట ఏకాగ్ర బుద్ధియైనూరు మారులు ప్రణవమును జపించి, శ్రీహరిని స్మరించుచు ప్రదక్షిణము

పుణ్య తీర్థేశుచిః స్నాత్వా, ప్రాప్య శ్లక్ష్ణం హరిద్రుమం ।
పౌరుషేణ విధానేన సంపూజ్య ప్రణవేనవా ॥ 67

కృత సర్వోపచారోఽథ శతకృత్వః సమాహితః ।
జపన్ ప్రదక్షిణీ కుర్యాత్ ప్రణవం సంస్మరన్ హరిమ్ ॥ 68

ఆలింగ్యప్రాఙ్ముఖః పశ్చాత్ ధ్యాయంస్తేజో మయం హరిమ్ ।
అశ్వత్థ రూపిణం విష్ణుం భక్త్యైనం మంత్ర ముచ్చరేత్ ॥ 69

'త్వం ధామ సర్వధామ్నాంచ బోధాత్మాబోధిరుచ్యసే ।
మయాశ్లిష్టో హ్యఘభయాత్ బ్రహ్మశ్రేష్ఠ జగత్పతే ॥' 70

ఆరాత్తమిత్యుక్త్వైనం తు ప్రణమేదథ దండవత్ ।
ఆరాదస్తు తడిత్తేఽగ్నిస్త్వారాత్ పరశురస్తుతే ॥ 71

చేయవలయును. 66,67,68

ఆవిష్ణు స్వరూపమగు నశ్వత్థవృక్షమును ఆలింగనము జేసికొని, తూరుపు వైపునకు తిరిగి, తేజోమయుడగు శ్రీహరిని స్మరించుచు భక్తితో నీక్రింది మంత్రము నుచ్చరింప వలయును. 69

'సమస్త తేజస్సులకు నీవేస్థానము. నీవు జ్ఞానస్వరూపుడవై 'బోధి' యని పిలువబడుచున్నావు. ఓ శ్రేష్ఠ బ్రహ్మమా? లోకపాలకా! పాపభయము వలననాచే కౌగలింపబడితివి, ఇది అశ్వత్థ మంత్రము దీనిని పలుమారులు స్మరింప వలెనని తాత్పర్యము. 70

దగ్గరగా నుండి యీవిధముగా పలికి, దండ ప్రణామ మాచరింపవలయును. 'నీకు మెరుపుతీగ (తటిత్తు) దూరముగా నుండునుగాక! అగ్నిగూడనీకు దూరముగా నుండును గాక! (అట్లే) గొడ్డలి కూడ దూరమున నుండునుగాక! పెనుగాలిలో మేఘములు వర్షించునుగాక! ఓ వృక్షరాజమా! నీకు శుభమగును గాక! అను వాక్యము నుచ్చరించి భూమిపై దండ ప్రణామము నాచరింపవలయును. 71,72

గొప్ప గొప్ప పాపములలోగూడ నిదియే రహస్యతమమగు ప్రాయశ్చిత్తము.

నివాతేత్వభివర్షస్తు స్వస్తితేఽస్తు వనస్పతే ।
ఇతివాక్యం సముచ్చార్య ప్రణమేద్దండ వద్భువి ॥ 72

ప్రాయశ్చిత్త మిదం గుహ్యం పాతకేషు మహత్ స్వపి ।
వ్రతం పుత్రీయ మాయుష్యం మహారోగైక భేషజమ్ ॥ 73

కిమన్యత్ సర్వకామానాం బీజమేతద్ధరి ప్రియమ్ ।
యస్తు సంవత్సరం కుర్యాత్, ఏవం శనిదినే శుచిః ॥ 74

తస్యోపదిశతి స్వప్నే మోక్షమార్గం హరిః స్వయమ్ ।
జపన్ ప్రదక్షిణీ కుర్యాద్ భక్త్యా శ్వత్థం దినేదినే ॥ 75

తంసర్వదురితా న్యారాత్త్యజన్తి భువి రక్షితమ్ ।
దుస్స్వప్నతిగ్రహ దుర్భోజ్య, దుఃసంగ, దురధీతిజైః ॥ 76

పుత్రకాము లొనర్చు వ్రతమిదియే. ఆయుర్వర్ధకము మహారోగముల పోద్రోలునదీ యశ్వత్థ పూజనమే! 73

వేరుగనేమున్నది. శ్రీహరి ప్రియమగు నీ యశ్వత్థ వృక్షమే సర్వకామములకు మూలబీజము. (కామముల తీర్చున దిదియని తాత్పర్యము) ఈ విధముగ నెవ్వడు ప్రతి శనివాసరమున సంవత్సరముపాటు అశ్వత్థసేవన మొనర్చునో, వానికి శ్రీహరి స్వయముగ కలలో నగుపించి మోక్షమార్గము నుపదేశించును. (కావున) అశ్వత్థ మంత్రమును జపించుచు ప్రతిదినము భక్తితో ప్రదక్షిణము చేయవలయును.74,75

ఎవ్వడీవిధముగ శుచియై శ్రీహరి ప్రియమగు నశ్వత్థ తరువును సేవించునో, శ్రీహరి రక్షితుడగు వానిని, భువిపై సర్వపాపములు దూరమునుండియే తొలగిపోవుచున్నవి. దోషయుక్తమగు వస్తువును ధీనముగా పుచ్చుకొన్నందు వలనను, దోషభూయిష్ఠమగు పదార్థమును తిన్నందు వలనను, దుష్టసంసర్గము వలనను, దుష్టమగు శాస్త్రాదికమునధ్యయనము చేసినందువలనను పుట్టిన దోషముల నుండి ప్రతిదినము విముక్తుడగును. 76

దుష్టములగు స్వప్నముల వలనను, దుష్టములగు గ్రహములు పీడించినందు వలనను, పిశాచాదుల వలనను భయములేర్పడినప్పుడు నరులకు శ్రీవిష్ణుద్రుమమును (అశ్వత్థవృక్షమును) ఆశ్రయించుట తప్పవేరు శరణ మేమున్నది? 77

ఈ విధముగ నో ప్రభూ! అశ్వత్థమను తరువు సాధారణ వృక్షములలో పరిగణింపదగదు. (అట్లే) విష్ణుభక్తి పరాయణుడైన నరుడు, సామాన్య నరులలో పరిగణింపదగడు. కనుక, పరమ వైష్ణవుడవగు నీవు అందరి కంటెను గొప్పవాడవు ! 78

దుఃస్వప్నదుర్ గ్రహక్రాన్తి మహద్భూత భయేషుచ ।
నృణాం కిమన్యచ్ఛరణం వినావిష్ణు ద్రుమాశ్రయమ్ ॥ 77

ఏవ మశ్వత్థ వృక్షోఽయం నగణ్యస్తరుషు, ప్రభో !
వైష్ణవశ్చ నృమాత్రేషు తస్మాత్, సర్వాధికో భవాన్ ॥ 78

శ్రుత్వేతిలజ్జితే కించిత్, శక్తి పుత్రే సభాసదః ।
విస్మితాశ్చ ప్రహృష్టాశ్చ మార్కండేయమ పూజయన్ ॥ 79

అహో! మహాత్మన్ ! సర్వజ్ఞ! సర్వమస్మద్ విధిత్సితమ్ ।
అప్యపృష్టం త్వయాప్రోక్తం పరాశర నతిచ్ఛలాత్ ॥ 80

ఉక్తం విష్ణ్వర్చనం శ్రేయస్తులసీచ హరిప్రియా!
వైష్ణవః సఫలాయుశ్చ పూజ్యోఽఘఘ్నో హరిద్రుమః ॥ 81

ఈ మాటలు విని శక్తి పుత్రుడగు పరాశరుడు కొంచెము సిగ్గిలగా, సభయందు గల వారందరు ఆశ్చర్యచకితులై ఆనందించినవారై మార్కండేయమునిని పూజించిరి.79

ఓహో! మహానుభావా! సర్వజ్ఞుడా! ఇదియంతయు మేముచేయ దలచినదియే. పరాశరునకు నమస్కరించు వ్యాజమున మాచే నడుగబడకయే నీచేనిది చెప్పబడినది. 80

విష్ణుసమారాధనము శ్రేయోదాయక మనియు, తులసి శ్రీహరికి ప్రీతి పాత్రమైన దనియు, విష్ణుభక్తి నిరతుడు సఫలమగు నాయుర్దాయము కలవాడనియు, శ్రీహరిద్రుమము (అశ్వత్థవృక్షము) సర్వపాపవినాశిని, నిరంతర పూజనీయమనియు చెప్పబడినది. 81

నిస్సంశయముగ నీ విషయమే మాచే విచారింప దలచినది. ఓ ప్రభూ! అది సంపూర్ణముగనీచే చెప్పబడినది. ఓ భాగవతోత్తమా! కృతకృత్యులమైతిమి. 82

శ్రీహరియనుగ్రహముచే దీర్ఘాయుర్దాయమును పొంది, శ్రీహరినే యాశ్రయించిన వాడవయ్యును నీవు 'భక్తుడనుకాను, అలసుడను,' అనిచెప్పుట కేవలము మమ్ముల ప్రతిబోధించుటకేగదా! 83

అంతట, మహామునియగు మార్కండేయు నీవిధముగ స్తుతించినవారై, ఆవిప్రులు ఆతని యనుజ్ఞనుపొంది అశ్వత్థవృక్షమును సేవించువారై, శ్రీహరిని తులసితో ఆరాధించిరి. 84

శ్రీ నారదుడు ఇట్లు పలికెను. ఓ శౌనకా! ఈ విధముగా నామార్కండేయమహర్షి సంక్షేపముగ వైష్ణవులయొక్కయు, అశ్వత్థవృక్షము యొక్కయు తులసి యొక్కయు

ఏతదేవ సుసందిగ్ధమస్మ జ్జిజ్ఞాసితం ప్రభో ।
కృత్స్నముక్తం కృతార్థాః స్మః త్వయా భాగవతోత్తమ ॥ 82

విష్ణోః ప్రసాదాద్దీర్ఘాయుః తదేక శరణోఽపియత్ ।
త్వమభక్తోఽలసోస్మీతి బ్రూషేఽస్మద్ బోధనాయయత్॥ 83

మహామునిమితిస్తుత్వా తతస్తే తదనుజ్ఞయా ।
అశ్వత్థ సేవినో విప్రాః తులస్యైవార్చయన్ హరిమ్ ॥ 84

శ్రీ నారద ఉవాచ –
ఏవం సంక్షేపతః ప్రాహ మార్కండేయః స, శౌనక ।
వైష్ణవాశ్వత్థ తులసీ మాహాత్మ్య మతులం మహత్ ॥ 85

సర్వేశ్వరో విష్ణు రనన్త మూర్తిః ।
అనన్త శక్తి ర్భత దూర మస్తామ్ ।
కోవక్తి, తద్భక్తగుణాన్ సమస్తాన్
తదంఘ్రి శౌచోత్థసరిద్గుణాన్ వా ॥ 86

ఇతి శ్రీనారదీయే హరిభక్తి సుధోదయే
వైష్ణవ తుల స్యశ్వత్థ మాహాత్మ్యం నామ అష్టాదశోధ్యాయః ॥

అసమానమైన మాహాత్మ్యమును పేర్కొనినాడు.

సర్వేశ్వరుడగు మహావిష్ణువు అపరిచ్ఛిన్నమైన యాకృతికలవాడు, అపారశక్తి సంపన్నుడు. అహో! ఈ విషయమిట్లుండనిమ్ము. ఆ శ్రీమహావిష్ణువునకు భక్తులైన వారి గుణములనుగాని, ఆ శ్రీహరి పాదమును బ్రహ్మకడుగగా పుట్టిన యాకాశగంగ యొక్క పవిత్రతాది గుణములనుగాని ఎవ్వడు నిరూపించి చెప్పగలడు?

భగవద్భక్తుల మాహాత్మ్యము, గుణములే మాటలతో చెప్పనలవికాని వైనప్పుడు సాక్షాత్తుగ శ్రీహరి గుణములను, అనన్త శక్తులను వక్కాణించుట అసాధ్యమని తాత్పర్యము.

ఇది శ్రీనారదీయ పురాణాంతర్గతమగు హరిభక్తిసుధోదయమున
వైష్ణవ , అశ్వత్థ తులసీ మాహాత్మ్యమను పేరుగలపదునెనిమిదవ యధ్యాయము.

# ఏకోనవింశాధ్యాయః

**ఏకోనవింశాధ్యాయసారము :** యోగోపదేశమను పేరుగల యీ యధ్యాయము మిక్కలి విషయ భారము కలిగియున్నది. శౌనకాదులచే మరల మరల నడుగబడినవాడై నారదమహర్షి వారికి బ్రహ్మవిద్యనుప దేశించినాడు. నిరంతర శ్రీహరిస్మరణ నిర్మలమైన చిత్తమే, తత్త్వజ్ఞానమునకు యోగ్యమగును. కనుక నిర్మలచిత్తులగు శౌనకాదులకు సర్వ విద్యాసారమగు తత్త్వము నుపదేశింప నుద్యమించి,

యోగగ్రంథ సహస్రాణాం, సర్వోపనిషదాం తథా ।

సతాంచ యత్ర తాత్పర్యం సోఽర్థః పర ఇహోచ్యతే ।

వేలాది యోగగ్రంథములకు(యోగమనగానిచ్చట బ్రహ్మవిద్యయే) సమస్తోపనిషత్తులకు, సత్పురుషుల కెచ్చట తాత్పర్యమున్నదో ఆ పరమార్థ మిచ్చట చెప్పబడుచున్నదని ప్రతిజ్ఞచేసి, ముందుగ, కామాద్యరిషడ్వర్గ దోషములను ప్రస్తావించినాడు. 11వ శ్లోకము నుండి 70వ శ్లోకమువరకు విస్తారముగ ఒక్కొక దోషముయొక్క ప్రభావమును దృష్టాన్త పురస్సరముగ నిరూపించి-

'ఉన్మూలనాయ చైతేషాం మూలం వక్ష్యామి సత్తమాః । ' ఓసజ్జనులారా! ఈకామాది దోషములకు మూలమేదియో చెప్పుదునని యారంభించి 71వ శ్లోకము నుండి 80వ శ్లోకము వరకు - త్రిగుణాత్మక ప్రకృతియే కామాది ప్రేరకమై సర్వానర్థహేతువనియు, దానివలననే జీవునకు బద్ధతయనియు నిరూపించినాడు.

" వేదాన్తేభ్యః, సతాంసంగాత్, సద్గురోశ్చ, స్వతస్తథా ।

జ్ఞేయోఽన్యః ప్రకృతేరాత్మా, సదాసమ్యఙ్ ముముక్షుభిః ।"

ఉపనిషద్వచన విచారమువలనను, సజ్జన సాంగత్యము వలనను. సదాచార్యోప దేశము వలనను, తన ప్రయత్నముచేతను ప్రకృతి కంటె వేరైన యాత్మనెరుగ వలయునని యుపదేశించినాడు. మాయాస్వరూపయగు ప్రకృతి నధఃకరించిన శ్రీవిష్ణువునందుగల దృఢభక్తియే, దీపమువలె స్ఫుటముగ ప్రకృతికంటె వేరైనయాత్మను దర్శింపజేయునని పేర్కొనినాడు. పిమ్మట 13వశ్లోకము నుండి కొందరిచే నాచరింపబడు నద్వైతోపాసనా ప్రకారము నెరింగించి నిర్గుణోపాసనారూపమగు నీయోగము దురనుష్ఠేయ మనియు, కావున మముక్షువుకు శ్రీహరిశరణాగతియే సులభోపాయమని నిష్కర్షించినాడు.

'ఏవమద్వైత యోగేన విముక్తిర్వా మయోదితా ।

కింత్వేష దురష్ఠేయో జనైర్యోగో నిరాశ్రయః ।'

'తస్మాన్ముముక్షోః సుసుఖో మార్గః శ్రీవిష్ణుసంశ్రయః ' అని సిద్ధాన్తీకరించినాడు.

నిరంతరోద్యత్పులకా భక్తా హర్షాశ్రువర్షిణః ।
శ్రుత్వా విష్ణోః కథాముచుః తద్విరామాసహా ద్విజాః॥ 1

శ్రీ శౌనకాదయ ఊచుః –
భగవన్! భగవతా జాతాః సనాథా స్సుఖినోవయమ్ ।
భవార్తాః స్థలమీనాభాః భూయో రక్ష్యా వచోఽమృతైః ॥ 2

వక్తుమర్హసి నోయోగం భవరోగైక భేషజమ్ ।
దుష్ప్రాపః ప్రాప్యతేయేన విష్ణుః సుఖమహార్ణవః ॥ 3

బ్రహ్మాత్మజస్తతః ప్రాహ బ్రహ్మవిద్యాం హరిప్రియః
శౌనక ప్రముఖాన్ విప్రాన్ భక్తాన్ వీక్ష్య వికల్మషాన్ ॥ 4

తపసా భజతాం చిత్తం హరిస్మరణ నిర్మలమ్ ।
జ్ఞానస్య యోగ్య మేవాద్ధా! బీజస్యేవ సుకృష్టిః ॥ 5

అనిష్కల్మషితే చిత్తే, జ్ఞానం నోప్తం ప్రరోహతి ।
తస్మాద్వక్ష్యామి వోయోగం సంక్షిప్యైవ సుస్ఫుటం యథా ॥ 6

నిరంతరము పొటమరించిన పులకాంకురములు కలవారును, కన్నుల వెంట నానంద బాష్పముల వర్షించు వారును అయిన భక్తులు విష్ణుగాథను విని, దానికి కల్గిన విరామమును సహింపజాలని వారై ఇట్లుపలికిరి. 1

హే! భగవన్! నీచేతనే మేము నాథవంతులుగను, సుఖపడిన వారుగను చేయబడితిమి. సంసారదుఃఖ పీడితులమగుమేము నేలపైబడిన చేపలవలె నీ వాగమృతములచే మరల రక్షింప దగియున్నాము. ఏది సంసార మహారోగమున కౌషధమో, దేనివలన పొందనలవి కానివాడును సుఖసాగరుడునునగు శ్రీహరి పొందబడునో అట్టియోగమును గూర్చితెలుపుము. 2,3

శ్రీహరిప్రియుడు, బ్రహ్మపుత్రుడునగు నారదమహర్షి - ఎట్టి కల్మషము లేని వారును, భక్తులును, వేదాధ్యయన సంపన్నులును అయిన శౌనకుడు మున్నగు ఋషులనుగాంచి, బ్రహ్మవిద్యను గురించి వారికి తెలిపెను. 4

లెస్సగా దున్నబడిన నేల విత్తనములు నాటుటకనుగుణమైనట్లు ఆహా! తపస్సుచే నిరంతర భజన మొనర్చు వారిస్మరణముచే నిర్మలమైన మనస్సు జ్ఞానమునకు తప్పక యోగ్యమగునుకదా ! 5

విస్తరో భ్రామయేచ్ఛ్రోతౄన్ నచాసౌ యుజ్యతే ద్విజాః ।
విలాప్య విస్తరం కృత్స్నం చిదేకరస సాధనే ॥ 7

యోగగ్రంథసహస్రాణాం సర్వోపనిషదాం తథా ।
సతాం చ యత్ర తాత్పర్యం, సోర్థః పర ఇహోచ్యతే ॥ 8

భావ్యం విరక్త్యా ప్రథమం ముముక్షోర్విషయౌఘతః ।
రాగాగ్ని తప్తే చిత్తేహి జ్ఞానసశ్యస్య కా స్థితిః ॥ 9

మత్సర ద్వేష రాగాగ్ని త్రయాత్యుష్ణే హి మానసే ।
జ్ఞానం దత్తం ప్రతప్తాయః సికతాస్వివ నశ్యతి ॥ 10

కామబీజాన్యనన్తాని సంప్రరోహన్తి యద్హృది ।
తత్రాటవీనిభే జ్ఞానపుణ్యసస్యం నవర్ధతే ॥ 11

'ఎట్టి కల్మషములేని మనస్సున నాటనిదే జ్ఞాన మంకురింపదు. కనుక, మీకు సంక్షేపించి స్ఫుటముగ యోగమును చెప్పగలను. 6

మిక్కిలి విస్తారముగ చేప్పినచోనది వినువారికి చిత్తవిభ్రాన్తిని కలిగింపవచ్చును. కావున నట్లు విస్తరించి చెప్పుట యుక్తముకాదు – ఓ ద్విజులారా! విస్తారమునంతటిని తొలగించి, చిదానందమాత్ర స్వభావమగు పరమాత్మ తత్త్వమును తత్సాధనమును (ఆ పరమాత్మను పొందుట కుపాయమును) వేలాది యోగశాస్త్ర గ్రంథములకును, సర్వోప నిషత్తులకును, సత్పురుషులకు ఎక్కడ తాత్పర్యమున్నదో, ఆయుత్కృష్టమగు విషయమిప్పుడు చెప్పబడుచున్నది. 7,8

మొట్టమొదట మోక్షమును కోరువానికి (ముముక్షువునకు) విషయముల పట్ల వైరాగ్య ముండవలయును. విషయరాగమునెడి యగ్నిచే బాగుగ తపించిన మనస్సున జ్ఞానమను పంటకు గతియేమున్నది ?

అగ్నిదగ్ధమైన నేలపై మొక్కలుండనట్లు, విషయరాగదగ్ధమైన మనస్సున జ్ఞానము నిలువబడదని తాత్పర్యము. 9

బాగుగా కాలిన యినుముపైనను, ఇసుకపైనను నీరు ఇంకిపోయినట్లు మాత్సర్యము, ద్వేషము, విషయరాగము అను మూడగ్నులచే మిక్కిలి తపించిన మనస్సున జ్ఞానముంచ బడినను నశించును. 10

అవిలీనం యథాహేమ నహేమ్నా యోగమర్హతి ।
వైరాగ్యేణా(ద్రుతం చేతః జ్ఞానేన కఠినం తథా ॥ 12

విషయేషు విరక్తిశ్చ భవత్యేవ వివేచనాత్
అవిచారితరమ్యేషు కింపాకస్య ఫలేష్వివ ॥ 13

విషయాశ్చ సుఖాయన్తే విష్ణుమాయాజుషాం ద్విజాః ।
సర్వజీవసమాః సర్వే స్యుస్తే సర్వసుఖాయది ॥ 14

అహోఽహరివ సర్వేషాం రా(త్రీరా(త్రి ర్నవైభిదా।
తదా సమాః స్యుర్జీవానాం సర్వేతే సత్సుఖాయది । 15

యద్వ్యైకస్య (ప్రియం కించిత్ తదేవాన్యస్య న (ప్రియం ।
దృశ్యతే (స్త్ర్యన్నభూషాది నృష్వివ రుచి భేదతః ॥ 16

అనంతములైన కామబీజము హృదయమున మొలకెత్తినప్పుడు అరణ్యముతో సమానమైన ఆతావున పుణ్యపుపంట వృద్ధిచెందదు. 11

అగ్నిచే కరుగని బంగారము, బంగారముతో కలియజాలదు. అట్లే కఠినమైన మనస్సు, వైరాగ్యముచే కరుగనిచో జ్ఞానసంబంధమును పొందనర్హముకాదు. 12

విచారింప నంతవరకు మనోహరముగానుండు విషయములపట్ల వివేచనము వలన వైరాగ్యము తప్పక వచ్చును. 'కింపాక'మని పిలువబడు చెట్టుయొక్క ఫలములు చూచుటకు మనోహరముగా నున్నను, తినుటకు దుర్గంధ భూయిష్టములై వెగటు పుట్టించి నట్లే, విషయములును. 13

ఓ ద్విజులారా? కన్ను, ముక్కు, చెవి, మున్నగు నింద్రియములచే గ్రహింపబడు రూపగంధశబ్దాది విషయములు విష్ణుమాయచే వ్యామోహితులైన వారికి సుఖము లగుచున్నవి. అట్లు కానివి సర్వాత్మనా సుఖస్వభావములై యుండినచో జీవులందరకు ఒకే విధముగా సుఖానుభవమునే కల్గింప వలయునుకదా!

విషయములను సుఖములుగ కేవలము విష్ణుమాయా మోహితులైనవారు మాత్రమే భావింతురు. ఏలన అవి అట్టివారికి మాత్రమే సుఖములుగా గోచరించును తప్ప అందరికిని కాదు. అవి, స్వభావతః సుఖరూపములైనచో జనులందరు సమానముగ సుఖానుభవమునే పొందవలయునుకదా! అట్లుగాలేదు. కొందరు ఏవిషయములను

ఆస్థా యం(త్రచబాలానాం నయూనః త(త్ర, య(త్రచ ।
తయోర్న త(త్ర వృద్ధస్య, య(త్రాస్యాస్థా నచద్వయోః ॥ 17

నృప్రియా మోదకా భూయః, పూతిమాంసం శునాం(ప్రియమ్ ॥
నృణాంతదేవాతిహేయం, తత్త్వం కింత(త్రనిశ్చితమ్ ॥ 18

స్వాద్వా(మ్రఫలమన్యేషాం హేయముష్ట్రస్యతద్విషమ్ ।
యస్యామృతం నింబఫలం, తద్ధితిక్తం సునిశ్చితమ్ ॥ 19

నృప్రియాః కుంకుమాభుషాః (క్రోడా విట్పంకకాంక్షిణః ।
తస్మాన్నైకాంతతోవస్తుసుఖం కించిద్ వ్యవస్థితమ్ ॥ 20

సుఖములుగా భావించు చున్నారో, ఆవిషయములే మరి కొందరికి దుఃఖ రూపమగు ననుభవమును కల్గించుచున్నవి. సుఖదుఃఖజనకత్వము విషయముల నియతస్వభావమైనచో, స్వభావము దురతి(క్రమముగనుక, నిప్పు అందరిని కాల్చినట్లు, అందరికిని సమానానుభవము కలుగవలయునుగదా! కనుక, విషయములు సుఖములుగా భాసించుట విష్ణుమాయతప్ప వేరుకాదని యభి(ప్రాయము. 14

పగలు పగటివలె అందరకి ఒకేవిధముగ నున్నట్లు, రా(త్రి రా(త్రివలెనే ఎట్టి భేదములులేక, సుఖముతో కూడియుండినచోనివి, జనులందరకు సమానముగా నుండవలయును కదా! రా(త్రింబవళ్లు అందరకు సమానముగ సుఖావహములు కావని తాత్పర్యము. 15

ఏదియొక్కనికి (ప్రేమాస్పదమో, అదియేమరియొకనికి అ(ప్రియ మగుచున్నది. (స్త్రీలు, భోజ్యవస్తువులు, అలంకారములు మున్నగునవి మానవులలోనే వారివారి యభిరుచిలోని భేదమునుబట్టి భిన్నములుగా నున్నవి.

అనగా ఏ (స్త్రీనెవ్వరు (ప్రేమింతురో ఆమెనే మరియొకరు ద్వేషింపవచ్చును. లేదా (ప్రేమింపక పోవచ్చును. ఒక భోజ్యవస్తువొకనికి రుచికరముగా నున్నను, మరియొకనికి వెగటు పుట్టింపవచ్చును. అట్లే అలంకారములు కూడ ఒకరికిష్టమైనవి మరియొకరికి ఇష్టము కాకపోవుట అనుభవసిద్ధమే. కనుక, (ప్రీతి, లేదా, సుఖము అనునది వస్తునిష్ఠముకాక, కేవలమా విషయము ననుభవించువాని స్వభావనిష్ఠమే. ఆస్వభావము విష్ణుమాయాజుష్టమని యభి(ప్రాయము. 16

బాలురకెచ్చట ఆసక్తియుండునో యువకుల కచ్చట ఆసక్తి యుండదు. బాలురకు, యువకులకు నెచ్చట ఆసక్తియో వృద్ధుల కచ్చట ఉండదు. వృద్ధుల కాసక్తి

అవిసంవాది సర్వేషాం సుఖమేవం నదృశ్యతే ।
తస్మాత్తే విషయాః సర్వే సుఖాభా విష్ణుమాయయా ॥ 21

భ్రాన్తిస్తు లక్షణాభవాత్ చిత్తభ్రాన్తిజుషోజనాః ।
వస్తునిర్భిన్నమతయో మన్యతే హ్యవ్యవస్థయా ॥ 22

తదేతదవిచార్యైవ పతన్తి బత! మోహితాః ।
విషయేషు, సుఖాభేషు, తాన్ దృష్ట్వాఽన్యే, పరేచ,తాన్ ॥ 23

అజ్ఞైరత్యాదృతత్వేపి విషయాణాం క్వసాధుతా?
గ్రాహ్య మాణంహిమనుతే దీపం బాలో ఽ మలంయథా ॥ 24

గల విషయములలో బాలురకు యువకులకు నాసక్తి యుండదు. అనగా వయోస్థాన భేదముచే రుచిభేద ముండునని యభిప్రాయము. 17

నరులకు కుడుములు మిక్కిలి ప్రియములు. కుక్కలకు దుర్గంధ భూయిష్ఠమగు మాంసము ప్రియము. నరులకట్టి మాంసము మిక్కిలి యసహ్యమును పుట్టించును. ఇచ్చట వాస్తవ తత్త్వమేమియని నిశ్చయింపనగును? 18

మామిడి పండు కొందరకు సరసమై యుండును. అదియే ఒంటెకు విషప్రాయమై హేయమగును. వేపపండ్లు దేనికి అమృతప్రాయములుగా నుండునో, అవి యన్యులకు నిజముగా చేదుగ నుండును. 19

నరులకు కుంకుమము, అలంకారము ప్రీతి పాత్రములు. పందులు, మలమును బురదను మిక్కిలి కోరుచుండును. కావున ఏవస్తువు నియతముగ సుఖకారణమని నిశ్చయము లేదు. 20

ఈ విధముగ, అనుభవ భేదము లేకుండగ అందరకు సుఖకరమైనది ఈ ప్రపంచమున కన్పట్టదు. కావున ఈవిషయము లన్నియు విష్ణుమాయచే సుఖమువలె భాసించుచు నుండును. 21

ఈ విధముగ నీ విషయములు సుఖరూపములనియో, లేక దుఃఖరూపములనియో లక్షణము నియతముగ లేనందున; 'ఈ విషయము నాకు సుఖము' 'ఇదినాకు దుఃఖము' అనునది కేవలము బుద్ధి విభ్రమమును పొందిన జనుల భ్రాన్తియే తప్ప వస్తుతత్త్వము కాదు. విభిన్న వస్తువులను గురించి విభిన్న యభిప్రాయములుకల జనులు, ఎట్టి నిశ్చయము లేకయే, వారివారి చిత్తములకు తోచినట్లు విషయములను సుఖములనియో దుఃఖములనియో భావించుచుందురు. 22

సుఖాభత్వంచ నైతేషాం వ్యాధిశోకభయాదిషు।
అవశ్యేషునృణాం సత్సుప్రత్యుతక్లేశకారిషు ॥ 25

ఇచ్ఛయా విషయాసక్తో నరోఽనర్థపరంపరామ్ ।
యాత్యత్రాముత్రచాత్యర్థం విచార్యైతచ్చ కారతి ః? 26

నదూరే యాతనా యామ్యా, మూర్ఛయన్తి శ్రుతాశ్చయాః ।
జనాంస్తు ఘోరా దృష్టాహి స్వాస్థ్యేప్యత్ర క్షణాన్మృతి ః॥ 27

తాస్తిష్ఠన్త్వథవా,దృశ్యాదృశ్యం నరకమీక్షతామ్ ।
పంగ్వంధబధిరోన్మత్త కుష్ఠరోగాది సంజ్ఞితమ్ ॥ 28

ఈ తత్త్వమును విచారముచేయకయే, అయ్యో! విషయములపట్ల వ్యామోహితులై పతితులగు చున్నారు. సుఖాభాస రూపములగు విషయములందు కొందరు తగుల్కొనగా, వారినిజూచి మరికొందరు, వారినిజూచి ఇతరులు మోహమున బడుచున్నారు.

'శతాన్ధాః కూపం ప్రవిశన్తి ' అనిన్యాయము. నూర్గురు గ్రుడ్డివారు ఒకరినొకరు పుచ్చుకొని నడచుచున్నప్పుడు, ఒకడు నూతిలో బడినచో అందరు ఆనూతిలోనే పడుటయెట్లో, విషయములపట్ల సుఖబుద్ధితో ప్రవర్తించి పతితులైన వారిననుసరించి యితరులును పతితులగుట యట్టిదేనని యభిప్రాయము. 23

నిర్మలమగు దీపము నందించునప్పుడు బాలుడు పట్టుకొననెంచిన అది కాలు నట్టి స్వభావము కలదే అయినట్లు, అజ్ఞులైనవారు అవివేకముచే నాదరించి నంత మాత్రమున విషయములు సాధువులు కావుకదా! బాలుడు దీపము కాలునని యెరుగక దానివెలుగును చూచి పట్టుకొన యత్నించును. అట్లే అజ్ఞులు విషయతత్త్వ మెరుగక వాటి కై యర్రులు చాచుదురు. అంత మాత్రముచేనవి ఉపాదేయములు కావుకదా! 24

నరులచే, తప్పక ననుభవింప వలసినవియు, పైగా క్లేశావహములు అయిన వ్యాధులు, శోకము, భయము మున్నగు వాటియందు విషయములకు సుఖసామ్య మెంత మాత్రము-లేదు. 25

తనయంతతాను కోరి విషయములపట్ల ఆసక్తిగలనరుడు ఈ లోకము నను, పర లోకముననను మిక్కిలి యనర్థమును పొందుచున్నాడు. దీనిని విచారించి నప్పుడు విషయముల పట్లప్రీతి యెట్లుకల్గును? 26

దారిద్ర్యం, మూర్ఖతా, బాల్యేమాతృనాశః, స్త్రియాస్తథా ।
వైధవ్యమిత్యాద్యభిధాభిన్నాని నరకానిచ ॥ 29

శ్వశ్వపాకఖరక్రోడవిట్ కృమ్యాది కుయోనితా ।
విషయాసక్తి జానర్థక్నృతైవేత్యవ ధార్యతామ్ ॥ 30

స్థలే, జలే, ఖే, నరకే జీవా యేస్థాస్నుజంగమాః ।
భుంజతే దుఃఖజాతంతు కృత్స్నం విషయమూలకమ్ ॥ 31

యథాపతంగా దృష్ట్వాహి దగ్ధాన్ సహచరాన్ పునః ।
నిపతంత్యేవమన్యేఽగ్నావజ్ఞాత్వా తత్కృతం వధమ్ ॥ 32

యమలోకమున ననుభవింపవలసిన యాతనలు దూరమునలేవు. (పాపకర్మములు నొనర్చిన వారికవి నిరంతర సన్నిహితము లేనని యభిప్రాయము ) వాటిని గురించి విన్నంత మాత్రముననే అవిజనులకు మూర్ఛను కల్గించును. ఇక చూచినప్పుడు వేరుగ చెప్పవలసినదేమున్నది. ఎంతస్వస్థతతో గూడిన వానికైనను ఒక్క క్షణమున మృత్యువున్నది. 27

ఆనరకయాతన విషయమట్లుండనిండు. ఇక ప్రత్యక్షముగా నీలోకమున కుంటితనము, గ్రుడ్డితనము, చెవిటితనము, ఉన్మాదము (పిచ్చిదనము) కుష్ఠ రోగము మున్నగు పేరుగల నరకములను పరికింపుడు. కనుపింపని యానరకము కంటె ప్రత్యక్షసిద్ధమైన వ్యాధ్యాది నరకమే దుర్భరమని తాత్పర్యము. 28

దారిద్ర్యము, మూర్ఖత్వము, పిన్నవయసున తల్లిని గోల్పోవుట, అట్లే స్త్రీకి భర్తృ మరణము మున్నగు విభిన్నములైనవి నరకములే! 29

శునకము, శునకమును వండునట్టి చండాలుడు, గాడిద, పంది, మలమందుండు పురుగులు మున్నగు నీచయోనులందు పుట్టుట, విషయాసక్తి వలన కల్గిన యనర్థమును బట్టి యేర్పడినదేనని తెలియవలయును. 30

నేలపై, జలమున, ఆకాశమున, నరకమున, స్థావరజంగమాత్మక జీవజాతము ఏదుఃఖసంతతి ననుభవించుచున్నదో అదియంతయు, విషయసంబంధము వలన కల్గినదే. జీవుల సుఖదుఃఖాను భవములకు విషయాసక్తియే నిమిత్తమని తాత్పర్యము. 31

మిడతలు, తమతోటి మిడతలగ్నిలోపడి మాడిపోవుట చూచియు,

సుఖాశయా బహిః పశ్యన్ దేహిచేంద్రియరంధ్రకైః ।
వాతాయనైర్గృహీ వాస్తత్త్వంవేత్తిన బాహ్యవిత్ ॥ 37

తస్మాదర్థానర్థాభాన్ వివిచ్యవిషయానితి ।
ఉత్సృజేత్ పరమార్థార్థీ బాలరమ్యాన్ అహీనివ ॥ 38

దుర్జయా యత్నతో జేయాః కామక్రోధాదయోఽరయః ॥
ముముక్షు భిస్సదాధీరైఃఅప్రమత్తైః ప్రమాథినః ॥ 39

కించైక ఏవకామోఽలం,ససురాసురమానవం ।
వశీకుర్వన్ జగద్వృద్ధోయోగమార్గ నిరోధనే ॥ 40

బాధింపబడనిదై, దాని ననుభవించినవారికి గోచరమై యున్నది. దానిని (తనలో గల భగవదనుభవ సుఖమును) దర్శింప లేక (అనుభవింప లేక) బాహ్యమగు విషయ సుఖమును కోరువాడు వంచింప బడుచున్నాడు. 35

ఎట్లుగ అజ్ఞుడైనవాడు (వివేకశూన్యుడు) నిధి లేని ప్రదేశమును త్రవ్వినప్పుడును, పొల్లును దంచినప్పుడును కేవలము శ్రమయే వానిప్రయత్నమునకు, ఫలమగునో అట్లే, తత్త్వదృష్టి లేనివానికి బాహ్య విషయములపట్ల గల వ్యామోహము కూడ నిష్ఫలమే ! 36

ఇంటిలో కూరుచుండినవాడు కిటికీల ద్వారా వెలుపలగల వస్తువుల చూడగలిగినను వాటివాస్తవ తత్త్వము నెరుగజాలనట్లే, జీవుడు శరీరముననుండి ఇంద్రియప్రణాల ద్వారా విషయముల దెలిసి కొన్నను, తనలోనే (హృదయమున) గల పరమాత్మ తత్త్వము నెరుగజాలడు. 37

కావున అందముగా కనుపించుచున్న పాముపిల్లలను విడచివైచినట్లు, సుఖములుగా పైకికన్పట్టుచు అనర్థదాయకములైన విషయములను, వివేచించి పరమార్థమును కోరు జీవుడు తప్పక విడువలయును.

పాము పిల్లలు చూచుటకు శరీరవర్ణమునుబట్టి అందముగా కన్పట్టినను, వాటి విషస్వభావమునుబట్టి అవి ప్రాణహరములని గుర్తించి దూరముగా విడచివైచినట్లు, పైకిసుఖములుగా కన్పట్టు విషయములు వాస్తవమున సుఖములు కావనియు పరిణామ విరసములు, అనర్థదాయకములునని యెరిగి, విజ్ఞుడు వాటిని దూరముగా విడచి పెట్టవలయునని తాత్పర్యము. 38

అవధీద్రఘునాథః కింపులస్త్యంనహి కింత్వయమ్ ।
ఏకః సీతాతనుచ్ఛన్నోధన్వీ పుష్పశరః స్వయమ్ ॥ 41

నిపాత్యేంద్ర మహల్యాయాం స్వపుత్ర్యాంచ పితామహమ్ ।
కందర్పో జగదుద్దర్పో మిథునీ కురుతేఽనిశమ్ 42

యశః,కులం, శ్రుతం, ధైర్యం, తేజో, లజ్జాంచ, యోగ్యతాం ।
స్మరః క్షణాత్ తృణీకృత్య, స్త్రీదాసాన్ కురుతే బుధాన్ 43

కామక్రోధాద్యరిషడ్వర్గము జయింపనలవికానిదే అయినను పీడాకరములగు నాయన్తః శత్రువులను, నిరంతరము నిగృహీతబుద్ధులు, అనవధానతలేక నిత్య జాగరూకులై యుండువారును అగు మోక్షకాములు (ముముక్షువులు) (వాటిని) ప్రయత్నపూర్వకముగ జయింపవలయును. 39

అరిషడ్వర్గమునగల ఒక "కామమే " దేవరాక్షస మానవజాతులతో కూడిన జగత్తునంతటిని వశపరచుకొని, విజృంభించి, యోగమార్గము నడ్డగించుటలో మిక్కిలి సామర్థ్యము కలిగియున్నది. 40

రావణాసురుని రామభద్రుడు చంపినాడా? కాదు. ఏలన, ఒక్క మన్మథుడే సీతారూపమున దాగియుండి ధనువును బట్టి, పుష్పబాణుడై స్వయముగ,రావణుని జంపినాడు.

శ్రీరాముడు రావణుని చంపినాడని కథాప్రసిద్ధి. కాని ఇది వాస్తవము కాదనియు, రావణుని కామమే సీతారూపమున వానిని వధించినదనియు తాత్పర్యము. 41

ఇంద్రుని, గౌతమపత్నియగు నహల్యపట్ల కామవివశుడగు నట్లును, తన కుమారిత పట్ల చతుర్ముఖ బ్రహ్మ కామచిత్తుడగు నట్లును ప్రేరించిన తుంటరియగు మన్మథుడు నిరంతరము లోకమును కామ వివశమొనర్చి, స్త్రీ పురుషుల జతగూర్చుచుండును. 42

ఎంతయో కష్టపడి సంపాదించిన కీర్తిని, ఉత్తమ వంశమును, శాస్త్ర విజ్ఞానమును, ధైర్యమును, తేజస్సును, సిగ్గును, యోగ్యతను ఒక్కక్షణమున గడ్డిపోచగా కించపరచి పండితులను సహితము కామవశతచే స్త్రీ దాసులగునట్లు మన్మథు డొనర్చుచున్నాడు.

కామ ప్రవృత్తి మానవుని యొక్కక్షణముననధఃపాతాళమునకు అణగద్రొక్కునని యభిప్రాయము. 43

మునులు మున్నగు వేలాది ధీరజనులచే సుసంపన్నమై, కీటముల నుండి

మునిధీర సహస్రాఢ్యం కీటాద్యాబ్రహ్మజంగమమ్ ।
స్త్రీబలః పంచపంచేషు రేకో భ్రామయతీచ్ఛయా । 44

హతాః క్రోధేన చక్రేనమహాన్తో నహుషాదయః ।
సన్మార్గ విత్తచౌరేణ గుణపుణ్యవనాగ్నినా ॥ 45

జపయజ్ఞతపఃక్షాంతి సరిద్భిశ్చిర సంభృతమ్ ।
మహాన్తమపి పుణ్యాబ్ధిం క్రోధాగస్త్యః క్షణాత్పిబేత్ । 46

బ్రహ్మవరకు గల జంగమ ప్రాణి కోటిగల జగత్తును, స్త్రీల సాహాయ్యమున బలమును పొందిన మన్మథుడొక్కడే, తనయిచ్చవచ్చినట్లు త్రిప్పుచున్నాడు. లోకమున కామవశముకాని దేదియు లేదని తాత్పర్యము.

ఇంతవరకు అరిషడ్వర్గములోని కామమను మొదటి యంతశ్శత్రువును గురించి నారదుడు మునులకు విశద పరచినాడు. అన్ని యనర్థములకీ కామమే మూలము. దీని వలననే క్రోధాదులు పుట్టి జీవపతనమునకు కారణమగుచున్నవి. కనుకనే, శ్రీభగవానుడు గీతలో

'కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।

మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥' (శ్రీగీత 3-37)

' ఈ కామమే సర్వలోక శత్రువు. దీనివలననే ప్రాణులకు సర్వానర్థములు కలుగుచున్నవి. ఇది రజోగుణమును ప్రేరేపించునదై క్రోధమునకు కారణ మగుచున్నది. ఈకామమునకు ఎన్నివిషయ భోగముల నందించినను దానికితనివి తీరదు. కనుకనే ఘోరములైన పాపముల జేయించును.' అని పేర్కొనినాడు. ఇంతియేగాక ఈ కామమే సమస్త ప్రాణికోటిని సర్వదా ఆవరించియున్నది. దీనినే మరల భగవానుడు -

ధూమేనా వ్రియతే వహ్నిః యథాదర్శో మలేనచ ।

యథోల్బేనావృతోగర్భః తథాతేనేద మావృతమ్ ।(3-38)

'అగ్ని, పొగచే చుట్టువారి నట్లును, అద్దము దుమ్ముచేచుట్టు వారినట్లును, గర్భస్థమగు శిశువు మావిచే చుట్టు బడినట్లును, ఈ సమస్త ప్రాణిలోకము రజోగుణ ప్రేరకమై, సర్వానర్థకారణమగు కామముచే, చుట్టు వారియున్నది.' అనియు పేర్కొనినాడు. 44

నహుషాది చక్రవర్తులు సహితము, సన్మార్గమను ధనమును అపహరించునదియు

గోష్ఠీవ్యాఘ్రంయథోత్సృజ్య, గాఃకోటీర్రాక్షయన్నపి ।
నైవప్రాప్నోతి తద్వృద్ధిం త్వతి క్రోధీ తపః ఫలమ్ ॥ 47

కేవా క్రోధేన-నహతాః స్వస్థాన ద్రోహ కారిణా ।
ఏవం శోకేన మోహేన, మత్సరేణచ కోటిశః ॥ 48

లోభగ్రస్తాస్తు బీభత్సాః దృష్ట్వా భూయోబుధా అపి ।
అల్పోత్కోచాయ గోవిప్రదేవ బహ్వర్థనాశకాః ॥ 49

-గుణములను, పవిత్రాటవిని దహించు వహ్నియునగు నొక్క క్రోధముచేతనే మడసినారు.
శ్రీమద్భారతోద్యోగపర్వమున -

అహం తపస్వీ బలవాన్ భూత భవ్య భవత్ప్రభుః ।

మయి, క్రుద్ధే జగన్నస్యాత్, మయిసర్వం ప్రతిష్ఠితమ్ ' ॥ (భార.ఉ.14/17)

(నేనే తపస్విని, బలవంతుడను, భూతభవిష్యద్వర్తమానములకునేనే అధిపతిని. నేను కోపగించినచో జగత్తుండదు. నాయందే సర్వము ప్రతిష్ఠితమైయున్నది' అని యహంకరించిన క్రోధస్వభావుడగు నహుషచక్రవర్తి, తపస్వులచే మోయబడిన పల్యంకికలో ప్రయాణమై శచీదర్శన లాలసుడుకాగా, దురహంకారియగు నహుషుని పతితుని జేయ, అగస్త్యుడు మున్నగు ఋషులుధర్మసందేహ ప్రశ్న వ్యాజమున వానిని ధర్మభ్రష్టునిజేసి, వానిని స్వర్గచ్యుతుని జేసినారు.

'హతశ్చ నహుషః పాపో దిష్ట్యాగస్త్యేన ధీమతా !

దిష్ట్యా పాప సమాచారః కృతః సర్పోమహీతలే ॥ ' (భార. ఉ. 17/22)

పాప ప్రవృత్తుడగు నహుషుడు దైవవశమున నగస్త్యునిచే శాపోపహతుడై పృథివిపై సర్పమైనాడు. కామక్రోధాది వంచితులైన వారిట్లే ఉన్నత పదవిని పొందియు, తమ ప్రవర్తనచే సజ్జనులకు ద్వేగము కలిగించి భ్రష్టులగుదురని తాత్పర్యము. 45

జపము, యజ్ఞము, తపస్సు, సహనము మున్నగు నదులచే బాగుగ నిండినదై, గొప్పదైన, పుణ్యసముద్రమునుగూడ క్రోధమను నగస్త్యుడు ఒక్కక్షణమున త్రాగి వేయును.

బహుజన్మ సంచితమగు పుణ్యమునుగూడ ఒక్కక్షణమున కల్గిన క్రోధము పోద్రోలునని తాత్పర్యము. కనుక ఇది ప్రాణి కోటికి రెండవ శత్రువు. 46

స్త్రీ – బాల – మిత్ర – విశ్వస్త – గురు – బ్రహ్మస్వభోగినః ।
రమన్తే నిర్భయా ధీరా అవజ్ఞాయోగ్రవేదనా ః 50

శూద్రేభ్యోఽగ్రజన్మానో లుబ్ధా బ్రహ్మవదంత్యహో ।
తతస్వినష్టదన్నాదా నిర్వీర్యా యాజయన్తితాన్ ॥ 51

ప్రోత్సాహయన్తః కున్నృపాన్ మిథ్యోత్ప్రేక్షితసద్గుణైః ।
స్వైరుపాసతేలుబ్ధా బ్రహ్మఘ్నా నిరపత్రపాః ॥ 52

ఎన్ని కోట్ల యావులను సంపాదించినప్పటికిని, గోశాలలో పెద్దపులిని విడచి నప్పుడవి వృద్ధి చెంద లేవుకదా! అట్లే క్రోధ వివశుడైనవానికి తపఃఫలము వృద్ధిచెందదు. 47

క్రోధమెవ్వనినాశ్రయించి యుండునో వానికే ద్రోహము చేయును. ఇట్టి క్రోధముచే ప్రతిహతులు కానివారెవ్వరు? ఇట్లే శోకముచేతను, మోహముచేతను, మాత్సర్యముచేతను, కోట్లాది జనులు బాధింపబడుచున్నారు, ఇంతవరకు క్రోధ స్వభావము నిరూపింపబడినది. 48

పండితులైనవారు లోభమువలన దోషములను చూచుచున్నవారయ్యును లోభదోషావిష్టులై, పరభీతికరమగు స్వభావము కలవారై స్వల్పమగు నవినయసంపాదనముకై గోవులను, బ్రాహ్మణులను, దేవతలను, బహుళములగు ద్రవ్యములను నశింపజేయుచున్నారు. 49

లోభావిష్టులగువారు స్త్రీలకు, బాలురకు, మిత్రులకు తమను విశ్వసించిన వారికి, గురువులకు, బ్రాహ్మణులకు చెందిన ద్రవ్యము ననుభవించువారై, ముందుముందు నరకమున తామనుభవింప వలసిన తీవ్రవేదనముల లెక్కింపక ధైర్యముతో, భయరహితులై సుఖముల ననుభవించుచుందురు.

పరద్రవ్యాపహరణము లోభవిజృంభితమనియు, అదియనివార్యమగు నరకవేదనకు హేతువనియు తాత్పర్యము. 50

వైదిక కర్మాచరణము నందర్హతలేని వారికికూడ వేదమును బోధించుచు, వారిని సేవించుచు, వారిడిన యన్నమును దినుచు, తమశక్తిని కోలుపోయినవారగు విప్రులు, యజన యోగ్యతలేనివారిచే యాగముల చేయించుచుందురు.

ఇది ధనలోభ విలాసమని తాత్పర్యము. 51

క్రోధలోభౌతు చండాలౌ నస్మర్తవ్యౌచ నన్వియౌ ।
యదావిష్టః పుమాన్ హన్తి స్త్రీబాలానతి దారుణః ॥ 53

దంభాక్రాన్తాశ్చరన్త్యేతే సదాచారరతా ఇవ ।
స్వార్థైకసాధకాహ్యేధ్యా మునివేశానటా ఇవ ॥ 54

దాంభికా బహుళద్వేషాశ్చరితైః శ్లాఘితాజనైః ।
సంరంభిణోఽన్తర్నిస్సారాః కృత్రిమేభనిభా ద్విజాః ॥ 55

విస్తార్య, వాగురాం వ్యాధో మృగానా కాంక్షతే యథా ।
ప్రపంచసత్క్రియామేవం, దాంభికా ధనినాంధనమ్ ॥ 56

లోభదోషమునకు వశపడినవారు, దుష్టులగురాజుల ప్రోత్సాహపరచుచు, అవాస్తవములై స్వకపోల కల్పితములగు సద్గుణములతో గూడిన స్తోత్రపాఠములచే వారిని సేవించుచు, సిగ్గునువిడచి, వేదహాని నొనర్చుచుందురు. 52

అతి చండాలములైన క్రోధము - లోభము అను నీరెండును ఎంత మాత్రము స్మరింప దగినవికావు ఏలన, ఈ రెండింటిచే నావిష్టుడైనవాడు మిక్కిలి దారుణ స్వభావుడై స్త్రీలను బాలురను (గూడ) విచక్షణారహితుడై చంపును. ఇంతవరకు లోభము నిందింపబడినది. 53

కామక్రోధావిష్టులైన జనులు కేవలము స్వార్థపరాయణులై సదాచార సంపన్నులవలెను, మునివేషమును వేసికొన్న నటులవలెను, తెచ్చిపెట్టికొన్న అభినివేశముతో దంభాచారులై ధనమును ప్రోగుజేసి కొనుచున్నారు. 54

కృత్రిమములైన యేనుగులవలె గంభీరమగు నాకృతికలవారై, అంతస్సార శూన్యులగు బ్రాహ్మణ బ్రువులు , దంభాచారపరులై, ద్వేషకలుషి తాంతరంగులై పై కగుపించుచున్న చరితముచే లోకుల ప్రశంసల పొందుచు, ఆటోపముతో ప్రవర్తించుచుందురు. 55

చేపలను బట్టుటకై కొలనియొడ్డున ఏకాగ్రముగ నిలుచుండిన కొంగలవలెను, వలనుపన్ని మృగముల వేటాడదలచు బోయవలెను, అడవులలో తమతీవ్రాయుధములచే భయపెట్టి యాత్రికుల ధనములదోచు, దోపిడి దొంగలవలెను, తమయాచార వ్యవహారముల లోకులకు చూపుచు, దాంభిక ప్రవృత్తి గలవారగు కొందరు, గ్రామములో ధనవంతుల ధనము నపహరించుచుందురు. 56,57

హరన్తి దస్యవోఽటవ్యాం విమోహాస్త్రైర్వ్ఱణాధనం
పవిత్రైరతి తీక్ష్ణాగ్రైః గ్రామేష్వేవం బకవ్రతాః ॥ 57

ప్రకటం పతితః శ్రేయాన్య ఏకోయాత్యధఃస్వయమ్ ।
బకవృత్తిః స్వయం పాపః పాతయత్యపరానపి ॥ 58

ఛన్నపంకే స్థలధియా పతన్తిబహువోనను ।
బైడాలవ్రతికోఽప్యేవం సంగసంభాషణార్చనైః ॥ 59

ఆత్మనైవోపహసితా మిథ్యాధ్యాన సమాధిభిః ।
నిర్లజ్జా వంచయంతీమం లోకం దంభేనవంచితాః 60

విద్యాధనాదులచే, , సహజముగ శ్రేష్ఠుడయ్యును, పాపాత్ముడై, బకవృత్తి నాశ్రయించిన వాడు (కొంగవలె స్వార్థదృష్టితో కూడినవాడు) ఒక్కడు తాను పతితుడైనను తనతోటివారి నెందరినో పతితుల నొనర్చుచున్నాడు. 57

యద్యదాచరతి శ్రేష్ఠతత్త దేవేత రోజనః ।

సయత్ ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ।

అని శ్రీ గీతాసూక్తి. సమాజమున శ్రేష్ఠునిగ వ్యవహరింపబడువాడు, పైకి ధార్మికునిగా కన్పట్టుచు, అంతఃకరణ శుద్ధి లేమిచే విపరీతముగ ప్రవర్తించి తాను పతితుడగుటయే గాక, తనను చూచి ప్రవర్తించువారిని గూడ పతితుల జేయుచున్నాడు. శ్రేష్ఠుడైన వానినిచూచి, వాడునడచినట్లు తామునడువ వలెనని భావించుట, అట్లు ప్రవర్తించుట లోకలక్షణముకదా! కనుక విద్యా, ధన, కులాదులచే నుత్తములుగా లోకమున ప్రసిద్ధిచెందినవారు, తమయాలోచనలనకును, నడువడికిని పొంతనలేకుండ ప్రవర్తింప రాదని తాత్పర్యము. 58

పైకి గట్టినేలగా కన్పట్టుచు, లోన నూబిగల ప్రదేశములందు గట్టినేలయను బుద్ధితో ననేకులు పడుదురుకదా! అట్లే బిడాలవ్రతము నాశ్రయించిన వాడు తన సంబంధము చేతను, మాటలచేతను, అర్చనములచేతను (ఆదర వ్యవహారముచేతను) పరులవంచించి పతితుల నొనర్చుచున్నాడు. 59

దంభ గుణమునకు వశపడి దానిచే వంచింపబడినవారు తమయంతతాముగా ఉపహాసమును పొందినవారై అసత్యమైన ధ్యానము సమాధిమున్నగు దాంభిక

కోజయేదభిమానంచ, మహతామపి దుర్జయమ్ ।
జనానాక్రమ్య బహుధాస్థితంశ్రేయోబ్ధిబాడబమ్ ॥ 61

కులేన, విద్యయార్థేన, రూపఖ్యాతిబలైః పృథక్ ।
అభిమానేన బహుధా భవభుక్ కోఽత్రముచ్యతే ॥ 62

గుణైస్తుత శ్ఛిన్నమానో, మానైర్వృద్ధ్యత్యథోత్తరమ్ ।
ఖిద్యతే రమతః ప్రాణానభిమానాయముంచతి ॥ 63

ధనాభిమానేత్యక్తేఽపి గుణినాకేనచిత్ సదా ।
గుణీతపస్వ్యహంచేతి పునర్మానః ప్రవర్తతే ॥ 64

అథకశ్చిన్నసహతే స్తుతిం మానస్వభావివత్ ।
స్తుత్యోఽప్యస్తుతికామ స్త్వమిత్యుక్తః సతుతుష్యతి ॥ 65

వ్యవహారములచే సిగ్గువిడచి యీలోకమును వంచింతురు. ఇంతరకు దంభదోషమును గురించి నిరూపింపబడినది. 60

మహానుభావులగు పెద్దలకు గూడ జయింపనలవిగాని 'అభిమానము' నెవ్వడు జయింపగల్గును? ఈ యభిమాన మనునది సర్వథా జనుల నాక్రమించి యున్నదై వారిశ్రేయస్సను సముద్రమున పుట్టిన బడబాగ్నియే అనవలయును.

బడబాగ్ని - సముద్ర జలముల శోషింప జేసినట్లు, మానవు నాశ్రయించియున్న యభిమానము వానిశ్రేయస్సు నింకింప జేయునని తాత్పర్యము. 61

కులమును పురస్కరించుకొనియు, విద్య, ధనము, రూపము(అందమైనయాకృతి) కీర్తి, బలము అనువీటిచే వేరుగా ననేక విధములుగా కలుగు నభిమానముచే నావిష్టుడైన సంసారి, యిచ్చట నెవ్వడు దానినుండి విడివడును?

కులాది నిమిత్తములగు నభిమానముల నుండి విడివడుట కష్టతరమని యభిప్రాయము. 62

గుణములను బట్టి యితరులచే స్తుతింపబడినవాడు తాత్కాలికముగ అభిమాన విచ్ఛేదమును పొందియు, తరువాత క్రమక్రమముగ నతిశయించిన యభిమానములతో హర్షించును. తననభిమానించు వారికొరకు తాను ఖేదపడును. తుదకు అభిమానమునకై ప్రాణములగూడ విడచును. 63

ఉక్తాభిమానత్యక్తోఽపి యోగమార్గరతః శమీ ।
దృశ్యతే మానవానేవ బ్రహ్మజ్ఞోస్మీత్యహోపునః ॥ 66

సర్వాభిమానత్యక్తోఽథ నిఃసంగః కశ్చిదాత్మవాన్ ।
'నిర్మమోస్మీతి' తస్యాపి భూయోమానః ప్రవర్తతే ॥ 67

త్యక్తః కోనామమానేన ? క్లిష్టోదీనోఽపి భిక్షుకః ।
'భిక్షాభాగ్యంమమాన్యేభ్యో బహ్వస్తీ'తి చ,మానవాన్ ॥ 66

ఇతి కామాదిభిర్దోషై ర్జనా వ్యాకులితాన్తరాః ।
క్లిశ్యన్తిదేహభిన్నార్థవార్తామాత్రేఽప్యకోవిదాః ॥ 69

ఉన్మూలనాయ చైతేషాం మూలం వక్ష్యామి సత్తమాః ।
దుర్జయానాం స్మరాదీనాం ఛిన్నా రోహన్తి నోయతః ॥ 70

ఒకానొక గుణవంతునిచే ధనాభిమానము విడువబడినప్పటికిని, ఎల్లప్పుడు 'నేను గుణవంతుడను, నేను గొప్ప తపస్సుగల వాడను' అనునభిమానము మరల కలుగుచుండును. 64

ఇక, మరియొకడు అభిమానముయొక్క స్వభావము నెరిగినవాడగుటచే, ఇతరులొనర్చెడి స్తుతిని సహింపడు. కాని, ఆతడే – ' స్తుతింపదగిన నీవు, స్తుతిని కోరవు' అని ఇతరులచే పలుకబడినవాడై పరితుష్టినొందును.

అనగా 'మాన' స్వభావమునెరిగిన వారినిగూడ ఆంతరముగ నభిమానము విడచి పెట్టదని తాత్పర్యము. 65

పైనిపేర్కొన్న యభిమానమునుండి విడివడిన వాడైనప్పటికిని, యోగమార్గమందా సక్తిగలవాడై, శమస్వభావుడగు యోగి, 'నేనుబ్రహ్మజ్ఞాన సంపన్నుడను' అనుఅభిమానము కలవాడై తపించు చుండును. అహో! అభిమాన మెంతటిదోకదా! 66

సర్వవిధాభిమానములచే విడివడి బాహ్యసంగమును విడచి యాత్మనిష్ఠుడైన వానికి కూడ 'నేను మమకార రహితుడను' అను నభిమానము అధికముగ ప్రవర్తించుచున్నది. 67

ఈయభిమాన దోషమునుండి విడివడిన వాడెవ్వడున్నాడు? చివరకు బిచ్చమెత్తు కొనువానికిగూడ 'ఇతరులకంటెనాకు భిక్ష్యాభాగ్యము అధికముగానున్నది' అను అభిమానమున్నది.

సత్త్వం రజస్తమఇతి ప్రాకృతం హిగుణత్రయమ్ ।
ఏతన్మూల మనర్థానామాత్మ సంజ్ఞానరోధకమ్ ॥ 71

ఏతైర్వ్యస్తైస్సమస్తైశ్చదోషైః కామాదయోగుణాః ।
మానో,వికారాజాయన్తే సతతం జీవసంజ్ఞితాః ॥ 72

మూలమన్తర్వికారాణాం సర్వేషాంహి త్రయోగుణాః ।
వ్యస్తాస్సమస్తా,రోగాణాం శ్లేష్మపిత్తానిలా ఇవ ॥ 73

ఇంతవరకు 'అభిమాన' దోష మేయేస్థితులలో నేవిధముగా నుండునో స్పష్టపరుపబడినది. ఈ యభిమానమే గర్వమునకు, అహంకారమునకు కారణము. చివరికి యభిమానము ఇంద్రాది దేవతలను కూడ విడువదు. శ్రీభాగవతమున వర్ణింపబడిన గోవర్ధనోద్ధరణలీల ఇంద్రుని యభిమానమును పోద్రోలుటకు భగవానుడు చేసినది.

'యేమద్విధాజ్ఞా జగదీశ! మానినః త్వాం వీక్ష్య కాలేఽభయమాశు తన్మదమ్ ।
హిత్వా ర్యమార్గం ప్రభజన్త్య పస్మయా ఈ హా ఖలానామపితేఽను శాసనమ్ ॥'
( శ్రీ భాగ 10-27/6)

'ఓ జగదీశ్వరా! అభిమానవంతులగు మాబోటియజ్ఞులు సముచిత సమయమున నభయప్రదుడైన నిన్నుజూచి, యామదమును విడచి గర్వముడిగినవారై సజ్జన మార్గము నాశ్రయించుచున్నారు. ఖలులగు వారికిగూడ నీయచ్చమే దండము కదా!' అని పలికిన ఇంద్రుని పలుకులు ఆతని 'అభిమాన' దోష భంజనమును వ్యక్తపరచుచున్నవి. దానిని బట్టి అభిమాన, మెంతటివారినైన విడువక యనర్థపరంపరను కల్గించునని విశదపడుచున్నది. 68

ఈ విధముగ కామక్రోధలోభ మోహమద మాత్సర్యములనువారు దోషములచే జనులు కలుషితమైన యంతరంగము గలవారై, తమదేహములకంటె వేరైన విషయముల యన్తస్తత్త్వము నెరుగనివారై క్లేశముల పాలగుచున్నారు. 69

ఇట్టి కామక్రోధాదుల పెరికి వేయుటకై, వీటికి మూలమేమో నిరూపింపగలను. ఓ సజ్జనులారా! జయింప నలవికానివగు కామాదుల మొలకలు మరలమొలకెత్త కుండునట్లీ విషయమును చెప్పుదును. 70

సత్త్వము, రజస్సు, తమస్సు, అని ప్రకృతికి సంబంధించిన మూడు గుణములున్నవి.

సత్త్వం సాత్త్విక సంగాచ్చ రజోరాజస సంగతః ।
తమస్తామస సంగాచ్చస్వసామ్యా ద్వర్ధతే ప్రియాత్ ॥ 74

సన్తస్సతాం ప్రియాః, పాపాః పాపానాం గుణసామ్యతః ।
తిరశ్చామపితిర్యఞ్చస్సదా తేహ్యేక కారిణః ॥ 75

గుణైర్భిన్నధియో జీవాః పృథక్ కార్యాణి మన్వతే ।
ముదాస్వగుణయోగ్యాని, సద్భిశ్చైరనుమోదితాః । 76

ఇవియే ఆత్మకు సంబంధించిన స్వరూప విజ్ఞానమును ప్రతిరోధించి సర్వానర్థములకు కారణమగుచున్నవి.

ఇక్కడనుండి ప్రారంభించి 90వ శ్లోకమువరకు ప్రకృతి సంబద్ధములైన గుణములవలన జీవులయందు సంక్రాన్తములైన దోషములను, వాటినధఃకరించు దేహాత్మ వివేకమును పొందుటకు ఉపాయమైన యోగమును నారదమహర్షి నిరూపించుచున్నాడు. 71

ఈమూడు ప్రాకృత దోషములు విడివిడిగాను, సమూహముగాను కామాది గుణములను, అభిమానమును, ఇతర వికారములను పుట్టించుచున్నవి. వీటిని బట్టియే జ్ఞానానంద స్వరూపములగు నాత్మలు జీవవ్యవహారమును పొందుచున్నవి.

సాధారణముగ ఆత్మకు జీవవ్యవహారమున్నది. ఈ వ్యవహారమునకు కారణమేమని పర్యాలోచించినప్పుడు 'జీవతీతిజీవః' అనువ్యుత్పత్తినిబట్టి జీవించుచున్నాడు కనుక, జీవుడు అని జీవవ్యవహారమేర్పడు చున్నదని చెప్పవచ్చును. ఆత్మకు కర్మమూలమున దేహము దానియందున్న ప్రాకృతిక ధర్మములు ఏర్పడినప్పుడు 'జీవుడు' అనువ్యవహారము కలుగును. కనుక ఇట్టి వ్యవహారమునకు ప్రాకృతికములగు సత్త్వ రజ స్తమోగుణములు కారణమని తాత్పర్యము. 72

శరీరమున కలిగెడి రోగములకు, వాతపిత్త శ్లేష్మముల ప్రకోపమే కారణమైనట్లు, సత్త్వ రజస్తమోగుణములు మూడు వేరువేరుగాను, సమూహముగాను సమస్త వికారములకు కారణమగుచున్నవి. 73

సత్త్వగుణ సంపన్నులైన వ్యక్తుల సంబంధముచే సత్త్వగుణము, రజః ప్రవృత్తిగల వారి సంసర్గముచే రజోగుణము, తమఃప్రవృత్తుల సంబంధముచే తమోగుణము వృద్ధిచెందును. దీనికి ఆయాయి గుణములకు గల సామ్యము, (పోలిక) మరియు, ఆయాయి గుణములు కలవారిపట్ల ప్రీతి కారణము. 74

ఏతన్మయీచప్రకృతిర్మాయా యావైష్ణవీశ్రుతా
లోహిత శ్వేతకృష్ణేతి నిత్యా,తాదృగ్బహుప్రజా ।  77

సైషాచరాచర జగత్ పత్రపుష్పఫలాన్వితా ।
కామాద్యసత్కంటకినీ మహావల్ల్యాత్మనః పృథక్ ॥  78

ఎల్లప్పుడు సమానమగు వ్యవహారము కలవారగుట చేతను, గుణములను బట్టి పోలిక కలిగియుండుట చేతను సజ్జనులు సజ్జనులకు ప్రేమాస్పదులు. ఇట్లే పాపులు పాపాత్ములకు ప్రియులు. పశుపక్ష్యాదులకు పశుపక్ష్యాదులు ప్రియములు.

తమతో సమానములగు గుణములు కలవారిపట్ల జనులకుగాని పశుపక్ష్యాదలకు గాని ప్రీతిపుట్టునని తాత్పర్యము.  75

వారివారి గుణములలోని తేడాను బట్టి వేరువేరు బుద్ధులు కలవారు తమతమ కార్యములను వేరుగనే భావింతురు. తమతమగుణములకు తగినవియగు కార్యముల నానందముతో చేయుదురు. ఇట్లు స్వగుణానుగుణముగ కార్యములజేసినవారు, తమతో సమాన గుణములు కలవారిచే నామోదింపబడుదురు.  76

ఈ సత్త్వ రజస్తమోగుణ త్రయముతో కూడినదే ప్రకృతి. ఇదియే వైష్ణవ మాయ. ఇదియే ఎర్రగను, తెల్లగను, నల్లగానున్నదనియు, నిత్యయై, తనవలె గుణ త్రయముతో గూడిన బహుసంతామును కనుచున్నదనియు శ్రుతులు చెప్పుచున్నవి.,

ఉపనిషత్తులు ఈ గుణత్రయవిశిష్టమగు ప్రకృతిని నిరూపించియున్నవి.

'అజామేకాం, లోహిత శుక్ల కృష్ణామ్ బహ్వీః ప్రజా జనయన్తీం సరూపాః ।
అజోహ్యేకో జుష మాణోఽనుశేతే జహాత్యేనాం భుక్త భోగామజోన్యః ॥
(శ్వేతి. 4/5)

'పుట్టుక లేనిదియి(నిత్యయు) ఎరుపు (రజోగుణము) తెలుపు(సత్త్వగుణము) నలుపు(తమోగుణము) అనుమూడు రంగులు కలదియునగు ప్రకృతి తనతో సమానమగు రూపముగల(సత్త్వరజస్తమోగుణములుగల) అనేక సంతానమును కనుచున్నది. నిత్యుడగు నొక్కడు (జీవాత్మ) ఆ ప్రకృతి ననుభవించుచున్నాడు. ఇక మరియొక నిత్యుడు (పరమాత్మ) విరక్తుడై ఉదాసీనుడై ప్రకృతిని భోగింపక విడచుచున్నాడు.' ఇత్యా ద్యుపనిషద్వచన మిచ్చట పరామర్శింపబడినది' మాయాంతు ప్రకృతిం విద్యాత్ మయి నంతు మహేశ్వరమ్' మాయను ప్రకృతిగాను, మాయనధఃకరించిన మాయావిని

శుద్ధోఽప్యాత్మాతిసామీప్యాదస్యాధర్మాన్ పృథగ్విధాన్ ।
కర్తృత్వభోక్తృత్వసుఖాన్, మన్యతేస్వాన్ సుచింతితాన్ ॥ 79

జీవో బహిః స్థితాత్ క్షేత్రాత్ సు ప్లుటం భిన్నాత్మకోఽర్థతః ।
నేమాం వేత్త్యన్తరాసన్నాం ముఖసక్తాం మ షీ మివ ॥ 80

మహేశ్వరునిగాను (పరమాత్మగాను) ఎరుగవలయును ' అనియు,

'దైవీహ్యేషాగుణమయీ మమమాయా దురత్యయా' 'సత్త్వ రజ స్తమో గుణ మయయు దైవియగు నామాయ దాటరానిది' అనియు శ్రీగీత మాయ - ప్రకృతి రెండును ఒక్కటేనని నుడువుచున్నది. ఇకదీని విలాసమును చెప్పుచున్నాడు.77

ఈ గుణత్రయాత్మక మాయారూపమగు ప్రకృతి, స్థావర జంగమాత్మక జగత్తును, పత్రములు, పుష్పములు, ఫలములుగా కలియున్నదియు, కామక్రోధాది కంటకములతో (ముళ్లతో)కూడినయొక మహాలత. ఇది యాత్మకంటె భిన్నమే. 78

సహజ శుద్ధ స్వభావము గల జీవాత్మ, ఈ ప్రకృతి (లేదా మాయ) కు అతి సన్నిహితుడై యుండుటచేత, ఈ ప్రకృతికి చెందినవియు, తనకంటె వేరైనవియునగు ధర్మములగు, కర్తృత్వము (కర్తయగుట) భోక్తృత్వము (కర్మ ఫల భోక్తయగుట) సుఖము (ఇట్లే దుఃఖము) మున్నగు వాటిని తనకు చెందినవిగనే భావించుచుండును.

ఈ విషయమే శ్రీగీతలో -

'ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।

అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే ॥'

'తననంటి పెట్టుకొనియున్న ప్రకృతికిచెందిన సత్త్వ రజ స్తమోగుణముల ప్రేరణచే కల్గుచున్న ప్రవృత్తులనన్నింటిని, అవి వాస్తవమునకు తనవికాకున్నను, తనవి గనే భావించుచు, అహంకార విమూఢుడైన జీవుడు ,తానే కర్తనని భావించుచున్నాడు' అని చెప్పబడినవి. ఇట్లే, తనకుచెందని కర్మముల ఫలములు తానే భోగించుచున్నట్లు భావించుచున్నాడని యెరుగవలయును, ఇదియే సంసారమని తాత్పర్యము.79

తనముఖము నంటిన మసిని (మాలిన్యమును) తాను చూడలేనట్లే, జీవుడు పరమార్థముగ తనకు వెలుపల నావరించియున్న క్షేత్రము (దేహము) కంటె తాను భిన్నుడై యున్నను, తనలో తనకు సన్నిహితముగానున్న ప్రకృతిరూపమగు మాయను తెలియజాలకున్నాడు.

సోఽథప్రతినివృత్తాక్షోగురుదర్పణ బోధితః ।
స్వతోఽన్యాం విక్రియాంమౌఢ్యాదాస్థితామంజసేక్షతే ॥ 81

అథాఽసౌ ప్రకృతిర్నాహమియంహి కలుషాత్మికా ।
శుద్ధబుద్ధస్వభావోఽహమితి,త్యజతి తాం విదన్ ॥ 82

ఏవందేహేంద్రియాద్యర్థే శుద్ధత్వేనాత్మనిస్మృతే ।
శిథిలా సవికారేయం త్యక్తప్రాయాహిచర్మవత్ ॥ 83

జీవాత్మకు పైని కప్పుగానున్న శరీరమే క్షేత్రము. 'ఇదం శరీరం కౌంతేయ ! క్షేత్రమిత్యభిధీయతే' ఓ అర్జునా! ఈ శరీరమే క్షేత్రమని చెప్పబడుచున్నది. ఈ శరీరము ప్రకృతి వికారమే. ఇట్లే బాహ్యములగు పదార్థములన్నియు ప్రకృతి పరిణామములే. తాను ఈ ప్రకృతి పరిణామములైన పదార్థములకంటెను, ప్రకృతి వికారమైన దేహముకంటెను వేరైయున్నప్పటికిని, దేహాది రూపమగు ప్రకృతితో నిత్య సన్నిహితుడై యుండియు ఇది తనకంటె వేరని యెరుగజాలడు. ఈ జీవప్రకృతులకు గల యన్యోన్య సంబంధమువలన కలిగెడి వ్యామోహమును ఉద్ధవుడు భగవానునకు విన్నవించగా, భగవానుడు - జీవప్రకృతి వివేకమును, మోహము పోవుట కాచరింపదగు యోగమును భాగవతమున నుపదేశించినాడు.

ప్రకృతిః పురుషశ్చోభౌయద్యప్యాత్మ విలక్షణౌ ।

అన్యో న్యో పాశ్రయాత్ కృష్ణ ! దృశ్యతే నభిదాతయోః ।

ప్రకృతౌ లక్ష్యతే హ్యాత్మా, ప్రకృతిశ్చ తథాత్మని ।

ఏతన్మే పుండరీకాక్ష! మహాన్తం సంశయం హృది ।

ఛేత్తు మర్హసి సర్వజ్ఞ! వచోభిర్నయనైపుణైః ॥' (శ్రీభాగ .11-22- 18/19)

'ఓకృష్ణా! ప్రకృతి, పురుషుడు, (జీవుడు) అను నీరెండును వాస్తవమున కత్యన్త భిన్నములే. అయినను, ఒకదాని నొకటి యాశ్రయించి యుండుటచే ఈరెండింటికిగల భేదము కన్పట్టుటలేదు. ప్రకృతియందు పురుషుడును, పురుషుని యందు ప్రకృతియు కన్పట్టుచు, సంశమును కల్గించుచున్నారు. పుండరీకాక్షా! సర్వజ్ఞుడవగునీవే ఈసంశయమును ఛేదింపుము' అనగా - శ్రీ భగవానుడే తత్త్వమునుపదేశించినాడో అదియే శ్రీహరిభక్తి సుధోదయమున 81వశ్లోకమునుండి విశదపరుపబడినది. 80

పిమ్మట, నీ జీవుడు గురువను దర్పణము(అద్దము) వలన తత్త్వము నెరిగినవాడై, తనకంటె వేరుగనున్నప్పటికి, అహంకారమూలమగు మూఢతచే తన దిగనే భావింపబడిన

సవికారాపికి మౌఢ్యేన చిరంభుక్తాగుణాత్మనా ।
ప్రకృతిర్జాతదోషేయం లజ్జయేవ నివర్తతే ॥ 84

ప్రకృతౌ శిధిలాయాంచ తద్వికారాఃస్మరాదయః ।
నివృత్తా ఏవ, హిత్వాతాన్ నహ్యాయాన్తి మదాదయః ॥ 85

చిత్రచ్ఛాయా పటత్యాగే, త్యక్తం తత్స్ధంహి చ్చిత్రకమ్ ।
ప్రకృతేర్వి రామాదిత్థం ధ్యాయినాం క్వస్మరాదయః ॥ 86

యీ ప్రాకృతిక వికారమును వెంటనే దర్శించును.

గురువు దర్పణము వంటివాడు. అద్దము మనముఖముపైగల మాలిన్యమును మనకుచూపి, దానిని తుడుచునట్లుగ నెట్లు ప్రేరించునో, ఆచార్య పురుషుడును తన్నాశ్రయించిన వారి ప్రాకృతిక దోషముల నెత్తిజూపి ప్రకృతికంటె వేరైన యాత్మ తత్త్వమును, ఆత్మకంటెవేరైన పరమాత్మ తత్త్వమును ఎరుకపరచును. 81

ఆచార్యోప దేశానంతరము, నేను ప్రకృతినికాను. ఇది త్రిగుణబద్ధయై కలుషస్వభావ, నేను శుద్ధ స్వభావుడను, జ్ఞానస్వరూపుడను, అని, ప్రకృతిని తనకంటె వేరుగా తెలిసికొనును. 82

ఇట్లు దేహము, ఇంద్రియములు మున్నగు విషయము, ఆత్మకుగల విశుద్ధత్వము స్మరింపబడగా, వికారములతో పాటుగ నాప్రకృతి శిథిలమై, పాముకుబుసమువలె విడువబడిన దగును. తనంతతాను తొలగిపోవునని తాత్పర్యము. 83

వికారాస్పదమయ్యును చాలకాలము గుణస్వభావముగ భోగింపబడిన ప్రకృతి, దోషము నెరిగినదై సిగ్గుచెందినదా యనునట్లు తొలగిపోవును. 84

ప్రకృతి, శిథిలముకాగానే, ప్రాకృతిక వికారములగు కామాదులు కూడ తొలగినట్లే. కామాదులను విడచి, మదమాత్సర్యాదులు కూడ తిరిగిరావు కదా! 85

చిత్రముచే ముద్రింపబడిన వస్త్రమును విడువగానే, దానియందు గల చిత్రముగూడ విడువబడినట్లే, ప్రకృతి విరమించగనే ధ్యాన నిష్ఠులగు వారికి కామాదులెటనుండివచ్చును? 86

హర్షము, (ఆనందము) శోకము, భయము, క్రోధము, లోభము, మోహము, అట్లే మదము, మాత్సర్యము, స్నేహము, దైన్యము, నిద్ర, అలసత్వము, కామము, మున్నగునవియు, దంభము, (అహంకారప్రవృత్తి) అభిమానము, అతివిషయాసక్తి

హర్ష-శోక-భయక్రోధ-లోభ-మోహ మదాస్తథా।
మత్సరస్స్నేహ కార్పణ్య నిద్రాలస్యస్మరాదయః॥ 87

దంభాభి మానతృష్ణాద్యాః సర్వే ప్రకృతిజాస్స్మృతాః।
గుణసంజ్ఞాః సదోషాశ్చ నిర్దోషో నిర్గుణఃపుమాన్॥ 88

యథాజ్వలద్గృహాశ్లిష్టగృహో విచ్ఛిద్యరక్ష్యతే।
ఏవంసదోషప్రకృతేర్విచ్ఛిన్నోఽయం నశోచతి॥ 89

వేదాన్తేభ్యః, సతాం సంగాత్, సద్గురోశ్చ, స్వతస్తథా।
జ్ఞేయోఽన్యఃప్రకృతేరాత్మా, సదాసమ్యఙ్ముముక్షుభిః॥ 90

మాయా ప్రవర్తకే,విష్ణౌ,కృతా భక్తిర్దృఢానృణాం।
సుఖేన ప్రకృతిం భిన్నాం సందర్శయతి,దీపవత్॥ 91

మున్నగునవి యన్నియు దోషభూయిష్టములై ప్రకృతివలన పుట్టిన గుణములుగా పేర్కొనబడుచున్నవి. ఎట్టి దోషములేని వాడును, నింద్యగుణములు లేనివాడును పురుషుడు (అగు జీవాత్మ). 87,88

మండుచున్న యింటిని ఆనియున్న వేరొకయింటిని, వేరుచేసి రక్షించినట్లు, దోషభూయిష్ఠమగు ప్రకృతినుండి విడివడిన జీవుడు శోకింపడు. జీవునకు కల్గెడి శోకము ప్రకృతి సంబంధము వలన కల్గినదేనని తాత్పర్యము. 89

వేదాన్త వచనముల వలనను, సజ్జన సాంగత్యముచేతను, ఆచార్యలక్షణముగల యుత్తమగురువు వలనను, అట్లే తనయంత తాను ప్రయత్నించియు ప్రకృతికంటె వేరగు, 'ఆత్మ' ఎల్లప్పుడు ముముక్షువులచే (మోక్షమును కోరువారిచే తెలియ దగియున్నది. 90

ఈ ప్రకృతిరూపమగు మాయనధఃకరించి ప్రవర్తింపజేయు శ్రీమన్నారాయణుని యందు దృఢముగ నుంచబడిన జనుల 'భక్తి', ఎట్టి క్లేశములేకయే తమకంటె వేరైన ప్రకృతిని, దీపమువలె జీవులకు చూపుచున్నది.

పైశ్లోకమున(85) చూపబడిన యుపాయములన్నింటికంటె మాయనధఃకరించిన శ్రీహరి యందుగల దృఢభక్తియే ఉపాయతమమని యభిప్రాయము. 91

ఈ విధముగ నాత్మను దృఢముగ నెరిగి, పిమ్మట, సమస్త విషయసంపర్కమును

ఇత్యాత్మానం దృఢం జ్ఞాత్వా సర్వసంగంతతస్త్యజేత్ ।
అద్వైతసిద్ధ్యైయతతామన్యసంగోహ్యరిఃస్ఫుటమ్ ॥ 92

ఏకాంతే స్వాసనో ధీరః శుచిర్దక్షః సమాహితః ।
యతేతోపనిషద్దృష్టమాయా భిన్నాత్మదర్శనే ॥ 93

పరాక్ప్రవృత్తాక్షగణం యోగీ ప్రత్యక్ ప్రవాహయేత్ ।
రుద్ధ్వామార్గం తదభ్యస్తం నర్మదౌఘవమివాత్మనః ॥ 94

స్థాపయిత్వాపదేఽక్షాణిస్వేస్వేఽన్తస్తుమనః శనైః ।
నివృత్తసైన్యం రాజానం వేశ్యేవాన్తఃప్రవేశయేత్ 95

అంతర్నీతేచ మనసి,నచలన్తీంద్రియాణ్యపి ।
అభ్రాణిస్తిమితానీవచోదకేఽనాగతేఽనిలే ॥ 96

విడువవలయును, ఏలన, అద్వైత సిద్ధికై యత్నించు వారికి ఇతర విషయ సంపర్కము స్పష్టముగ శత్రువేకదా! 92

ఏకాంతప్రదేశమున మంచి యాసనమును వేసికొని కూరుచున్నవాడై, బుద్ధిని నిగ్రహించినవాడును, బాహ్యాన్తశ్శౌచము కలవాడు, సమర్థుడు, ఏకాగ్రనిష్ఠుడు అయిన ముముక్షువు ఉపనిషత్తులలో దర్శింపబడిన మాయాభిన్నమగు నాత్మను దర్శించుటయందు ప్రయత్నింప వలయును. 93

బహిర్ముఖములుగా, విషయములవైపు ప్రవర్తించు ఇంద్రియములను అంతర్ముఖములుగాజేసి, యోగనిష్ఠుడైనవాడు నర్మదానదీ ప్రవాహమువలె, ఇంద్రియముల కలవాటైన మార్గము నడ్డగించుటద్వారా, వాటిని, ఆత్మోన్ముఖముగా ప్రవర్తింప జేయవలయును. 94

ఇంద్రియములను వాటివాటి స్థానములందు నిలిపి, మెల్లగా సైన్య విరహితుడగు రాజును వేశ్య తనగృహమున ప్రవేశింప జేసినట్లు, మనస్సులను అంతర్ముఖముగా ప్రవేశింపజేయవలయును. 95

మనస్సీవిధముగా లోన ప్రవేశింప జేయబడగా ఇంద్రియములుకూడ కదలవు. ప్రేరకమైన వాయువు రానప్పుడు మేఘములు కదలకయే యుండునుకదా! 96

పిమ్మట, శరీరము, అహంకారము, బుద్ధి అనువీటియన్నిటికంటె వేరైనచైతన్య

తతో వపురహంకారబుద్ధిభ్యోఽన్యచిదాత్మని ।
తాసాంప్రవర్తయితరి,స్వాత్యని స్థాపయేన్మనః ॥ 97

ముదా కర్తృత్వభోక్తృత్వమానికం, తామసాలయం ।
సర్వాత్మని,చిదానందఘనే,విష్ణౌ,నియోజయేత్ ॥ 98

సలిలేకరకాశ్మేవ దీపోఽగ్నావివ,తన్మయః ।
జీవోమౌఢ్యాత్ పృథగ్బద్ధో,ముక్తో బ్రహ్మణి లీయతే 99

అయంచజీవపరయోర్యోగో,యోగాభిధో ద్విజాః ।
సర్వోపనిషదామర్థో మునిగోప్యః పరాత్పరః ॥ 100

ఏవం బ్రహ్మణియుక్తాత్మా, సనిరంతరచిద్రసః ।
ఆసీతానంతరం రాజ్యం విలాప్యజగదాత్మని ॥ 101

స్వభావుడగు నాత్మ, వాటికి (ఇంద్రియములకు) ప్రవర్తకుడుకాగా, తనయాత్మయందే మనస్సును కుదురుకొల్ప వలయును. 97

ఇట్లాత్మోన్ముఖ మొనర్చబడిన మనస్సును, ఇంద్రియములను వశపరచు కున్నవాడును, కర్తృత్వము భోకృత్వము (అనగా కర్తయగుట, భోక్తయగుట) యనునవి తనకేనని అభిమానించువాడును తమోగుణమునకు నిలయమైవాడును అగుజీవాత్మను సర్వాత్మకుడు చైతన్యానందఘనుడు అయన విష్ణువునందు లెస్సగ కూర్పవలయును. 98

నీటిలో ఇండింపగింజ కరిగినట్లును, అగ్నిలో దీపములీనమై, నట్లును, అజ్ఞానవశమున స్వతంత్రములుగా ప్రవర్తించుచున్న దేహేంద్రియ మనస్సులచే బంధింప బడినజీవుడు ముక్తుడై పరబ్రహ్మమందు లయించుచున్నాడు. 99

ఈజీవాత్మ పరమాత్మలకు కల్గిన సంబంధమే 'యోగమని' చెప్పబడును. ఓ ద్విజులారా! సమస్తములగు నుపనిషత్తులకు ప్రతిపాద్యతత్త్వము , మునులకు గూడ అత్యంతరహస్యమైనవాడు పరాత్పరుడగు శ్రీహరియే. 100

ఈ విధముగా పరబ్రహ్మమగు శ్రీమన్నారాయణుని యందు కూర్పబడిన యాత్మగలవాడును, నిరంతరము కేవల చైతన్య స్వభావముతో నొప్పువాడును అగు జీవుడు, బాహ్యమగు శరీర రాజ్యమును సర్వజగదాత్మకుడగు శ్రీహరియందు లయింపజేయ వలయును. 101

క్రమాద్విలయమానాయ్య కఠినాంశోపమం జగత్ ।
విస్తరం స్వాత్మవిద్యోగీనిర్విశేషం విలాపయేత్ ॥ 102

తదా సుఖప్రకాశాత్మా నిర్విశేషో నిరంజనః ।
సజ్యోత్స్న కేవలా కాశసామ్యం కించిద్బిభర్తినః ॥ 103

నాసావనేక ఏకోవా, నాలోకస్తమసః పరః ।
నాల్పో మహానవా, నబహిర్నాన్తరోవాఽసమోఽవ్యయః ॥ 104

ఏవం సతతయుక్తాత్మా క్రమాద్విష్ణుమయో భవత్ ।
నహి సైంధవశైలోఽపి క్షణాదంబుమయోభవేత్ ॥ 105

వృత్తిలోఽపి జగత్ కృత్స్నం విష్ణురేవేతి భావయేత్ ।
నిర్మమో నికహంకారశ్చరేత్ శిథిల సంసృతిః ॥ 106

క్రమక్రమముగ కఠినములగు నంశములతో విస్తరించియున్న జగత్తును లయింపజేసి, ఆత్మవేత్తయగు యోగి, ఎట్టి విశేషాంశములు లేకుండగ లయము నొనర్పవలయును. 102

అప్పుడు ఎట్టి విశేషములు లేని వాడును, దోషస్పర్శరహితుడును,(ప్రాకృతికగుణ సంసర్గములేనివాడును) ఆనందముగ ప్రకాశించునట్టి ముక్తాత్మ, వెన్నెలతో కూడి ప్రకాశించు (మేఘాదిరహితమగు) నాకాశము యొక్క సామ్యమును కొలదిగా వహించును. 103

ఈ దశలో నాముక్తాత్మ అనేకుడుకాడు, ఒక్కడు కాడు, ప్రకాశముకాడు, తమస్సుకు వశపడినవాడుకాడు. అల్పుడుకాడు. మహత్త్వము కలవాడుకాడు. బాహ్యప్రవృత్తికాడు, ఆంతర ప్రవృత్తియుకాడు, కేవలము సర్వసామ్య విరహితుడు, అవ్యయుడు (నాశరహితుడు). 104

ఈ విధముగా, నిరంతరము పరమాత్మ యోగమును పొందినవాడై క్రమముగ విష్ణుమయుడు కావలయును. ఏలన, లవణ పర్వతమైనను ఒక్కక్షణమున నీటిలో కరిగిపోవదు కదా! 

లవణమునకు నీటిలో కరుగులక్షణమున్నను ఒక్కసారిగ కాక, క్రమక్రమముగనే నీటిలో కరుగునట్లు, ఒక్కసారిగ కాక, క్రమక్రమముగనే జీవుడు విష్ణుయోగమును పొందునని తాత్పర్యము. 105

దేహేప్యహం మతిర్మూలం మహతో భవభూరుహః ।
తత్కృతో, దారపుత్రాదౌస్నేహః క్వైతేఽన్యథాత్మనః ॥ 107

కర్మకుర్యాదశక్తోఽపి పూర్వాసత్కర్మ శుద్ధయే ।
విరేకాయౌషధం పీతం, సమలం హ్యపగచ్ఛతి ॥ 108

కామ్యేనకర్మణాబద్ధో నశక్యస్తద్విశుద్ధికృత్।
రజసోత్తేజనార్థేన హ్యాదర్శో నామలీభవేత్? ॥ 109

అకర్మకరణాద్యేన ముముక్షురపి బధ్యతే ।
అనివార్యరజోవర్షం స్నానేచ్ఛుర్నను మూఢధీః ॥ 110

జీవాత్మను పరమాత్మతో లయింపజేసినప్పటికిని, ఈ సమస్త జగత్తు విష్ణువేనని భావింపవలయును. ఎట్టి యహంకారమకారములు లేనివాడై, సంసార శైథిల్యమును పొంది సంచరింపవలయును. 106

ఈ ప్రాకృతికమగు శరీరమందు 'అహమ్' (నేనేఇది) అను బుద్ధి (అనగా దేహమందాత్మబుద్ధి) ఈ సంసార మహావృక్షమునకు మూలము. దీనివలననే (దేహాత్మ బుద్ధివలననే) భార్యాబిడ్డలయందు మమకార మేర్పడుచున్నది ఈ దేహాత్మ బుద్ధి లేనిచో ఈ యాత్మకు ఇవియెచ్చటివి? 107

శక్తిలేకున్ననూ కర్మాచరణము తప్పదు. ఏలన, పూర్వమొనర్చిన దుష్టకర్మములు పరిశుద్ధములగుట కిదియే ఉపాయముకదా! మలశుద్ధిద్వారా ఉదరదోషమును పోగొట్టుటకై విరేచనకారియగు నౌషధమును మ్రింగినప్పుడు, ఆయౌషధముకూడ, ఉదరగతమగు మలముతో పాటుగ తొలగిపోవు చున్నదికదా!

పూర్వకర్మ పరిశుద్ధికై యాచరింపపబడిన సత్కర్మము కూడ పూర్వకర్మముతో పాటుగ తొలగిపోవునని యౌషధదృష్టాన్తమును బట్టిస్పష్టపడుచున్నది. 108

కామ్య కర్మముచే బద్ధుడైనవాడు, దానిని భగవదాయత్తమైన కర్మముచే విశుద్ధినొనర్చు కొన్నప్పుడు, బంధింపబడుట కలవికాడు. అద్దమును నిర్మల మొనర్చుట కుపయోగింపబడిన చూర్ణముచే, దర్పణము నిర్మలము కాదా? 109

కర్మాచరణము చేయనందువలన ముముక్షువుగూడ బంధమున బడుచున్నాడు. వర్షముగా పైనిబడుచున్న ధూళిని నివారింపకుండగ స్నానముచేయ నిచ్ఛగించువాడు మూఢబుద్ధియేకదా! 110

తస్మాత్కుర్వన్ననాసక్తో నిత్యనైమిత్తికీః క్రియాః ।
అనఘత్వాయ, శుద్ధ్యైచ సుగుప్తో యోగమభ్యసేత్ ॥ 111

నిర్విఘ్నాయ ముముక్షుణాం గతిం నాఖ్యాపయేజ్జనే ।
కారాగృహాదపసరన్ వంచయేద్ధివ్యవస్థితాన్ ॥ 112

ఏవం సతతమభ్యాసాత్, లీనబుద్ధేః పరాత్మని ।
కర్మాణి బుద్ధిపూర్వాణి నివర్తంతేస్వతోద్విజాః ॥ 113

సోఽథానందాత్మకం దేహం వర్తమానం యదృచ్ఛయా ।
విషయీవాన్తరాత్మానం నవేత్తిచిర విస్మృతః ॥ 114

కావున, నిస్సంగుడై నిత్య - నైమిత్తిక క్రియల నాచరించుచున్నవాడై, పాపముల పోగొట్టు కొనుటకును, పరిశుద్ధి కొరకును, ఆత్మ పరిరక్షణ మొనర్చు కొనువాడై యోగాభ్యాస మొనర్పవలయును. 111

మోక్షేచ్ఛచే యోగమార్గమున ప్రవర్తించు వారికి సంబంధించిన యాచరణ విధానమును, విఘ్ననివారణమునై, సామాన్యజనులకు చెప్పక గోప్యముగ నుంచవలయును, కారాగారము నుండి తప్పించు కొనిపోవదలచినవాడు, కారాగృహ రక్షకుల వంచించియే పోవలయునుకదా! 112

ఓద్విజులారా! ఈవిధముగ నిరంతరము అభ్యాసమొనర్చుటద్వారా పరమాత్మ యందు చిత్తమునులయమొనర్చినవానికి, జ్ఞానపూర్వకముగా నాచరింపబడిన కర్మములు తమంత తాముగ తొలగిపోవుచున్నవి. 113

స్వేచ్ఛగా (భగవదాయత్తముకాక) ఇంద్రియ వశమై యున్న దేహమును, ఆనందాత్మ కమని (ఆనందస్వరూపుడగు పరమాత్మను ఆత్మగా కలిగియున్నదని) చాలకాలము మరచి పోయినవాడగు జీవుడు, విషయలోలుడైన వాడంతరాత్మనెరుగనట్లు, తెలియజాలకున్నాడు. 114

పూర్వముండిన యభ్యాసమును బట్టి కదలుచున్న దేహముకలవాడును, లౌకికములైన కర్మముల నాచరించుట యందుగాని, వైదిక కర్మాచరణమునందుగాని సంగములేనివాడును, పుణ్యాపాప సంబంధము లేనివాడును, సమస్తము నందాత్మను దర్శించువాడును అయిన జీవుడు 'జీవన్ముక్తుడ'ని చెప్పబడుచున్నాడు. 115

ఇట్టి జీవన్ముక్తతాదశయందుగల వానికి, దేహము రాలిపోవగనే, ఇకనాతడు

పూర్వాభ్యాసచరత్కాయో నలౌక్యోనచవైదికః ।
అపుణ్యపాపః సర్వాత్మాన జీవన్ముక్త ఉచ్యతే ॥ 115

తద్దేహపాతేచపునః సర్వాశోన సజాయతే ।
ఏవంమద్వైత యోగేన విముక్తిర్వామయోదితా ॥ 116

కింత్వేషదురనుష్ఠేయో జనవైర్యోగో నిరాశ్రయః ।
అభ్యస్తమార్గాదక్షాణి సహసా కోనివర్తయేత్ ॥ 117

చిత్తేహి స్వవశే యోగః సిద్ధ్యేత్, తత్తు జగత్పతిమ్ ।
కోఽనాశ్రిత్య నిగృహ్ణీయాత్ అవ్యక్తమతి చంచలమ్ ॥ 118

అరూపత్వాన్మనోఽదృశ్యమ దృశ్యత్వాదనాస్పదమ్ ।
అనాస్పదత్వాదగ్రాహ్యమ్, అగ్రాహ్యత్వాదనిగ్రహమ్ ॥ 119

సర్వాత్మనా పుట్టడు. ఈ విధముగ 'అద్వైతయోగము' ద్వారా 'ముక్తి' యెట్టిదో మీకునాచే చెప్పబడినది. 116

కానియీ 'అద్వైతయోగ' మార్గము నిరాలంబనము (అనగా నిర్గుణోపాసనము) కనుక, జనులకు ఆచరణ సాధ్యము కాదు. పూర్వము అభ్యసించిన మార్గమునగల యింద్రియములను, వెంటనే, ఎవ్వడు నివర్తింపజేయగలడు..

సగుణమగు వస్తువు నాశ్రయించినంత సులభముగ నిర్గుణమగు వస్తువు నాశ్రయించుట సాధ్యముకాదని తాత్పర్యము. 117

మనస్సు వశపడియున్నప్పుడు (పూర్వోక్తమగు) యోగము సిద్ధించును. ఆమనస్సును, జగదీశ్వరుడగు శ్రీహరి నాశ్రయింపక ఎవ్వడు నిగ్రహింపగలడు? ఏలన, ఈమనస్సు ఇట్టిదని స్పష్టముగ తెలియరానిది, మరియు చంచలమైనది కదా! 118

ఈమనస్సునకు రూపము (కంటి కగుపించు ఆకృతి) లేదు. కావున ఇది చక్షురింద్రియ గోచరముకాదు. ఇందువలననే (కంటికగుపింపదు కనుకనే) దీనికాశ్రయము (నిర్దిష్టమగు స్థానము) లేదు. (అనగా కన్ను, ముక్కు, చెవి, మున్నగు ఇంద్రియములకు ప్రతినియతమగు స్థానమున్నట్లు మనస్సునకు స్థానములేదని తాత్పర్యము.) కనుకనే, (స్థానములేనందుననే గ్రహింపబడదు. గ్రహింపబడదు కనుకనే నిగ్రహింపబడదు. కనుక మనోనిగ్రహసాధ్యమగు యోగము చంచలమనస్కులగు మానవులకు అసాధ్యమని యభిప్రాయము. 119

వాయుర్న్ దుర్గ్రహోహ్యమన్యే, దశాశాప్వేవసంచరన్ ।
ఆశాసహస్రసంచారి, మనః కేననిగృహ్యతే ॥ 120

తస్మాన్ముముక్షోః సుసుఖోమార్గః శ్రీ విష్ణుసంశ్రయః ।
చిత్తేన చింతయానేన వంచ్యతే ధ్రువమన్యథా ॥ 121

నాగమ్యమస్తిమనసః కమలాసనాండ –
మధ్యే బహిశ్చ సతతం భ్రమి సర్వగంతత్ ।
విష్ణుం కదాచిదపి సర్వగమాశు యాయి
నైవస్పృశత్యథచ చిత్రమతః కిమన్యత్ ॥ 122

ఇతి శ్రీనారదీయే హరిభక్తి సుధోదయే యోగోపదేశః ఏకోన వింశాధ్యాయః

వాయువు, పది దిక్కులలోనే సంచరించును కావున, ఏదియో, యొకదిక్కున దానిని పట్టుకొనవచ్చును. కాని మనస్సు వేయిదిక్కులలో సంచరించునదై ఎవ్వనిచే నిగ్రహింపబడును?

'ఆశాసహస్ర' మనగా వేయిదిక్కులు, వేలాది యాశలు (కోరికలు) అనిగూడ అర్థము. 120

కావున మోక్షకామునకు అత్యంత సుఖానుభవమగు మార్గము శ్రీవిష్ణువు నాశ్రయించుటయే. లేనిచో (శ్రీహరి నాశ్రయింపకున్నచో) నిరంతర విషయచింతనముగల యా మనస్సుచే జనుడు తప్పక వంచింపబడగలడు. 121

ఈ బ్రహ్మాండము నడుమ వెలుపల నిరంతరము భ్రమించుచు సర్వత్ర ప్రసరించునట్టి యీ మనస్సునకు గోచరము కానిదేదియులేదు. ఇట్టి శీఘ్రగామియు నిరంతర గమన శీలమునగు చిత్తము, సర్వాంతర్యామియగు శ్రీహరిని ఎప్పుడును వెంటనే ఆశ్రయింపదు.

ఇంతవరకు కామక్రోధాద్యరిషడ్వర్గ ప్రభావమును, దానికి మూలమైన త్రిగుణాత్మక ప్రకృతియొక్క విలాసమును, ప్రకృతినధిఃకరించుటకు కొందరిచే నాశ్రయింపబడు అద్వైత యోగమార్గమును, దానికంటె సులభమైన శ్రీహరి శరణాగతిని, భక్తివైశిష్ట్యమును నారదుడు పేర్కొనినాడు. 122

ఇది శ్రీనారదీయ పురాణాంతర్గతమగు హరిభక్తిసుధోదయమున

'యోగోపదేశ'మును పంతొమ్మిదవ యధ్యాయము.

# వింశోఽధ్యాయః

శ్రీ నారద ఉవాచ

భక్తియోగస్తు నిర్విఘ్నో యోగమార్గాద్ద్విజోత్తమాః

యతో విష్ణుసనాథస్య దుర్జయం నాస్తికించన॥ 1

సమస్త శ్రేయసాంమూలం, ప్రధానం హి మనోజయః।

సహి సిద్ధ్యత్యుపాయేన వైష్ణవానాం నిశామ్యహమ్॥ 2

తదభ్యాసానుసారేణ, మనోధీమాన్ వశంనయేత్॥

పశుం దుష్టమివాక్లిష్టో హఠాన్నప్రతికూలయేత్ ॥ 3

చేతో గీతప్రియం చైతత్ విష్ణుగీతే సమర్పయేత్।

కథాయాంచేత్ కథాంచిత్రాం శ్రుణుయాత్కథయేద్ధరిమ్ । 4

ఓ ద్విజోత్తములారా !' అద్వైత యోగ ' మార్గముకంటెను భక్తియోగము ఎట్టియంతరాయములు లేనిదగుటచే సులభసాధ్యము. ఏలన, శ్రీహరినాశ్రయించిన వానికి జయింపరానిదేదియు లేదుకదా ! 1

నిఖిలశ్రేయస్సులకు మూలము, ప్రధానమైనది మనస్సును జయించుటయే. అది విష్ణుభక్తి పరాయణులకు ఉపాయముచే సిద్ధించును. దానినెరిగింతును. 2

బుద్ధిమంతుడైనవాడు ఎట్టిక్లేశముల పడక ఆమనస్సునకలవాటైన రీతిని వశపరచుకొనవలయును. దుష్టమగు పశువు వలె, మనస్సు, హఠాత్తుగ ప్రతికూల మొనర్చుకొనరాదు కదా! మనస్సును దానికభ్యస్తమైన మార్గమునుండి బలాత్కారముగ మరల్చరాదనియభిప్రాయము. 3

మనస్సు గీతములపట్ల సమాసక్తమైనచో దానిని విష్ణుగీతమందు సమర్పింప వలయును. కథయందు ప్రీతికలిగియున్నచో, ఆశ్చర్యకరమగు శ్రీహరి కథను వినవలయును. శ్రీహరికథనే చెప్పవలయును. 4

మనస్సు సౌందర్యమునపేక్షించునదైనచో కోమలములు చేతోహరములునగు శ్రీహరిప్రతిమలను చూడవలయును. ఏలన ఆప్రతిమల దర్శించుటయందు స్వేచ్ఛగా నామనస్సు ఆనందించును. 5

రూపార్థిచేత్తు తస్యైవ ప్రతిమాశ్చిత్ర కోమలాః ।
పశ్యేత్ స్వలంకృతాస్తత్ర రమతే యద్ యథేచ్ఛయా ॥ 5

నహ్యేకత్రప్రియం తావత్ చంచలం పాపి మానసమ్ ।
తద్దరేశ్చిత్రవార్తస్య వార్తాసు రమయేత్ సుధీః ॥ 6

నచ చిత్రోత్సవా వార్తా శ్చిత్రలీలం హరింవినా ।
సంత్యన్యేషాం యదిచ్ఛాతః చరాచరజగత్ స్థితిః ॥ 7

యద్యద్వస్త్రాన్నపానాది చిత్తార్థే తత్తదేవహి ।
విష్ణ్వర్పితం భవేన్నాత్ర క్లేశాః ప్రత్యాహృతిష్వివ ॥ 8

కృతీ విష్ణ్వర్పితాన్ భోగాన్ భుంజానోఽపి విముచ్యతే ।
అయంహి సుకరః పంథాః ముక్తేశ్చతురసేవితః ॥ 9

ఒకేచోట మనస్సు ప్రియమై యుండదు. చంచలము, పాపస్వభావము కలదియునగు మనస్సు ప్రతివిషయమునకుప్రీతితోనే ప్రవర్తించును. కావున ఆశ్చర్యకరమగు గాథగల శ్రీహరియొక్క వార్తలయందే (కథలయందే) బుద్ధిమంతుడు తన మనస్సును రమింపజేయవలెను. 6

చిత్రములగు లీలలుగల శ్రీహరినివిడచి, విచిత్రములు ఆనందదాయకములునగు కథలులేవుకదా! ఒకవేళ కొందరికి ప్రీతికరములగు విషయములున్నను, ఆ శ్రీహరియిచ్ఛచేతనే కదా యీ చరాచర జగత్తు యొక్క ఉనికి.

అనగా ఈ చరాచర జగత్తునకుగల విషయములలో నెవ్వరికేది విచిత్రముగ పరితోషదాయకమైనను అది శ్రీహరిసృష్టియే కనుక, సాక్షాత్తుగ శ్రీహరి లీలా ప్రతిపాదకములగు కథల పట్ల మనస్సును ప్రవర్తింపచేయుట శ్రేయోదాయకమని యభిప్రాయము. 7

చిత్తమునకు విషయములైన (చిత్తప్రీతి కొరకు పరిగ్రహింపబడిన ) అన్నము, వస్త్రము, పానము మున్నగు సమస్తము (ఇదియే) శ్రీహరికి అర్పింపబడవలెను. ఇట్లు చేసినందువలన తాము ఆ వస్తువుల సంపాదించుటలోని క్లేశములు తొలగిపోవును. ఎట్లనగా – ప్రత్యాహృతులయందు ఇంద్రియములంతర్ముఖములైనపుడు విషయసంబంధక క్లేశములులేనట్లే.

విషత్వేనైవ విషయాఃఖ్యాతా అపి యదర్పణాత్ ।
తదీవామృతతాం యాతాః, కోఽన్యఃసేవ్యోహరేఃన్పణామ్ ॥ 10

ఏవం విష్ణురతేశ్చేతః స్వయమేవ ప్రసీదతి ।
ప్రత్యాహార మనాహారం వినాక్లేశాంశ్చ దుఃసహాన్ ॥ 11

జ్ఞానం వఃసుసుఖం వచ్మి,మనోయత్ర సకృద్ధృతమ్ ।
జ్ఞాతాస్వాదం తదేవేచ్ఛేద్ యదన్యన్న విముక్తిదమ్ ॥ 12

'శబ్దాదిష్వనుషక్తాని నిగృహ్యాక్షాణి యోగవిత్ ।
కుర్యాచ్చిత్తానుకారీణి ప్రత్యాహార పరాయణః ॥

అను విష్ణు పురాణ (6/7/43) వచనమును బట్టి శబ్దాది విషయములందు సక్తములైన ఇంద్రియములను నిగ్రహించి చిత్తోన్ముఖ మొనర్చుట ప్రత్యాహారము. ఈప్రత్యాహారదశయందు ఇంద్రియములకు విషయసంబంధక్లేశములు లేనట్లే, తాను క్లేశములపడి సంపాదించిన అన్న వస్త్రాదులను భగవదర్పణముచేసినప్పుడా క్లేశములు తొలగిపోవునని తాత్పర్యము. 8

ధన్యుడగు జనుడు విష్ణువున కర్పించిన భోగములను తాననుభవించుచున్నను. ముక్తిని పొందగలడు. ఇదియేనేర్పరులగు విద్వాంసులాచరించిన సులభమార్గము.

ఈశావా స్యోపనిషత్తీ విషయమునిట్లు చెప్పుచున్నది.

'ఈశా వాస్య మిదం సర్వం యత్కించ జగత్యాంజగత్ ।
తేన త్యక్తేన భుంజీథాః, మాగృధః కస్యస్విద్ధనమ్ ॥

ఈ సమస్త ప్రపంచము సర్వ నియామకుడైన నారాయణుని నివాసస్థానము. కావున ప్రతివస్తువు పరమాత్మతో కూడి ఆయనకే భోగ్యమగుచున్నది. కావున ఈ జగత్తునగల విషయములను త్యజించి అనగా ఇది భగవానునదే, నాది కాదు అనుభగవదర్పణ బుద్ధితో స్వీకరించినపుడు, ఆ భోగములు బంధకములుకావు. కావున భగవదర్పణ రూపమగు త్యాగపురస్సరముగా భోగింపవలయును. అన్నియు భగవానునివే అయినప్పుడు ఎవ్వనికే స్వత్వము లేదు కావున, లోభముతో నెవ్వని ధనమును కోరరాదు' అని 9

తనవిగా భావించి భగవంతున కర్పింపక భుజించుటచే బంధకములై విషప్రాయములగు చున్నవి కనుకనే 'శబ్దస్పర్శా'దులకు విషయములని వ్యవహారము.

సుఖం పద్మాసనసీనః ప్రణవేన హృదంబుజం ।
ఉన్ముఖీకృత్య చంద్రాభం త్రిగుణైస్తత్ ప్రకాశయేత్ ॥ 13

మహత్కందోత్థితం, జ్ఞాననాలం, ప్రకృతికర్ణికమ్ ।
అష్టైశ్వర్యదళం విద్యాత్ కేశవం తద్ధిభావయేత్ ॥ 14

తస్యోపరి చ వహ్న్యర్క సోమబింబాన్యను క్రమాత్ ।
యథోక్తం స్వప్రభోద్భాసి రత్న పీఠంచ చింతయేత్ ॥ 15

వీటిని ఎవ్వని కర్పించినపుడు అమృతమగుచున్నవో అట్టి శ్రీహరికంటె నరులకు సేవింపదగు వాడెవ్వడు. 10

ఈ విధముగ శ్రీహరియందు ప్రీతి కలిగినందు వలననే మనస్సు ప్రత్యాహారము, ఆహారమును విడచుట, దుర్భరములగు క్లేశముల పడుటలేకయే తనంతతానుగ ప్రసన్నమగుచున్నది.

మనస్సును వశపరచుకొనుటకు యోగశాస్త్రమున చెప్పిన ప్రత్యాహార ప్రక్రియగాని, ఉపవాసాది కఠోరనియమములుగాని, అక్కరలేకుండగ, విషయసంపర్కము వలన కలిగెడి క్లేశములెంత మాత్రము లేకుండగ, శ్రీహరియందు మనస్సును ప్రవర్తింపజేయుట ద్వారమునే ప్రసన్నమైనర్పవచ్చుననియభిప్రాయము. 11

మనస్సు ఒక్కసారి కుదురుగ నిల్పినంతమాత్రముననే అత్యంత సుఖావహమై, రుచినెరిగి దేనిని విడువక కోరుచుండునో అట్టి జ్ఞానమును గురించి మీకు చెప్పెదను. మరియు ఏదివిముక్తికి ప్రతిబంధకమో దానిని గూడ తెల్పుదును. ఇచ్చట జ్ఞానమనగా మనస్సు శ్రీహరిరూపాంకిత మగుటయే. అనగా భగవంతుని ఆకారముతో నిండినమనస్సు యొక్క ధర్మమే జ్ఞానమనియభిప్రాయము. 12

యోగశాస్త్రప్రసిద్ధమైన పద్మాసనమువేసికొని సుఖముగ కూరుచుండి, 'ఓమ్' అను ప్రణవముతో చంద్రబింబమువంటి హృదయ పద్మమును ఉన్ముఖముగా జేసి త్రిగుణములచే దానిని ప్రకాశింపజేయవలెను.

ఇప్పుడు శ్రీహరిపైమనస్సును కుదురు కొల్పుటకు వలయు ఉపాసనా ప్రక్రియను నుడువుచున్నాడు. 'పద్మకోశప్రతీకాశం హృదీయంచాప్యధోముఖమ్' ఇత్యాదిగ్రశోతిచే హృదయము పుండరీకాకారముగ నుండునదని చెప్పబడినది. ఇది చంద్రుని వెన్నెలవంటి సత్త్వ ప్రకాశముకలిగి యుండును. దీనిని ప్రణవముచే వికసింపజేయవలయును.

తస్మిన్ మృదుశ్లక్ష్ణతరే శంఖచక్రగదాబ్జినం।
చతుర్భుజం సుందరాంగం భావయేత్ పురుషోత్తమమ్ । 16

నిరంకం, చంద్రధవళం, కోమలావయవోజ్జ్వలమ్ ।
వహ్నిం ద్వర్కాది తేజస్వితేజోపీతం, సుతేజసమ్ । 17

నానా మౌళిమణిద్యోత చిత్రీకృత హృదాలయమ్ ।
స్ఫురత్ కిరీట మాణిక్య-బాలసూర్యోదయా చలమ్ । 18

శ్రీ మన్ముఖాబ్జసౌరభ్య సుదృష్ట చరితాం గయా ।
భృంగావళ్యేవాలకావల్యా లీలయా లోలయాంచితమ్ ॥ 19

దీనివలన సత్త్వ రజస్తమో గుణములతో కూడిన మాయనుండియూ మనస్సు విడివడును. 13

ఈ మనస్సను పద్మమునకు మహత్తత్త్వమేమూలము (దుంప) జ్ఞానము నాళము(కాడ); ప్రకృతిలేక మాయఅనునది దీనికి కర్ణిక (అనగా బొడ్డు); అణిమ, లఘిమ, గిరిమ, మహిమ,ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అను నెనిమిది సిద్ధులు దళములు(రేకులు) అని తెలియ వలయును. ఇట్టి హృదీయ పుండరీకమున శ్రీమన్నారాయణుని భావింపవలయును. 14

ఈ హృదయ పుండరీకపు పై భాగమున అగ్ని, సూర్యుడు, చంద్రుడు అను మూడు తేజస్సులను క్రమముగా వాటి ప్రకాశములతో కూడినవిగా భావించి,రత్నమయమగు పీఠమునుభావింప వలయును. 15

ఇట్టి హృదయపద్మమున కల్పింపబడిన మృదులము మసృణమును (నునుపుగలదియు) అగు రత్నపీఠమున శంఖచక్రగదాపద్మముల ధరించి, నాలుగు భుజములు కలిగి మనోహర రూపముగల పురుషోత్తముడగు శ్రీమన్నారాయణుని భావింపవలయును. 16

16 వ శ్లోకమున హృదయాబ్జమున పురుషోత్తముడగు శ్రీమన్నారాయణుని భావింపవలయునని చెప్పబడినది. ఇట్లుభావింపదగు దివ్యమంగళ విగ్రహము 24 వ శ్లోకము వరకు నిరూపింపబడుచున్నది.

'ఎట్టి కళంకములు లేనివాడును, చంద్రబింబమువలె స్వచ్ఛకాంతి కలవాడును.

స్వచ్ఛాద్ ఫాలాష్టమీ చంద్రాత్ కలంకం స్నిగ్ధకాష్టవత్ ।
ఉద్ధృత్య తేనైవ కృతం బిభ్రాణం భ్రూలతా యుగమ్ ॥ 20

దయామృత ప్రకటకన ప్రసన్ననయ నాంబుజం ।
శ్లక్ష్ణనాసం, లసద్గండ బింబితో జ్జ్వల కుండలమ్ ॥ 21

అనుగ్రహాఖ్యహృత్ స్థేందు సూచకస్మిత చంద్రికమ్ ।
ఆశ్లిష్టకంఠం శ్లక్ష్ణ శ్రీ భుజాభరణ మాలయా ॥ 22

సింహస్కంధాను రూపాంసం వృత్తాయత చతుర్భుజమ్ ।
కౌస్తుభోపాన్త విద్యోతి సద్రత్నాంగద కంకణమ్ ॥ 23

పేశలములైన అవయములచే ఉజ్జ్వలమైన దేహకాంతికలవాడును, అగ్ని,చంద్రుడు, సూర్యుడుమున్నగు తేజస్సులచే చుట్టువారిన శుభ్రతేజస్సు కలవాడును, అనేకములగు శ్రేష్ఠమణుల కాంతిచేనాశ్చర్యకరముగ నందగించిన వక్షఃస్థలముకలవాడును, ప్రకాశించుచున్న కిరీట మాణిక్యములనుబాలసూర్యుడుదయించునట్టి తూరుపుకొండయైనవాడును, శోభాసంపన్నమగు ముఖాంబుజ పరిమళముచే మత్తిల్లిన నల్లని మోములుగల తుమ్మెదల బారువలె నొప్పారు, ముంగురుల, యందమైన కదలికలు కలవాడును, స్వచ్ఛమైన ఫాలభాగమను నష్టమీ చంద్రుని నుండి నల్లని కళంకమును వెలికిదీసి దానిచేతనే కల్పింపబడెనా యన్నట్లున్న నల్లనికనుబొమలజంట కలవాడును, దయామృతమును జాలువారుచు ప్రసన్నములైన నయన పుండరీకములుకలవాడును, నున్నని నాసిక కలవాడును, ప్రకాశించుచున్న నున్నని చెక్కిళ్లపై ప్రతిబింబించిన కుండములు కలవాడును, అనుగ్రహమను హృదయ గత చంద్రుని సూచించునట్టి చిరునగవు వెన్నెలలొలికించు వాడును, మసృణములైన భుజాభరణముల కాంతులచే చుట్టువారిన కంఠసీమ కలవాడును, సింహపు మూపువలె సుదృఢమగు స్కంధము కలవాడును, గుండ్రని పొడవైన నాలుగు భుజములు కలవాడును, కౌస్తుభమణికి సన్నిహితముగా నుండి ప్రకాశించు చున్న యుత్తమరత్న విభూషితములగు అంగదములు,మురుగులు కలవాడును, స్వచ్ఛమగుదేహకాంతికలవాడును, పుణ్యమను లతకు దుంపయైనవాడును, జ్ఞానమను వెన్నెలతో నొప్పారు చంద్రబింబమైనవాడును, నాదముచే ప్రసిద్ధివడసినట్టిదియు హంసవలె ధవళకాంతి కలదియునగు శంఖమును ధరించినవాడును, స్వర్ణము, సూర్యుడు,

శుభ్రం పుణ్యలతాకందం జ్ఞాన జ్యోత్స్నేందు మండలమ్ ।
నాదప్రసిద్ధం దధతం శంఖం హంసవదుజ్జ్వలమ్ । 24

(25 వ శ్లోకము నుండి మూలము అలభ్యము)

చంద్రుడు,అగ్ని మున్నగు తేజస్సుల కాంతులు మూర్తీభవించినట్టియు, స్వతంత్రముగ ప్రకాశించునదియు, యజ్ఞవేదికపై ప్రజ్జ్వరిల్లు వహ్నివంటిదియు, అసుర వినాశకమునైన సుదర్శన చక్రమును ధరించినవాడును, ప్రపంచవినాశకారకులగు రాక్షసుల నశింపజేయుటకై కౌమోదకియనుపెద్ద గదను ధరించినవాడును, స్వాశ్రితులగు భక్తుల హృదయార విందముల ప్రతిబోధించుటకై కౌస్తుభమను సూర్యుని ధరించినవాడును,ఈ కౌస్తుభమణికి ప్రక్కన(వక్షఃస్థలపు రెండవ వైపున ) అనన్యహృదయయగు శ్రీరమాదేవిని ధరించినవాడును, తన భక్తుల సన్నిధానమున నిరంతరమానందమును పొందు వాడును, వక్షఃస్థలమున ధరింపబడిన రత్నమాలలచే తనభక్తుల చిత్తములనాకర్షించు వాడును, చతుర్ముఖ బ్రహ్మకు నివాసస్థానమై ఒప్పారు నాభికమలము కలవాడును, పీతాంబరధారియు, నిరంతరము భక్తులచే పెన్నిధిగా నాశ్రయింపబడిన పాదకమలము కలవాడును, తెల్లని వెన్నెలకునెలవైన నఖచంద్రులచే నొప్పారువాడును, నల్లని కళంకచిహ్నములు కలిగి గ్రహగ్రస్తత నొందుచు, వృద్ధిక్షయములకు నెలవైన చంద్రబింముతో పోల్చరాని స్వచ్ఛనఖకాంతులతో నొప్పారు పాదములు గలవాడును అయిన శ్రీహరిని భావింపవలయును (12 నుండి 31 వరకు)

భక్తిపరవశులగు వారు శ్రీహరి పాదకమలములపై తులసి నుంచుదురు. ఈ తులసి యొక్క పరిమళము నాఘ్రాణించి నప్పుడు వారి హృదయములు ప్రేమ భరములగును. ఈ భక్తులా శ్రీహరి పాదకమల మధువును తుమ్మెదల వలె గ్రోలుదురు. శ్రీదేవి యా శ్రీహరి చరణపంకేరుహమునకు పరిచర్యనొనర్ప తహ తహపడునదై నిరంతర మాపాదముల కోమలముగ స్పృశించుచుండును. ఇట్టి పాదసంకేరుహముల స్మరణము మాయనధఃకరించును కదా! 32

ఆ శ్రీహరి, ఇంద్రనీల మణిఖచితమగు పాదపీఠముపై సుధలుజాలువారు తనపాదపద్మముల నుంచి సింహాసనముపై నాసీనుడైయున్నాడు. నిత్య నిరవద్య ప్రకాశమానమగు దేహముతో అనన్య సామాన్యమగు దేహకాంతితో నొప్పారు శ్రీమన్నారాయణుని దేహముపై నలంకరింపబడిన రత్నాభరణకాంతులు దేహకాంతి ప్రతిబింబితములై మిగుల ప్రకాశించుచున్నవి. కుంకుమము, కాషాయవర్ణము, చందనములచే నలదబడిన దేహము కలిగి వనమాలాభరణముతో దివ్య మంగళవిగ్రహముచే నొప్పారు శ్రీమన్నారాయణుని దర్శించుటయే ఆత్మానందదాయకము 33-34

యోగీంద్రుల కిట్టి దివ్యమంగళ విగ్రహమే ధ్యేయవస్తువు. భక్తులీయప్రాకృత సౌందర్యమును దర్శించి తన్మయులై యానంద సాగరమున మునిగి పోవుదురు. ఈ దివ్య మంగళ విగ్రహము వీరి కన్నులకు పండువు, ఆత్మకాహారము. ఇక నిట్టి విగ్రహము దర్శింపజాలని భక్తులు శ్రీహరి సౌందర్యమునుపవర్ణించు గాథల వినుచు ఆనంద తన్మయులై బిగ్గరగ శ్రీహరిగుణములను, నామమును గానమొనర్చుచుందురు. శ్రీహరి స్వసంకల్ప మాత్రముననే భక్తులను గ్రహింపనెంచి వివిధరూపముల నావిర్భవించు చుండును. శ్రీహరికి వివిధ శక్తులున్నవి. సర్వవ్యాపియు, అపరిమేయశక్తి సంపన్నుడు, సర్వజ్ఞుడు అయిన శ్రీహరి తన యనన్య భక్తులకు శరణము. సర్వేశ్వరుడగు శ్రీహరియొక్కడే భక్తజనులచే ఉపాస్యుడు, ధ్యేయుడునని యెరుగవలయును.35–39

ఓ ద్విజులారా! ఎవ్వరీ సులభము సుగమమునైన మార్గము నాశ్రయింతురో వారు తమ జన్మ సాఫల్యమును, పరమార్థమును తప్పకపొందగలుగుదురు. ఉపాసకుడైన భక్తుని ధ్యానము, కాలపరిచ్ఛిన్నము (ఒకప్రత్యేక కాలమునకు పరిమితమైనది) కాని, భగవానుని ఏదియో ఒక రూపమునకు పరిమితమైనదికాని, కాక సార్వత్రికము, ఎట్టి యంతరాయములు లేనిదిగను ఉండవలయును. ఆతని మనస్సెప్పుడును ధ్యేయవస్తువగు పరమాత్మను విడచిపోవరాదు. ఒకరాటకు పొడవైన త్రాటితో పశువును కట్టినప్పుడు అది పోయినట్లు కాదు కదా! అట్లే మనస్సును భక్తిరజ్జువుతో భగవచ్చరణారవిందములందు కట్టివేయుటవలన నది నశింపదు. ఎట్టి దశయందును భగవదను స్మృతిని విడువరాదు. వివేక సంపన్నుడైనవాడు వివిక్త జీవనుడైనప్పుడు తనవివేకమును కోలుపోవునా ?

ఓ బ్రాహ్మణులారా! మానవుడెంతటియాచారసంపన్నమగు జీవితమును గడిపినను, శ్రీహరి సేవకుదూరమైనప్పుడు మాయనధఃకరింపజాలడని నా నిశ్చయము. తానొనర్చు కర్మములను భగవదర్పణ బుద్ధితో చేసినప్పుడు భగవానుడు అమృతనిష్యందములగు తన పాదపుండరీకముల నను గ్రహించును. ఇదియే జీవిత పరమావధి. ఎంతటి నిర్హేతుక కృపాపరవశుడు శ్రీహరి! ఆయన తన భక్తుల పట్ల చూపునట్టి ప్రేమకు అవధులు లేవు. 40–41

కనుక వివేకియగు జనుడు పరమ భాగవతోత్తముల సాంగత్యమున, తన నిశ్చల భక్తిచే నిరంతరము సర్వాత్మనా పరమాత్మ సేవనొనర్చును. భక్తులు శ్రీహరి దివ్యమూర్తిని తమహృదయములందు ప్రతిష్ఠించుకున్న వారై మనోవాక్కాయములచే, తమ సర్వస్వము నర్పించుచు, శ్రీహరి భజనానుకూలమగు జీవితమును గడపుచుందును. ఇట్లొనర్చుటచే వారు తనకు, తనకుటుంబమునకు మాత్రమేగాక సమస్త ప్రపంచమునకు ఆధ్యాత్మిక ప్రయోజనము చేకూర్చుచున్నారు. భగవానుని శ్రీమూర్తి (అర్చా మూర్తి) యే సర్వకామనల నీడేర్చు కల్పవృక్షము. ఆతడు తన భక్తుల యవ్యాజ కామనల నీడేర్చును.

తన గృహమునవెవ్వడు భగవదర్చామూర్తిని ప్రతిష్ఠించి యర్చించునో వాడీ భౌతిక ప్రపంచమున పొందదగు సర్వాభ్యుదయములను పొందగల్గును. ఒక్కసారి శ్రీహరి యర్చామూర్తి నుపాసించి స్థిర నిశ్చలమగుభక్తి పరిపాకమును పొంది యాదేహమును ఎవ్వడు విడచినాడో వాడిక క్లేశబహులమగు మాతృగర్భమున పడడు. ఈ సృష్టి పరిణామ చక్రమున కావలనాతడు విరాజిల్లును. ఎవ్వడు తన రెండు చేతులతోను శ్రీహరియర్చామూర్తి నారాధించునో వాడు ప్రపంచపు పాపముల కడిగివేయుచున్నాడు. ఈ వినాశశీలమగు ప్రపంచమున కట్టి రెండుకరములే సంరక్షకములు కదా! ఎవ్వడు శ్రీహరికి సంబంధించిన యుపాసనా విధానమునెరగని వాడును, అజ్ఞుడును అయినవాడో, అట్టి వాడొనర్చిన యవ్యాజ తీర్థతులసీ సమారాధనమును గూడ భగవానుడుప్రీతితో స్వీకరించి వానికి ఆధ్యాత్మిక ప్రశాన్తిని నిత్య కింకరత్వమును ప్రసాదించును. (భగవత్సేవకు విజ్ఞత, అవిజ్ఞత అనునవి ప్రతిబంధకములు కావని తాత్పర్యము) ఆహా! తానొనర్చుసేవకెట్టి ప్రతిఫలమో కదా! భగవదర్చామూర్తిముందు ప్రసరించిన అగరుధూపము ఆఘ్రాణింప బడినంత మాత్రముననే ఈ ప్రాపంచికరోగమున కౌషధముకాగలదు. ఎవ్వడు శ్రీహరి మందిరమును దీపముతో ప్రకాశింప జేయునో, వాని హృదయమునగల యజ్ఞానపు చీకట్లను ఆదీపము పారద్రోలి, అధ్యాత్మిక ప్రకాశమును కలుగజేయును. నేతితో నిండిన దీపములను విష్ణుమూర్తికి ఎదురుగా నెవ్వడుంచునో వాడే మాయనధఃకరించును. ఏకొద్ది మాత్రమైనను తనశక్తి కొలది భగవంతునకు నివేదించినచో దానితో ప్రీతుడై శ్రీహరి ఆ మానవుని యాత్మను ప్రత్యుజ్జీవింపజేయు పీయూషమునొలికించును. (పత్రం పుష్పం ఫలం తోయం యోమేభక్త్యా ప్రయచ్ఛతి। తదహం భక్త్యు పహృతమశ్నామి ప్రయతాత్మనః ( శ్రీగీత 9-26)

పత్రమునుగాని, పూవునుగాని , ఫలమును గాని, నీటిని గాని ఎవ్వడు భక్తితో నా కర్పించునో వాటిని నేను ప్రీతితో స్వీకరింతునని భగవానుడు చెప్పినాడు. (భగవంతుని కర్పింపక, తిన్నది, విషమనితాత్పర్యము) వస్త్రములు, ఆభరణములు, పుష్పమాలలు పుష్పములు మున్నగునవి భక్తితో భగవత్ శ్రీమూర్తికి (విగ్రహమునకు) అర్పించుట, ఆ మానవుని లౌకికకామన నీడేర్చుటకు ద్వారము మాత్రమేకాక, జీవిత పరమసాఫల్యమునకు నిదానము. భగవన్మందిరము చుట్టును మూడు సారులు ప్రదక్షణము చేసినవాడే ప్రాకృతిక జన్మ చక్రమును దాటును. భగవదార్చమూర్తి ముందట సాష్టాంగముగ ప్రణమిల్లుట వానిహృదయమునగల సర్వపాపమును మరలనంటకుండగ దూరము చేసికొనుటయే. **41–54**

భగవదర్చామూర్తి నారాధించునప్పుడు (ప్రదక్షణముచేయునప్పుడు, సాష్టాంగ ప్రణామమునాచరించునప్పుడును) శరీరమున కంటిన రజము, శ్రీహరి పాదకమలముల

పరాగమేనని యెరుగవలయును. ఎవ్వడు శ్రీమన్నారాయణుని యర్చించునోవానికి, శ్రీలక్ష్మీ మహాదేవియు అర్చింపదగియే యున్నది. సర్వదేవతలచే నామె నిరంతర మర్చింపబడును. (శ్రీలక్ష్మిని విడచి కేవల శ్రీనారాయణునిగాని, శ్రీమన్నారాయణుని విడచి కేవల లక్ష్మీ దేవినిగాని విడదీసి యర్చింపరాదని తాత్పర్యము) శ్రీహరిమూర్తి సౌదర్యమునెవ్వడు కీర్తించునో వాడు దేవతలకు గూడ దుర్లభమైన యనుగ్రహమును పడయును. 55–57

చిన్నతనముననే ఎవ్వడు శ్రీమన్నారాయణుని ధ్యానించియుపాసించునో, అట్టివానిపట్ల దేవతలు తమ నర్చించిన దానికంటె మిక్కుటముగ ప్రసన్నులగుదురు. (ధ్రువునిచరితమిచ్చట దృష్టాన్తము) తల్లిఒడిలో నుండి క్రిందకుజారి తల్లిపాదములచెంత పొరాడుస్తనంధయుడగు శిశువును, తల్లి చేతులతో పైకెత్తికొన్నట్లు, తనపాదములచెంత భక్తి వినమ్రుడైనవానిని శ్రీమన్నారాయణుడు ప్రీతితో లేవనెత్తును. (ఉద్ధరించునని తాత్పర్యము)

భగవన్నామముల బిగ్గరగ నుచ్చరించుచు, భగవద్గుణ వైభవమును కొనియాడుచు గానమొనర్చువారు నిజముగ లోకప్రశాన్తికి కారణము కదా! భక్తిపారవశ్యముతో భగవద్గుణ లీలల గానమొనర్చుట మోక్షసామ్రాజ్యమును కరతలామాలక మొనర్చు కొనుటయే. ఏ పరమభాగతోత్తముడాయనంతసాగరముననునిగి భగవద్గుణ లీలా మాధుర్యమును తన గాన–నర్తనములచే నావిష్కరించుచు ఆనందాశ్రువులు కన్నుల వెంట విడచునో, ఆకన్నీరు, సమస్త నదీప్రవాహములపవిత్రీకరించును. అట్టివారితో సాంగత్యము కలవారు (అనగా అట్టి భక్తుని దర్శించి, స్పృశించి, ప్రశంసించువారు) తమపాపముల కడగివేసికొనుచున్నారని యెరుగవలయును. ఎవ్వరు భగవద్దర్శనమునకై లాలసపడుదురో, అట్టివారి యాభవద్దర్శనతృష్ణయే వారిని పవిత్రీకరించును. చేతులపైకెత్తి యరమోడ్పుకన్నులతో భూమ్యాకాశముల నవలోకగా చూచుచు భగవన్మాధుర్య సాగరనిమగ్నులై సానందముగ నర్తించువారి చూడ్కులు, భూమ్యాకశములలోని సర్వప్రాణి కోటిని ( అంతరాళమున గల సర్వ లోకములను ) పవిత్రీకరించు చున్నవి. 65–68

భగవన్మందిరాదులలో భగవత్ప్రసాదమును శ్రద్ధాభక్తులతో సమ్మానించుట, తీర్థమును పరిగ్రహించుట భగవదర్పితములగు పుష్పమాలల ధరించుట ఈ మూడును జనుల సర్వపాపములకడిగివేయును. భగవత్పాదార విందమునుండి యావిర్భవించిన గంగవలె, పరమపవిత్రమైన శ్రీపాదతీర్థమును అభిషేకజలమును ఎవ్వడు పరిగ్రహించునో వాడు సర్వపాపవినిర్ముక్తుడగును. ఈ తీర్థముయొక్క మహాత్మ్యమునెవ్వడెరుగ జాలును? భౌతిక తాపమును త్రిగుణాత్మకమాయా ప్రకోపమును ఎన్ని సముద్రముల జలమైనను

ఎన్ని సారులు మునిగినను ప్రశమింపజేయజాలదు. కాని భగవదర్పితమైన జలమును, తీర్థముగా ఒక్క చుక్క స్వీకరించినను అది సర్వతాపముల శమింపజేయును.69-71

భగవత్తీర్థ పవిత్రతను వక్కాణించుటకు, మనకు శక్తిచాలదు. దానికిగల శక్తి అనన్య సామాన్యము, అప్రాకృతము. ప్రాపంచిక మహాగ్నిని చల్లార్చుటకు శ్రీమన్నారాయణ శ్రీపాద తీర్థ మొక్కటే ఉపాయము. భవరోగమునకు దివ్యౌషధము. కనుక, తీర్థమును త్రాగుట ద్వారాగాని, శిరస్సుపై ధరించుట, లేదా తన శరీరోర్ధ్వ భాగమునగల అవయముల పై నుంచుకొనుట ద్వారా సమ్మానింపవలయును. ఎవ్వడు నిరంతరము శ్రీహరి దివ్యతీర్థమును పుచ్చుకొనుచుండునో వాడు దేవతలచే ననుగ్రహింపబడుటయేగాక, జన్మబంధమును విదల్చుటకు సమర్థుడగును. ఎవ్వడు శ్రీహరి గుణలీలల నితరులకు వివరించి చెప్పుచుండునో అట్టివాడు మాయనధఃకరించుచున్నాడు. ఎవ్వడు అమూల్య రత్నముల కలిగియుండునో వాడు దరిద్రుడెట్లగును? ఎచ్చట పవిత్ర ద్విజులు, శ్రీపాద తీర్థము యొక్కయు, భక్తులయొక్కయు విశిష్టతను కొనియాడు చుందురో, ఎచ్చట గోబ్రాహ్మణులు సానందముగ నివసించుచుందురో అచ్చట ప్రాపంచిక దుఃఖములకు తావుండదు. 72-76

ఎవ్వడు శ్రీహరి మందిరపు ప్రాంగణమును గోమయముతో నలుకుచు, శ్రీహరి పవిత్ర చిహ్నములను(అనగా ఊర్ధ్వపుండ్రము, శంఖచక్రాదులును) నిర్మించుచుండునో వాడు, మందిరమును దర్శించు భాగవతజనుల శుభకామనల పొందుచున్నాడు.77

ఈ విధముగ భగవద్భక్తుని ప్రతి చర్యయు, శ్రీహరి సమర్చనమునకే వినియోగింపబడుచు వానికి జీవిత సాఫల్యమునిచ్చును. శ్రీహరి భక్తినిమించి ఆత్మోద్ధరణమునకు వేరొక ఉత్తమోపాయము లేదు. శ్రీహరి సేవయే జీవిత పరమార్థము. ఎన్ని ప్రాపంచిక భోగములు, సంపదలున్నను అవి మానవునకు వాస్తవమగు పరితోషమును కల్గించునవి కావు. శ్రీహరి సేవయే వాస్తవ పరితోషకారకము. మనోవాక్కాయ కర్మలచే శ్రీహరి నారాధించుటయే నిజమైన పరితోషము. ఎవ్వడు నిరంతర శ్రీహరి పరిచరణశీలుడో వానికి అంత్యకాలమున శ్రీహరి స్మృతి యెడబాయక నామము వానినాలుకపై నప్రయత్నముగా నర్తించుచు, వానిని పరమ పదమునకు చేర్చును. 78-80

ఎవ్వడు తన జీవితమును శ్రీమన్నారాయణ సేవకర్పింపడో, భగవన్నామము నుచ్చరింపడో అట్టి దుర్మార్గుడు చివరిగడియలలో భార్యాపుత్రాదులను, ఇష్టములైన లౌకికవస్తువులమాత్రమే స్మరించి, భగవన్మాయావంచితుడై జననమరణ చక్రమున తగుల్కొని బయల్పడజాలడు. అప్పుడాతడు దుర్భరదుఃఖాశ్రువుల రాల్చవలసినదే! భగవన్మాయా మోహితుడు భగవత్స్మరణమునెట్లు చేయగల్గును? 81

కావున,మానవజన్మ చే ననుగ్రహింపబడిన ప్రతివ్యక్తియు, నిరంతర కృపాళువగు శ్రీమన్నారాయణుని సేవకై యాత్మార్పణమొనర్చుకొనవలయును. కేవలము శ్రీహరియొక్కడే మానవజీవితపు చరమలక్ష్యమును(పరమార్థమును) అనుగ్రహింపజాలును. శ్రీహరికృప యసామాన్యము. కనుకనే, ప్రీతితో, హాస్యముగ, సవ్యాజముగ (ఏదియో కోరికను మనస్సులో పెట్టుకొని) ఏ విధముగ్గానైనను తనను భజించినవానికి పాపనిష్కృతి నొసగును. ఎంతటి గొప్ప గొప్ప పనులు చేసినప్పటికిని, అవి శ్రీహరి సమారాధనముగా చేయబడకున్నచో, అవి నిష్ఫలములే కాక, నిఃశ్రేయసప్రతిబంధకములు కూడనగును. ప్రపంచపు క్షేమమును కోరువాడు శ్రీహరి కంటెనెవ్వడున్నాడు? 82–83

ఓ పవిత్ర ద్విజులారా! నేనిదివరకటి జన్మములలో ఒక జన్మమున దాసీపుత్రుడనై పుట్టితిని.ఆకారణముగ నొకయాశ్రమమున విడువబడితిని. అందువలన పరమ భాగవతోత్తముల సాంగత్యమున శ్రీమన్నారాయణుని దివ్యనామ-లీలలలోని మాధుర్యమును చవిగొంటిని. దానివలన శ్రీహర్యనుగ్రమును బడసి, నిరంతర శ్రీహరి సమారాధ నాసక్తుడనైతిని. ఈ భక్తి వివశతతో నేను గానమొనర్చుచు, శ్రీహరి లీలల వినుచు నాహృదయము నందలి తమఃపటలమును దూరముచేసికొంటిని. అటుపిమ్మట శ్రీహరి నిర్హేతుకకృపాళుడైనాహృదయమున నావిర్భవించినాడు. శ్రీహరి నాహృదయము నావిర్భవించుట నెరిగినే నిట్లు స్తుతించితిని.

'ఓ సచ్చిదానందమూర్తీ! మాయాపరవశుడనై జననమరణచక్రమున దగిలియున్న నేను నీయనుగ్రహముచే నాహృదయమును నీ పాదపుండరీకములచెంత కట్టివైచితిని. కనుక ఎన్ని జన్మములనెత్తినను నీయనన్య స్థిర భక్తి నుండి నన్ను దూరము కానీయకుము. నిరంతర పాదపద్మపరిచరణశీలత నన్నెడబాయకుండునుగాక! 86

ఓ విప్రులారా! ఏదేవతలచేగూడ నాస్వాదింపరానిదగు శ్రీహరి దివ్యకథామృతమును త్రావినారు కదా! ఇదియే మీకు జీవన పరమార్థముననుగ్రహించును. శ్రీహరి కథలోనంతటి మాహాత్మ్యమున్నది.సందేహములేదు. ఓ ఋషిమణులారా! భాగవతసంగమే శ్రీహరి భక్తిని వృద్ధి నొందించుచుండును. మీరెంత ధన్యులోకదా! ఎవ్వడు శ్రీహరి భక్తి యందుసక్తుడై యుండునో వాడు తాత్త్విక జ్ఞాన ప్రభచేననుగ్రహింపబడును. అట్టివాడే, శ్రీహరిసేవలో నిత్యానంద మయమైన శ్రీహరి పదమును పొందగలుగును. 87–88

ఇట్లే ప్రతిజీవియు దుఃఖభాజనమగు సంసారమును దాటగల్గును. ఇక మాయా పరవశతయుండదు. ప్రాకృతిక పరిణామము నుండదు. 89

ఈ విధముగ నైమిశారణ్య వాసులగు మునులకు శ్రీహరితత్త్వోపదేశమునిచ్చి, శ్రీహరి గుణలీలల కీర్తించి, యాపరమభాగవతశిఖామణియగు నారదుడు అటనుండి వెడలిపోయినాడు. 90

ఎవ్వడు అచంచల విశ్వాసముతోడను, నిశ్చలభక్తితోడను 'శ్రీహరి భక్తి సుధోదయము' ను వినునో, లేక వివరించునో అట్టివాడు సాంసారిక కశ్మలముల నుండియు, హృదయ దోషముల నుండియు విముక్తుడై చివరకు భగవద్ రూప మాధుర్యమును పరమపదము ననుభవింపగలడు. 91

ఇచ్చట హరి భక్తిసుధోదయము ముగిసినది. శ్రీగోలోకనాథుడగు రాధామాధవుని కృపామృత వృష్టులచే నీగ్రంథమాంధ్రభాషలో ననువదింపబడినది.

వల్లవీ జనహృత్పంకజాతసంతత విగ్రహమ్ ।
సాగ్రహం సుగ్రహే స్వీయభక్తానాం, దుష్టనిగ్రహే॥

శ్వేతద్వీపాఖ్య చిద్ధామ కర్ణికాయుత గోకులే।
దివ్యే బృందావనే రాసమహోమండలమండనమ్ ॥

నవనీరదసుశ్యామం లసద్రాధాతటిద్వృతమ్ ।
భజే సానంద గోవిందం భవతాపహరం హృదా॥

సచ్చిదానంద! తేऽవ్యాజకృపయా పరిపూర్ణతాం ।
యాతంసమర్పయే తుభ్యం "హరిభక్తి సుధోదయమ్ "॥

శ్రీ కృష్ణార్పణమస్తు